ఆవిష్కరణము :
శ్రీవిరోధికృన్నామ సంవత్సర
శ్రావణము

తొలికూర్పు:
ప్రతులు ౧౦౦౦



ప్రతులకు :
వేదుల సూర్యనారాయణశాస్త్రి
శ్రీవాణీనిలయము – టౌనుహాలు వెనుక వీధి
తణుకు
పశ్చిమ గోదావరి జిల్లా.



వెల :
10 రూ.

ముద్రణము :
వేంకటేశ్వర ప్రింటింగు ప్రెస్,
ఆలమూరు.
తూర్పు గోదావరి జిల్లా.

# శ్రీ ము ఖ ము

## శ్రీ కంచికామకోటి పీఠాధిపతులు




శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్య
శ్రీమచ్ఛంకర భగవత్పాద ప్రతిష్ఠిత
శ్రీకాంచీకామకోటిపీఠాధిప జగద్గురు
శ్రీమచ్చంద్రశేఖరేంద్ర సరస్వతీ శ్రీపా దాదేశానుసారేణ
శ్రీసుజ్ఞయేంద్రసరస్వతీశ్రీపాదైః ప్రతీచ్యగోదావరీమండ
లాంతర్గత తణుకుగ్రామాభిజనాయ తత్రత్యపరిషద్బహుశార్ధ
సాధుః విద్యాశాలాయా మాంధ్రభాషాపండితస్థానభాజే
శ్రీమతే వేదులసూర్యనారాయణశర్మణే క్రియతే. నారాయణస్మృతిః .

సంస్కృతే విశ్వగుణాదర్శ చంప్వాదిప్రసిద్ధ గ్రంథకర్త్రా శ్రీవేంకటాద్రి మహాకవినా విరచితస్య, శ్రీదేవీవిషయకస్య, ప్రాదుర్భావమారభ్య శ్రీదేవ్యాః కారుణ్య సౌంద ర్యాభయ దశావతార సహావస్థితి శరణాగతరక్ష ణాదిమహిమ్నాం సరళయా రీత్యా ప్రతిపాదకస్య లక్ష్మీసహస్రమహాకావ్యస్య భవతా ఆంధ్రభాషా యాం సరళమృదుపదయుతై నైకవృత్త భాసుర పద్యరూపేణ, కృతః అనువాదః మూలార్థసంప్రకాశకః శ్లేషయమ కాదిశబ్దాలంకారయుత మూలశ్లోకానామపి సమ్య గనువదన్ ఆంధ్రభాషాజ్ఞానా మర్థజ్ఞానపూర్వక పరాయణోచితః ముద్రాపణాహ్వో విజయతే,

భవాన్ ఏవంవిధాన్ బహూన్ గ్రంథాన్ విరచయన్ భగవదనుగ్రహభాక్ నిఖిల శ్రేయశ్శ్రియః పరంపరాః ప్రాప్నోతు ఇత్యాశాస్మహే.

యాత్రాస్థానమ్ నా రా య ణ స్మృ తి ః

ఏలూరు (ప్రతీచ్య గోదావరీమండలమ్)
ప్లవంగవైశాఖబహుళాష్టమీ.

# ★ పండితాభిప్రాయములు ★

## శ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారు.

శ్రీమత్పరదేవతాయైనమః

వేదుల సూర్యనారాయణశర్మకృతమైన (ఆంధ్రీకృత) లక్ష్మీసహస్రము నందు మచ్చుతునుకలుగా ముద్రించిన పద్యము లించుమించుగా నన్నియుఁ జదివి చూచితిని. మిక్కిలి ధారాళమైన ధారతో మృదుమధురపదరచనతో మనోరంజకిత్వ మును గల్గించుచున్నది. కవికిది ప్రథమప్రయత్నమైనను అట్లుండక చాలపరిపక్వా వస్థయందున్న కవిత్వమువలెనే కనుపట్టుచున్నది. శ్లేషయమకచక్రవర్తి బిరుదాం కితుఁడైన శ్రీవేంకటాధ్వరిలక్ష్మీసహస్రము నింతకన్నసులభముగా వేఱొకరు తెలిఁ గింపలేరని నేనీ రచనమునుజూచి యనుకొంటిని. *సంస్కృతమునందుఁగూడ కేవల సంఖ్యామాత్రపూరకములగు నేకాక్షరయమకాదులను తెలిఁగింపవలసిన యావశ్య కతలేదని వదలిపెట్టినట్లు గ్రంథకర్త చెప్పెను. ఆయన యభిప్రాయముతో నేనును ఏకీభవించితిని. సర్వవిధముల నీయనకవిత యీయనకేకాక యీయన నివసించు సుప్రసిద్ధాగ్రహారము కాకరపర్తికికూడ ప్రఖ్యాతి గడింపఁగలదని నాదృఢవిశ్వాసము.

కడియము
తూ॥ గో॥ జిల్లా.
8—11—37

(సం) చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి
శతావధాని.

---

* శ్రీ శాస్త్రిగారికిఁ జూపించునాఁటికి చిత్రయమకస్తబకములు నాచే పూర్తిగా ననుదింపఁ బడియుండలేదు. అవి తెనుఁగునకు రానంతక్లిష్టములై యుండుటచే వానిని వదలితినని శ్రీ శాస్త్రిగారితో ననియుంటిని. తరువాత వానినికూడఁ దెనుఁగునకుఁ దీసికొనిరాఁగల్గితిని.
గ్రంథకర్త.

శ్రీ కాశీ కృష్ణాచార్యులుగారు

గుంటూరు
3—2—1940

శ్రీ లక్ష్మీహయగ్రీవో విజయతే

మహాశయా !

భవద్విరచితములగు *శృంగారనళీయాంధ్ర లక్ష్మీసహస్రములను శ్రీమొదలితిశ్రీవఱకుఁ జూచితిని. వానిలో మొదటిది మీచే నాకుపుగనల్లఁబడినట్లు పౌత్త్రమునఁ గననయ్యె. అందుచేఁ దమశృంగారనళీయము "పూఁతమెఱుంగులన్" అను నుత్పలమాలికనల్లిన ఆంధ్రకవితాపితామహుని నామనంబునఁ దోపించెను.

ఇఁక ఆంధ్రలక్ష్మీసహస్రము: సంస్కృతశ్లేషయమకాదులతో నిండిన గ్రంథముల నాంధ్రీకరించుటయన సామాన్యవిషయముగాదు. వానిలో లక్ష్మీసహస్రముఁ దెనిఁగించుట మఱింత శ్రమజనకము అయినను మీ పద్యములనుజూచినచో మీకాకార్య మతిసులభమైనట్లు నాకుఁదోచినది. చూచినంతలో మూలరసమునకు లోటులేదు కవిత నిర్దుష్టము. ఈ కాలమున మిమ్మును "సరస్వతీ కంఠాభరణము" అని పిలిచిన నతిశయోక్తి కాదని నాయాశయము.

(సం) కాశీ కృష్ణాచార్యులు.

---

* శృంగారనళీయము ఇది ళకారప్రాసముతో మూఁడువందల చంపకమాలికా పాదములుగల ఆశుకవితారచనము. ఇది లక్ష్మీసహస్రకావ్యము నిర్విఘ్నముగా రచింపబడుటకు విఘ్నేశ్వరున కంకితమీయఁ బడినది, ఈ గ్రంథముకూడ ఇందు చివర ముద్రింపఁబడినది.

శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

ధవళేశ్వరము
4 - 1 - 42

విద్వాన్ వేదుల సూర్యనారాయణశర్మగారు తెలిఁగించిన లక్ష్మీసహస్రము లోని పెక్కుపద్యములు వింటిని. చదివితిని శ్లేషయమక చక్రవర్తియగు వేంకటాధ్వరి నిర్మించిన యాకృతి నాంధ్రీకరించుట యసాధారణకృత్యము. అట్టియెడ శ్రీ శర్మగారు స్వతంత్రరచనగాఁ దోఁప నాంధ్రీకరించుట యెంతయుఁ బ్రశంసనీయము. శైలి మృదుమధురము. భాష నిర్దుష్టము అట్టి యాకృతి సర్వవిధముల భాషాభిజ్ఞుల యాదరముఁ గాంచఁగలదని నాయభిప్రాయము

(సం) మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

శ్రీమంగిపూడి వేంకటశర్మగారు
ఆంధ్రజాతీయకవి.

మకాం - తణుకు
8 - 2 - 40

బ్రహ్మశ్రీ విద్వాన్ వేదుల సూర్యనారాయణశర్మగారికి

మీరు దయతో పంపిన శృంగారనళీయమును, ఆంధ్రలక్ష్మీసహస్రమునందలి మచ్చుతునక పద్యములను ఆనందముతో చదివినాను సంస్కృతాంధ్రపదములు సమములై యొప్పి మృదుమధురమైన శైలిగలిగి మెలికలులేక గొగ్గులేక నిమ్మళముగ్గా నడిచినట్లు ధారాళమైనధారగలిగి మనోరంజకమై తమకవిత్వము చెలువారుచున్నది. శ్లేషయమకములచే శోభిల్లు వేంకటాధ్వరికృతికి భాషాంతరీకరణమైనను మీ లక్ష్మీసహస్రము స్వతంత్రగ్రంథమువలె నలరారుట మీ శక్తికి నిదర్శనముగా నున్నదని తలంచుచున్నాను మీరు స్వతంత్రములై దేశభక్తిప్రబోధకములైన యుత్తమోత్తమగ్రంథము లనేకములు రచించి తెలుఁగుభాష నలంకరించి కృతార్థులగునట్లు అనుగ్రహింప భగవంతుని ప్రార్థించుచున్నాను.

౮ - ౨ - ౪౦
[illegible]

విధేయుడు
(సం) మంగిపూడి వేంకటశర్మ

## శ్రీ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు

బ్రహ్మశ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు, నేఁడు నాకడకువచ్చి తాము విద్వాన్పరీక్షలోఁ గృతార్థులమైతి మనియు వేంకటాధ్వరి రచించిన "లక్ష్మీసహస్రము" నాంధ్రీకరించితి మనియుఁ జెప్పిరి. విద్వాననిచెప్పుటచేత వారియందు నాకంత గౌరవము గలుగలేదు. ఇప్పటివిద్వాన్, శిరోమణిపరీక్ష లట్టిగతి గల్గించుటకుఁ గారణము లగు చున్నవి. కాని, వారు తమ రచించిన గ్రంథమును జదివి వినిపించినంత వారి సంస్కృతాంధ్రసాహిత్యము తెల్లంబై వారియం దత్యంత గౌరవము కుదిరినది. సంస్కృతజ్ఞానము లేని యాంధ్ర జ్ఞానమును, ఆంధ్రకవిత్వమును రుచింపఁజాలవని వ్రాయుట సత్యదూరముకాదు.

ఆంధ్రలక్ష్మీసహస్రము శర్మగారు చదువఁగాఁ జాలపద్యములు వినియున్నాఁడను, వినినంతవఱకు నిర్దుష్టములుగా మృదుమధురములుగానున్నవి. ఇది వీరికిఁ బ్రథమప్రయత్నమైనను పాఠకులకట్లు తోఁపింపని మనోహరత్వముం గూర్చుచున్నదని నాయభిప్రాయము.

రాజమహేంద్రవరము
3–3–1935

(సం) శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రి.

## శ్రీజటావల్లభుల పురుషోత్తముగారు M. A.

### ప్రిన్సిపాలు, ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము

ఆర్యా! మీ ఆంధ్ర లక్ష్మీసహస్రములోని మచ్చుపద్యములను జదివితిని. పద్యము లనువాదములనిపింపక స్వతంత్ర రచనలవలెనే యలరారుచున్నవి మూలములోని యర్థగాంభీర్యమునేకాక పదములలాలిత్యమునుగూడ మీరు నిలబెట్టినారు శ్లేషార్థములను గాపాడుట గడుంగడు ప్రశంసనీయము, పుస్తకమంతయు నాంధ్రావళికిఁ ద్వరలోనే లభించుగాక యని కోరుచున్నాను.

కొవ్వూరు
3–8–1939

(సం) జటావల్లభుల పురుషోత్తము.

## శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహంపంతులుగారు
## రాజమహేంద్రవరము

కాకరపఱ్ఱు గ్రామవాసులు బ్రహ్మశ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారు తెనిఁగించిన "లక్ష్మీసహస్ర" మను మహాకావ్యమందలి పద్యములు నూఱు నేనువిని యానందించితిని. గ్రంథము తెనిఁగించినట్లు గాక స్వకపోలకల్పిత మైనట్లుగా నాతి కఠినమై రసవంతమై పండితజనాదరణీయమై యున్నది. మూలములోనున్న కొన్ని శ్లేషలను రసము, భావము, నర్థము చెడకుండ తెనుఁగులోనికిఁ దెచ్చుట మిక్కిలి ప్రశంసనీయము. వేంకటాధ్వరి గ్రంథముఁ దెని గించుట మిక్కిలికష్టము. అయః పిండమువంటి యా కావ్యము నీవి మిక్కిలిమనోహరముగాఁ దెనిఁగించి యాంధ్ర సారస్వతమున కొక క్రొత్తయలంకారముఁ దెచ్చెను ఈ కవి యింకనిటువంటి గ్రంథములను రచియించి వాఙ్మయసేవఁ జేయుఁగాక.

రాజమహేంద్రవరము
9—11—37

(సం) చిలకమర్తి లక్ష్మీనరసింహము.

## శ్రీ చెన్నాప్రగడ భానుమూర్తిగారు
## మద్రాను ప్రభుత్వభాషాంతరీకరణపండితులు (రిటైర్డు)

శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారికి

చెన్నాప్రగడ భానుమూర్తి,

మీలక్ష్మీసహస్రపు మచ్చుతునుకలును, శృంగారనళీయమును అందుకొని చదివి యానందించినాఁడను కవిత్వధార ధారాళమై రసపుష్టియు గుణసమృద్ధియుఁ గల్గి సాగుచున్నది.

తరుణవయస్సున ప్రథమప్రయత్నముననే విద్వత్కవిసామగ్రియగు ప్రతిభా వ్యుత్పత్తులలవడిన మీరు ఇతోఽధికాభివృద్ధినంది రసబంధుర ప్రబంధరచనచే నాంధ్ర సరస్వతీసేవ చేయుటకు వలయునాయురారోగ్యముల మీకీశ్వరుఁడనుగ్రహించునుగాక!

నరసాపురము
27 — 7 — 41

(సం) చెన్నాప్రగడ భానుమూర్తి

## శ్రీ వేదుల రామశాస్త్రిగారు

కొత్తపల్లి సంస్థానవిద్వత్కవులు. కాకరపఱ్ఱు.
ప్రధానపండితులు, ఆంధ్రగీర్వాణవిద్యాపీఠము, కొవ్వూరు.

దీనిమేలిమి గురుపుత్రగురువులు వక్కాణించి యున్నారు. కాన నేనంతతెలుప నక్కఱలేదు. కాని ఈ గ్రంథము రచించునప్పుడుకాని, తరువాతగాని దీనిగురించి నాసహాయమేవిధముననుఁ బొందకున్నను నెల్లరకన్న నెక్కువగా నీతనితో నాకు గురుశిష్యసంబంధము లొక్కింత మెండుగా గలుగుటంజేసి యీకృతిలక్ష్మి గడించి యిచ్చు కీర్తివిత్తములో నాకును నేకీసపాలైనను గొంతరాక యుండదనిమాత్ర మభినందించు కొనుచున్నాఁడను.

(సం) వేదుల రామశాస్త్రి.

## ఓలేటి వేంకటరామశాస్త్రి

పిఠాపుర సంస్థానవిద్వత్కవులు

శ్రీరస్తు చిరంజీవులగు వేదుల సూర్యనారాయణశర్మగారికి అనేక శుభాశీర్వాదములు.

మీరుపంపిన లక్ష్మీసహస్రము (మచ్చుతునుకలు) చదివి చూచితిని. కవిత్వము ధారాశుద్ధిగలిగి సరళముగను మనోహరముగను గనుఁబడినది. ఆంధ్రీకరణమైనను స్వతంత్రరచనవలెనే కనుపట్టుచున్నది. మంచికవిత్వమున కుండవలసిన లక్షణములు చాలఁగలవు. మీ కవితారచన యుత్తరోత్తరాభివృద్ధినొందవలయునని యాశీర్వదించుచున్నాను.

గ్రహింపవలయును.

కవితావిలాసము, పిఠాపురము.
13 - 4 - 1937

(సం) ఓలేటి వేంకటరామశాస్త్రి

శ్రీ సాగి వేంకటనరసింహముగారు M. A

సంస్కృతలెక్చరర్, గవర్నమెంటు ఆర్ట్సుకాలేజీ, రాజమండ్రి.

ఆర్యా ! నమస్కారములు.

మీ శృంగారనళీయమునుగూడఁ జూచినాను.

నేను మీతోఁజెప్పినట్లు వేంకటరామయ్యగారికి నా అభిప్రాయము నందఁజేయనైతిని.

పసిఁడినిగ్గును, కప్పురపుఁదావియు, వెన్నెలల చలువయు, జుంటితేనియల మాధుర్యమును, మందమలయానిలముల మార్దవమును, పావనోదార గోదావరీ ప్రవాహగాంభీర్యమును, సహజముగఁ బ్రకటించు మీ కవిత్వమునకుఁ బండితాభిప్రాయము లను పైపై మెఱుఁగు లేలనో తెలియకున్నది.

27 - 11 - 37

మకాం

వేమూరివారి యిల్లు

కృత్తివెంటివారి అగ్రహారము, బందరు.

ఇట్లు విధేయుఁడు

(Sd) సాగి వేంకటనరసింహము.

బెజవాడ

4—2—41

కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు,

కాకరపఱ్ఱు శతాబ్దులనుండి విద్యాపీఠము, అచట నింకొక క్రొత్తపండితకవి పుట్టినాఁడనుటలో నచ్చెరువులేదు. కాని లక్ష్మీసహస్ర మింతసులువుగా శ్లేషలు చమత్కృతిగా తెలుఁగులోతెచ్చి తెలుగుచేసిన వారొకరు కలిగినారనగా నచ్చెరువేయగును.

(సం) విశ్వనాథ సత్యనారాయణ.

## శ్రీ చర్ల నారాయణశాస్త్రిగారు
### శ్రీసూర్యరాయాంధ్రనిఘంటుకార్య
### ప్రధానపర్యవేక్షకులు, పిఠాపురము.

చిరంజీవి వేదుల సూర్యనారాయణశర్మ అభిప్రాయము నిమిత్తము నాకుఁ బంపిన లక్ష్మీసహస్రము (మచ్చుతునకలు) భాషామణీ పత్రికానుబంధముగాఁ బ్రకటిత మైన సంచికను జదివిచూచితిని.

ఇందు కవి అచిరకాలమున సంపూర్ణముగాఁ బ్రకటింపఁబోవు ఆంధ్రలక్ష్మీ సహస్రమునకు మచ్చుచూపుటకై శ్లేషయమక చిత్ర బంధాదియుతముగ శ్లేష యమక చక్రవర్తియని పేరువడసిన వేంకటాధ్వరిచే రచింపఁబడిన లక్ష్మీసహస్ర మను సంస్కృతప్రబంధములోని అచ్చటచ్చట కొన్ని శ్లోకములకు తెలుఁగుపద్యము లను మూలమునకు అన్యూనాతిక్రమముగఁ దెనిఁగింపఁబడెనని సూచించుటకై యొకటిరెండు సంస్కృత శ్లోకములును ముద్రింపఁబడి యున్నవి.

ఈ పద్యములు కవియుద్దేశించినటు సంస్కృతమునకు సరిగాఁదేటతెనుఁగు మాటలతో నెల్లరకు సుబోధకమగు రీతినున్నవనుటకు సందియములేదు. గ్రంథ మంతయు నిట్లే యుండగలదని యూహించుచున్నాను కావునఁ బ్రకటింపనున్న సంపూర్ణగ్రంథమును ఆంధ్రలోకమాదరించి యీ బాలకవిని బ్రోత్సహించుఁగాక.

(సం) చర్ల నారాయణశాస్త్రి

శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణపంతులుగారు
శ్రీశారదా నికేతనము, గుంటూరు.

శ్రీ వేదుల సూర్యనారాయణశర్మగారిచే రచింపఁబడిన "శృంగారనళీయము" "లక్ష్మీసహస్రికావ్యము" అను గ్రంధముల నచ్చటచ్చట చదివిచూచితిని. వీరి కివి ప్రథమప్రయత్నములే యయినను ఆరితేరిన ప్రౌఢకవివలె రచించినారు. చక్కని శైలి మృదువుగనున్నది. తేలికగ అర్థమగుచున్నను పేలవముగలేక పూర్వమహా కవుల కవితను జ్ఞప్తికిఁదెచ్చుచున్నది వీరికవిత్వము. మిక్కిలి శ్రమపడక లక్ష్మీ సహస్రములోని శ్లేషలను తెనిఁగించినారు. ఇది దుర్ఘటమైనపని. ఈ యువకవి యొక్క ప్రథమప్రయత్నముల నాదరించి ఆంధ్రలోకము బహుగ్రంధరచనకు వీరిని ప్రోత్సహించునని ఆశించుచున్నాను.

గుంటూరు,
3 - 2 - 1940

(సం) వున్నవ లక్ష్మీనారాయణ

కళాప్రపూర్ణ
శ్రీ విక్రమ దేవవర్మ D Litt
Maharajah of Jaypore (Orissa)

జయపురము
28—1—43

మచ్చుతునుకలుగాఁ ప్రకటితములయిన తెలుగు పద్దెములు వేంకటాధ్వరి విరచితలక్ష్మీసహస్రశ్లోకములకు ననువాదములు. వానిరచయిత విద్వాన్ పండిత శ్రీవేదుల సూర్యనారాయణశర్మగారు. ఆపద్యములు మూలానుసరణములు, మృదు పదయుతములు, మఱినిర్దుష్టములు.

మఱియును దత్కవివిరచిత శృంగారనళీయము లకారప్రాసముగల మున్నూట చంపకమాలాచరణములతో నొప్పుచు మృదుశబ్దకలితమై మనోహరముగా నున్నది.

(సం) శ్రీ విక్రమ దేవవర్మ.

# లక్ష్మీసహస్రకావ్య సమర్పణము

శ్రీమ న్మత్కులదైవతంబులు రమా శ్రీసత్యనారాయణ
స్వాముల్, శ్రీఅలివేలు వేంకటపరబ్రహ్మంబులున్; నన్ను నా
రామన్, మామకసంతతిన్ సతతమున్ రక్షింత్రుగా కెప్పుడున్
క్షేమాసూనకృపావలోకన సుధాసేకాతి రేకంబుగన్. 1

నాపూర్వుల్ మొద లింతదాఁక ననుసంధానింతు మేఁ టేఁటనున్
దీపారాధన సేవ లేవిభు లసద్దివ్యాలయంబందు, నా
పాపిపున్ శ్రీచినవాడపల్లి నగరీరా ద్వేంకటేశప్రభున్
దీపింపంగ మదాలయంబులు సమృద్ధిన్; మ్రొక్కి ప్రార్థించెదన్.

అన్నవరంబు తన్నిలయ మన్నవరంబు లొసంగమాకు, మా
నాన్నలనాఁటినుండి మఱి నావఱకున్ సతతంబుఁ దద్ద్వతాఽ
చ్ఛిన్నసమగ్రసంపదలఁ జెంది సుఖించెద,మట్టి సత్యదే
వాన్నవరేశుఁ గొల్చెద ననంతసుఖమ్ములు మమ్ముఁ దేర్పఁగన్. 3

ఆరాధించిరి తల్లిదండ్రు లిల నా కాయుష్య మారోగ్యమున్
'పూరా'గా నిలుపంగఁ గోరికొని, సంపూర్ణ ప్రపత్తిస్థితిన్,
బేరు న్నాకు యదీయమున్ నిలిపి రెవ్వేళన్ దనున్ బ్రేమ నిం
డారన్ బిల్వఁగ:నిత్యముం గొలుతు నే నాసూర్యనారాయణున్. 4

సూర్యనారాయణునిమధ్యఁ జూడనైన
సత్య నారాయణుఁడె రమాసత్యదేవుఁ,
డాతఁడే వేంకటేశ్వరుఁ, డగుటఁజేసి
సత్య మిలువేల్పు వేంకటేశ్వరుఁడు మాకు. 5

శ్రీరామునకె విందుఁ గూరిచె నేభర
ద్వాజర్షి, యతఁడు గోత్రర్షి నాకు
బూర్ణమా పేరయల్ ముత్తవ్వ ముత్తాత
లై యుమాశంకరు లైరి నాకు
లక్ష్మీనారాయణుల్గా. కామమా లచ్చ
యలు నవ్వ తాతయు నైరి నాకు
గౌరమాంబాసూర్యనారాయణలు, వాణి
ధాతయుఁగాఁ దల్లి తండ్రి నాకు

వ్యాససిద్ధాంతి నాగమ, లమ్మపితలు
వ్యాసశాస్త్రియు, మఱి పరబ్రహ్మశాస్త్రి,
వ్యాసశర్మయు, సూర్యనారాయణయును,
లక్ష్మీనారాయణయు మాతులకులు నాకు. 6

వేదులవారటం చెపుడు పేర్వడిరో గృహనామమౌచు, సం
వేదులు సామవేదమున విజ్ఞులు. సాహితిచక్రవర్తు, లాం
ధ్రాదిమభాషలందుఁ గవితాత్ములు, శాస్త్రసముద్రు లందు రా
వేదులవారిబిడ్డనయి పెర్గితిఁగాకరపర్తిగడ్డపైన్. 7

నను నారామద్రావిడు,
ననఘద్విజవంశ్యు, సూర్యనారాయణ శ
ర్మను బ్రేమను జదివించిన
ఘనగురువులు పెక్కుమంది గల, రెన్నంగన్. 8

ఆదిగురుండు మాతులుఁడునై శ్వశురుండగువ్యాసశర్మ యాం
గ్లాదుల, నింక మధ్యగురులై చదివించిరి వ్యాసలింగశా
స్త్ర్యాదులు సంస్కృతంబు, మఱి వ్యాకృతిశాస్త్రపయోధి రామ శా
స్త్ర్యాదులు లోఁతులం దెలిపి: రందఱ మద్గురులం దలంచెదన్. 9

'విద్వా'న్పట్టము నందితి,
'విద్వత్కవి' యనఁగఁ గవిత వెలయించితి, ధీ
మద్విద్యార్థులకు తణుకు
సద్విద్యాలయమునందుఁ జదువుఁ గఱపితిన్, 10

కవిత స్వయంకృషి కాఁగా,
నవునన విద్యార్థి నగుచు నది చదువుచునే
ప్రవచించితి నాంధ్రమ్మునఁ
గవినై లక్ష్మీసహస్రికావ్యము నేనై. 11

"శ్లేష యమక భావ చిత్రసమాశ్లిష్ట"ని
యశముఁగొన్న వేంకటాధ్వరికృతి,
ననువదింపఁ డెవ్వఁ డంతపుష్టిగ నేను
తెనుఁగుఁజేసితి నన దేవికృపయ. 12

తెనిఁగింపఁగ శక్యముగా
దనులిఙ్గ విభక్తి కావ్యయస్థ తిజస్త
స్థనిబద్ధశ్లేష విఱుపు
లును, జిత్రము, లొదిగెఁ దెనుఁగులో నంబకృపన్: 13

వయ సిరువది, ప్రకటింపఁగ
భయమయ్యెన్ చెఱుకువాడవార్ వేంకటరా
మయగార్ '*భాషామణి'లో
వయిచిరి వెఱపఱగఁ గొన్నిపద్యము, లటుపైన్. 14

"చెళపిళ వేంకటకవి" వ
ర్యులునన్, శ్రీపాద కృష్ణులును, కాశీ కృ
ష్ణులు, చిలకమర్తి నరసిం
హులునున్, మఱి విశ్వనాధు 'లోహో !' యని రిఁకన్. 15

---

*ఆనాఁడు రాజమహేంద్రవరమునుండి వెలువడినట్టి ఉత్తమశ్రేణికిఁజెందిన హిత్యమాసపత్రిక. నా శృంగారనళీయము. లక్ష్మీసహస్రములోని మచ్చుతునుగా నెంచిన సుమారు 100 పద్యములను భాషామణిలో బ్రకటించి శ్రీ వెంకటమయ్యగారు నాకు విడిగా కొన్నిపుస్తకములుగాఁగూడ ముద్రించి యిచ్చిరి.

సకలము దైవాధీన
మ్మకదా ! నాసొమ్ముతోనె ముద్రించితి, ల
క్ష్మికి నాపై నింతటిదగు
సకలంకప్రేమ యుండ, నన్యుల కగునే ! 21

ఏకాక్షరయమకములను,
నేకొంచెమొ బంధకవితఁ నిఁకఁ గొఱవడగా
నాకొఱత నిపుడు తీర్చితి ;
నీకృతి నాకరువదేండ్లు నిండ వెలువడెన్. 22

శ్రీనిఁ గూర్చినకృతి గాన శ్రీనివాస
మూర్తికే యంకితమ్ము నొనర్తు నేను
అంకిత మ్మన్యునకు నిడు టద్ది కాకి
ముక్కునకు దొండపండిడు పోల్కియౌను ! 23

శ్రీనిఁ దనతొమ్మపైని వసింపఁజేసి
నాతనికి శ్రీనిఁగొనియాడఁ బ్రీతి గలుగుఁ,
దననుతిన్ దనభర్తకున్ వినుపఁ బ్రీతి
గలుగు శ్రీదేవి; కిఁక నేమి వలయు నాకు ? 24

సాలంకృతలక్ష్మినిఁ గొని
యేలంగాఁ దగినవాఁడ వీవని, నీ పా
దాలం బెట్టితి వేంకట
శైలేశా ! శ్రీనివాస ! సర్వము నీవే. 25

ఒకయల్లుఁడు కృతిసభఁ దా
వకసన్నిధిఁ గూర్చెఁ; గరవువచ్చిన తటి య
చ్చకుఁ గాకిత మిప్పించె నిఁ
కొకయల్లుఁడు; సుతులు ధనము నొసఁగిరి కృతికై. 26

కావున నల్లురఁ గూఁతుల
తో వృద్ధినిఁగూర్పు; సతులతో నాసుతులన్
బోషింపుము; తత్సంతతులను,
నావనితను గౌరిదేవి నలరింపు మిఁకన్. 27

నాకై కోరిన దొక్కటె
యా కైవల్యంబుగాక యడుగ మఱేదియుఁ;
నా కిఁక జన్మం బెప్పుడు
రాకుండఁగఁజేయు; మదె వరమ్మగునాకున్. 28

ఓకృతిపతి! వేంకటపతి!
కైకొను లక్ష్మీసహస్రికావ్యసుతను నీ;
వీకల్యాణమహోత్సవ
మే, కూర్చుత సుతసుతాభివృద్ధులు మాకున్. 29

అల్లుఁడవై మల్లక్ష్మిని
పెళ్లాడితి; వింక శయనవేశ్మమ్మగ నా
యుల్లమగుఁ బాలసంద్రపు
వెల్లి కృతిశ్రీసనాథ! వేంకటనాథా! 30

# లక్ష్మీ సహస్ర కావ్యము

# విషయ సూచిక

వరుససంఖ్య　　పేరు

శ్రీః

# లక్ష్మీసహస్రకావ్యము

## ప్రారంభస్తబకము

శ్రీరామా రమణీయ పాదయుగళీ శృంగార లాక్షాంకిత
స్ఫారోరోంతరుఁ డీశ్వరుండు త్రిజగత్ప్రాదుర్భవ స్థాన సం
హారక్రీడుఁడు శేషశైల సతతాధ్యావాసభక్తావన
ప్రారంభుండునునైన వేంకటపరబ్రహ్మంబు నర్చించెదన్. 1

అరుణాంబుజాక్షు లసదృశు
లురుతర విలస త్పయోధ రోద్యన్మూర్తి
స్ఫురితులునగు దంపతులను
మరి మరి మ్రొక్కెదను లోకమాతన్ పితనున్. 2

శీతలకరుణామృతఝర
పాతములన్ మంగళములు పండించెడి శ్రీ
మాతన్ గొల్తుఁ బవిత్రఁ
బ్రాతర్వికచాబ్జపత్రభాసురనేత్రిన్. 3

కోరి భజింతు యత్పదవిజృంభణ మాయమృతాబ్ధిజాకుచో
ద్గారపయఃప్రపూరమువిధంబు మహోచయమై జగత్త్రమ
స్తారకమౌనొ యట్టి గుణధన్యము యామునసాధమధ్య మా
శ్రీరమణాస్మదీయగురుశేఖరమౌ గురుపాదవర్గమున్. 4

శ్రీదేవీస్తవనాతిపూతయగు మజ్జిహ్వానటద్వాణి శ్రీ
భూదేవీతనయా కథామృతమహాపూరంబు నీభూమిపైఁ
బ్రాదుర్భావముఁజేసి యెల్లర భవప్రాప్తాతితాపమ్ము వి
చ్ఛేదంబుంబొనరించు నాదికవిరాడ్జిహ్వేందిరన్ గొల్చెదన్. 5

తమి నేకవి కృతిసింధువు
నమృతమున కహీనగుణులు నగు విబుధులు య
త్నమున మధింపఁగ శ్రీలా
భము నమరునొ తత్కవీశు వ్యాసుఁ దలంతున్. 6

నీవు విభుత్వ మిచ్చెదవు నీపదభక్తుల కంబ! యట్టి నీ
కే విభుతన్ ఘటించి నుతికెక్కుమహాత్ముఁడు దుష్టసర్ప కో
టీవినతాతనూజుఁడు పటిష్ఠమహోపనిషద్గురుండు నా
పావనమూర్తిఁ గొల్చెదను భక్తిని వేంకటనాథదేశికున్. 7

ఆదిని నాదుభారతి వనాద్రివిధూదధిభూపపట్టణాం
భోదములం దసత్యపరిపూరితవర్ణనఁ జేసి చేసి వి
ర్వేదమునొంది పాడువడి వేసరియుండియు నేఁడు త్వద్గుణా
పాదక దివ్యకీర్తనకుఁ బర్విడుచుండె నదేమిచిత్రమో. 8

అతిమదదూషితాంధుల నృపాధములన్ సువచోవిలాస సం
తతుల నుతించి చాలు నొకదండము వారల కింక నీదుసం
స్తుతుల నొనర్చి పాపభరశూన్యతఁ గాంచి యభీష్టసౌఖ్యవి
స్తృతుల నిహోర్ధ్వలోకముల నిమ్ముగఁ జూఱఁగఁ గొందు శ్రీసతీ !

సరస మృదూక్తి సత్కవిత సమ్మతి నీచులపాలు సేసి స్వో
దరపరిపూరణార్థమ యతథ్యపుఁగబ్బములన్ రచింత్రు కొం
దఱు మఱి నేను శ్రీభుజగనాథ శిరోఽధికకంపనావహా
త్పరమసమర్థ మత్కవితఁ బావనిఁ జేయ నినున్ నుతించెదన్. 10

వాణీజాని సుతుండు వేదమయమౌ వాహంబు తల్పంబు గై
ర్వాణీశబ్ద నియంత తమ్ముఁడు కళావంతుండు నీ, కేనొ ని
ర్వాణప్రజ్ఞుఁడ సంస్తవంబుల నినున్ రంజింపఁగాఁ బూనితిన్
మాణిక్యాపణమందు గుంజ లిడి యమ్మం బూనిన ట్లమ్మరో! 11

అమృతమధురిమఁ గాదనునట్టి పూర్వ
కవినుతులఁ గల్గినట్టి నీకర్ణ జడిమఁ
బాపగా నేవొ విహసనాస్పద పదాలఁ
గూర్తు నీనుతి నియ్యది గొనుముతల్లి ! 12

ప్రవిమలగాత్రి ! పండితపురందర రంజకమైన మత్కృత
స్తవ మసహిష్ణుపామరముదంబును బొందకపోవుఁగాక నేఁ
డివురను దానిఁ గోరి స్వరధీఘన కింపగు యక్షగానముల్
చెవిటిమనంబు రంజిలగఁ జేయఁగఁజాలునె యెన్నఁడైననున్. 13

నీనుతి సేయ నెట్టులుగ నేర్తును నేను, ధృతాష్టకర్ణుఁడన్
గాను, చతుర్విధశ్రుతినిఁ గాను, కనుల్‌చెవులౌనహీనుఁడన్
గాను, హనూమదాదులకె కష్టతరంబగు వార్ధి దాటగాఁ
బూనినకుంటివానివలెఁ బూనితి నిన్ను నుతింప, నమ్మరో ! 14

సరసిజవాసినీ ! కునృపసంఘమహాస్తుతికూపజాలమం
దరయమిఁ గాలు జాఱిపడి యంధునిరీతిగ నేఁడు వేంకటా
ధ్వరికవి త్వద్గుణస్తవసుధారస మానఁగఁబూనెఁ దింత్రిణీ
క రస విశేషపాయి పులకండపుమాధురిఁ జొక్కురీతిగన్. 15

కావ్యజీవితభూతఘనరసస్థితి నెంచి
చూచి సంధానించు సొగసు నెఱుఁగ
శబ్దార్థతదుభయశక్తుల సరిఁ దూఁచి
కోరి కూర్చెడు ముద్దుఁగూర్పు నెఱుఁగ
సామాన్యులైనట్టిజనులు ప్రయోగించు
జాతీయములనైనఁ జాలనెఱుఁగ
లలితార్థహేతుకాలంకారభేదముల్
సాంగయుతంబుగాఁ జదివి యెఱుఁగ

నైనఁగానియు సిగ్గుఁ బోనాడి నేను
నిన్ను నుతియింప యత్నించుచున్నవాఁడఁ
బ్రథితకరుణాలయవు కాన భక్తజనుని
తప్పు క్షమియించి ప్రోవగదమ్మ తల్లి ! 16

కాలునఁ గన్ను లేదు మఱి కన్నులచే వినలేను శీర్షముల్
నాలుగు నైదు నాఱునయి౯ం గనఁ బుట్టను బుట్టలేదు, కం
జాలయ! నీగుణాళిఁ గొనియాడగఁబూనిన నాపర్యిత్నమున్
హేళన సేయకుండునె 'యిహీ యిహి' యంచు జగజ్జనావళుల్. 17

వేదజాలమ్మునకునె యవిషయమైన
నిన్నుఁ గొనియాడ, నే నెట్లు నేర్తు నమ్మ!
బాడబునకె యసాధ్యమౌవార్ధిఁ దావ్రి
మశకశిశు వెప్పుడైన సమర్థమగునె! 18

ఏతఱినైన ధాతృముఖు లెక్కవయౌదురు కాని తల్లి! నీ
యాతరమైన సద్గుణమహత్త్వము లెన్నెడువేళ నేను నా
ధాతృముఖుల్ సమానమతిధారులమే శశి రాతివ్రేళ ఖ
ద్యోతముఁగెల్చినన్ పగలు దోఁచిన రెండును నొక్కటేగదా! 19

పటునుతికోరకపవ్రితతి వాక్పతి పొందుఫలంబె నాకునున్
గటునుమితస్తుతిన్ సరిగఁ గల్గును తల్లి! యదెట్టులన్నఁ బ్రి
స్ఫుటజపదానహోమములఁ బొందు మహోమ్న్యతవై భవంబునే
యటుకులమాత్రివ్మే పిడికెఁ డాదృతి నిచ్చి కుచేలుఁ డొందఁడే! 20

అమరేశాదులు త్వద్గుణామృతము నిత్యం బాని ధన్యోత్తముల్
కమలా! నేను భవద్గుణాబ్ధిఁ గణముల్మాతాృిస ధన్యుండ న
య్యమరుల్ గోర్విలుదురిందునుండి యమృతాహారంబుఁదృప్తిన్ జకో
రములో రెండునుమూఁడుబిందువులమాతవ్రిన్ దృప్తినిం బొందవే!

అమ్మా! వేంకటశైలరాడ్విభునికొమ్మా! నేను నీపైని స్తో
త్రమ్ముల్ గూర్పఁగ సాహసించితిని శబ్దార్థమ్ము లీవే కటా
క్షమ్ముల్గూర్చి భవత్కరాగ్ర విలసత్కల్హార మాధ్వీ భ్రమ
త్సమ్మర్దోత్థ షడంఘ్రిసంఘ విసర ఝ్ఝుంకార సంకాశముల్. 22

శ్రీవేదాంతకవీంద్రచంద్రుఁడు భవత్ప్రియాంసుసత్పాదుకన్
దా వేపద్యములన్ నుతించెననఁ జిత్రింబేమిలే దాహయ
గ్రీవుం డాతఁడె యౌట, నల్పజనుఁడన్ గించిద్జ్ఞుఁడన్ మందుఁడన్
నే వేయింటను నిన్ నుతించెద ననన్ విద్వజ్జనుల్ నవ్వరే! 23

ఇతరములైన కావ్యము లవెన్నియొ యున్నను దల్లి! యిద్ది నీ
స్తుతిగుణలేశమాత్ర బుధతుష్టినిఁ బొందునటంచునెంతు, నీ
పతిచరణాబ్జజాత యని భర్గుఁడు జాహ్నవి నుత్తమాంగమం
దతిముద మొప్ప మోయఁడె మహత్తరతీర్థము లెన్నిగల్గినన్. 24

అతితరచిత్రపద్యమయ మైనను నీనుతి తల్లి! మోటకుల్
మతిఁ బరికించి యొక్కయణుమాత్రము సంతస మందలేరు నే
వెతఁ బడదాని కేమనిన వేధ విశాలరసాస్థలిన్ జమ
త్కృతిరసవేదులన్ మువురు నిద్దరనైన సృజింపకుండునే! 25

పలుకులకల్కి చన్నుగవపాలను వాదుకుఁ బిల్చుమాధురిన్
జెలఁగుచుఁ దేటతేనియలఁ జిల్కుచుఁ బల్కిన వేంకటాధ్వరిన్
గలిప్రథ హెచ్చ, లక్ష్మిగుణగాథల వేదుల సూర్యశర్మ మే
ల్తెలుఁగొనరించెఁ దణుకుపురి; దీనిఁ బఠించి తరింపుఁడీ! జనుల్. 26

కొలిచినఁజాలు ని న్నెపుడొ కొంచెము వానికి వేయినేత్రముల్
మొలవకతప్ప దింకఁ బ్రతిపొద్దును నీపదకంజముల్ హృదిన్
నిలుపుచునున్ననాకు గణనీయములైన సహస్రపద్యముల్
వెలువడకుండునే వదనవీధిని వాణి వసింపకుండునే? 27

సరసీసంజాతాలయ!
విరసంబై నను మదీయ వినుతి భవత్కిం
కర వేంకటకవిసూర్యా
కర మని కరుణార్ద్రదృష్టిఁ గావంగదవే. 28

శ్రీకరభాస్వదలంకృతి
యై కడు రసికాళిరుచ్యమై రమ్యంబై
యీ కృతిపద్మము సూర్యా
లోకమునను శాశ్వతము వెలుంగుంగాఁతన్ ! 29

# లక్ష్మీ సహస్రకావ్యము

## ప్రాదుర్భావస్తబకము

మిగుల కర్కశమును నతిమృదులమైన
రత్నములు రెండు విష్ణునురమ్ము నెపుడు
వెలుఁగఁజేయంగఁ బ్రాదుర్భవించె నెచట
నట్టి కలశార్ణవంబున కంజలింతు. 1

జనని! చతురాస్యముఖ శిశుజాతమును స
మృద్ధముగఁ బాలఁ బెంచ జన్మించితీవు
కామధేనువుతోడఁ బాల్కడలియందు
సర్వజగదంబ! ఏమివాత్సల్య మహహ! 2

ఆక్కలశాబ్ధిలో జననమందె మహోద్వయి నీదువెంట నం
దొక్కటి విష్ణువక్షమున నొప్పెను రెండవదౌ మహంబు తా
నక్కరకంరుమస్తమున కందము సంఘటియించెఁదల్లి ! నీ
వ్రక్కజనింపఁగాఁ గనిన భాగ్యమహోన్నతికాదె వానికిన్. 3

జీవం జీవములను గడుఁ
జోఁవంగఁ దమోభరంబుఁ బోఁదోలంగన్
గావంగను సచ్చకోరము
నీవున్ శీతాంశుఁడున్ జనింపరె కడలిన్. 4

జగదభిమోహనమ్మగుచు సంద్రమునుండి జనించుచున్న నీ
మొగమును గాంచి శంకరుఁడు, పూర్ణుఁడు నిర్మలుఁడైన చంద్రుగాఁ
దగఁ దలపోసి తా మొదటఁ దాల్చిన ఖండశశాంకు రోసి క్రిం
దుగఁ బడఁ ద్రోయనో యనఁగ నూఁపె శిరమ్ము నినున్ నుతించుచోఁ

సుమనస్సమూహముం జూచి గోదానామృ
తాన్నదానమ్ముల నమరఁ జేసె
విబుధమాన్యుండయి వెలసిన మఘవంతు
నకు నుత్తమాశ్వదానం బొనర్చె
సన్మార్గులకు మణి సంతాన ఫలవృక్ష
ములు నాదిగల దానములనుజరిపె
జడదారియై దిగ్వసనుఁడైన సర్వజ్ఞు
నకు సితాంశుకదాన మొకఁ డొసంగె

నీజనకుఁడైన దుగ్ధాబ్ధిరాజు నిన్ను
పరమపురుషున కొసఁగుటకొఱకు ముందు
పరిణయవ్రతదీక్షావసరమునందు
అలఘుసంపద్విధాత్రి ! దుగ్ధాబ్ధిపుత్రి ! 6

పారావారమునుండి దివ్యులు సుధాభాండమ్ముఁ గైకొన్ననున్
స్వారాట్టు వెలిగుఱ్ఱముం బడసినన్ జంద్రున్ భవుం డొందినన్
సారాసారవిదుండు గాన హరి శేషస్థానమందున్న నిన్
గారామొప్ప వరింపనో జనని ! మున్ దాఁగోరఁ డొం డేదియున్.

నీదుమోము చంద్రునిం బలు కమృతముఁ
గరములును బదములుఁ గల్పవృక్ష
పల్లవములఁ బోలు తల్లి! వ్యక్తమగునె
అన్నఁబోలుచెల్లె లన్న మాట. 8

జలధి సుధాదిసంతతినిఁ జాలగఁ బొందినఁ బొందుఁగాక నీ
వలననె, తల్లి! సంతుగలవాఁడగు నాతఁ డదెట్టులన్న భూ
వలయమునేలు రాజునకుఁ బౌరుషధైర్యగుణాదు లెన్నియేన్
గలుగునుగాక, దానమునఁగా యతఁడెక్కుడు వాసికెక్కెడున్.

వడివడిఁ ద్రచ్చువేళ నల వాసుకి వేయిముఖంబులన్ బయ
ల్వడి సుడిగాలి రేఁగ పయిపైఁ దిరుగాడు పయఃకణంబు లిం
బడరి సుమాళి గాఁగఁ దగు మంధరమంథనధుంధుమధ్వనిన్
గడు నుతియించి శ్రీహరినిఁ గాంచె సముద్రుఁడు నిన్ను నిందిరా!

తరిమలవల్ల నుల్లసిలు ధంధమరావములే మృదంగఘాం
కరణములై మరున్నటశిఖామణి హంగులొనర్పనై మనో
హరనటులౌ తరంగవిపణాంగన లెల్లరచేత మేజువా
ణి రహి నొనర్పఁజేసె రమ ! నీపిత నీ జననోత్సవంబునన్, 11

వాసుకిదొట్టి యెల్ల చిలువల్ దరికొండను జుట్టియుండి స్వ
ర్వాసులు వార్ధిఁ ద్రచ్చునెడఁ ద్వజ్జననంబున నీశిరోజముల్
వేసటలోనఁ జూచి శిఖిపింఛమటంచును భ్రాంతినంది సం
త్రోసమునొంది త్రాళులవిధంబు కృశించె వినీలకుంతలా! 12

మెండుగా వారిభాగ్యముల్ పండి వార్ధి
నుండి నీ వుద్భవింప నాఖండలుండు
మున్నుగా వేల్పు లెల్లరుఁ బూజ లిడిరి
జనని! డిండీరతండపుష్పముల నీకు. 13

బలుపుగఁ గ్లేశమొందిరి సుపర్వులు నిన్ గన నంచు వారి య
య్యలపును బాపువ్యాజమున నాపృషదశ్వుఁడు మెల్లమెల్లగా
మలసెను వారిపై నఖిలమాత! శ్రమంపడియుంట మెండునా
కలిఁ గొనియున్నయట్టి యురగంబులు మ్రింగు నటన్న భీతిచేన్.

ఆనలినాలయన్ బరిణయంబగు బెప్పు డటన్న కౌతుకా
ధీనతనున్న వెన్నుని ప్రతీక్షణవీక్షణపంక్తిపోలికల్
బూనిన దుగ్ధవీచికల, మున్నుగఁ దల్లి! వివాహమంగళ
స్నానవిధిన్ నయించె నిను సంద్రము సాంద్రముదంబునొందుచున్.

అమృతవారాశిఁ గల్పవృక్షములనడుమ
భాసురంబగు మణిమంటపమునఁ దల్లి!
సింహపీఠిక మృదుసరసీజమందు
నున్న త్రిదశోపసేవ్యవౌ నిన్నుఁ గొలుతు. 16

అమృతవీచికలను బోలునట్టి చామ
రముల నభ్యర్ణమున నప్సరసలు గొలువ
జనుల పరితాపమును బాపు జనని ! నిన్ను
నిదురలేవఁగనే నాదుమదిఁ దలంతు. 17

జనయిత్రి ! భవదుద్భవంపుఁదఱినిన్ జంద్రామలజ్యోత్స్న పైఁ
దనుకంగా ముకుళించి మంథర రయోద్యన్మంధన మ్మోర్వకో
య్యన గట్టెక్కిన తమ్మిమొగ్గలనఁగా హస్తాంజలుల్ వట్టి స
ర్వనిలింపుల్ వినుతించు తావకకృపాపాంగమ్ము నర్థించెదన్. 18

మురహరునిసన్నిధివి ది
క్కరు లభిషేకంబు సేయఁ గనులారఁగ ని
న్నరసి భవత్ప్రీత పొందిన
గరువపుమురువునకు మేర గలదే ! తల్లీ ! 19

ఉఱికితివి దేవతలు చూచుచుండఁగానె
విష్ణునురమున, శృంగారవిధము మెఱయ
తనదు పసినిసుంగుల సన్నిధానమ్ముందు
జనని ! పతిఁగూడ సతికి లజ్జయగునటవె ! 20

కలశసాగరదీప్తి గంగాస్రవంతి;
శ్యామసుందరతనుకాంతి యమున; నీదు
స్వర్ణతనురోచి యిఁక సరస్వతి; త్రివేణి
సంగమమువంటిదగును మీ సంగ; మంబ ! 21

అమరనదిచేతఁ జల్లనౌ హరుశిరమున
శశి వసించెను, గరుణచేఁ జల్లనైన
హరియురంబున నుంటి వీ వంబ! మీరు
పుట్టినింటికిఁ దగునిల్లు మెట్టినారు. 22

ఆ మహావిష్ణుభుజమధ్య మనెడి మేటి
యత్తవారింటి కీ వేగునపుడు నీకు
సారెగా రత్నములను విస్తారముగను
నొసఁగె నీ తండ్రి రత్నాలయుండు తల్లి! 23

# లక్ష్మీసహస్రకావ్యము

## వక్షస్స్థలావస్థానస్తబకము

సతము శేషాచలేశు వక్షస్స్థలమున
నిరవుకొని చలనమొందని కరుణగలిగి
జనులఁ బ్రోవంగఁ గంకణమును ధరించి
నట్టి యంబుజనిలయ నే నభినుతింతు. 1

ఓకారుణ్యపయోనిధీ! గుణనిధీ! యోభక్తహృత్సన్నిధీ!
యోకాంక్షాధికసంప్రదానచణదివ్యోదారదృగ్భాసినీ!
యోకల్యాణి! సమస్తలోకజననీ! యోహర్యురోవాసినీ!
నీ కేమ్రొక్కెద సుస్థిరంబగుమతిన్ నిత్యంబు నన్ బ్రోవుమీ! 2

పంచచామరము.

భవాభవాదిసేవితాంఘ్రిపద్మ! పద్మసద్మ! క్షీ
రవార్ధివంశపావనీ! పరాత్పరాంబ! హర్యురో
నివాసినీ! జగన్నివాసినీ! త్రయీశిరస్తుతా!
భవాంబుధిన్ దరింపఁజేసి పాలనం బొనర్పవే. 3

నీపతిపడుకిల్లు నీతండ్రి నీతమ్ముఁ
డొండు భూష వేఱొకండు కన్ను
నీవు వక్షమందె నిలిచెవ, వీపేరిమ
అన్యలభ్యమగునె యంబ! చెపుమ. 4

'తనతోఁబుట్టువెయైన చంద్రువసుజాతంబుగా గనన్‌లేని యా
వనజాళిన్ వసియించు లక్ష్మి యనుదుర్వాదంబుఁ బోఁద్రోల నీ
వనయంబున్ సహజాతకౌస్తుభ శుభాధ్యావాసమైనట్టి యా
వనజాతాయతనేత్రువక్షమున సంవాసింతు వో శ్రీసతీ! 5

అతిపాపాత్ములమైన మాదృశుల నయ్యబ్జోదరుం డేమి శి
క్షితులం జేయునో యంచు నీవు కరుణాసిక్తాంతరంగంబు వే
నతనిన్ మాపయినిన్ దయాకలితుఁ జేయంబూని నీ వెప్డు నీ
పతివక్షంబుననే వసింతువుగదే భక్తాభిరక్షాగ్రణీ! 6

నీవిభుఁడు ప్రాణపదమైన నెలవునందు
నిన్ను నెలకొనఁగాఁ జేసి నెమ్మిఁ దల్లి!
ప్రాణసమ నీవు వేంకటపతి కటన్న
జనములాడెడినుడిని నిజంబు సేసె. 7

జనని! గళశంఖమందుండి జాలువాఱు
హారలావణ్య నాకాప గాంబువులను
ప్రణయపూరిత హృదయసామ్రాజ్యమునకు
నిన్ను నభిషిక్తగాఁజేయు నీవిభుండు. 8

అరయ శిరీషపుష్పసదృశాంగివి నీ వతిపేశలంపుఁదా
మరసగృహంబు వీడి యల మాధవు బాణకి జాతికర్కశా
విరళము కౌస్తుభోపల నివేశ కఠోరమునైన వక్షముం
గరము సహించియుంట, మముఁ గావఁగఁబూనియొకా! రమాసతీ!

క్షీరవార్ధిఁబుట్టి శ్రీవత్సశోభితం
బగుచు హరితదీప్తి నలరు విష్ణు
వక్షమనెడు గోష్ఠభాగంబు మెట్టి మా
కమృత మొసఁగువేల్పుటావు నీవు. 10

అతిలోకుం డఘనాశకుండు నతులుం డైయొప్పు నీభర్త, అ
య్యతనింగూడ నతిక్రమించి భవదీయంబౌ మహత్త్వంబు ర
మ్యతనొందున్; సనకాది మానసములం దాతండు వాసించు, శ్రీ
సతి! నీ వాతనిమానసమ్మననె వాసమ్మందు దెల్లప్పుడున్! 11

ఏరలు శ్రీవేంకటపతి
నూరస్థానంబునందు శోభిల్లెడు నిన్
గోరి భజింతురో వారలు
నూరస్థానంబుఁ జించి చొత్తు రమృతమున్. 12

బలివసుహరు నుచ్చోర
స్థలమున వసియించి నీవు సారసనిలయా!
చెలఁగి హరింతువు మా చిర
కలితంబుల నర్థములను గడఁకన్ సతమున్. 13

అంబ! శశియు నీవు నబ్ధిఁ బుట్టితి రైన
నతఁడు కృష్ణధారియయ్యె నీవొ
కృష్ణధార్య వైతి కీడొంద మేలొందఁ
గారణంబు జన్మకాలఫలము! 14

క్షీరనిధిజాత! ఓభక్తపారిజాత!
అల్ల శ్రీహరిభుజవిటపాంతరమున
పెనఁగి వనమాలచేత వ్యాసృతయగు నొక
కనకలతికామతల్లిగాఁ గనుదు నిన్ను. 15

అంబ వనమాలికాశోభితంబును పర
మతులసీతమ్మనౌ సులక్ష్మణము మఱియు
ప్రథితసద్రూపమును మహారామమునగు
హరియురోదేశమందు కాపురము నీకు. 16

ఇతరములైన మానికము లేవిధరించిన వానిలోన నీ
ప్రతిమను గాంచి నీ వితరభామనొకర్తుకఁ జేరఁదీసెఁగా
యితఁ డనికోపగింతువని యెంచి భవత్పతి యట్టిశంక కే
గతియును లేని నీసహజుఁ గౌస్తుభమున్ ధరియించె నద్దిరా! 17

అమ్మ! నీయిష్టగేహమౌ హరియురమున
స్నేహపూర్ణమ్ము త్రిదశోపసేవ్యము నయి
ప్రజ్వరిలుకౌస్తుభమణిదీపమ్ము తమము
మాపి మా కిఁక ముక్తినిఁ జూపుఁగాక. 18

సరసీజాలయ వై నను
పరికింపఁగ సతము మునులభావమ్ముల నా
మురహారునురమున నాగము
శిరముల నివసింతు వీవు చిత్రము తల్లీ! 19

శ్రీవత్సాంక పరిష్కృత
మై వనమాలాభిరామమై తాపింఛ
శ్రీవిలసితమౌ హరియుర
మావసథంబై నతల్లి! యలరింపు మమున్. 20

పరతత్త్వంబు 'భవద్విభుండ, మఱి నీవా?' యన్న ప్రాచీనవా
క్పరిషద్వర్యులచింత వాపుటకు నీప్రాణేశుఁడోతల్లి! ని
న్నురమందున్ ధరియించి భూషణవిధంబొప్పంగ స్పష్టంబుగన్
బరతత్త్వప్రతిపాదనం బొనరిచెన్ బ్రాభత్వ మేపారగన్. 21

నీ కెటనొచ్చునో యనుచు నీపతి నిన్ను సుమాంగి! తొమ్మనన్
జేకొనెఁ గాని నీదయినచేరికచేఁ బులకాంకురావళుల్
మేకొనె, వానినిన్ గెలువలేకయె యంతటిశౌరిగూడ స్వే
దాకులితుండెయయ్యె జయమౌనె రహస్థితకంటకాళితోన్. 22

సుస్థిరంబయి నీలంపుశోభలొలయఁ
దగు ముకుందాభిధాన నిధానమును ని
రంజనులె పొందుటను జూచి రక్షసేయ
నొక్కొ యయ్యురమున నంటియుందు వంబ! 23

తామరసశరణ వయి యథార్ధముగ న
తామర సశరణ వగు దో కామజనని !
పర మురస్ఫుర ణారిని మురియఁజేయ
పర మురస్ఫురణమ్మున వరలు దహహా ! 24

ఒక్కనిముసంబు విష్ణునియురము నీవు
విడిచియుండిన మా కేడుగడ యెవండు ?
అపథవర్తనులౌ వారియందు మివుల
కోపియగు విభుకోపంబు మాపఁదల్లి ! 25

# లక్ష్మీసహస్రకావ్యము

## కారుణ్యాష్టకము

మూర్తినొందిన కారుణ్యపూరమనఁగ
వెలసి భక్తులకెల్ల నీప్సితము లిడుచు
హరియురోభూషణమ్మైనయట్టి పాల
కడలిరాముద్దుకొమరితం గరముఁ గొలుతు. 1

రావణుఁడాదియౌ పలుగురక్కసు లీభువిఁ బాపవృత్తి న
త్యావిలమొందఁజేయఁగ దయాబ్ధివిగానఁ బ్రజాళి నెల్లనున్
బ్రోవఁగఁబూని యా జనకభూపుని జన్నపుభూమిగర్భమం
దీవుదయించినావు జననీ ! నుతియింపఁగలారమే నినున్. 2

నీదయ నిశ్చయంబుగను నీయెడ నిర్దయ, యెట్టులన్న దు
గ్ధోదధిపుత్రి ! భూమిపయి నుద్భవమొందగఁజేసి కట్టి! బా
ధాదశ నొందఁజేసెఁగదె తద్దయుఁగాలముదాక నిన్నుఁ గ్రి
వ్యాపిష్టమ్మునందు జగదార్తినివృత్తి నొనర్పఁజేయగన్. 3

చేసితి నెన్నొతప్పులను జెప్పఁగఁగూడని వైనఁగాని పే
ర్వాసినిఁగన్న నీదుదయ పర్వునునాపయిఁ దప్ప, దంబ! సం
తాసముఁజెందునాకు వరదానచణా! కరుణాబ్ధి! నీదు కా
కాసురరక్షణ మ్మధికమైన ధృతిం గలుగంగఁజేసెడిన్. 4

జనని! నీ కెంతొ ద్రోహంబు సలిపియున్న
వాయసముఁ గూల్ప నాయసంబైనయట్టి
రాముహృదయంబు నీదయార్ద్రంబుఁజేసి
కరఁగిపోయెను కోపమ్ముఁ దఱిగిపోయె. 5

ఎంతటిద్రోహకార్యముల నేచిననైనను వారిపైని నా
వంతయు శత్రుభావమనునట్టిది లేక దయారసంబు వ
ర్షింతువు తల్లి! రావణుఁడు నెల్లినపిమ్మట పూర్వదేవతా
కాంతల ద్రుంగఁగోరు నలగాడ్పుకుమారుఁడు సాక్షి దీనికిన్. 6

స్వయముగ నేమియుం దనకు సల్పనివాలిని స్వార్థమంద ని
ర్దయుఁడయి చంపి నిందపడె రాముఁడు, నీవొ స్వబుద్ధిగానె య
త్యయములఁజేసినట్టి దనుజాంగనలన్ మఱి కాకమున్ దయా
మయివయి ప్రోచియుంటి వసమానదయానిధి వీవె జానకీ! 7

ఉరుతర తావక కరుణా
తరణియె లేకున్న జన్మ దారిద్ర్య భయం
కరరోగ మరణ యుతమగు
వరుణాలయ మేము దాటవశమే తల్లీ! 8

నీ సహవాసమే జనని! నీవిభు రాము దయాభిరాముగా
భాసిలఁజేయు నేమన భవద్విహితుండయి స్త్రీవధంబునున్
జేసె, నదోషి వాలి వధఁజేసెను, నీ సహవాసమందో కా
కాసురుఁ ద్వద్వ్యథాకరు దయాకరుఁడై కడుఁ బ్రోచెఁ గావునన్.

పవనసుతుని వాలభాగమ్మునం దగ్ని
రావణాజ్ఞ భటులు రగులుగొలుప
నేకృపాప్రవాహ మిట్టె చల్లగఁజేసె
నమ్మ! దాన మా భవాగ్ని యణఁగు.

హంసకులంబునన్ జననమందగ విష్ణువు క్రూరదానవ
ధ్వంసమొనర్ప, రాక్షసకృతంబగు దోషసహస్ర మోర్వ స
ర్వంసహాయందు నీవు ప్రభవంబొనరించితివమ్మ పాప వి
ధ్వంసిని! పిల్ల కబ్బు తనతల్లిగుణమ్ములె యంచుఁ దెల్పుచున్.

దీనజనుండ నే నధికదీనజనావనశీల వీవునుం
గానను, పోష్యపోషకత గల్గెను నాకునునీకు దైవ యో
గానుగతిన్, నినున్ శరణమందితి నన్విడనాడకమ్మ! ని
న్బోనిగుణాంబురాశులకుఁ బోలునె భక్తులఁ ద్రోసిపుచ్చుటల్. 12

నీవును శీతభానుఁడును నీరధిఁ బుట్టుటచే దయార్ద్రతా
భావమునీకు, నయ్యమృతభావము చంద్రునకున్ ఘటిల్లె నో
దేవి! యసంభవమ్మెదియు దీనను గానము కార్యజాతమం
దావృతమౌను కారణగుణావళి యన్నది సాజమేగదే! 13

నీదు దయారసమ్మనెడు నిమ్నగ యుచ్ఛపదస్థులౌ గిరీ
శామలవంకకుం జనక యారసి నీచపదస్థులైన య
స్మాదృశులం దపార మసమానముగాఁ బ్రవహించు యుక్తమౌఁ
గాదె తలంపఁగా నిది యకారణకారుణికా ! మదబింకా ! 14

అఖిలహృదయంబులందుండు నాదివిష్ణు,
వతనిహృదయంబునందుండు వంబ ! నీవు
నీదుహృదయంబునన్ దయ నిండియుండు,
నదియ సకలాతిశాయి యటంచు దలఁతు. 15

కొందఱపైని నాగ్రహముఁ గొందఱపైని నమగ్రహంబునుఁ
బొందుచు నేలు నీవిభుఁడు భూస్థలి, నీదయయో యనుగ్రహం
బొందియె యేలు; కావుననె న్యూనము త్వత్పరిపాలనమ్ము సం
క్రందనముఖ్యగీత ! యటుగాదన విష్ణువు శేషి యెట్లగుఁ? 16

విధివిహితకర్మముల నెల్ల విడిచిపుచ్చి
యహితకర్మమ్ములనె సత మాచరించు
నట్టి పాపాతిపాపుండనైన నన్ను
నమ్మ ! యెటుప్రోతువో నిన్నె నమ్మియుంటి. 17

అనుపమ నిర్నిమిత్త కరుణా ! తుర్రిటియైనను నీవు నీపతిన్
వెనుకొనకున్న నాతఁ డవినీతులతప్పులు సైపఁ డంచు నీ
వనుగుణమైనయట్టులుగ నయ్యవతారములందు నీపతిన్
బనివడి చేరియుందు వనపాయినివై దయయన న్ననీదెగా ! 18

చెవులు గడియలుపడి శ్లేష్మమ్ము గళ మడ్డి
కనులు తేలవైచుకాలమందు
నిను దయ త్వరపెట్ట నీవు వారలఁ బ్రోవ
విముఖుఁడౌపతిఁ ద్వరపెట్టు దమ్మ ! 19

తాపసపింహబృందములె దాఁటగరాని భవాంబుధిన్ మహా
పాపుఁడనైన నే నెటులఁ బారముసేరఁగలాడ నంచు సం
తాపముఁ గల్గుచుండె మది తల్లిరో ! యైనను నాకు నీ దయా
ప్రాపకులైనవారిఁ దలఁపన్ గడు ధైర్యము నివ్వటిల్లెడున్. 20

మునులు తపః ప్రభావమునఁ బొందు భవత్కరుణారసం బకిం
చనుఁడను నేనునుం గనుదు, సత్యము తల్లి ! యదెట్టులన్నచో
ననితరవృత్తితోడ సనకాదులు ఘోరతపస్సుచేఁ బొడం
గనుపరతత్త్వమున్ సుఖమునన్ గనవే యమునాతటీతరుల్ ! 21

నలినగృహా ! సమంచిత ధనంజయుఁడౌచు నుదారహేతియై
యల రవిమండలాంతరగుఁడౌ హరి యెప్పుడు నే కృపాప్రపా
కలనను శీతలుండగుచుఁ గ్రాలునొ యట్టికృపాప్రపాప్తిచే
నలరగ మేము మా భవతపర్తువిదాహము మాన్పఁజేయవే. 22

కరుణా వరుణాలయ ! భీ
కర సంసారాబ్ధి మునిఁగి కడనంటిన యీ
దురితాతిదురితు నను నీ
కరుణాతరణిన్ వెలార్చి కావంగదవే ! 23

# లక్ష్మీసహస్రకావ్యము

## కటాక్షస్తబకము

వారిజాలయవదన లావణ్య మనెడు
కలశపాథోధిలోపల వెలయునాక
టాక్ష వీక్షణమను కల్పవృక్ష మెపుడు
కోరినవియెల్ల మా కొసగూర్చుఁ గాత! 1

ఎవ్వని యదృచ్ఛగానైన నీవు నిమిష
మాత్ర మీక్షింతువో యట్టి మాన్యజనుఁడు
వేగముగ మూఁడొ యెనిమిదో వేయొ యైన
కనులఁ బొందును చిత్రింబుగదె మదంబ! 2

జననీ! నీయవలోకనామృత మహాసార ప్రపూరంబులోఁ
జిను కొండెవ్వనిదేహముం దడుపు నా శ్రీమంతుప్రాగ్గేహ మా
తనిహస్తాగ్రపరిచ్యుతంబును లసద్గంధేభ మస్తచ్యుతం
బును నౌ దానజలంబులన్ బురదయై పొంగారి రంగారెడిన్. 3

నీ యవలోకనామృతధునిం గణమేనియుసోకుపుణ్యముం
జేయనివారిగేహములు సేడ్పడి కష్టుల నష్టు లొప్పగా
తోయదవారిధారలను దుస్తర దుఃఖభరాశ్రుధారలన్
హేయములౌచుఁ బంకిలత నెప్పుడు నొప్పెడుఁ బంకజాలయా! 4

కొందఱు హైమయానములఁ గుల్కుచు నెంతయు వైభవంబు సె
ల్వొందగ సంచరింతురు ప్రభూత్తములై మఱికొందఱున్న య
య్యందలముల్ వహింతు రతియాప్యవుజీవన మొప్పఁ దల్లిరో!
యందుకుఁ ద్వత్కటాక్ష విష యావిషయత్వములోనె హేతువుల్ :

స్వరధీశాదుల నెట్లుప్రోచి తటు విస్వత్వార్తు మందుఁ ననున్
గరుణాపాంగఝరంబు నొక్కతుటియైనం గూర్చి రక్షింపు మిం
దరయన్ నీ కిసుమంత లోపమును రా దంబా! ఘనుం డెప్పుడున్
మరుభూమిన్ మఱి మేరుభూమిని సమానంబొప్ప వర్షింపఁడే! 6

ద్వారద్వారమునందు దుష్టనృప భృత్య శ్రేణి ఛీకార హుం
కారధ్వానములఁ గళా గుణ మహోఘాతమ్ములఁ బోని దు
ర్దారిద్ర్యగ్రహబాధ లంబ! కడుచిత్రం బౌనటుల్ నేఁడు నీ
కారుణ్యాంబునిధిఁ వగాహనవిధిఁ గావింప వేఁ బారెడిన్. 7

సత్కులజన్మమున్ శుభయశం, బతిసుస్థిరమైనయట్టి భా
గ్యోత్కరమున్, సుసంతతి, యదూద్వహపావనభక్తి, సర్వ వి
ద్వత్కవిగీతసత్కవిత, తత్ప్రియ్యానురక్తి యనంగ నేడునున్
ద్వత్కరుణా కటాక్ష పరిణామము లౌఁగదె తల్లి! చూడఁగన్. 8

అరయమి బుద్ధిహీను లధమాధములైన నృపాలురన్ గడున్
గరములు రెండు మోడ్చి ధనకాంక్షను గొల్చుట చాలుచాలు, నిన్
శరణముఁ జొచ్చి తోఁజనని! సంప దభంగ తరంగ గేహమౌ
వరకరుణాప్రవాహమునఁ బ్రత్యహమున్ స్నపనంబుఁ గూర్పుమీ.

జననీ! నీ వొక్కపరిన్
ఘనముగ కరుణార్ద్ర వీక్షణమ్ముల వీక్షిం
చినచో, నెంతటిపాపముఁ
బొనరిన యమభటులు నన్నుఁ బొడఁగనఁగలరే? 10

పేదతనమ్ముఁ బాప పృథివీపతులెందఱుఁ జాటురీతిఁ బ
ద్యాదుల సన్నుతించిన, మహాపటుమంత్రములన్ జపించినన్,
వాదములన్ జయించుచుఁ బ్రపంచముఁ జుట్టినఁగాని కాని సం
పాదనఁజేయలేఁడు త్వదపాంగనిరీక్షణ లేక యెవ్వఁడున్, 11

లేమిదయ్యు మడపఁ బ్రేఁపబెత్తెమ్మయి
భక్తిలతను దడుప వారిదమయి
హృదయతమము నెడప నిఁక శరజ్జ్యోత్స్నయౌ
నీ కటాక్ష మంబ! మాకు దిక్కు. 12

శశివలెఁ గువలయతాపముఁ
బ్రశమన మొనరింప, విష్ణుపదమున సర్వ
జ్ఞశిరమున వెలుఁగ, నణఁపఁగ
నిశాటచక్రంబు, జనని! నీరధి గనె నిన్. 13

అతిక్రమతీశ గేహ నిరయమ్ములఁ గావలిగాచునట్టి యు
ద్ధతుల విషంపుపల్కులశతం బిఁక నాపయిఁ దాకనీక నీ
సితకమలద్విషమ్ములగు చెల్వగుచూడ్కులు సోక తల్లి ! నా
మితిగనరాని పాపపుగమిం గడు వేగమ పాపి ప్రోవుమీ. 14

స్థిరవసు నవనీపకు న
స్థిరవసుని వనీపకునిగఁజేయగ, వానిన్
మఱి దిరుగఁజేయఁ జాలి య
డరు నఘటితఘటకమౌ కటాక్షముఁ గొలుతున్. 15

నళినదళాయతాక్షి! ఫణినాథశయానునిపత్ని ! తల్లి ! నీ
లలితకటాక్షవీక్షణబల మ్మొకయింతయు నేని లేనిచో
కలిమిసెడున్,మహేంద్రుఁడునుగర్భదరిద్రుఁడగున్,మఱిన్మరుత్
స్థలము మరుస్థల మ్మగును; తద్విపరీత మగున్ భవత్కృపన్. 16

ఓ జగద్ధాత్రి ! యెప్పుడు యుష్మదీయ
శీత లాపాంగ లహరి నన్ జేరుఁగాత
మతిత రాభీల కాల రూ క్షాతి దౌష్ట్య
యుత దృశము లెప్పుడును జేరకుండుఁగాత. 17

వనమయూరవృత్తము

ఇందిర ! బెడంద లిఁక నెందు నెడగా, న
య్యిందుకర చందన మహీధర తటాంచ
త్కందర మరు చ్ఛిశిర కమ్రిముల నీ వె
ల్గందుకనుసందుల మరందములఁ గొల్తున్. 18

ఎచటఁ దా నుండునో యట నెల్ల జనని!
మహితమైనట్టి షట్పద మంత్ర ముంట,
నుచ్చకోరక నూత నాభ్యుదయ మగుటఁ,
ద్వత్కటాక్షంబు మకరందధార యగును. 19

ప్రాజ్ఞులకు భాసితముల రూపముల నొసఁగు,
నహహా! భవదాహ మిదును, సత్యమ్ము జనని!
భవదపాంగాఖ్యగంగ యభంగ, యందు
స్నానమును గూర్చియా ర్తు లణంపఁగదవె. 20

'శ్రీ క్షయ'యంచు పేదముఖసీమ విధాత లిఖించునట్టి య
య్యాక్షరముల్ ప్రతీపగతి నారసి వానికి యక్షవై భవం
బక్షయమొంద నిత్తు వల యబ్జజువాశ్రితయు సత్యమొంచ నీ
వీక్షణరూపభాగ్య మరవీసము నోచినఁగాని తల్లిరో! 21

త్వదపాంగ భృత్యు లెప్పుడు
పొదలుదురు కుబేరవిభవముల, వితరజనుల్
మది దుఃఖించుచు మనుదురు
హృదయ విదారణ మహా దరిద్రతఁ దల్లీ! 22

ఓ హరిరాణి! లోకముల నొప్పుగ నేలెడి నీకటాక్ష మే
దేహిపయిన్ సతంబును బ్రతిష్ఠిత మొందగఁజేయు దట్టి యా
దేహి జగద్ద్వయంబునను 'దేహి'పదంబుఁ దొరంగి మించు సం
దేహ మొకింతయేనియును దీనికి లేదు తలంచి చూచినన్. 23

అతిపటువైన తావక కటాక్ష నటుం డధికమ్ముగా విచి
త్రతత దయివాఅగా సుగుణతాలసదుచ్ఛ్రియ మొప్పఁ దల్లి ! సం
శ్రిత మృదు లాస్య రంగములఁ జెన్నువహింప ననేకరీతులన్
సతతము భారతిన్ నటిగ సల్పి ఘటించు వినోదనృత్యముల్. 24

ఏ యవలోకనమ్ము లవి యెప్పుడు కాటుకఁ దీర్చి నీ మనో
నాయకుఁ గృష్ణమూర్తిగ నొనర్చుచున్నవా ఆ మహత్తమ
శ్శ్రీ యుత దృక్ప్రసారములు చిత్రము సర్వతమోగుణమ్మునున్
మాయఁగఁజేయుచుండునిఁక మాహృదయమ్ములనుండి తల్లిరో! 25

వికసి తామోద భారమ్ము వెలయఁజేసి
సుప్రసి ద్ధాగ మాంచ ద్విశోభితయయి
సుమితయైన ననంతఫలములఁ దేల్చుఁ
ద్వ ద్ద యాపాంగ వల్లి! మాధవునిఁ, దల్లి! 26

తావ కాపాంగమూర్తి యో తల్లి ! విప్ర
యోగులకు దుఃఖముల నొకింత నొందనీక
మార్గణావళిఁ బంచత్వ మందనీక
చేయు భవనాశనమ్ము విచిత్రముగదె. 27

స్వచ్ఛ కమ లాభివృద్ధికి జనని! జనని
యగుచు, నిర్మలు సదుపాస్యునట్లు విధుని
సలుపు త్వ దపాంగ శరదృతు వలరు మాదు
నాప దాటోప ముజ్జృంభితాప మణఁచి. 28

తనకు నాల్గుకనులు తనరు వేలుపుఁ గూడ
నే కటాక్షపులేశ మెపుడుఁ గోరు
నెనిమిదికన్నుల నెనయు దైవముఁగూడ
నే వీక్షణకణమ్ము నెపుడుఁగొలుచుఁ
బండ్రెండుకన్నులఁ బరగు దేవుఁడుఁగూడ
నే దృష్టిలవ మాశ్రయించు సతము
వేయినేత్రములున్న వేల్పుసామియుఁ గూడ
నే యపాంగముమాత్ర మెపుడుఁ దలఁచు

నచలసంపద్విధాయి నిర్వ్యాజదీన
బంధువును నైన నీ దయాపాంగదృష్టిఁ
బుష్టిగాఁదెల్పి యెవఁడైనఁ దుష్టిఁగనునె
వికసితాంబుజపాణి ! గోవిందురాణి ! 29

అమరాధీశ్వరి ! నీకటాక్ష కవచ ప్రాప్తుండు ధన్యుం డహో !
సమరంబం దమరోత్తమాభిజయమున్, శౌర్యాభిముఖ్య ప్రభు
త్వమునుం బొందును, నిత్యవైరిజయమున్ బ్రాపించు, లక్షింపఁ దే
సమయంబందుఁ బ్రమత్త రాజకుల వాక్ శస్త్రాభిఘాతమ్ములన్. 30

అలకాధిపతిసిరి నపహసింపఁగఁ జాలు
విత్తమాతనియింట నృత్తమాడు
పరివిమల చంద్రికా ధవ శాశ్వరత్నమ్ము
లాతని మొగసాల నాక్రమించు
కొండలవంటి యేన్గులపిండు లాతని
గుమ్మమ్ము వెలిసీమఁ గొలిచియుండు
రాజతేజము మహారాజతేజము వాని
ముఖసీమ తాండవమ్మును బొనర్చు

ఏ పురాజన్మమందైన నింతొ యంతొ
పుణ్య మొనరించి నీ పాదపూజ చేసి
జనని ! నీ చూపుకొసలోనఁ దొనఁకి వ్రాలు
నమృత వాఃపూర కణ లేశ మందుకొనిన. 31

అమలాబ్జాలయ ! నీ కటాక్షవిషయుం డౌవాఁడు గోత్రాధికృ
త్త్వము, నుచ్చామరపాళినుల్లసిలు జైత్రస్థానముం బొంది యు
త్తమసంతాన సమస్త భవ్య సుమనస్త్వాంచి తామోద సౌ
ఖ్యములన్ నిత్యము నొందు నైహికమునం దాముష్మికంబందునన్

తల్లి ! యనుదిన మాసాయ మెల్ల ధన మ
దాంధులను గొల్చినను దృష్ణ యాఱకుంట
శీత లా పాంగ దేశమ్ము రీతి నీదు
శీత లాపాంగ దేశమ్ముఁ జేరుకొందు. 33

కరుణావీక్షణలేశమాత్రమున వేగం గామితార్థమ్ములన్
విరి వాప్పార ఘటించు నీవు గలుగన్ విశ్వాంబ ! నీచాత్ములొ
నరులం గొల్చెడివారు స్వాదుతరమై నాళీకసౌరభ్యమౌ
సరసుం బోనిడి దాహశాంతి మృగతృష్ణం దీర్చువారొఁగదే. 34

కడు నజీర్ణాఘ నాశను, బడుగు, ధృఢగ
దాకరు, పురాణపూరుషు, వీఁక నెపు డ
లంఘునునిఁ జేసి యొప్పు నీ లలితవీక్ష
ఔషధము మాదు భవరోగ మణఁచుఁ దల్లి ! 35

ఓ వనజాలయా ! భవ మహోదధి తారక కర్ణధారులన్
శ్రీ విభవాంగనా సతత నృత్త విధాయక సూత్రధారులన్
శీవృత పాప పాదప విభేదక తీవ్రకుఠారధారలన్
తావక వీక్ష ణాంచిత సుధారసధారలఁ గొందుఁ జేరలన్. 36

చల్లనై తీయని దయారసంబుఁ గలిగి
అమృత పానోత్క సద్విజాక్రమితమైన
నీ కటాక్షాభిధాన తటాకమందు
జనని ! తనుతాప మెడల నే మునుక లిడుదు. 37

లోకజనయిత్రి ! నీ యవలోకములను
జడుని నెవ్వనిఁ జూతు వా జనుఁ డొకండ
ధన్యదుర్లభమయిన, అత్యంతమైన
యనవలోకమ్మునొందు నత్యద్భుతమ్ము. 38

లలితభవదీయవీక్షణలవముచేత
నంబ ! రిక్తమునాధిపదంబు నరసి
సంపదాధిక్యమును జేర్చి జను నహో ! స
మాధి నొందింతు చిత్రతమంబుగాదె. 39

మొదటనె యాప్సితార్థపరిపూర్ణతఁ గల్గఁజేసి యాపయిన్
బొదలు భవత్కటాక్షములు; ముందుగ దుస్తరవార్ధి దాటి యా
పిదపనెగాదె యుష్మదభివీక్ష మదుత్సుతుఁ డొందె; నమ్మరో
మదిఁ దలఁపంగ నద్భుతతమంబులు నీదు మహత్త్వతత్త్వముల్. 40

ఓక్షోణీరేజనివాసినీ! బహూళ దానోదంచితమ్మైన నీ
యా నిర్వ్యాజకృపాకటాక్ష మిఁక ప్రత్యక్షంబునం గల్గగన్
సూనశ్రీల నపారగంధయుతమై చూడంగరానట్టిదౌ
ఆ నాకాగము నాశ్రయింతురె యభీష్టావాప్తికై యెవ్వరేఁ. 41

అతికలుషాపహారియయి యజ్ఞులఁగూడఁ దరింపఁజేయు నీ
వితత కృపా విలాసయుత వీక్షణ మన్ ఘనమాంత్రికుండు మ
ద్వృత విషయాభిలాష లను భీకర భూత వికారచేష్టల
ద్భుతముగ మాయఁజేయుఁగదె తోయజవాసిని! పాపనాశినీ! 42

అంబ! జగదంబరో! నీ యపాంగమూర్తి
సర్వకాలంబు జలజాతశరత నొందు,
మధుర మధుకాల సంగతి మఱఁగి సర్వ
మంగళేశానకలన నెసంగు, నెట్లు! 43

అష్టమమందు దుర్గ్రహము లా శనిభూజులఁ గూడియుండినన్
కష్టదశ న్విధాత యలికంబున నొక్కి లిఖించినన్ భవ
ద్దృష్టి యొకింత మూపయి గదించితివేని యవేమిసేయు భ
క్తేష్టద! మంచుబిందు లణఁగించునె భామకరస్థపద్మమున్. 44

అరయగ యుష్మదీక్షణ ల వాన్వయ తద్వ్యతిరేకలీలలన్
నరులకు నౌ జయాపజయనమ్ములు తల్లి! త్వదీక్ష మున్నుగన్
గరువలిపట్టి పొందుటనుగాదె జయంపడ లంకఁ గాల్చె, నీ
కరుణఁ దొరంగి యుండుటనెగాదె నిశాచరు లోడిపారి రౌ. 45

ఓహో ! మహాగ్నికూడ సహజోష్ణత యెంతగ నున్నఁ గాల్పగా
నీహ నొనర్ప దోజగదధీశ్వరి ! నీ యభివీక్షయన్ సుధా
వాహిని నోలలాడఁగలవారి; హిమీకృతధూమకేతువౌ
ఆ హనుమంతుఁ డింధుల కుదాహరణుండుగదే తలంపఁగన్. 46

నీకరుణేక్షణోదయము నిత్యము భాసిలునేని దేవి ! సూ
ర్యాకలనంబుచే నణఁగు నంతరవార్తతమోభరంబు, దో
షారరశక్తి రూపఱు తనంతటఁదాను, సతమ్ముఁ గల్గు నా
నాకవిదీప్తి, సారసవనంపుసిరుల్ గలుగున్ తలంపునన్. 47

నీ కటాక్షవసంతుండు నిరత మంబ !
పఱపి భూమిజతతి కవిపల్లవతను
తీర్చిసుమనోవిభూతి, నదీప్తికాన
నముల నామోద పరిపూరితము లొనర్చు. 48

అంబ ! తావక కరుణా సుధాబ్ధియందు
మందరక్షణ వికసి తామంద హృదయ
మెడలి వెల్వడు వీక్షణామృత ఘటమ్ము
సతము సుమనోనురాగమ్ము సంతరించు. 49

అంబ ! ఆనృసింహానతితీవ్రకోపాగ్ని
శాంతపఱచి మివుల చల్లనైన
నీ కటాక్షఝురము నిరతంబుఁ బరపించి
మా యఘానలమ్ము మాపుమమ్మ. 50

లీలగ నీకటాక్ష మొక లేశము నిమ్ము మహాపరిదాన స
చ్ఛీలకు నీ కిదెంత ? మితిఁ జెందని శ్రీలగు నాకుమాత్రి; మే
వేళలఁ గుంభవృష్టిఁ గురిపించెడి మేఘున కొక్కచుక్క మై
రాలినఁ దక్కువౌనొకో ? పరార్థ్యము ముత్తియ మౌట కుక్తికిన్.

కలుషవినాశకమ్మగుచుఁ గ్రాలెడి నీదుకటాక్షలేశమున్
గలిగినమానవుం డుపవనమ్ముల హాయిగఁ గోకిలాంగనా
కలరవ రమ్య గానములు, కాంతలహాసకనిక్వణంబులున్
గలిగి యఖండ సౌఖ్యములఁ గాంచు జగజ్జననీ ! జనావనీ ! 52

స్వర్గరాజ్యపదము, శాశ్వతమౌ నిరు
పాధికమ్ము సుఖము, నందఁజేయు
నెద్ది; యట్టి నీ సమీక్షణామృతఝరిఁ
జేర్చి యందు స్నాతుఁ జేయుమమ్మ ! 53

"భూపభూమిఁ బొమ్మొభీమపాపభూమ"
యంచు నా ఫాలమున వ్రాసి నట్టి యజు ప
వర్గగర్భంపు లిపి త్వదపాంగములను
జెఱపి యపవర్గగర్భగాఁ జేయు; మమ్మ ! 54

వానినె సన్నుతించెదరు పండితు లెల్లరు, వానిచేతనే
మానితమౌను వంశ మతిమాత్రిమూ, సద్గుణజాల మొందు న
వ్వానినె, బుద్ధిమంతుఁడన వాఁడె, యరిందముఁడన్న వాఁడె, యే
వ్వానికి నీ కటాక్షలవభాగ్య మొకించుక గల్గు నమ్మరో ! 55

పారములేని సంసృతితపంబున నాతపబాధఁ బాపి, పెం
పారెడు నీడఁ దీర్చి కరుణాత్మ మధుప్రీతిఁ దేర్చి తల్లి ! వి
స్తారఫల ప్రసారమిడు తావకవీక్షణమన్ సురద్రుమున్
గోరి భజింతు మెల్లపుడు కోర్కెలు కొల్లలుగా ఫలింపఁగన్. 56

అరయఁ బీతాంబ రాకలి తాప్తి,దీప్త
మగుచు ముక్తాది భూషితమైన పదముఁ
బడయఁగలుగుదు రెందుఁ గ్రుంకిడిన నట్టి
విరజనదియౌను తల్లి ! నీవీక్షణమ్మ. 57

భక్తునుదుటను గల్గు దుర్వర్ణములను
జెఱిపి భవదీయవీక్షణఝరము తిరిగి
రాజితాభ్యుదయమ్మఁ గరమ్మఁ గలుగఁ
జేయునుగదమ్మ ! యిది యెంత చిత్రమగును ! 58

నీయపాంగకాదంబిని నిస్స్వఁడనెడు
హీనభువి నెప్డొ కానక వృష్టిఁ గురియ
నెక్కుడుసుకీర్తి గల్గు నెంతే వరమతి
శాలియై తేజరిల్లు నో జలజగేహ ! 59

తొడరి యుష్మదపాంగ మధువ్రతుండు
వృద్ధి నత్యంత మొందఁగా నెంచి కూడఁ
గూడియుండు మధ్వాహారితోడ నెపుడు,
నీరజపుసంగతుల నెప్డు నెఱపు జనని ! 60

అంగజుతల్లి ! నీవు విపదాకరమౌ భవరాత్రియందు ని
ద్రం గను నీదు భక్తులకుఁ దద్దయుఁ బ్రేమరసం బెసంగ స్వా
పాంగము నౌషధ మ్మిడుదు వైనను వారలు దానఁజేసి యు
ప్పొంగి వినిద్రితమ్మవు విబోధము నొందెద రెంతచిత్రమో ! 61

మునుగా నీ యవలోకనమ్ము శిశిరమ్ముం బొందునవ్వానికిన్
వెనుకన్ రాదు రజోమయమ్మయిన యా వేధో వృ గూ ష్మాగమ
మ్మను, రౌద్రాంచిత దృ గ్ఘ నాగమపు ముంపుల్ దమోధామముల్;
చనుదెంచున్ మధుకాలదీప్తి సుమనస్సత్వావహామ్మై పర్విసూ ! 62

తల్లిరో ! అదృష్టవంతు నీదగు కటాక్ష
మున సహస్రాక్షుగ నిమిషమున నొనర్చి
త్రిదశ నేత్రాకృతినిగాఁ దిరిగి మార్చి
మఱల యసదృక్పథంబున మార్తు వహహ ! 63

వదన విభా ప్రవంతికలఁ బర్వులువారు మహోతరంగముల్
సదమల మందహాస వనజంబుల ఝాంకృతిసల్పు భృంగముల్
తుదగనరాని సంపదల దూకులకున్ నవనాట్యరంగముల్
విదితదయావలోకపదవీనదవీయసి ! నీయపాంగముల్. 64

# లక్ష్మీసహస్రకావ్యము

## యత్న స్తబకము

ఏజగన్మాత నొంద నింతింత యనఁగ
నలవికానట్టి యత్న మా యచ్యుతుండు
పొనరిచెనా యట్టి దేవి నే మనమునందుఁ
దలఁచి మ్రొక్కెద శ్రేయోవితాన మొంద. 1

నినుఁ బొందగ వనజాక్షుఁడు
మొనసి మహా కఠినకర్మముల నొనరిచె నో
జననీ ! జగమున నరయగ
వననిధి మథియించుకంటె భారము గలదే ! 2

అనయము నీ గురు స్తనమహాచలముల్ మునుముందుఁ దాను చు
ల్కనగ వహింపవచ్చునని కంజదళాక్షుఁడు భారమోర్వ సా
ధన నొనరింపనో యనఁగఁ దద్దయు సాగరమధ్యమంబునన్
మునిఁగెడి మంథరాచలము మూఁపునఁ దా ధరియించె నమ్మరో! 3

"మును దా నీయక యెద్దియున్ దనకు రాఁబో"దంచు లో నెంచి తా
మును నిన్ బెండిలియాడగాఁ దలఁచి తత్పూర్వంబె చటాప్రీతిఁ జా
ననుగా మారిచి యక్షపాదునకుఁ గన్యాదానముం జేసె ష
డ్గుణసంపన్నుఁ డభీష్టదుండు నగు నా గోవిందుఁడున్ జానకీ! 4

అంబ! గాధేయుఁ గొలిచి బలాఖ్యవిద్యఁ
బడసి రాముఁడు తనుబాధఁ బాసికూడ
నతను బాధాపహారిణి యైన నిన్నుఁ
జెంద వెండియు నతని భజించెఁగాదె. 5

దశరధయజ్ఞసత్ఫలము తా నగుటన్ సమతన్ విదేహరాట్
శశిసవనావనీసముపజాతను నిన్ను వివాహమొందఁ ద
న్నిశిచరకోటి నెల్లను ననిన్ వడిఁ గూలిచి రామభద్రుఁ డా
కుశికసుతక్రియజ్ఞము నకుంఠితరీతివిఁ బ్రోచె నంబికా! 6

భవహరుఁడై నను రాముఁడు
భవచాపలతాంతబుద్ధిఁ బరఁగెనుగదె యో
యవనీజా! నినుఁ బరిణయ
మవుటకెగా ఆప్రయాస మంతయుఁ బడసెన్. 7

ఆ వనజాప్తవంశ కలశాంబుధిచంద్రుఁడు తాను, నీదు భ్రూ
సేవకుఁడైన మన్మధునిచేఁ గడు నోటమి నొంది సమ్మదం
బావహిలంగఁజేయుటకు నాతనికిం బ్రీతిరోధియౌ మహా
దేవునిచాపమున్ విఱిచితెచ్చి యుపాయనమిచ్చె జానకీ! 8

ఎందును నిన్నుఁబోలుపతి యెవ్వఁ డటంచు వివాహగోష్ఠియం
దందఱు నెన్న నీపిత, ద్వదన్వయముఖ్యపురోధయౌ శతా
నందుఁడు వాక్సహాయత నొనర్చ నటంచు, నతండు సమ్మదం
బందఁ దదీయమాతృ దృషదాకృతి మాన్చెను రాముఁ డమ్మరో! 9

అల మారీచ సుబాహు రాక్షసుల మాయాప్రౌఢిఁ దీవ్రాశుగా
వళిఁ జల్లారిచి కౌతుకప్రదుని విశ్వామిత్రు సేవించి దో
ర్బలపాండిత్యముఁ జూపి భర్గధనువున్ పై కెత్తి ఖండించి యి
ట్టుల నెంతో శ్రమ నొంది నిన్ బడసె నెట్లో రాముఁడో శ్రీసతీ!

తనకు నీ జాడఁ జెప్పినంత నొకగ్రద్ద
కంబ! యోగ్యైకయోగ్యపదంబు నిచ్చె
నహహ! రఘురామమూర్తి; మహాత్ములైన
హద్దుమీఱుదు రనురాగమధికమైన. 11

మానధనైకజీవనులమధ్యను నగ్రిణియయ్యు నేరికిం
దానె శరణ్యుఁడయ్యు రఘుతల్లజుఁ డొక్కనికోఁతినిన్ ద్వదీ
యానయనార్థమై శరణమందె నయారె! మహీసుతా రవం
తైనను లెక్కసేయరు ఫలార్థులు గౌరవలాఘవంబులన్. 12

నిను నొసఁగంగ నుంకువగ నీ పిత సేసిన యీశుచాపపుం
గొనయము నొక్కవెట్ట రఘుకుంజరుచేబొటవ్రేలు కాయగా
చెను, రవిసూను విశ్వసితుఁజేయఁగ దుందుభిమేనుఁ దన్నఁగాఁ
బెనుపుగఁ గాలి బొట్టనవ్రేలును గాయలుగాచె మైథిలీ! 13

రావణుఁజంపి విన్నుఁ గొనిరాఁగ సహాయతఁగూర్చునంచు సు
గ్రీవునకున్ ముదంబు నొనరింప నినాన్వయవార్ధిచంద్రుఁ డెం
దేవిధమైనయెగ్గు తన కెప్పు డొనర్పని వాలిఁ జంపి దో
షావృతుఁడై కళంకయుతుఁ డయ్యెను నీకొఱకే మహీసుతా ! 14

అల వైకుంఠపురమ్ములో శ్రుతులలో నమ్మౌనిరాణ్మానసో
జ్జ్వలసౌధంబులలో ఫణీంద్రునిఫణచ్ఛాయాప్రదేశంబులో
పల సౌఖ్యాంబుధిఁదేలు నిర్మలపరబ్రహ్మంబు నీకై శిలా
స్థలులం బండెను ఋశ్యమూకమున నో తల్లీ ! కపీంద్రార్థియై. 15

నినుఁ జూచివచ్చుటకునై
హనుమంతుఁడు రాముచే మహాసత్త్వుండై
జననీ ! దుర్లంఘ్యమ్మగు
వననిధిని విలాసమాత్రి వడి లంఘించెన్. 16

అరులిడు నగ్నికాల్పు మొదలౌ వ్యధలంబడి లంక నెట్టులో
కరువలిపట్టి నిన్నరసి క్రమ్మరి వచ్చినయంత నాతనిన్
గరకమలంబులన్ నిమిరి గాటపుఁబ్రేమ ననర్ఘ్యమౌ భుజాం
తర పరిరంభ సౌఖ్య మిడి తద్వ్యథఁ బాపెను రాముఁ డమ్మరో !

నయవిదుఁ డంబ ! రాముఁడు; మనమ్మున నిన్నడయంగ వైరి ని
ర్జయముననవ్విభీషణుఁడు సాయపడున్ దన కంచు లంకనున్
జయమును బొందకున్న రభసమ్మునఁ బట్టముఁగట్టె వాని, క
క్షయసుఖ మొందఁగోరునెడ సాహసవృత్తియె మూలమౌఁగదే ! 18

మార్చె 'జ్యేష్ఠుండెరా' యన్నమాట మున్న
దశరథుఁడె భార్యకౌఁగుఁ ద్వ్యదర్థ మట్లె
జరిపె సుగ్రీవునెడ విభీషణునియెడల
తల్లి ! రాముండు తండ్రికిఁ దగ్గ కొడుకు. 19

సకలశరణ్యుఁడైన రఘుచంద్రుఁడు లంకకు మార్గమొందగా
నొక జడరాశినిన్ శరణమొందెను నీకయి తల్లి ! యార్తితో
వికచకుశేశయాక్షుఁడని పేర్వడియుండినవాఁడుఁ గూడఁ దా
నకట ! కుశేశయత్వమును నందె భవద్వసధాభిలాషతోన్. 20

లంకాద్వీపసమీపవర్తియయి తల్లంకాపురిం గల్గు నీ
వంకంగల్గు వియోగభీతిఁ బితయౌ వారాశి, రాముండు ని
న్నింకం దాఁ గొనిపోవునంచును బధం బీకుండఁ దీవ్రీకగా
తంకంబుం గని శోషమొందెఁగదె వాత్సల్యాతిరేకంబువేన్. 21

ఎలమి నిజాగ్రజుండయిన యింద్రుఁడు వజ్రపుధాక కోర్వగా
నిలువగలేనియట్టి యవనీధరపంక్తులఁ బూడ్చె నంబుధిన్
వెలితిగ నంచు సోదరుఁ డుపేంద్రుఁడు తల్లిరో ! శేషపూర్ణము—
నలిపెను వానరాహృతరసాధరపంక్తులచేఁ ద్వ్యదర్థమై. 22

ఫల మంజుల కక్షలకును
నలరగ వానరుల నరుల నంభోంహారా
శుల దాటఁజేసె నీకయి
జలజాప్తకులుండు సేతుసంఘటనమునన్. 23

అంబుధిని లోన నరికట్టె ననలుఁ డొకఁడు
తల్లి ! నినుఁబొందుకాంక్షతోఁ దహతహపడు
నినకులేశ్వరుప్రేరణన నలుఁడొకఁడు
వారధిం గట్టి యరికట్టె పైనిఁగూడ. 24

తనరన్ సేతువుఁ గట్టి నీకొఱకునై, తా దాటి యబ్ధిన్ భవా
బ్ధిని దాటించెడి రాముఁ డెల్లర, "స్వయం తీర్త్వా పరాం స్తారయే"
త్తనురీతుల్ సగరాన్వయస్థులకుఁ గొప్రీత్తానే, భువిన్ జాహ్నవిన్
జనకుల్ సద్గతిఁజెందఁ దెచ్చి యొకఁడే సర్వావనిం బ్రోవఁడే! 25

'నీవు లేకున్నఁ బ్రోవఁ'డన్నిందయుంటఁ
గూర్చ నిన్ను విభుని కలంకోపరోధ
మొనరుతు వటంచు నాఁడు లంకోపరోధ
మాసఁజేసిరి రఘువీరదాసు లంబ ! 26

ఇష్టదేవత నిన్ను సంతుష్టఁ జేయ
రాముఁ డల్ల సముద్రతీరమ్మునందు
జనని ! కడుఁ బలాశచ్ఛేదమును నయోమ
ఖమునఁ జేసి మహాహవమును నొనరిచె. 27

వడి విప్రయోగివలె రా
ముఁడు ధర్మగుణానుషంగమున నాశక్తిన్
దొడివిప్రహస్తపరముగ
గడువింతగఁ గనక దానకార్యమొనర్చెన్. 28

ధ్యానమొనరించి నిన్నె, జయమ్మనందె
నంబ ! వింతగ లలితోరణాగ్రభూమి
ఘనసదస్యాయత మ్మతికాయమాన
ధనమహాలయమందు నంజనిసుతుండు. 29

విష్ణువయ్యు వియోగాసహిష్ణు వగుచు
హంసకులసార్వభౌముఁ డంబా ! తపస్స్వ
రూపవిచ్ఛేదములకు నిరూఢిఁ గొన్న
మేఘనాదార్భటిని కసిమీఱఁ దిసె. 30

కననై రావణపోషణ
మనయము వహియించి ముదము నందిన నంత
స్తనవైరియనుచుఁ బలి మా
ర్కొని యొనరిచెఁ గుంభవధముఁ గుంభినితనయా ! 31

కుంభకర్ణుని సజ్జనాలంభకరునిఁ
జిత్రముగఁ గిలుకీ ల్వీడఁదీసి యడఁచి
త్వజ్జననియైన భూమికౌభార ముడిపె
నంబ ! నీనాధుఁ డిది భవదర్థమెకద ! 32

అధికపు ణ్యాప్య మౌ నీ సమాగమ మని
పుణ్యజనులతోనాహవమును బొనర్చి
ఘనముగా వారలకు స్వర్గకన్యకలను
బరిణయముఁ జేసె శ్రీరామభద్రుఁ డంబ ! 33

ఘనమౌ ధర్మము నూని తల్లి కొఱకై  కాంతుండు  మున్వేడురల్
దనరంగా నధికాననాదులను గాలక్షేపముం జేసి తా
ఘనమౌ ధర్మము నూని వెండియును నీకై తల్లి! పెన్వేడుకల్
దనరంగా నధికాననాదులను గాలక్షేపముం జేసెఁగా. 34

పాప పంచక నాశనాపాదకమగు
నట్టి సేతువుఁ గట్టి త్వదర్థ మహహ!
పాప దశక వినాశ నాపాదియయ్యె
త్వత్ప్రియభద్రుఁడౌరామభద్రుఁడంబ! 35

అంబరో! "శ్రియమిచ్ఛేద్ధుతాశనా" త్త
టంచుఁ బలికెడుమాట సత్యంబుసేయ
సీతరూపాన శ్రీవయిచెలఁగునిన్నుఁ
ద్వద్విభుం డనలముఖమునఁ బడసెఁగాఁదె. 36

వానరకోటి నీకొఱకుఁ బ్రాణములన్ విడ వారికిన్ బునః
ప్రాణమువోయ దేవతల రాముఁడు ప్రార్థనసేసె నౌర! తా
నేనిఖిలార్థదుం డమరు లెల్లరకయ్యును; కార్యశూరుఁ డౌ
మానిసి గర్వగంధ మణుమాత్రము నొందఁడుగా జగత్ప్రసూ! 37

ఘనముగ యుష్మ దానయన కార్యధురంధరులైన వారికిన్
మణి కనకాంబ రాది బహుమానములన్ బొసరించి సర్వముం
బనివడి నిర్వహించి యతిమాత్రబహూకర ణార్హుఁడౌ విభీ
షణునకు నంత రంగము నొసంగెను రాముఁడు చిత్రమంబికా! 38

నీదు సంతానమైన యీనిఖిలజగతిఁ
బ్రోవ నవతారముల నెత్తె నీవిభుండు
అతనికార్యంబులకు నెల్ల నంబ! నీకు
నిష్ట మొనరించుకంటె వే ఱెద్ది ఫలము! 39

# లక్ష్మీసహస్రకావ్యము

## మంగళ స్తబకము

మంగళకరముల కెల్లను
మంగళకరమైన దనుచు మన్నించెద రే
మంగళదేవత నా షణి
పుంగవ శైలేశు భాగ్యమూర్తి భజింతున్.

ఎందునైనను నీయంశ మింత యున్న
గడ్డిపరకయు మిగుల మాంగళ్య మొందు
'శ్రీఫల' 'శ్రీతృ'ణాఖ్యలఁ జెందునట్టి
బిల్వ దూర్వాదులే దీని వెల్లడించు.

వర్ణ గణాది దోషపరివార మహాజలరాశినుండి యు
త్తీర్ణ మొనర్చునంచు భవదీయ శుభప్రద వాచకంబు ను
త్కీర్ణ మొనర్చుచుందురు తదీయ కృతిప్రముఖ స్థలంబులం
దర్ణవరాజరాజతనయామణి ! తత్కవిశిల్పకారకుల్,

నీచరణాబ్జసేవ ప్రీతినిత్య మొనర్చుటచే నమంగళా
శౌచయుత శ్మశానమున స్థాణువు నెప్పుడు నొందికూడ శీ
తాచలరాట్కుమారిక సుధాబ్ధికుమారిక ! సర్వమంగళా
వాచక మొందె నన్నుఁ దెలుపన్వలెనే యిఁక నీమహత్త్వమున్. 4

పావనుండగు సుధావారాశి జనకుండు
కౌస్తుభాదులు శుభంకరు లనుజులు
దివ్యమంగళదేహ దేవాదిదేవుండు
భర్త శ్రీకార మొప్పారు పేరు
భద్రంకరుండైన బ్రహ్మదేవుఁడు పుత్రుఁ
డాగమాంతంబు విహారభూమి
క్షేమంకరుండు ఛందోమయుండగు పక్షి
వాహంబు పద్మంబు వాసగృహము
ఇట్టి మాంగళ్య పరివార మెపుడు నొంది
యలరు మంగళదేవత వైనయట్టి
నీదుమాంగళ్య మేరు వర్ణింపఁ గలరు ?
భద్రపరివార ! అఖిలసంపద్విహార ! 5

వాసింగన్న సమస్తసంపదలు లోపంబందు నంబా ! భవ
ద్వాసంబౌ శుభవస్తుధిక్కృతిని, దుర్వాసోమునీంద్రుండు శ్రీ
వాసంబౌ స్రిజ మీయ, నేన్గుతల గర్వాంధ్యమ్మునన్ వైచి మున్
తా సర్వస్వము శక్రి గోలుపడఁడే తన్మోనిశాపాహతిన్. 6

అతిశివోదయకరి దయ నార్ద్రియు నయి
కరము నీచూడ్కి భవతారకముగ నమరు
నద్దియుక్తమె మఘవంతుఁ డహహ! శాప
నిహతి జ్యేష్ఠాశ్రియుండయి నిను నుతించి
యుచ్చమగు పునర్వసువర్గ మొంది తిరిగి
యతులుఁ డయ్యెను బహుచిత్ర మంబ! యిద్ది.

అంబ! నీ నుతి పావనమైనరీతి
నెనసియున్నది తద్బలముననుగాదె
కలుగును సుమంగళత కుజనులకు సతము
నరసి చూడంగ నది యెంత యద్భుతంబు!

అరయఁ గుజనుఁ డమంగళకరుఁడు మూఢుఁ
డయ్యుఁ దలఁచుగ నీతమ్ముఁడైన సోము
సంగతింజేసి యో తల్లి! మంగళాఖ్యుఁ
డగుచును బుధాగ్రగణ్యుఁ డౌ నద్భుతమ్ము.

అల్ల రామావతారంబునం దొకప్పు
డచ్యుతుం డినసంబంధ మందె ననుచు
అంబ! నీ విన సంబంధ మందఁజేయ,
నంత శివతాత శివతాతి యయ్యె నెపుడు.

అంబ! కూత్పత్తిమూలమౌ నబ్జనాభు
చరణకమలంబు నీ శుభకర సమాగ
మంబునఁ గపాలికిని శివత్వంబుఁ గూర్పఁ
దగిన త్రిజగత్పవిత్రతీర్థమును గనియె.

అంబ ! నీరూపున సవర్ణయగును, గాన
భద్రకరయౌచుఁ దనరి హరిద్ర యెపుడు
సతులకు సుమంగళత్వం బొసంగుఁ, దావ
కాంగ మరయంగ మంగళమంగళంబు. 12

అలరి హరిద్రాజశ్రీఁ
జెలగెడు నీరూపు నెపుడుఁ జిత్తమున నిడన్
గలుగు హరిద్రాజ శ్రీ
తలమునుకఁగ నంబ ! ధ్యేయతాద్రూప్యమునన్. 13

# లక్ష్మీసహస్రకావ్యము

## సౌందర్యస్తబకము

అబ్జుఁ డబ్జశరుండు నే యబ్జనిలయ
కగుదురో తమ్ముఁడును సూనుఁ డగుచునట్టి
యఖిల సౌందర్య నిస్సీమమైన లక్ష్మి!
కెపుడు సాష్టాంగముగ మ్రొక్కి లిడి తరింతు. 1

తల్లి! చెవులకుఁ గనుల కద్వైతభావ
మొనరి నాలుకకును ద్వైత మొనరునెడల
నీ నిరుప మావయవ రామణీయకమ్మ
నేను వర్ణింపఁగాఁ గొంత నేర్తునేమొ! 2

ఎంతయు నీవు నౌదల వహించినఁ దన్మధుపౌఘమైత్రి న
త్యంత మొనర్చు నీదు చికురావళి; తల్లిరో! యిద్ది యుక్తమౌ,
నెంతగ నెత్తిఁబెట్టుకొని యేలిన నమ్మలినైకసఖ్య మా
వంతయు వీడకుంట కుటిలాత్మల నైజగుణమ్మ కావునన్. 3

జడపయి నెప్డు నీవు నవచంపకమాలికఁ దాల్చుచుండు టా
జడకు నిసర్గసౌరభికి సౌరభమున్ సమకూర్పఁగా, దఁకన్
గడు నభిలాష వేణిఁగల కమ్మనితావినిఁ గ్రోలి ఝూంకృతుల్
ముడివడ మూఁగు తుమ్మెదలమూఁకను దోలఁగఁగాని; శ్రీసతీ! 4

అందము లొల్కఁబోయఁ జికురాళి సుమమ్ములతోడఁగూడ నీ
విందిర! సూర్యచంద్రులను నెప్పుడు నీ తలఁ దాల్తు వందుచేఁ
బొందిరి! పుష్పవత్పదము పూషుఁడుఁ జంద్రుఁడు, వారికూర్పుచే
నొందిన దుత్తమస్థితిఁ ద్వదుత్తమకేశభరమ్ము చిత్రమౌ. 5

సుమనో ఒగ్రి వాస వాసన
గమతను సకలాపజయతఁ గడుఁ గృష్ణ ఘన
త్వమునుం, గనుదే విజయత
యమరును నీ కుంతలముల నద్భుతముగదే. 6

చెలఁగి జలభృద్రుచినిఁ బూని, శిఖులయెడల
మత్సరము నూనుచుఁ దమస్సమావృతిఁ గను
నట్టి కుటిలమ్ములగు కుంతలాళి కీవు
పద్మసద్మాంబ! యిడు మహిబంధనమ్ము. 7

అలకాకృతి నలకాకృతి
గలదంబా; అగ్ర్యపుష్ప కాంతయు, శ్రీదో
జ్జ్వలితయు, వర నీల విభా
కలితయును ముకుంద భాగ్యఖనియును నగుటన్, 8

పరమహిమాలయజనివి
స్ఫురముగ భువనాగ్ర్యసింధుభూషితమయి శ్రీ
సురభితమీనాంక మ్మయి
వరఘనశైవాలకాళివలెఁ గచతతి యొౌ. 9

చామరము నీదుకేశపాశమ్ముతోడ
సదృశముగఁ జేయుటెట్లు? శ్రీశౌరిచేతఁ
బ్రస్తుతులఁ గొన్నదిది, తల్లి పశువుచేత
నైన నను బురస్కృతినిఁ బొందనట్టి దద్ది. 10

సిందూరము మల్లీసర
ముం దనరగ దల్లి! నీదు ముంగురు లందం
బొంది సరస్వతి గంగనుఁ
బొందిన కాళిందిచెలువముం గను నహహా! 11

అరయ నమ్లాన శోభితమౌ ప్రసూన
పాళి ధరియించి సురభిసంవాసితయయి
తన్మహారామవినుతయై ధరణిజాత!
అందముగ సుతరామలకాళి వొల్చుచు. 12

ననవిలుకాఁడు మన్మథుఁ డనారత మీ సుమబాణపంక్తిచే
తనె నను వేఁచుచుండెనని తద్దయు రోసము నొంది యేమొ తా
ననయముఁ గుంతలాత్మయగు నంధతమిస్రమునన్ ముకుందుఁడే
పునఁ గెడపున్ బ్రసూనకులమున్ జగదంబరో! యద్భుతంబగుఁ.

సుమనస్తోమముతోడ నాహరిమనస్సుంగూడ నీకేశపా
శమునం గట్టెద వీవు గావుననె విస్తారంబు నామోదపూ
రమునుం బొందెడి నమ్మనమ్మెపుడు నో రాజీవసంవాసినీ !
గమనింపన్ గుణవత్సహస్థితి గుణగ్రామంబుఁ జేకూర్ప దే! 14

లోకములోన నెక్కడ విలోకము సేసినఁ జెట్టు నెప్పుడున్
మేకొనియుండి పుష్ప మటుమీఁద శలాటు ఫల స్వరూపముల్
సేకొనుఁ, జెట్టునుండి వెలిఁజెందియుఁ ద్వత్కచసీమ మెట్టుటన్
నాకకుజప్రసూనము లహో! సఫలత్వము నందె శ్రీసతీ! 15

జననీ ! దివ్యసుమాళిచే ద్విగుణమౌ సౌరభ్యముం బొందు నీ
ఘనధమ్మిల్లముచుట్టుఁ దుమ్మెదలమూకల్ సేరుచున్ ఝాంకృతి
ధ్వనులన్ సంస్తవనమ్ము సేయుచును దత్సారూప్య మొందం బ్రద
క్షిణముల్ సేయుచునుండు నిత్యమనుచున్ జింతింతు నేనాఁటికిన్. 16

అమ్మరో ! భృంగపంక్తి త్వరయౌగతి నీహృదయేశునాభిప
ద్మమ్మును వీడి సంతతము దావుల నెల్లదిగంచలమ్ములన్
గ్రమ్మగఁజేయునీచికురరాజినిఁ జేరెడు, నిద్ది యుక్తమౌ
నమ్మధుసూదనుండు మధుపావళి కెట్టు లభీష్టుఁ డయ్యెడిన్ ? 17

వికచసూనగంధమ్మును వీడి గండు
మిగిలి తుమ్మెదపిండు నీదగుకచస్థ
సౌరభముఁ గ్రోల నెంతొ యాశఁ గొని మూఁగు,
రంజితభ్రమరి ! సుమసురభితకబరి ! 18

కలయ మారజనిస్థిరనిలయమగుచు
మిగులు తత్కుంతలాంధతమిస్రమందు
నలరునలరుల నొకసౌరభానువృత్తి
దశదిశలనించు నెంతచిత్రంబు తల్లి! 19

సరిగట్టినఁ జంచలతల్
వరలఁ దమోరుచినిఁ గుంతలవ్రజ మంబా!
పరిశోభితమాలోన్నతిఁ
బరిహారము సేయు, మఱియుఁ బరిపోషించున్. 20

నలువుగ ముంగురుల్ సెదరి నాట్యమొనర్ప మనోహరంబుగన్
జెలఁగెడునట్టి నీ యలికసీమ పయోనిధినుండి భూమికిన్
గలిగెడువేళఁ జుట్టుకొను నాచునుగూడిన బాలచంద్రుగాఁ
దలఁచెద రెల్లవారలు సతమ్మను నిందిర! పద్మమందిరా! 21

చిరకాలంబు తమస్సమూహములతో స్నేహించియో కాక యం
బరమందుం దొలుమబ్బుతోడ నవినాభావంబునుం బొందియో
పరిపూర్ణంబగు చంద్రబింబ మఖిలాంబా! నీలకేశాతిసుం
దర మౌ నీ వదనంబుతో సరిసమానంబై విరాజిల్లెడిన్. 22

సూర్యచంద్రాత్మకములగు చూడ్కు లెపుడు
హరి భవద్వక్త్రబింబమ్ము నందుఁ బఱుప
నది మహోదర్కలీలల నందునన్న
కవులవాక్యంబు సత్యమై క్రాలు నంబ! 23

జననీ! విముగ్ధ లద్దమున సంగతమౌ భవదాస్యబింబమున్
గని యది నీ ముఖంపుకళకాంతుల దొంగిలె నంచు దానిపైఁ
గినియుచు మోదఁ, జేతులకుఁ గీల్కొనెఁ దన్మలినంబు; లూరకే
యనఘుల నాడిపోయఁ గలుషౌఘము లంటకయున్నె యేరికిన్? 24

అద్ది వికచంబు కచశోభి యిద్ది నీర
సత్త్వయుత మది యిది సరసంబు మఱియుఁ
బంకభా క్కద్ది యిది యకలంక మంబ!
ఇంక జలజమ్ము నీ మోము నెటులఁ బోలు? 25

మాత! మర్గేశశీర్షార్చ్యమానపాదుఁ
డైన రాజునె గెల్చెఁ ద్వదాస్యమునకు
నాతపస్పృహి యగుచు వనాంతవాసి
యగు కుశేశయాళిని గెల్చు టబ్బురంబె! 26

'నదవనజ' మమ్మరో! నీదు వదనజన్మ
మొందగ మహాతపంబునయందు నిష్ఠ
నెంత తలకిందులై తపియించిన 'జన
వదన'మేయగుఁ గాని త్వద్వదన మగునె? 27

అరయగ నబ్జుఁ డబ్జముఁ ద్వదాననవైరులె యైనవారికాం
దొరులకు మైత్రిలేమిఁ గడు నోడిరి కూడి యెదిర్చినన్, బర
స్పరము విరోధులై నెగడువారు మఱెందఱుఁ గూడియైన నొ
క్కరుని జయింపఁగూడఁ గొఱకారుగదే భువనైకసుందరీ! 28

జననీ! త్వదీయవక్త్రవసుసంచయచోరుఁడు చంద్రుఁ, డేమనన్
వనజగృహాంబుతల్పు గడె వైచి శయించినయంత నీవు, దాఁ
బవివడి సంచరించుచుఁ గవాటము నీ వెడయుంప వేఁగ నా
యినుఘృణులందొ యస్తకుధరేంద్రవనమ్ములయందొ దాగెడిన్. 29

జననీ! యశోకసంపదకు జన్మగృహమ్మయి సాలకాంతమై
కనదురుకాంతికందళవికాసమునై విలసిల్లు తావకా
ననమును గాంచి మాధవుఁ డనారత మా కుసుమేషుకేళికా
ననముగ నెంచి తద్విహారణమ్మున కువ్విళులూరు వేడుకన్. 30

స్వస్వరూపమునను భవద్వదనరూప
మునను ద్వివిధముగా శశి వనధిలోన
జననీ! జనియించెఁ గనుకనే సార్థకంబు
రాజు దాల్చెడి యా ద్విజరాజపదము. 31

అతిపరిశుభ్రమౌ సరసునం దసితోత్పలమట్టు లానిశా
పతితనుమధ్యదేశమున వర్తిలునట్టికళంకమట్టు లా
యతమగుపద్మమం దలరునట్టిమధువ్రతమట్టు లంబికా!
సతతము నీదుమోమునను జక్కనికస్తురిబొట్టు శోభిలున్. 32

జననీ! నవతిలకాననమున సముద్గ
తాభ నణుమధ్యశోభఁ, బెంపాటియు నవ
యవసమాగతిఁ గని, కుసుమాప్తిఁ గొని సు
ధాస్యభూమి పొదువు సుధాధరతఁ గొనుచు, 33

తనరి జలేజమున్ శశియుఁ దల్లి ! సరోగ నభోగతా నివ
ర్తనము లొనర్చి యెంతయు ముదంబునఁ ద్వన్నయనాస్యజన్మలన్
గని సరిహద్దుగట్టులుగఁ గన్బొమలుంచి వసింతు రౌఁ, బున
ర్జననములందునున్ సహజశత్రుత వీడి వసింప రేలనో ! 34

శ్రుతులను దాకు నీకనులఁ జూచి ముఖంబునుగూడ నివ్వి యా
తతముగ నాక్రమించునని తల్లి ! భయంపడి జాణయైన యా
శతధృతి హద్దురాళ్లుగను స్థాపనఁజేసెనొ యేమొ వీని న
న్వితముగ నీదుకన్బొమలు పెంపువహించు విసీలకాంతులన్. 35

అరవిందాసన శంకరాదిసుర లత్యంతంబు సేవ్యానిఁ గిం
కరులై కొల్తురొ యట్టి యా హరియె నీ కన్బొమ్మయుగ్మమ్ముఁ గిం
కరుఁడై కొల్చెడు నిత్యమౌ నహహా ! వక్రత్వాంచితున్ ధాత్రి నం
దఱునుం గింకరులై భజించెదరుగాదా భీతి నోయంబికా ! 36

అంబ ! శ్రుత్యంతజుష్టమై యతివిభాసి
తామరసభాతిమహితమై కామజనన
హేతువై కృష్ణరూపమై యెసఁగు నీదు
నేత్రియుగ్మమ్ము నెవరు వర్ణింపఁగలరు ? 37

హరిణి త్వదక్షిచే విజితయై శరణొందెను రాజు, నాతఁ డా
హరిణినిఁబూని యాస్యజితుఁడై తనమండలమున్ త్యజించి తా
శరణముఁజొచ్చె దుర్గవిభుఁజయ్యన నాతఁడు హస్తమస్తకాం
తరములఁ బూని భిక్షువయినాఁడు మహేశ్వరుఁడయ్యె నంబికా !38

నీ 'నయన'మంబ ! విపరీతమైనఁగాని
వర్ణరీతికి మార్పు నేపాటిఁ గనదు;
కమలమో వర్ణవికృతినిం గనును, నీదు
నయనమును నెట్లు కమల మ్మనంగఁ దగును ? 39

అమ్మ రో! మ్రుచ్చిలెన్ కువలయంబు త్వదంబకకాంతి నంచు రో
షమ్మున రాజు దాని వికచమ్ముగఁ జేయుటఁ జూచియట్టి చౌ
ర్యమ్మను దామునున్ సలిపినందులకున్ క్షమియింపు మంచుఁ దా
పమ్మున రాజపాదములఁ బట్టుఁ జకోరము దిక్కులేనిదై . 40

తమవసుతస్కరమ్ములగు తత్కువలమ్ముల కాశ్రయమ్ములై
యమరుట నీదు కర్ణముల నంబకముల్ గబళించుఁ దల్లి ! కో
పమున; సమర్థులౌ జనులపట్ల విరోధము కీడుగాదు ప
క్షముఁ వహియించి వారిరిపుసంతతి కాశ్రయమౌట కీడెయౌ. 41

వ్యాప్తమును వ్యాపకమ్మనౌ వస్తు లగుట
సంకుచితమగు శ్రుతిసీమ చాక్షుషప్ర
మాణమున; నింక నెటు నుపమానవార్త
యరయఁబడ దంబ ! కైముత్య మను నయమున. 42

నిఖిలలోకైకసంత్రాయణీ ! మదంబ !
కనును ధృతరాష్ట్రజాతాఖ్య; కర్ణమిత్ర
మైన నీ వీక్షణమ్ము కృష్ణార్జునప్రి
దీప్తియోగమె యొక వింతతెఱఁగుసుమ్మ ! 43

వేంకటనాయకు ధృతియను
కంకటమును జీల్చునీదు కన్నుంగవ మీ
నాంకుని యాకర్ణాంతా
లంకృతమగు ధనువుగాఁ దలంతుము తల్లీ! 44

చేరి నీ నేత్రయుగము నీ చెవులుగొఱుక
నంబ! రాజునకుఁ గుశేశయాళి దలఁకు,
కువలయము కాంతిహీనమౌఁ, బవలె వనము
మఱుఁగున సుహృద్యమీనాళి దిరుగుచుండు. 45

పనివడి నీదు నేత్రమధుపమ్ములు ద్వన్మధు రాధ రామృత
మ్మనయముఁ గ్రోలగాఁ బయనమై నడిత్రోవను నాసికాఖ్యచేఁ
దనరెడుచంపకమ్మఁగని దానిని దాటగలేమి నిష్టసి
ద్ధినిఁ గనలేక చంచలతఁ దిర్గును తల్లి! తదంతికమ్మునన్. 46

అంబ! త్వ దానన ద్యుతి సుధాంబుధిలో భువనైకజీవనా
లంబములౌచు నీదుకనులన్ మిషవర్తిలు రెండు దివ్య మ
త్స్యంబులు, వానికంటెఁ గడుఁ దక్కువలౌటను విష్ణునేత్రి మీ
నంబుల మ్రింగివేయు నిది నైజమెకా ఝషజాతి కెంతయున్, 47

నీదు నయ నాతిరమ్య వినీల కాంతి
రాసులను సోకి యింద్రనీలప్రశస్తి
నొందు నీ స్వర్ణతాటంక యుగళరుచినిఁ
బొలియుఁగాక నా యాతంకములు మదంబ! 48

కొడుకుపేరింటి పాటచేఁ గోర్కె నీదు
కర్ణములఁ గర్ణికాకృతిఁ గ్రాలు నినుఁడు
వానిచేరికచే నేత్రపంకజమ్ము
లనయమును వెల్గు లీనుచుండును సవిత్రి ! 49

అంబ ! నీ కర్ణభూషయౌ నంబుజంబు
నందు మధుపమ్ము ఝుమ్ము ఝు మ్మని ధ్వనించు
నద్ది నీప్రియుసందేశమైనయట్టి
మదనమంత్రార్థముం జెవిం బలుకుటేమొ ! 50

మరుఁడు భవ ద్వతంస కుసుమం బనునట్టి ఫిరంగిఁ గర్ణికా
వరణపుకుడ్యభాగమునఁ బై శ్రుతివేదిక నిల్పి తల్లి ! య
య్యరుణ ఘణిప్రదీప్తి శిఖి నంటిన తుమ్మెదగుండ్లబారుచేఁ
గరముఁ ద్వదాత్మ నాథు ధృతికంకటముౘ్ విదళించుఁ దీక్ష్ణతన్. 51

కర్ణభూషలైన కమలంబులం దాసఁ
జేసి కాదు, నీదు చెవులు రెండు
శ్రీనివాసు పలుకుతేనెవాకల నంబ !
నిండియుంట నటనె యుండు నళులు. 52

నేత్రయుగము నీదు శ్రోత్రవతంసక
మైన కలువఁ బట్టి యంబ ! కర్ణ
పత్రమిత్రుఁ దనదు వసుచోరుఁ డిదుగో య
టంచుఁ దుమ్మెదరొద నార్చి పిలచు. 53

వేదవేత్త లవామయౌ నీదు శ్రుతిని
జనని ! స్మృతిజన్మకారణ మని వచింతు
రహహ ! సుమనోఒంచిత మ్మగు నా శ్రుతిశిర
మందె జగదీశు చూపులు చిందులాడు. 54

నీ ద్వితీయ శ్రుతియు నిత్య మనంగభా
వానురూప యగుచు నల యశేష
శేషిని వశవర్తిఁ జేయ నాతం డంబ !
కర్మకారకతను, గను, నిజంబ. 55

అతనుం డన్ యజమానుఁగూడుకొని ఖ్యం గాధ్వర్యుఁడో యంబికా!
రతనాల్నిప్పుల నిండు త్వత్కనక కర్ణ ప్రజ్వల త్కుండ లా
తత హోమానల కుండమందు హరి హృద్ధైర్యంపుహవ్యంబు ఝూం
కృతు లన్ మంత్రములన్ బ్రదక్షిణవిధిన్ గీర్తించుచున్ వ్రేల్చెడున్.

జనని ! నిసర్గ రమ్యపదసంపదలన్ దివిజుల్ పొనర్చు త్వత్
ప్రణుతులతోడఁ బూర్తి సరివచ్చును నానుతులున్ భవచ్ఛ్రుతిన్
జొనిపిన యాక్షణంబుననె, శుక్తిగతంబయినంత వర్షపుం
జినుకును ముత్తెమై సరులఁ జేరి సమానమహార్ఘ మౌఁగదే ! 57

తనరారు ముత్యాల తాళతళ్యంబులే
జలజల ప్రవహించు జలము గాఁగ
నింపారు రతనాల యెఱ్ఱనికాంతులే
చక్కనౌఁ జెంగల్వచాలు గాఁగ

హాయువారు నీ విభు తరళేక్షణంబులే
యట సంచరించు మత్స్యములు గాఁగ
నలుపారు నీలాల నైగనిగ్యంబులే
రమణీయ నీలోత్పలములుగాఁగ
నలరి సర్వశ్రమాపహం బగుచునొప్పు
నట్టి భవదీయతాటంక మను తటాక
మును భజించెద నేను బ్రొద్దుననె లేచి
యనుదినంబునుగూడ నో యబ్జనిలయ!

జనని! నీ పైఁడికమ్మ లన్ మునులు శ్రుతుల
విడక ముక్తాభ్యుదయమును బడసి మివులఁ
జెలఁగు జ్యోతిష్పథంబున మెలఁగుచుండి
చక్రధర సన్నుతులఁ గాంతురి సంతతంబు.

నూతనంబుగ విడిచిన నువ్వుఁబువ్వు
వలెను నీనాసికాపుటం బలరునెపుడు
నంబ! యా పూవుకొసను నీహారబిందు
వొత్తినటు ముక్కునం దాణిముత్తె మలరు.

తల్లి! నీ నాస వేణులతామతల్లి
యందురన నిందు నాశ్చర్య మంద నగునె?
వేణుగర్భమ్మునందుండి వెలికిఁజాతి
ముత్తియము నీదు నాసాగ్రమున వెలుఁగదె!

ధైర్య మఱి నీదు నాస్యకాంత్యబ్ధియందు
నాసికాసేతువుం గనినంత రాముఁ
డహో! నిశాచరకేశసంహార మొదవ
నెటు విదేహజయామోద మెనయఁ డంబ! 62

కన భవదీయ నాసికను కంబముగా నిలఁబెట్టి దానినిన్
గనుబొమ లన్న పగ్గముల గాటముగా బిగఁదీసి కట్టి యో
జనని! యనంగుఁ డన్ మివుల సాధకుఁడౌ నొకదొమ్మరీఁడు తా
ననయము దానిపై నిఁ గడు నద్భుతరీతిగ నాట్యమాడెడున్. 63

సౌరభదాన మెంతొ తొలిజన్మమునందిడి నీనసాకృతిన్
ధారణసేయఁ, గోటిగుణితంబుగ వెండియుఁ జంపకంబు తత్
సౌరభమొందె; సజ్జనులు సల్పెడి దానము లెల్ల నంబ! పెం
పారవె కోటిరెట్లయి భవాంతరమందు సుఖింపఁజేయఁగన్. 64

ఊరుపుఁబిల్లవాయువుల నొంది గుబుల్కొనునట్టి నీదు నా
సారమణీయ మౌక్తికముఁ జక్కని చిక్కని మల్లెమొగ్గగా
నారయువాఁడఁ, దద్వికసనాతినిరీక్షను దానిపై పయిఁ
జేరి వసించుగా! జనని! నేత్రమధువ్రతయుగ్మ మెప్పుడున్. 65

కలుములరాణి! నీదు నసఁ గ్రాలెడు ముత్తియమన్నయట్టిరో
వెలఁదుక మందహాసమను వెల్లని యంశుకమున్ ధరించి లో
నలరి సమీరనర్తకుఁడు హంగునొనర్పగ నాట్యలీలలన్
జెలఁగి కరంచు నీదు విభుచిత్తము నెంతయు మెత్తమెత్తగన్. 66

ఓ తపనీయగాత్రి ! చెలువొప్పెడి నీ ముఖ మిందుబింబమై
వాతెర సంజరాగమయి భాసిల దానిసమీపభూమియం
దాతతకాంతిపుంజముల కాస్పదమై రమణీయమైన నా
సాతరళాచ్ఛమౌక్తికము చక్కనిచుక్కవిధమ్ముఁ దోచెడిన్. 67

అనయము నీ నసాగ్రి సముదంచిత మౌక్తికరాజ మెంతయున్
దనకు విరోధికోటి యగు దంతసమూహముఁ గాంచి భీతిచే
జనని ! భవ న్నసాబిలముచక్కని దాఁగగఁ జేర నందుఁ బెం
పెనయు ప్రతీపనిశ్వసన మెంతయు నడ్డఁ గడుఁ వణంకెడున్.

భవతీ ! రదనాళిసము
ద్భవ తీవ్రప్రభల భవతి భాతిగఁ దగు నా
భవతీ హాస జ్యోత్స్నిక
భవ తిమిరముఁ బాపి యెపుడుఁ బాలించు మమున్. 69

అమరిన స్వరూపగతిచేత ననవరతమూ
నీహాసితమగ్రవర్ణమ్ము నెట్టివై చి
అమిత విధు పాదజాత సఖ్యముఁ బొనర్చు;
నంబ ! యతిమందునకు నధరాప్తి తగదె ! 70

అంబ ! హరికీర్తిభాసంబు లనుచు, నీదు
నాల్కకొస నాట్యమాడు నా నలువచెలువ
మేని సుషమాప్రవాహంపు మెఱపు లనుచు
నీదు దరహాసకాంతుల నేఁ దలంతు. 71

ముక్కుముత్యంబు నవనవోద్భూతకాంతి
వీచికలఁ బొంది చంద్రునిఁ జూచి నవ్వె
నట్టి నీచిఱునవ్వుచే నంబ ! యధర
బంధుజీవమ్ము పాటలత్వమ్ముఁ బడసె. 72

పడమటిసంజతో వెలయు బాలసుధాంశుని శుభ్రదీప్తులన్,
పొడువగు పద్మరాగమణిపొంత సిత స్ఫటికోప లాంశులన్,
గడుసెఱుపాఱుపల్లవమునన్ దగు తెల్లనిపూలకాంతులన్
బెడఁగున గెల్చు నీ యధరబింబమునన్ దరహాసదీధితుల్. 73

నీ యధరంబునం దతివినిర్మలమౌ దరహాస మన్మిషన్
దీయని యా సుధారసమె తెల్లముగాఁ గనుపట్టు నో సుధా
తోయధిపుత్రి ! యా రసముతో మిళితమ్మయి నీ చటూక్తు లా
హా ! యతిమోదముం గొలుపుగా మధువైరికిఁగూడ నెప్పుడున్. 74

అంబ ! మృద్వీక మృద్వీకారంబ యయ్యె
నరఁటి రుచిచెడెఁ గండచక్కెరయుఁ జప్ప
వడియెఁ దేటులచే మైలవడియె మధువు
నీదు వాఙ్మాధురికి సాటి నిలువలేక. 75

తేనియ పురువులు తెట్టువలై పట్టి
చెట్టునో పుట్టనో చేరి నిలిచె
ద్రాక్షాఫలము జీవితముపైననే రోసి
కడుఁ జిక్కి ముడుతలువడి చెలంగె

చక్కెర వేతొక శరణంబుఁ గానక
ఖండ ఖండాంతర గామి యయ్యె
కదళీఫలము తనకాంతినివీడి రె
న్నాళ్లైన నిలువక కుళ్లిపోయె

నీ చటూక్తుల సతతంబు నిండియున్న
యట్టి మాధురిలో సహస్రాంశమునకు
నైనఁగూడను సరితూగి యాగలేక.
యో సుధామధురాలాప ! యో మదంబ !

చెఱకు భవద్వచోరసవిశేషము దొంగిలి స్వీయగర్భకం
దరమున నెంతొ గూఢముగ దాచెడిఁ గాననె గానులోపలన్
గరముఁ దపించి పిప్పియయి కర్కశుఁడిఁ దద్రసమెల్లఁ దల్లిరో!
విరివిగ మర్దనంబు గుణవృద్ధికి మూలముగాదె యారయన్ ! 76

పాలసముద్రిమం దమృతభాను సుధారస మొల్కఁబోసి స
మ్మేళమొనర్చి తల్లి ! యటుమీఁదటఁ దియ్యనియిక్షుదండముల్
బోలఁగఁజేసి కవ్వములఁబోలె మథించినయంత నబ్ధిపైఁ
దేలినవెన్నగూడ భవదీయ చటూక్తులముందుఁ దిక్తమౌ. 77

అంబ ! యధరంబుఁ గ్రొందలిరాకుగాగఁ
బలువరుసఁ దెల్లనైన పుష్పతతిగాగఁ
బ్రియమృదూక్తుల మకరందబిందువులుగ
నరయుదును నీవు మాధవివౌటఁజేసి. 78

తెలి వెలిఁజిమ్ము నీ వదనదివ్య విభాతతి యన్ సుధాబ్ధిలో
పల మధురాధరామృతము వాగమృతంబును బుట్టె వాని నో
కలిమిపడంతి ! యాస్యమునఁ గర్ణపుటద్వయినిన్ గడుంగడుం
గులుకుచు నెంతఁగ్రోలియు ముకుందుఁడుదృప్తిపడండు
మంతయున్. 79

భవహరణమైనయట్టి నీ వాక్యఫణితి
కాలకంఠాభిలాపముం గేలిసేయుఁ
గాక శ్రుతిపథమధురమై క్రాలు నద్ది
శుకముఖాలాపముల కెటుల్ చూపు దొనఁగు ? 80

ఏ నీవాగ్రసమాధురిన్ వినఁగ నాగేంద్రుండు నేత్రంబులన్
దా నిర్వేలశ్రుతీంద్రియంబులుగ సంధానించెనో కోర్కెమై
నా నీ వాగ్రసమాధురిన్ సకల మో చానీచ మాధుర్య లీ
లావిర్మోచని నెంతు నంబరా ! మహోల్లాసంబు సంధిల్లగన్. 81

అసమానరుచితోడ లసమానమగుసుధా
రసపూరమునకుఁ బర్యాయమగుచు
అరుదారు దేవతాతరుపుష్పముల మృదు
విధమధుప్రకృతికి వికృతియగుచు
పుండ్రేక్షురసమును ముంచెత్తగాఁజేయఁ
దగు ప్రణాళికల కాధారమగుచు
స్వాదుత్వగరిమఁ బేర్వడిన వేలుపుటావు
పొదుగుపాలకుఁ బరిపోషమగుచు

కండచక్కెరరుచికి వికాస మగుచు
నారికేళోదకపుపరిణామ మగుచు
రహిఁ జెలంగెడి నీ వచోలహరి జనని !
అఖిలమధురాతిశాయియౌ టద్భుతంబె ! 82

పాలకడలికిఁ గారాబుపట్టి వమృత
దీధితికిఁ జెల్లె లవు మధురాధిపతికి
నెయ్యపుంబత్ని వైనట్టి నీ సుభాషి
తంబులకు నంబ ! కదళీఫలంబు తులయె ! 83

ఆదిలో రూపయుక్తయై యలరుద్రాక్ష
అధికమైమధ్య యిక్షుజమైన సితయు
* నగ్రిజనయుక్తయగు సుధాఖ్యయునుజనని !
నీదువాఙ్మాధురికి సాటి నిలువఁగలవె ? 84

మాత ! నీ దంతశతుగ్రిలో మౌక్తికమ్ము
లమిత నిస్సార వంశ గర్భములఁ బుట్టెఁ
ద ద్ద్విజవ్రజ వైర సాధకుల కంబ !
సతము మాతంగకులశిరస్థ్సితియుఁ గలిగె. 85

నీ రదావళి నిరతమ్ము నీ రసజ్ఞ
కడను నటియించువాగ్దేవికంఠమందుఁ
గ్రాలు శ్రీదివ్యమందారమాలవోలెఁ
గాంతివలయంబు లొలికించుఁ గమలనిలయ ! 86



* పాఠాంతరము:— అంబరో ! అగ్రిజనయుక్తయగుమధూళి

ఔర ! సహసోన్మిషిత యయి నీ రదాళి
కాంతి యముక ముకుంద సంక్రాంత మగుచు
చెల్ల ! సజ్జఘనాగమ మెల్లఁ గడుఁ బ్రి
కాశమానమ్ముగా సదా క్రాలు జనని ! 87

అంబ ! అముక ముకుంద మ హా_స్తవర్గ
మై సదాదృతమై శుచిమంతమైన
త ద్ద్విజానీకమునకు ముక్తాకృతి సత
మమరుచుండుట కడు యు_క్త మగునుగాదె ! 88

చన నే ర క్త జపా సదృక్ష రసనా చ్ఛాయోప రక్తాంశు సం
జనిత ప్రాభవమౌ రదాళిఁ గని బీజాపూర విభ్రాంతి ము
న్నొక్కనఁ దుండంబునఁ గ్రోల వచ్చుశుకముం ద్రోలన్ జగద్ధాత్రి:కం
దెనొ నీచేతులు, త ద్రిదావళి తమోనిష్కాసయౌ మా కిఁకన్, 89

మాత ! వాగ్దేవతా నృ త్త ఘూత జాత
మనిశ మావృ_త్తముగ నట నెనయుచుంట
ప్రబలరాగమనోజ్ఞయౌ త్వద్రిసజ్ఞ
హృద్యసంవేద్యవిద్య మా కిచ్చుఁగాత ! 90

సతము మహాపరాధముల సల్పుచునుండెడి మమ్ము సత్కృపా
మతిఁ గడుఁ బ్రోవ మాపయిని మాధవుకోపము రూపుమాప నం
బ ! తదనురూపసూక్తులను బల్కి శ్రమింపడి యెబ్బవారు నీ
యతులరసజ్ఞ నింక శర ణందెద మోక్షపదాభికాంక్షినై. 91

కమలజునిరాణి కాననకౌముదియను
నిందవిడ నవనగుణయౌ నీదు రసన
నిలిచియు వనజనిలయవౌ నీ కలిమిని
అధికవనసంస్థితినె పొందు నహహా ! జనని ! 92

పనివడి కొల్చువారలకు వాఙ్మయసారదయై లసత్తనూ
జనిత మహాప్రభా విజిత శారద నీరదయై మహోల్లస
ద్గుణ శతకోటి గానయుత తుంబుర నారదయై భవద్రస
జ్ఞను నటియించు శారదను సన్నుతిసేసెద నిష్టసిద్ధికిన్. 93

భవ దధరబింబ మానన పంకజ ప్ర
భా వితానంపు బాలాతపంబొ లేక
త్వ న్మనోహరు హర్ష ప్రభాతవేళఁ
బొడము తరుణారుణోదయంబో మదంబ ! 94

వా గధర రూపములుగ నీ వదనమందు
నమృతములు రెండు జనియించె నందు మొదటి
దానివర్ణంబు శుకలాలితంబు తల్లి !
లాఁతివర్ణంబు కింశుక లాలితంబు. 95

వివృత రాగంబె య్యయ్యును విహ్వాత పల్ల
వము, విశుద్ధ ద్వి జావృత, మమృతవృత్త
మై యధర జీవ మంబ ! అ య్యరుణబింబ
భేదన మొనర్చు, నది యుక్త విధమెయగును. 96

బింబమున కోష్ఠమునకు విభేద ముడిపి
సాధుపదవర్తనులు సంధిసలుపునప్పు
డంబ ! నీ యోష్ఠ మగ్రివర్ణంబు బింబ
మునకు నిడి తదంతిమ వర్ణమును దొలంచె. 97

మౌనులకు నమృత మొసఁగెడు మాధవుండె
తల్లి ! యమృత పిపాస నెద్దానిఁ గొలిచె
నది గుణోత్తరమగు నీదు రదనవసన
మదె విరోధలక్షణమున నధర మయ్యె. 98

బిసరుహసూతి కొల్పింబుటము వెట్టిన బంగరువంటి నీ మెయిన్
బసుపుమెఱుంగుఁబూఁతలను బాగుగ నిడ్డ తటి చ్ఛలాకచే
పసిగ సృజించె, నాపయిఁ జక్కఁగ నీసునువాతెరన్ సుధా
రసమును జిల్క నత్యధికరాగము దానికిఁ గల్గె నమ్మరో! 99

తళుకుంజెక్కిలి ముద్దులాడునెడ నో తల్లీ! త్వదోష్ఠంబునం
దలరుం దేనియ నందనందనుముఖంబం దొంది సంగీత వే
శలఁ దద్వంశముఁ జెందె, భృంగకులమున్ దన్మాధ్వికేమో మహో
త్కలికన్ మిక్కిలి పెక్కు తూట్లు వొడుచున్ దద్వంశజాతంబులన్.

ధీలలితులార ! విద్రుమమాల యిద్ది
'యస్మదీ యాధరముకంటె నధరమెగద
యరయుఁడీ' యంచుఁ బ్రత్యక్షపఱుప జనని !
తాలుతువొ గళమ్మునఁ బవడాలదండ ! 101

జనని ! కన కాసు రాంగ పాటన ఖరములు
న్పృహరినఖరమ్ము; లై నను నీ కపోల
విహితములుగాగ, తాటంక మహిత కాంతి
ర క్త మృదులమ్ము లగుచు సార్థకములయ్యె. 102

దుద్దుల రత్నదీధితులు దోఁచగ బుగ్గలఁ, జూచి ర క్తిమన్
బ్రొద్దున నద్దమందున, విభుండు రతిన్ బ్రతిచుంబనంబులం
దద్దిన తమ్ములంపుటెఱుపౌనని భ్రాంతిలి తల్లి ! ప్రేళ్ల తోన్
బెద్ద శ్రమించియున్ జెఱుపనేరని నిన్గని నవ్వరే చెలుల్! 103

శ్యాలకుఁడౌ క్షపాకరుని "హ స్తమునంగల శంఖదీ ప్తికిన్
జాలవు, నాకుఁ జాలుదెటు, నా విధుపే రిడుకొన్న నంచుఁ బె
న్మేలమొనర్చు త్వద్విభుని మీఱగలేక విధుండు తల్లి ! నీ
శ్రీలలితాస్య జన్మమును జెందెఁ గళాత్మదరమ్ము గ్రిందు గాన్. 104

కమలాక్షి పాంచశర జ
న్యమున భవత్కంధరము ద్వ దంత స్థో ష్మో
త్క్రమణమ్మున గర్జించెడు
కమలా ! గోపాల హృదయ కమ లావాసా ! 105

ఘనమై, హిత చ క్రాహ్వాయ
మును గొనె నని స్వీయ భు క్త ము క్తాహార
మ్మును గుచశీర్షమ్ములచే
జననీ ! మోయించుఁ, బాంచజన్యము గళమై. 106

అంబ ! త్వత్కుచములఁ బయోజంబు లనుచు
నందు రది యెట్లు పొసఁగు ! బ్రహ్మాది బాల
కావళికి జీవ మొసఁగు పయస్సున కవి
జనకములు గానఁ, దగుఁ బయోజనకము లన. 107

తనలో నున్న సుధాపరిపూర్ణ కలశద్వంద్వంబు లోకైక ర
క్షణకై నీ జనకుండు నీయెడఁ గుచాకారంబునన్ నిల్పె నో
జననీ ! యందలిపాలఁ దృప్తిగను నాస్వాదింపగాఁ దెల్లఁబా
ఱిన యబ్జాసను నాల్క నాడుటను మాఱెన్ వాణియున్ గౌరిగన్.

ఇలను 'కన్దుక కఞ్చుక' మ్మలవి రెండు
నెపుడు వర్ణవిపర్యయ మ్మొనయ వంబ !
సుగుణు లవి గాన, నాద్యమున్ జూచు మైత్రిఁ,
జరమమును దలఁ జేర్చు నీ స్తన కుభృత్తు. 109

అంబ ! నీ దేహపురి కేగునప్పు డెదురు
పడినయట్టి పురాణగోపాలుఁ డూను
త్వ త్పయోధర వర ఘట ద్వయముఁ గాంచి
అధిక ఫలదం బటంచు లో నలరు మరుఁడు. 110

పుండరీకాక్షుఁ డంగజపూజ సేయఁ
దలఁచి పుణ్యాహవాచన కలశము లని
యంబ ! నీ కుచయుగము మహోక్షతములఁ
జిత్తమునఁ బ్రీతి యొసఁగఁ గైసేయుఁగాదె. 111

అంబ! నీ స్తనభూభృద్యుగం బయారె!
యెంత నున్నతి నందెనో! యీ చ రాచ
రాశి కీశ్వరుఁడౌ చక్రి యరసి తత్క్ష
ణంబె యవ్వానికిఁ గరార్పణం బొనర్చు. 112

అంబ! నీ యవయవముల కన్నిటికిని
వేయివేయిగ భూషలు పెట్టి కుచము
లవ్వి యవిభక్తములుగఁ జెన్నారుకతన
రెండిటికి మహాహార మొక్కండె యిడుదు. 113

జననీ! నీ స్తనయుగ్మ మెల్లపుడు విస్తారంపుటౌన్నత్య మొం
దిన యా భూమిభృదాళిసంపదల నెంతే నాహరించున్, సతం
బును నూర్ధ్వాశ్రిత సాధు చక్రముల పెంపున్ గూల్చు, నూర్ధ్వమ్ముగాఁ
గను, నీదృక్చరితమ్ములందు నవివేక మ్మేమి యాశ్చర్యమో. 114

దేవిరో! అతన్వాజ్యవతీర్ణ బలముఁ
బడసి, సుస్వాదుతర పయఃపరిబలశక్తి
నెనసి, బహు మహాహార సమృద్ధిఁ గాంచి
బలిసియున్నది నీ కుచద్వంద్వ మహహ! 115

తగు వివేకవార్తారహితముగ నున్నఁ
ద్వత్కుచద్వంద్వమున గురుత్వమ్ము నుంచి
పలుకుభృత్తులు శిష్యభావము వహించు
టది క్షమాధర లక్షణ మ్మౌను జనని! 116

బాపురే ! త్రిలోకభిక్షువౌ వామనుండు
వచ్చి చేతుల నలిపిన వాని కతను
దాన మొనరించు, హైమభూధరముఁ బూరిఁ
గొనని యౌదార్యమున భవ త్కుచయుగంబు. 117

అంబ ! ప్రహ్లాదజనకము లౌట నీదు
స్తనము లవి హిరణ్యాచల సంపదలను
జెందుఁ గావున నా నరసింహమూర్తి
సలుపు నచ్చటనే నఖక్షతము లెపుడు. 118

ఖర్వ మగుఁ గుంభ మది నీదు ఘనపయోజ
యుగ్మమున, కంబ ! పోల్కి యె ట్లొప్పు; స్పష్ట
పడదె వింధ్యాచలము ఖర్వపఱచియున్న
ఖర్వునిం గంటచేఁ గుంభఖర్వగుణము. 119

రతివిభుఁ, డధోక్షజుఁడు రతివ్రతము సేయఁ
ద్వత్కుచద్వంద్వ మను కైతవమున నొసఁగె
వారిజాలయ ! మంగళనారికేళ
ఫలయుగముఁ బసుపునుబూసి భద్రిమెసఁగ. 120

త్వ త్కుచంబుల కంబ ! మిత్రంబులగుచుఁ
దనరు కుంభంబులను దన తలధరించు
చుండెననికాదె యల గజేంద్రుిండు వేఁడ
నా క్షణమె రక్షసేసె నధోక్షజుండు. 121

త్వత్కుచంబుల నడుమ ముత్యములు దొరలు
చుండుటను, క్రింద నూగారు తుండ ముంట
నంబ ! యిభకుంభములు నీ కుచంబు లనెడు
కవులమాటలు నిక్కంబు లవునుకాదె ! 122

అంబ ! నీసోదరుఁడు విరహంబు మాకుఁ
గూర్చుచున్నాఁడు తన కది గూడదనుచు
గట్టిగాఁ జెప్పు మని కుచకైతవమునఁ
జక్రవాకద్వయము త్వ దాశ్రయముఁగోరె. 123

మదిరాక్షీకరఘాతబాధను సహింపన్లేనివై చెండ్లు నీ
హృదయంబందుఁ గుచాకృతిం బడసె నష్టేనిన్ భవన్నాథుఁ డ
య్యదువీరుం డొనరించు మర్దనముఁ బాయన్లేవుగా ! యుర్విపై
సుదృగాక్షిప్తుల కెష్ట మర్దనము లెచ్చోఁ బోయినన్ దప్పునే ! 124

అంబ ! కుంకుమధాతు రా గాంకితంబు
నతికఠోరమునౌ త్వత్కు చాద్రియుగము
పద్మనాభుని భుజమధ్యభాగమునకుఁ
గౌఁగిళులఁ గూర్చి నేర్పెనో కఠినగుణము ! 125

దుగ్ధవార్ధిజ ! ఘటికా శ తోదయంబు,
ధన్యతమ కాంత గురు మ హోదయము, భవ్య
సాహితీమదోత్కటము, నీ స్తనయుగ మది
నెగడఁజేయును కవిచక్రనిర్జయమును. 126

జనని ! సురతరుచిరవిలాసునిగఁ దలచి
పృథులకుచయుగ మొసఁగితి విభున కీవు
దానితోఁ జాపలతను వస్త్రమును దోఁచె
నది హిరణ్యాపహార్తకు నైజగుణమె. 127

ఉన్నమత్సరమయ్యు ననున్నమత్స
రంబునగు కందుకమునకున్ యంబ ! మఱియు
నంగగురుతోషితంబయ్యు నహహ ! నీదు
స్తనయుగ మనంగగురుతోషితంబునయ్యె. 128

తల్లి ! జగదీశుఁడౌ జనార్దనుఁ డుదగ్ర
హారమౌ నీదు కుచమండ లాంతరమున
కడుఁగరగ్రహ పీడన మ్మిడునుగదె హి
రణ్యహార్త కెక్కుడిది కారుణ్యవార్త ! 129

అంబ ! భోగ్యాయత ప్రశ స్వమంచితమగు
త్వత్కుచగిరీశ మౌళిపైఁ బడుచు నుఱుక
లిడుచు, నుద్వృత్తతను బ్రవహించుచుండు
నీదు గళ హార మను స్వర్ధునీమతల్లి. 130

బాల్యమున ధాత నీ స్తనపాయి యగుట
నే పితామహుఁడై నిత్యతృప్తుఁడయ్యె.
సంతతము నీ యురోజ రసజ్ఞమయ్యు
మార్పుఁ గొనదు ముక్తాహార మట్లె యుండు. 131

అంబ! తావక గురు కుచాగ్రంబులందుఁ
దనరి మిసమిసలాడు ముత్యాలపేరు
లల్ల బంగారుకొండపై నవఘళించు
రిక్కగమితోడ నెపు డెకసక్కెమాడు. 132

కలశాబ్ధిపుత్రి! నీ స్తన
ములఁ దిరుగెడునట్టి ముత్యములహారము, లా
జలరుహముకుళమ్ములపైఁ
గలరవకరు లగుచుఁ దిరుగు కలహంసములో. 133

జనని! భవచ్ఛరీర మను చక్కని యా వలరాజుతోటలోఁ
గనుఁగొన నౌ భుజంబులనఁగాఁ దగురెండు వినూత్నవల్లులన్
ఘనతరమైన చిత్రము దగన్ ఋతుభేదములేక యెంతయున్
బెనుపువహించు న వ్వెపుడు వ్రేళ్లివురాకుల గోరుఁబూవులన్. 134

వనరుహబాంధవుండు నిజబంధుపయోజము లెన్నియేని యో
జనములు దూర మయ్యె నని చాలగఁ జింతిలి తల్లి! వాని దా
పున నె వసింప నెంచి సతమున్ వెలుఁగొందును నీ కరాకృతిన్
జననముఁ గన్న పద్మముల సన్నిధి బంగరుకంకణాకృతిన్. 135

కరము నీ కరపద్మరాగముల మించి
కాలు కంకణపద్మరాగములఁ గాంచి
దాడిమీబీజలుబ్ధయై త్వచ్ఛుకంబు
జననిరో! విప్రలబ్ధయౌ ననుదినంబు. 136

పై (డికంకణముల నాట( బడిన యిందర్రి
నీలమణిదీధితుల( దేలి నీకరములు
నా(చుమేల్మ్రసు(గునను దోఁబూచులాడు
కమలముల(బోలె మిగుల రంగారు జననీ! 137

అసలే యెఱ్ఱనిదౌ భవత్కరతలం బాపై స్ఫురత్కంకణో
ల్లస దారంజిత పద్మరాగముల నెఱ్ఱంబాఱు నామీఁద( ద
త్ర్పస రాలోల బిడాలలోచనసుహృద్వైడూర్యవీక్షో త్పత
త్త్రిస లీలాశుక వార ణారుణ సమాక్రాంతిఁ మఱిఁ రక్తమౌ. 138

తల్లి! కాంచీకవీంద్రుసత్కవితకంటెఁ
గరము కోమలమైన నీ కరతలంబు
నిరత మాశ్రితకోటికి నిఖిలవస్తు
దానమిడునట్టి శ్రమను రక్తత వహించు. 139

అంబ! సర్వార్థదాయియైనట్టి నీదు
హస్తమేకాదు స్వర్ణ గతాధికంబు
ఎవ(డు నీ దానమున కర్హుఁ డవునొ భువిని
నట్టి నిస్వుండు స్వర్ణ గతాధికుండె. 140

అనవరత మనస్తాపదుఁ డైనవాని
వేగ నష్టాపదావాసు( గాగ( జేసి
ఆపదయటన్నమాటనే యంట నీక
కాచు నీ కర మద్భుతకరము జననీ! 141

అంబ ! దీనులు త్వత్కరాబ్జాత్త దాన
మహిమచే స్వర్ణవత్త్వముం బడసి వసుధ
నెప్పుడు నధీశు లౌదు, రిందేమివింత
మఱియు లక్ష్మీకుమారు లౌదు రన వింత. 142

కటకమణికాంతినైగనిగ్యప్రవాహ
కలితమై మీన మకర రేఖావృతమయి
హ్రదమువలె నొప్పు నీదు హస్తాంబురుహము
కరము నొగు లొందు మధువర్ధకగ్రహముల. 143

ఒనర స్వర్ణస్ఫురద్వివిధోర్మికం బ
దగుటఁ ద్వత్కర మంబ ! రత్నాకరంబ
కావుననె దాని నంది యాక్రాంతభువన
రాజి యగుచు జనార్దనతేజ మెసఁగు. 144

అమలచ్ఛాయము శుభక
ల్పమునై మఱి దానవారిపదపోషకమై
సుమనఃపరిపాలకమై
యమరెడు నీ పంచశాఖ మనిశముఁ గొలుతున్. 145

మరకతరత్నాదులు నీ
కరయుగ శోర్మికల నుంట కడువ్యర్ధము శ్రీ
శ్వరి ! యంగుళినఖకాంతులె
హరయించును పద్మరాగముఖరాగములన్. 146

హల్లకపాణి! తావక కరాంగుళి సంగత శోణిమమ్మె నీ
వల్లభునోష్ఠభూమిపయిఁ బర్వఁగఁజేయు విడెమ్ము. కానిచోన్
దెల్లనిదౌ సుధన్ నలఁపుదేఱిన పోకను పచ్చనాకులన్
జెల్లిన వీడియమ్మునకుఁ జెల్లునె? రాగకథాలవాప్తియున్. 147

దురితాతిదురితుఁ గర్కశ
తరు నను సంసారకూపతలమును వడి వె
ల్వరుపఁగఁ గనుగందుటచే
నరుణత వహియించె నీదుహస్తము జననీ! 148

అంబ! హసించు నీదు భుజ హైమ లతాగ్రిమ భాగ రమ్య హ
స్తాంబురుహద్వయ ప్రచల దంగుళికోటి నఖాగ్రరాజి ని
త్యం బు, సరస్వతీఝుర సమాపత నోపనత ప్రహదాంత రా
లంబ తరంగసంఘ విచలంబగు నుజ్జ్వల ఫేనజాలమున్. 149

అమర నిజాభిధానుఁ డయినట్టి విభుండు దశావతారముల్
క్రమముగఁ దాల్చె నం చతితరంబగు నీర్ష్య వహించి యవ్విధుం
డమలిన తావకీన నఖ రాకృతి నొక్కపరిన్ దశావతా
రముల భజించు నెల్లపుడు రమ్యజనాగ్రవతీ! రమాసతీ! 150

అలవారాశ్యున్నత స
తృలల కన్యా శస్త హస్తగురుభాసితుఁ డౌఁ,
దులఁ గనఁడు, విచిత్రాకృతి
వెలయ నఖాకృతి వెలుంగు; విధుని నుతింపన్. 151

క్షతమునుండి రక్షించిన, క్షత్రమగును ;
క్షతము సల్పినయపుడు నక్షత్రమగును;
జనని ! త్వత్ప్రియుమేనిపై క్షతశతమ్మ
సలుపుటను నీ నఖములు నక్షత్రము లగు. 152

హరిసమీక్షలఁ ద్వత్కర స్థాబ్జ యుగళి
నొకటి దాక్షిణ్యశా ల్యాశ్ర యోన్మిషితమ.
యగు, నదాక్షిణ్యశా ల్యాశ్రయ ముకుళిత మిఁ
కొండు, రెండునుగూడ మా కొసఁగు సిరులు. 153

రోమరాజి తనర్చు సురోజ మధ్య
హార నాయకరత్నంబు నంటి జనని !
నాభిరంధ్రంబునందుండి నల్లత్రాఁచు
పడగమణితోడ పై కెగఁబ్రాకినట్లు. 154

హారవిరూపమౌ నయనమందు దువయించెఁ గళిందకన్య యం
చురవగునీర్ష్య గంగ చరణోత్పలమందు జనింప, నీసుమై
మఱల జనించె నీ యుదరమందుఁ గళిందజ రోమరాజియై;
యరయ మదంబ ! పత్న్యుదర మందు నపత్యమె ముఖ్యమౌఁగదే!

మనసిజునని గెల్వ హరిన్
స్తన భూభృద్ద్వయి. నిలిపి జనని ! యూరుశత
ఘ్నిని, సజ్జఘనకుభృత్స్థల
మునఁ ద్రవ్వెనొ ! నాభిగర్తమును గుండ్లు పడన్. 156

అధర రసామృ తాప్తికౌఅకై పయనించిన రోమరేఖికా
మధుకరపంక్తియంబ ! పథమధ్యమునన్ ద్వ దురోజయుగ్మపుణ
కుధరయుగంబు యానమునకున్ బ్రతిరోధకమౌటఁ గాంచి యె
వ్విధమున నైన దాఁటుటకుఁ బెద్దగ నిత్య ముపాయ మారయున్.

మేఖలా రత్నపంక్తి సమీపమందు
భవ దుదర రోమరాజి శోభను వహించు
నంబ ! అంగారరాశిముం దవతరించు
శక్రమణినీల ధూమప్రసార మట్లు 158

అది నిశ్రేణికయా ! యురోజ గురు దుర్గారోహణార్థమ్ము నీ
హృదయాధీశ్వరు దృష్ట్వయమ్మునకుఁ, గాదే నంబ ! రత్యంగనా
హృదయధీశ్వరుచేఁ గృపాణికయ ! యేదే నొక్క లావణ్య ల
క్ష్మిదియౌ వేణికయా ! త్వదీయ రుచిరశ్రీ రోమరేఖాళియా ! 159

ఆతం డాత్మజుఁడౌను నీ. కయిన నౌరా ! యెంత దుర్మార్గుఁ డా
చేతోజాతుఁడు, తానుగాక మఱి పంచేషుప్రథాప్రాప్తిలో
నీతం డొక్కఁడ యంచు నొంచు జనకుణ: నీ గర్భమం దొందెఁ ద
త్తాతద్రోహిను తాప్త దుర్యశము మాతా ! రోమరాజీమిషణ, 160

జననిరో ! జీవనార్థము ఝషాంకుఁడు పొక్కిలినూయి నేరి నీ
తనువున, రోమరాజియను త్రాటఁ బయోజనువర్ణ కుంభముల్
దనరిచి, నూయి లోఁతగుటఁ ద్రాడటు నందమిఁ బారవైచి నాఁ
డెనయదు దాహశాంతి శ్రమియించినఁ బాపము శంబరారికిన్. 161

యౌవన పురోధ రతిసవ మ్మాచరింప
వేదియగు నాభిగర్తయుతోదరమున
పాఁతె రోమలతాఖ్య యూపమ్ము, నింక
జనని ! నీ స్తనయుగమె చషాల మగును. 162

శ్రీ లొలికించు సుందర వళీత్రయ తుంగతరంగ నాట్యసం
చాలనదీప్తితో, హృదయ సంగత హారమణీ తళత్త ళో
ద్వేలిత కాంతిసంప దురుఫేనముతో భవదీయ గర్భ రో
మాళి కళిందకన్యయయి యంబ ! ననున్ జరితార్థుఁ జేయుతన్.

స్తనగిరుల హారకాంతి దుగ్ధాబ్ధిలోన
జనని ! త్వద్గర్భమను వటచ్ఛదముపైనిఁ
జొక్కు రోమావళీ శ్యామసుందరుండు
తనకు నుపధానములు వళిత్రయముగాఁగ. 164

అంబ ! నాభీసరోరుహ ప్రాంతమందు
నారికేళాగ మగుచు నూగారు దనరుఁ
దద్దురిమాగ్రంబునన్ హరిద్రాభ నలరు
ఫలయుగమ్మగ నీ స్తనద్వయము వెలయు. 165

కమలభవుండు లోఁతు నధికమ్మగ నీదగు నాభికూపమున్
శ్రమపడి త్రవ్వి త్రవ్వి యొకసారి యొకింత శ్రమమ్ముఁ దీఱగా
నిముసము విశ్రమింప జననీ ! యెటకో యతఁ డేగ నెంచి కూ
పముదఱిని ల్విడుఁడు గునప, మ్మదె నీ నవరోమరాజి యా. 166

ఏత్తులందుండి దిగఁబారు తెల్ల నదులు
తెల్లమగుఁ, దల్లి ! యది యింక కల్ల; నీదు
నాభిగర్తమ్మునుండి స్తనాచలమ్ము
లెక్కు నీ రోమలతికా కళిందకన్య.

ఆరాటంపడి తండ్రినాభికమలంబం దున్న దాయాదుఁడౌ
నారాజీవజుఁ గాంచి తా నతని కెచ్చై యుండగా నంబ ! చె
న్నారెన్; నాభిసరస్స్థలోమలతికా నాళాగ్ర జాగ్ర ద్భవత్
స్ఫా రోరోజ సరోజకోశ యుగ మధ్యాసించి మారుం డటన్. 168

అఖిలజగదంబ ! లోకత్రియంబునకును
జీవనాధారములుగాఁ దావకీన
నాభికూపనిపానమునన్ ద్వదీయ
వళులు మూఁడును స్వర్ణసోపానములగు. 169

జగముల జయించి యంగజచక్రవర్తి
జనని ! రోమావళీ జయస్తంభముగను
పాఁతె నీ మెయి, ఓగువను గీఁతలిడిన
జితభువనసంఖ్య యన వళిత్రితయ మమరు.

జనని ! నీ నాభిసరసిలో స్నానమాడి
రతిపతిప్రీతి పూనెఁ బాలాశదండ
మదియ త్వ ద్రోమరాజి, త దంతికమున
దర్భమయకూర్చమటు వళిత్రియముఁ దనరు.

యౌవనారామ వృద్ధికై యంగజుండు
రోమరాజిని జనని ! యేతాముఁ జేసి
పాదవిన్యాసమునకు సోపానములుగ
బొడ్డుబావిదరి౯వళుల్ మూఁడు నిలిపె. 172

నీదు నాభీసరో నిమ్న నిర్ణయంబు
సలుప నీ విభు నేత్రిరుషంబు లంబ !
పూని విఫలంబులగు, నందు లీనమగుట
మధురిపుని ధీర రసపూర్ణ మానసంబె. 173

సజ్జఘన కరిగిరి సమాశ్రియముఁ గొన్న
కాంచి పంచాయుధస్వామికాఁపురమ్మొ,
నాభియ యనంతసరసియో, నారు దనరు
నంబ ! వళిధిష్ణ్యమగు ధ్వజస్తంభ మగుచు. 174

పులినము జఘన మ్మగు, శై
వల మగుఁ గేశములు, మీలు పతినేత్రంబుల్,
జలధిజ ! నీ మెయి యందమె
జననిధి; యావర్తమై యెసఁగు నాభి యటన్. 175

వేష్ట మొనరించి త్వన్మధ్యయష్టి నంబ !
రశన యను పాము నాభీబిలమ్ము పొంతఁ
బండుకొనియుండు, నది యపూర్వమగు భుజగ
మనఁగ నగు, మేను మణిమయ మ్మగుటఁ జేసి. 176

అంబ ! మధ్యాత్మ శబ్దగు ణాంతికమున
నేర్చుకొన్నట్టి శబ్దముల్ నీదు రశన
విభుని కర్ణాభ్రమున విన్చి ప్రీతిఁ గొలుపు,
శిష్యవాక్కులు గురుని రంజించుఁగాదె. 177

అంబ ! రతితంత్రముల రహస్యములు కింకి
ణీగతులఁ దెల్పు నీ రశనాగుణంబు,
రశన గా దది రతినాథు రసనగాని
శ స విభేదంబు లేఖక స్ఖలన మగును. 178

మధ్యమాశ్రయమై నిజమణుల నంబ !
సతమును బ్రశమితో త్తమస్థానమునయి
యనవరతమును శ్రీపదనాదరమగు
నీదు మేఖల మే ఖల గాదె నిజము. 179

ఎన్నఁగ ననంత పాణినిహితము గాన
తావక సువర్ణ సహిత సూత్రము సుమధ్య
వృద్ధిగుణముల శోభా సమృద్ధి నెనసి
ప్రకృతిశోభనమయి సుశబ్దములఁ దెలుపు. 180

శ్రుతిమంజు నాదయుతమై
సతతము సవలగ్ననాభిజఘనద్యుతివి
స్తృతమై యనంతసరసి దృ
గతిహితమై కాంచి కాంచియట్లు సెలంగున్. 181

ముక్తిపద మని కాంచిని బుధు లనుదురు
అంబ ! త్వత్కాంచి యిది యేమి యద్భుతంబొ
హేతువగు ముక్తికిని తార్క్ష్యకేతు,వట్టి
కాంతుమనమునకే బంధకారణ మగు. 182

కాంచిని వసించు సద్రత్నగణము జనని !
తనరు నఖజాతదీప్తిమంతంబుగాగ
వరదరాజవిరాజకృపాంకురములు
సంచరించుట కచట నాశ్చర్యమున్నె ? 183

అల్పమునకంటె నల్పమై యంబ ! నీ వ
లగ్న మంబరమగుట నర్థమున, లగ్న
వాస మంబరమగుట శబ్దమునఁ, గాంచి
కాదె కాంచీమిషన్ దటిద్గణ మట నగు. 184

వైభవ మ్మదిమ స్తవివాద మగు, న
నైంద్రియకతవిప్రతిపన్న మగును, గాన
నత్యపదమును నణువును నైన నడుము
కన్న నంబరమవరమౌఁ గద ! మదంబ ! 185

అంబ ! యణువయ్యు ! నీ వలగ్నంబు దాల్చె
స్తనగిరుల, నంబరమును,గాంచిని సతంబు;
ధారణి సమస్తమునకు నాధారభూత
మణువెకాదొకో ! నైయాయికానుసరణి. 186

కార్శ్యమును గాంచి నేత్రి మేక మిడ నీవు,
చిన్ను మించంగఁ బతి యిడ నేత్రయుగము,
కటి త్రినేత్రత్వమునుగనెఁ; గాని,యంబ!
శంబరారికి సంపదాస్పద మదెట్లు? 187

హరిపదారవింద మని కాదె నీ కటిన్
సంతసమ్ముతోడ సంతతమ్ము
నేత్ర మొకటి నీవు నిలిపియె యుంతువు
తల్లి! నిఖిలపతివ్రతామతల్లి! 188

కన్నులు సుదూరవస్తులన్ గాననట్లు
కనవు సవిధవస్తులను నంజనముఁ గొన్న,
కాన నేత్రినితాంత యోగమునఁగూడ
గానచాక్షష మగుట యుక్తంబ యంబ! 189

అంబ! అత్యల్పభావాశ్రయంబు నడుము
కావునసె యది హరికటాక్షవిషయమె
యయ్యె, నందున అతులకల్యాణగుణస
మంచితమ్మయ్యు బంధనప్రాప్తిఁ బడసె. 190

తత్పురాశన ప్రధన నిదానతను,మ
దంబ! రుచి రోరు రంభా సమాత్తనేత్ర
యుక్తత, నిఁక నుపేంద్రి మోదోత్సవతను
గ్రోలు, నీ వలగ్నము బలఘ్నసమము. 191

పరమమ్మై యాదిమంబయి వరలు నీ వ
లగ్నమును మధ్యమం బని వ్రాసి యంబ!
మధ్యమత్వంబు నందెఁ బామరుఁ డమరుఁడు
తక్కువగ నౌరునిఁగనఁ దానెక్కువగు నె! 192

పాఠాంతరము :-

అంబ! పరమాణువుల నాదిమంబు నీ వ
లగ్నమును మధ్యమంబని వ్రాసి కోశ
కరుఁడు మధ్యముఁ డయ్యెఁ బామరుఁ డమరుఁడు;
తక్కువగనౌరుఁగనినఁ దా నెక్కువగు నె!

కాంచీగత శ్రుతి మంజు స
మంచితశబ్దముల మాధ్యమకక్రమము, నిరా
సాంచితమయ్యె జనని! విడ
దించుకయును శూన్యవాద మిది చిత్రమ్మౌ. 193

సరిగఁ బ్రత్యక్షమునకు గోచరముగాదు;
తల్లి! స్మృతిజన్మమూలభూతమగుకతనఁ,
ద త్పర స్తన గౌరవ దర్శనమున
మధ్యమ మ్మది యనుమేయమాత్ర మగును. 194

స్వాదు మకరంద సదృశమౌ నీదు పలుకు
పౌలు పొకపెకాదు పంచమభూత మంబ!
సరస మణిమేఖలా రణ చ్ఛబ్దగుణ స
ముజ్జ్వలము కౌనుఁ బంచమభూత మౌను. 195

వరజఘనము ప్రబుద్ధదీప్త మగు గురువు
జననిరో! పళ్ళిబలాగమంబును హసించు
చుండ, నంతేవసన్మధ్యముండు శూన్య
వాదముఁ బరించుఁ; దగు శిష్యవర్తనంబు. 196

మకరధ్వజసింహాసన
మొకొ భూషణదీప్తిసింధుపులినమొకో తా
వక యౌవన మదగజ మ
స్తకమొకొ యనిపించు నీదు జఘనము జననీ! 197

త్వ జ్జఘన మంబ! హ స్తిమ స్తకము గాన
నచ్యుతుఁడు క్షతు లిడినఁ గామాంకుశమునఁ,
ద ద్ద్విరదమ స్తమున కధస్స్నములుగాగ
నూరుమిష రెండు తుండము లుంట వింత! 198

జనని! తావక భ వ్యోరుసంపదలను
కరి కరస్థ మొనర్పఁగాఁ గాంక్షసేసెఁ,
గదళి యదె కోరఁ గరి దాని మొదలుఁ గూల్చె;
నొకటె యిరువురఁ గోరఁ బో రాదవుఁ గాదె! 199

అంబ! శ్రీహరి యిడు పళ్ళిమదావహములు
నైకవిధ నేత్రిసంపదల్ స్వీకరించి
జఘనము శుభోరురంభాప్రశస్తి నంది
అత్యుదారత స్వర్గమ్ము నపహసించు. 200

కరి కరమ్మును గరభమ్ము సరిసమమ్ము
లందురు త్వదూరువుల కంచు మందు లంబ!
హెచ్చుతగ్గుగ వర్ణంబు లెనసి తాము
తమకె సరిగాని వవి యూరుసమము లగునె! 201

కరికర కదళీ కరభము
లురువు లగుఁగాంతి, వాని యున్నతికంటెన్
మఱి ముఖ్యవర్ణ దైర్ఘ్యము
నొరయుట నీ సక్థు లంబ! యూరువు లయ్యెన్. 202

తావ కోరులక్ష్మిఁ దన కరస్థముఁ జేయ
దంతి మధుపతతికి దానము లిడు,
నైన దాని కంబ! యమర దభీష్టంబు
కడు నపాత్రదాన మిడునె ఫలము! 203

కరికరము లో నసారము
మఱి వెలిఁ గర్కశము పైని మలినము నగుటన్
సరిపోదు నీదు తొడలకు;
కరియేసరికాదు, జనని! కరభముసరియా! 204

కవితతికి నీదు జంఘాయుగమ్ము స్మరుని
శరధులం బోల్పఁ దగునె! దాశరథిపత్ని!
నిరతమును వెనుకనె యుండు శరధు లెట్లు
ముందునకు వచ్చి జంఘలం బోలఁగలవు! 205

కాహళమ్ములు శతములు కలిసి కాని
శరధులు సహస్రసంఖ్యల నొంసి కాని
కమల! నీ జంఘలకు సాటిఁ గాంచలేవు,
కనఁగలరొ నూర్గు రంధులు కలిసియున్న! 206

అంబరో! జంఘాసుషమా
స్వంబు హరించుటనెగా ప్రభంజన కృత ఘా
తంబుల నుచ్చై ర్నినదము
లం బలుముఖములుగఁ గాహళంబు లొనర్చున్ ! 207

అంగజు నిషంగముల జంట యనెడు శంకఁ
గలుగఁజేయును నీదు జంఘాద్వయమ్ము
పాదమిషతోడ నంగజుబాణమైన
యంబుజం బంబ! యచటఁ బ్రత్యక్ష మగుట. 208

సుందరమును మునిభావేం
దిందిరమును నిందిరాంబ! దివ్యవధూహ్మా
న్మందిరమును నానంద సు
ధం దిరమును నైన నీ పదాబ్జముఁ గొలుతున్. 209

ఎవనిపదములు వానికే యిచ్చెను గతి,
ఒక్కనిపదంబు లగునె వేఱొకనిగతికి ?
నీ పదంబులు మా కిచ్చు నిత్య మంబ!
అతులిత గజేంద్ర యోగ్యమౌ గతిని, భళిర! 210

మృదు నవ కిసలయ మది నీ
పదలవమై యున్నకతనఁ బాదప మయ్యెన్
సదయహృదయ! తత్పల్లవ
పదపాతకుఁ బాదపాఖ్య భావ్యమె కాదే! 211

బాల మిత్రి రాగభావ మొందుటఁజేసి
పల్లవత్వ మందెఁ ద్వత్పదములు,
బాలసఖ్య మెపుడుఁ బనికిరా దను మాట
నూరకే వచించినారె! జనని! 212

ఏ వస్తున కేగుణ, మదె
రాకలెఁగద దానిఁగూడ; రాగమధికమౌ
తావక పద మంటిన, ముని
భావమున విరాగ మొదవు బహుచిత్రమగుణా. 213

వేయిపాదము లున్న నేమాయె బాల
భానునకు, నీదు పదయుగపత్రిభకు నోడె,
సద్వసుహరుండుఁ గువలయాసౌఖ్యకరుఁడు
నయినయతనికి జయ మెట్టు లబ్బు నంబ? 214

ఇందిర! నీ పదమార్దవ
ముం దలఁచియె నీ విభుండు మును నీ పెండ్లిన్
గందునొ రక్తపుబిందులు
చిందునొ యని త్రొక్కఁజేసె శిలను మృదువుగణా. 215

శుభతరలాక్షమై శ్రితవిశుద్ధతరద్విజమౌచు నంబుజ
ప్రభ కిరవౌఁ ద్వదాస్యమును బాదము, నభ్యుదయంబు నొంది తా
నభినుతమౌ సదా హిమరుగాకృతితోడ నొకం, డిఁ కొండుదా
నభినుతమౌ సదాహిమరుగాకృతి; నింతియ భేద మంబికా! 216

అంబ! యెవ్వఁడు నీదు పాదాగ్రశోభఁ
జూచి సహియింపఁడో వానిఁ జూడఁగూడ,
దందుచేఁగా దె ధర్మశాస్త్రాధినేత
లుద్య దాదిత్యు దర్శనాయోగ్యుఁ డనిరి! 217

కాంతిమాత్రంబున నెకాదు కామితార్థ
కలనఁ ద్వత్పాదములు సురాగంబు, లివ్వి
శ్రీరుచి నెకాదు త్రిజగదర్చితములగుట
నంబ! యంచితపత్రజాతంబు లయ్యె. 218

ఉరమునందున నే శుభచరణము లవి
సక్తమైన యలక్తవశమున హరికి
నిలుపు నుచ్చైఃపదత్వ, మా నీ పదంబు
లజభవమహేంద్రవినుత! మా కగుత దిక్కు. 219

ఉపేంద్రవజ్రవృత్తము

ఉదారసందేహము నొంది రాగం
బుదారసందేహము లూడ్చెడిన్; నీ
పదారవిందమ్ములు పద్మసద్మా!
సదా రవిం దమ్ములఁ జాల నవ్వున్. 220

అంబ! రజస్స్ఫుర ణాపహ
రంబై మఱి నీరజ స్ఫురణ హరమై ని
త్యంబును హితహంసకమై
యింబగు నీ పదయుగంబు హృతహంసకమౌ. 221

అంబ! నీ పాదయుగ్మంబు నంటి మెలఁగు
హంసకయుగంబు మంజులాత్యంతసుభగ
మధురకూజితముల హరిమానసమున
స్వేచ్ఛగాసంచరించు నె వ్వేళఁ గనిన. 222

అంబ! రాజితశోభనభాశ్రితంబు
తామసహరంబు నంబుజాప్తంబు శుభక
రంబు త్వత్పదం బర్క-బింబంబె యగును
ఒకటిపాద్యంబు నొక టర్ఘ్య మొందుఁగాని. 223

అంబ! జంభారిముఖ్యసమస్తదివిజ
మస్త కానీత భవ్య ప్రశస్త కల్ప
సుమ మరం దాభిషేక సంశోభమాన
మగు భవత్పాదయుగము నా యోఁదల నగు. 224

నీ పాదప్రణిపాతమే యొక మహానిర్వేలభాగ్యమ్మ ముం,
దాపై స్వీయశిరోవతంసమునకున్ దారావియోగవ్యథా
రూ పాభాగ్యముఁ బాప, నీదు నఖతారోదారసంయోగసౌ
ఖ్యాపత్తిన్ ఘటియించె; నెంత సుకృతం బంబా! పురారాతికిన్! 225

ఘోర సంసార సాగర తారకములు
త్వ త్పదము లందు, రది యథార్థంబ యగును;
అహా! తదాశ్రిత నఖ దశ కంబ యంబ!
తారకత్వంబుఁ గనుట చిత్రింబయగును. 226

అనిశముఁ బ్రికాళ కత నంద నభిలషించి
యంబ! త్వత్పాదములను దా మాశ్రియించి
నఖము లయ్యెను తారాగణమ్ము లంత,
ఖంబు చిత్రింబుగాగ నఖంబ యయ్యె. 227

తల్లి! యమరాళికాభిమతము మరాళి
కాభిమతమగు, నఖరాంశుకాంతమగు ఖ
రాంశుకాంతము, విద్రుమలలిత మద్ది
స్వర్ద్రుమ లలిత మగును నీ చరణ యుగము. 228

చరణంబులు భవదీయము
లరు ణారుణ కిరణసమము లగుటనుగా దే
యరవిందబాంధవత్వ మ
మరి సతతము సాధుచక్రమాన్యమ్ము లగున్. 229

అంబ! పరాగము నందగ
నంబరమున రాజు జరతుఁ డగును; భవత్పా
దాంబుజములఁ బశుపతి మ
స్తంబిడఁగఁ బరాగ మంటి తరుణుండయగున్. 230

అద్ది యుక్తమె యగుఁ ద్వత్పదాశ్రితుండు
జనని విప దాశ్రితుండు కా డనుట; కాని
త్వత్పదపరాగమును మౌళిఁ దాల్చునాతఁ
డనయ మపరాగమును బొందు టద్భుతంబు: 231

అంబరో! శుభావహమ్ము సురాదిమాన్య
మగుచు విధుతోపసర్గంబు నంది చారు
వర్ణమగు త్వత్పదమును జపమ్మెఁ బూజ
నెఱప నరమాపదాకృతి నెట్టివేయు. 232

రాగదము లని దేనిపరాగములను
మస్తమునఁ దాల్చు లోకసమస్తవిభుఁడు,
నీదు పాదము నబ్జ త్రపాదము నిఁక
భజన మొనరింతు నెడల నా వృజినభరము. 233

తల్లి! నీ పాదపంకజద్వయము నెవ్వఁ
డాశ్రయించునొ యతఁ డాశ్రితాళి కెపుడు
ద్విపదవిభుఁడగుఁ, ద్వత్పదవిముఖుఁడైన
వాఁడు చిత్రమ్ముగను జతుష్పదుఁడగు నిల. 234

పదముల యొఱుపు నిస
గ్గోపనతం బందు రంబ! యొరు, లయ్యది నే
నాపూర్ణ రాగ హరిహృద
యోపాం తాశ్రాంత వర్ణ నోదిత మందుజా. 235

రమరొ? పరమకరావళిరమ్య వగుచు
సుబహూరాగధరాధరశోభ వగుచు
హంసహారిగతిక వగు చలరుచుందు
వీవు స్వపితృ పితృపర్షిసూవిధములొప్ప. 236

# లక్ష్మీసహస్రకావ్యము

## శృంగార స్తబకము

శేషశైలేశవసతి విశ్వేశ్వరసతి
ప్రబలశృంగారరససకలస్వరూప
అననుమేయమహామహిమానుభావ
దుగ్ధపాథోధిదుహిత మాదు హిత మిడుత. 1

చిరకాలమునుండి జనని !
స్మరసౌరభచేష్టితముల మరగించియు నీ
వరు నిత్యనూత్నకళలను
గరఁగింతువు విస్మయంబుఁ గలిగింతు వహో ! 2

నీవీక్షణకౌటిల్యము
చే వేంకటవిభుని మది గ్రసితమయ్యె సదా
దేవీ ! ప్రతిఘోపఘ్నం
బౌవశ్రిత నెంతమాత్రి మది యంట దహో ! 3

కుసుమాయుధశరసుషమా
విసరమ్ములు నీకటాక్షవీక్షణము లహో!
బిసరుహావసథా వృషగిరి
వసధునకున్ సాత్వికానుభావము లొసఁగున్. 4

కలశాబ్ధిపుత్రి! శ్రుతులను
బలశాసనముఖ్యదేవపతిగణములచేఁ
బలుమఱు వేడఁగఁబడు హరి
పొలయలుకల నొక్క వచనమును వినువేఁడున్. 5

స్తంభమునందు నృహరి మును
సంభవుఁడై యుంటఁజేసి చతురత నీకున్
స్తంభంబు పుట్టునట్లుగ
నంభోరుహనిలయ! కూర్చు నంగజకళలన్. 6

మెలమెల్లగ నుచ్చైర
స్థలిఁ దాఁ గనుచుండఁగానె తననేత్రములన్
బలిమి హరించితి వని హరి
లలి భవదంబరము నంబ! రమ! లాగు రతిన్. 7

అమ్మరో! కుచేలసక్తుఁడైనట్టి హరికిఁ
జెలిమి నీ చేలమిడవెయాచింప రతిని
ఓహో! నీ దానరతిఁ బ్రమదోరుగుణముఁ
గని మహానందమునఁ దేలుఁగాదె విభుఁడు! 8

తొలిరతివేళ శయ్యకుఁ గుదుర్కొన లాగ విభుండు, నీవు చే
తుల విదలింప గాజులరుతుల్ ఘలుఘల్ రుతులీనఁగా వినఁ
వెలుపలఁ గాచి నీసఖులు, నిన్ బ్రియుఁ డంటినయంతఁ బొంగి మై
వలమయి, గాజులన్ బిగువువాఱగ వంచితలైరి తల్లిరో ! 9

రతిభంగ్యంతరమందు నీదు కచభారాకర్షముం జేయ నీ
పతి నో తల్లి ! మరుండు మాతృపరసేవాసక్తి మైఁ దత్కచా
హృతినిం జూడగ నోడి రోసమున వర్షించెన్ శరాసారమున్
పతిపైఁ ద్వత్కబరీ గల త్సుమగణ వ్యాజమ్మ రాజిల్లఁగన్. 10

ఆఖ్యచేత మహాస్నుచే నంబ ! యరయఁ
ద్వ త్పయోధరములు పయో ధరము, లవ్వి
హారికరస్పర్శమృదితము లగుచుఁ గురియు
హారమౌక్తిక సుమ పయఃపూరములను. 11

సరభసమగు పతిబాహా
పరిరంభణమునకు నుబ్బి భవదీయపయో
ధరములు కంచుకబంధము
విరియించి ఘటించుఁగాదె వేడుక పతికిఁ. 12

మధ్యదేశమ్మునకు ఖేద మందఁజేయఁ
జక్రసంపద నణఁచు నం చంబ ! నీర్ష్యఁ
బతిభవత్కుచ భూమిభృద్ద్వయము నతను
రణమునందు మర్దించుఁ గరద్వయమున. 13

హారి ఖర నఖర క్షతములఁ,
గరనిర్దయమర్దనముల ఘనతర బాధా
కరముల, సహియించి క్షమా
ధరతను వహియించె నీదు స్తనయుగ మంబా ! 14

తమకు వియోగముం గొలుపు తత్కమలారికిఁ జక్రవాకయు
గ్మము భయమంది నీ కుచసమాకృతి నొంది సుఖింపఁ దల్లి ! త
త్కమలవిరోధి నీ పతినఖాకృతిఁ గాంచి యిడున్ క్షతమ్ములన్;
కుమతులు జన్మజన్మములకున్ విడనేరరు పూర్వవైరముల్. 15

కరములందున్న శంఖచక్రముల వీడి
త్వ త్కుచద్వయి నిరుకేలఁ దల్లి ! యొకట
త్వ ద్గళముఁ బట్టు, నతనుయుద్ధమునను విడ
జాలఁడనిపించు హరి శంఖచక్రములను. 16

నీవిభుఁడు నీ యపూర్వ పాణిగ్రహమున
విజనగృహమందు మదనాగ్ని వెలయ, జనని !
పరిమృదిత స్తన లోల హార ప్రకీర్ణ
మౌక్తికమ్ముల లాజహోమమ్ముఁ జేసె. 17

పంచాయుధముల విడి కర
సంచారము నీదు మేన సాగించుచుఁ ద
త్పంచాయుధాజి నడిపెఁ బ్ర
పంచాతీతుండు శౌరి బళిరే ! జననీ ! 18

సుమశరున కోడి యతనుయుద్ధమున శౌరి
యంబ! తనశంఖచక్రముఖ్యాయుధముల
సంగమును వీడి, వీడఁ డుత్తుంగమైన
చాపలతమాత్రి; మిద్ది యాశ్చర్యమగును.

నృహరిబిగికౌఁగిలింతల, విహితకుచవి
మర్దనంబుల నీ హారమౌక్తికములు
నలిగి పొడియయి ఘర్మాంబువులను గలిసి
అంబ! చందననిర్విశేషంబ యగును.

మధురమధ్వార్త్తకరి మాయమాటలాడి
వశపఱుప నంత నంగముల్ ద్వైత మెడల
నంబ! నిర్గుణమగును ముక్తాళి, హరణ
మొందునంతఃకరణము, నానంద మందు.

మధురరతికేళియందసమస్తనాగ
నాయకనిబంధనశ్రమ నందునప్పు
డంబ! ప్రియతమ పాణినియంత్రణమున
గల్గును సుశబ్దములు నీదు గళమునుండి.

జలధర శంపాలతలం
బలె మీరలు మెలఁగ, నతనుమహితాశుగసం
కలితశ్రమజలవృష్టులు
గలుగుట యుక్తంబ, వింతకా దిది యంబా!

ఊనర చంచలగుణములంబయోధిజనులు
లులితు లతాగ్రసముక్తావలులునునైన
రాజకరగ నానాహారరాశులం బ్రి
కంపనముఁ గల్గె నతనుసంగరములందు. 24

ఉపవనిన్ నిన్ను మాధవుఁ డొంద జననీ!
చంప కామోద మాత్రరిశ్వమ్ము లొలసె
నంబుజంబున నలికుల మావరించె
తగునివి; కదంబకోరకోదయమె వింత. 25

బలిమి నగు గ్రస్త మరుణబింబంబు, క్రింద
రాలె నుడురాజి మేరుశిరంబునుండి,
తిమరవృతిఁ జంద్రుఁ డంబ! యాక్రమితుఁ డయ్యెఁ,
ద్వత్పతియు నీవు ద్వంద్వయుద్ధంబు సలుప. 26

నీ కేవిధమగు శ్రమయున్
గాకుండఁగఁ జేయనెంచినను విభునాశ్లే
షాకలితలైన పులకలు
దాఁకి కడున్ జనని! నీదు తను వెరియించున్. 27

వివిధవిధమ్ముల మన్మధ
సవ మొనరించెదవు పతికి సంతోషముగాన్
చివరికి ఘర్మాంబువులను
నవుఁగదె మీ కంబ! అవభృథాభిషవంబుల్. 28

సురతాంతమ్మునఁ దల్లి ! నాథుని యురస్సున్ ఫాలముం జేర్చి నీ
వు రతాయాసము వోవ నిద్రిఁ గొనునప్డున్ నీలలాటాంతర
స్ఫురితమ్మౌ శ్రమజాత ఘర్మసలిల స్రోతస్సుచే జాఱి క
స్తురిబొట్టా యురమందు నంటుకొను నచ్చోవేఱ శ్రీవత్సమై. 29

ఇంపుగ రహస్యమున నుపాసింపహారిని
అంబ ! యధరంబు నీరాగ మయ్యె, నీదు
నయనయుగము నిరంజన మయిన, దింక
కేశపాశంబు బంధముక్తిని భజించె. 30

వారికేళి, విభుఁడు పైకిఁ గన్పడకుండ
గ్రుచ్చి నఖము లంబ ! కుచములందు
మత్స్యకార్య మంచు మదినెంచి భీతితోఁ
గొంతు బిగిగఁ గౌఁగిలింతు వీవు. 32

అలికవలితములుగనై శ్యామలములునై
యలక లొలయ, నీదు నాస్య మేదొ
అలికబళిత శైవ లాఢ్య పద్మం బేదొ
వరుఁడు వారికేళి నెఱుఁగఁ డంబ ! 33

శుకపికశారికా ముఖర సుందరమై ఫలపుష్పసౌరభ
ప్రకరసుఖావహమ్మయి శుభప్రదమై సకలర్తుపూర్ణమై
ప్రకృతిమనోహరమ్మగుతెఱంగుగ శేషగిరిం బొనర్చి తా
వక విభుఁ డంబ ! తేల్చు నిను పావన మంజు నికుంజభూములన్.

మనసిజ గుణ టంకృతులను
ననుకరణ మొనర్చునట్టి యళిఝుంకృతు లొం
దిన వనములు సఫలంబులు
జననీ ! వృషగిరిని మీదుసంచారములన్. 35

చందనవని జననీ ! హరి
పొందఁగ నిను మెఱుపుతోడి మొయి లను భ్రమ లో
నందుచు నాడెను నెమిళులు
కందరములఁ బాము లెడయఁ గరువలి మురియన్. 36

కని ముకుళము లుడు లని నిను
వనజాక్షుఁడు గలియు రాత్రి వడెనని జననీ !
దినకరకిరణము లొలయని
ఘనవని నళు లొలసి యంధకారముఁ గొలుపన్. 37

దాసుఁడై నీదు పతిపేరుఁ దాల్చియున్న
మాధవుఁడు మాధవునకు సంబరముఁగొలుప
హరికిఁ బొలయల్కఁ బెడమొగంబైన నిన్నుఁ
గొట్టు మని యంగజున కిచ్చెఁ గుసుమశరము. 38

కమ్మని కేశగంధ మతిగా గళదప్పుముఁ గ్రోల నెంచి ఝుం
ఝుమ్మని కామమంత్రముల షట్పది పాడుచు రొప్ప భర్తృవ
క్షమ్మ నయాచితమ్ముగనె సత్వర మీవు గవుంగలింతు వో
యమ్మ ! హరిప్రసాదమున కయ్యళి యెంతగఁ బాత్ర మయ్యెనో.

ఉరగశైలమ్మునందెల్లఁ దిరిగి తిరిగి
అంబ ! వనభూములకు నెల్ల నరిగి యరిగి
ఇంపు లొలికెడి పూ లెల్ల నేర్చి యేర్చి
నీకుఁ బతి కూర్చు మూర్ధాభిషేకమహము. 40

అనిశమును బుష్పవతులైన యట్టి లతల
యందు రాగమ్ముఁ గను పల్లవాళిఁ దెచ్చి
శ్రుతిశిరమ్ముల సుమనోఽనుగతినిఁ గూర్చి
అధిక మామోదమును గూర్చు నంబ ! విభుఁడు. 41

చెమట దోఁగాడుచేత నీ చిత్త విభుఁడు
తిలకమును దీర్ప నీకు సంతృప్తికొఱకు,
వారి దిగఁజాటి యస్థానపతితమగుట
నద్ది హసియింతు వద్దమం దరసి జనని ! 42

శేషశైలమందు జీమూతముల దూరి
కేళి మేను మేళగింప శౌరి,
వెదుక నరిగి నీవు విద్యుల్లతగ నుండఁ
బోల్చలేక మోసపోయె నతఁడె. 43

బాల ! నాపైఁ గోపిధమేల ! యందీయంగఁ
దగవె చేతికిఁ బయోధరము లీవు
అవ్వి వర్షర్తువునందె యందెడుఁ గాన
యాచింపు మవసరమైన దానిఁ

ప్రాధేయపడి నిన్నుఁ బ్రార్థింతు మది నెంతొ
        రుచిగ నాశ్లేషాభిరుచి నొసఁగవె
శశిఁ గాను నేను తత్స్వస నౌదు నాతని
        నడుగు మాతఁడు దాని కగువిభుండు

    హాస్యములకేమి ? యధరమ్మునడుగుచుంటి
    నధరయాచన యేల? మే లర్థికిడునె !
    పతియడుగఁ జతురగతితో బదులుసెప్పి
    దేవు నలరించు శ్రీదేవి దిక్కు మాకు. 44

అంబ ! పరిహాసమునకు నీ ప్రాణవిభుఁడు
వెనుక వెనుకనె వచ్చి నీ కనులు మూసి
చేరలకు మించి కన్ను లొప్పారియుంటఁ
బూర్తిగా మూయఁజాలక పొందె లజ్జ. 45

జనని ! మృగజాలదృగ్వ్యగ జాడ్యకర గు
ణాద్భుత మహానుభావ మైనట్టి గొప్ప
వాగురముగాదె యల్ల నీ వాలుఁజూపు
లందులోఁ జిక్కి హరిణమై హరియు నహహా ! 46

సదమలములు మదనసంపదలగు నీదు
నవ్వువెన్నెలలను నాథుచిత్త
మెంతకరినమయ్యు నింత సోకిన నంబ !
కరఁగిపోవుఁ, జంద్ర కాంతమట్లు. 47

శైలఘనమైన నీ కుచమూల మంటి
తాను గోవర్ధనాచలధారి యగుట
జ్ఞప్తికిన్ రాఁగ మునుపటిసంగతులకు
నవ్వుకొనుచుండు నపుడప్డు నాథుఁ డంబ!

వల్లి తమాలము, విద్యు
ద్వల్లి ఘనము, నిందుకళ; నభమ్మును, దీపం
బెల్ల హరిమ్మణిగృహము నటు
లుల్లసిలంజేయు దీవు నొడయుని జననీ!

అతనుతరు పల్లవంబులు,
పతిమానసభృంగ కుసుమపటలము, లంబా!
కృత హరితపఃఫలమ్ములు,
క్షితిఁ బొగడగఁదగునె నీదుశృంగారంబుల్!

# లక్ష్మీసహస్రకావ్యము

## ఐశ్వర్య స్తబకము

విశ్వంభర తుల్య సమ
స్తైశ్వర్యగ బ్రహ్మవేత్త లందు రెవతె నా
విశ్వజగజ్జనని నే
విశ్వాసము నుంచి శరణు వేఁడెద నెదలోన్. 1

మిత్రావరుణాదీష్టులఁ
బాత్రత యిర్వురకు సరిగఁ బరగినటు జగ
న్నేతృత హరికిని నీ కే
మాత్రము కొఱవడక సరిసమం బగు జననీ! 2

సర్వులలో శ్రేష్ఠత మీ
యిర్వురకు సమాన మైన నిఁక మీలోనన్
పూర్వాపరగణనంబున
పూర్వాధిక్యంబు హరికె పూన్చెద వంబా! 3

పాఠాంతరము :—

అరయ మీదు జంట నవిశేషమ యగు న
శేష శేషి భావ చింతనమున
నైన, నిర్వురందు నధిపతి నీ కౌట
శేషి శౌరి, నీవు శేష మంబ !

సమములే యిర్వురకు విశేషణము,లైనఁ
జేరె గుణమునఁ బతికి విశేష మంబ !
ప్రాజ్ఞులగువారు నీకుఁ బ్రత్యక్త్వ మొప్పి
గుణములఁ బరాక్త్వ మొప్పి వాకొనిరిగాదె ! 4

ఆ యచ్యుతుండు సంసా
రాయత కృశసుజన రక్షకై దీక్షితుఁడై
సేయును రక్షాయజ్ఞము
నీ యన్వారంభ మొంది నిత్యము జననీ ! 5

వ్యాసవిభక్త వేదము ప్రపంచమునంతకు విష్ణుపత్నిగా
శాసనకర్త్రి వీ వనుచుఁ జాటెను దానికినేమిలే, స్వయం
శాసనకర్త్రి వీవె యని చాటెను విష్ణుపురాణమందు నా
వ్యాసువితాత, యిద్ది విలువైనప్రమాణముగాదె యంబికా! 6

పతితలమీఁజి యెంత ప్రీతిభాగుణమున్నను, భార్య భర్త కే
గతి నపకర్షఁ గూర్చుటది గాఁదగదంచుఁ బరాశరుండు దం
పతులగుమీర లొక్కటిగ వ్యాప్తినొనర్తురనెన్ మదంబికా !
పతివిడి నీకె వ్యాప్తినిడి పల్కెడునజ్ఞులఁ ద్రోసివైచెగా. 7

వాగతీత మహాప్రభావమునఁ జేర్చి
భక్తులకుఁ గన్నుఁ దెఱపించి ముక్తిఁగూర్చి
పారిజాతంబుగా వేదవనమునందు
వరలు 'శ్రీసూక్త' మిదుత శుభమ్ము మాకు. 8

సతివిడి పతి కెయ్యెడలన్
కర్తుక ర్తృత్వంబు జనని ! కాదు కనుకనే
యితరేతరసంసక్త
స్థితితో నైశ్వర్య మెపుడు నెలఁగెడు మీకున్. 9

"అతనిఁ గూడి జగము లాపెయే సృజియించె
నయిన పేరుమాత్ర మతనికయ్యె
నతఁడు నాపె యొకటె" యనినరామాయణం
బంబ ! సర్వసమ్మతంబ గాదె. 10

నీకును బతికిని భేదము
లేకయె భువి వ్యాప్తి తుల్యరీతిగ జననీ !
వాకొను శ్రుతి శ్రుత్యంతము
లేకగ్రీవముగ నెఱుఁగలే రిది యజ్ఞుల్. 11

నీ పతి సర్వాత్మగనే
వ్యాపితుఁడగు, నీవు జ్ఞానపద్ధతి దనరన్
వ్యాపిత,వను వాదమునకుఁ
బ్రాపెయ్యది ? యది యశీకవాదము జననీ ! 12

వేద వేదాంత సమ్యగు పాదితమగు
నీదు వైభవము నెఱుంగ నేర్చునెవ్వఁ
డాతని కిడి వైభవము దయార్ద్రచిత్త
వై, భవముఁ బాయఁజేయుదు వంబ! నీవు. 13

ఒకఁడు నీకు ఘనత నొసఁగు నొక్కఁ డంబ!
హరికి ఘనత నొసఁగు; నిరువురందుఁ
బెద్ద మొదటివాఁడె. పితృమాతృపూజలఁగా
మాతృపూజ ధర్మమహితమగుట. 14

భర్త భార్య యనెడి పదముల న్యూనత
భార్య కగుట, నీకుఁ బలికినారు
శేషభావ మంబ! శ్రీయుతరామాను
జార్య; లంతె కాని యధిక వీవె. 15

మినుకులు 'జగ మిర్వరచే
తను వ్యాప్తం' బనినఁ గాదు ద్వైరాజ్యం; బో
జననీ! 'అగ్నావైష్ణవ'
మని కర్మతుపే రున్న, దైవ మందొక్కఁడెయొ. 16

రామునిసీతవౌచును విరాజిలి కృష్ణుని భోజకన్యవై
వామను బ్రహ్మచారి ననపాయినివై హరిణాజినంబుగా
స్వామిని సర్వరూపపరివర్తను నచ్యుతు నచ్యుతాత్మవై
ప్రేముడిఁ గూడియుంటి వవిభిన్నలు నైక్యులు మీర లంబికా! 17

చెడ్డ విడిచి మంచి చేపట్టి యిఁకనమ్మ !
గాఢమైన నమ్మకమ్ముతోడ
నిన్నుఁ గూడియున్న నీపతిపై నాదు
భార ముంతు దురితభరముఁ ద్రెంతు. 18

ఆహా ! 'శ్రీమ ద్ధరయే
స్వాహా' యని యొకఁడుపలికి స్వాత్మార్పణగా
వ్యాహృతి నిడిన విశేషణ
మాహాత్మ్యము హరికె యొసఁగి మన్నింతువుగా. 19

కనుసన్నల భువనమ్ముల
మనిచెడి ఈశిత్రి ! లేశమాత్రాపాంగా
ర్పణ నిందాదిపదమ్ముల
నొసఁగూర్చుసవిత్రి ! శుభము లొసఁగుము మాకున్ ! 20

# లక్ష్మీసహస్రకావ్యము

## క్షాంతి స్తబకము

ఎన్ని యపరాధములఁ జేసియున్నఁగాని
నన్నుఁ జల్లగఁజూచు నా కన్నతల్లి
శ్రీమహాదేవి; క్షాంతి వి స్తృత మహమ్మ
నంగరక్షగఁ జేసి నా కహరహమ్ము.

అపరాధసహస్రమ్ముల
నెపుడును బొనరింపకుండ నే ముండినచో
నపు డంబా! నీదు క్షమా
విపులగుణమ్మునకుఁ బుట్టువే లేదుగదే!

అతిఘోరమైన దోష
ప్రతతికి నా కింక లేదు ప్రాయశ్చిత్తో
చితకర్మ, మాశ్రియింపఁగ
గతియేది? నీక్షమయె నాకు గతియగు జననీ!

క్షాంతిగుణమె మూర్తిమంతమై నీ వైతి,
వంబ! యతిశయోక్తి నరయ మిందు;
కాకయున్న యల్ల కాకాసురుఁడు నాఁడు
బ్రతికి బైటఁబడగ వలనుపడునె! 4

పాఠాంతరము :–

కండ లురలంగ రక్తంబు గండివార
నధరముం జీల్చువేళ కాకాసురుండు
కోపమే పొంద వది యేమిగుణమొ తల్లి!
పూర్తియగునట్టి క్షాంతికి మూర్తి వీవు. 4

అంబ! కావింతు మెపుడు స్వాత్మార్పణంబు
క్షమను బరపించి చేయు రక్ష మము నింక
భవసముద్రముఁ గడపి యవ్వలకుఁ జేర్చు
మాతరం బ్రహ్మ మిడ నీకు మాతరంబె! 5

విడువలే దకృత్యముఁ బొరపడియు నంబ!
కృత్యము ఘుణాక్షరన్యాయ కృతము నేని
నే నెఱుంగను, నన్ను మన్నింపకున్న
దిక్కు నా కెది! నీక్షమా దృక్కు దక్క. 6

క్షమ మాత సఖియు, శయ్యయు
క్షమాధరత్వమునఁ గనెఁ బ్రశస్తిని; నీవుఁ
క్షమకునిధి వంబ! యిఁక నెది
శ్రమ మా యాగస్సహస్రశమనమ్మనకున్?

హింసానీకపథప్రవర్తులగు మ మ్మీక్షించి మాపై గుణో
త్తంసమ్మైన భవ త్క్షమాగుణముఁ గొంత న్నిల్పి మా పాప వి
ధ్వంసమ్మున్ బొనరింపఁజేయు దన వింతం బొంద మీ మమ్ములన్
సంసారాబ్ధిఁ దరింపఁజేయు దన నాశ్చర్యంబె విశ్వప్రసూ ! 8

ఆయై ఘోరవిచిత్రదోషముల కాయై శిక్షలం జేయ దీ
క్షాయుక్తుండు భవద్విభుండు కడు రూక్షక్రోధుఁడై యుండ నిం
కే యొక్కండు మనంగలాఁడిలను దల్లీ ! స్వామి కేదో మహా
పాయావిష్కృతి నీవు క్షాంతిగుణ ముత్పాదింపకే యున్నచోన్. 9

"భక్షణ సేసినై చెద నవశ్యము నీక్షణమంద నీపయిన్
గక్షవహించి నిన్ను వెతఁ గాల్చిన యేకజటాధిరాక్షసా
జ్ఞాక్షుల నాజ్ఞ వి" మ్మనుచుఁ బ్రార్థనసేసిన మెచ్చికూడ న
య్యక్షకుమారహంత నభియాచనఁ దీర్పవుగా క్షమావతీ ! 10

అంతముకాక తప్పు దొకయప్డు మహేంద్రకుబేరశంకరా
నంత సమస్త సంపదలు నంచు నెఱింగియుఁగూడ ఘోర దు
ర్దాంత దురంత పాపపరిదర్పితచిత్తత నర్థకాముదు
శ్చింతలఁ బ్రొద్దుపుచ్చితి నిసీ ! జననీ ! క్షమియింపుమీ ననున్. 11

అజహత్యాపుఁడ నాయఘమ్ములకుఁ బ్రాయశ్చిత్తమే లేదు వే
దజగత్సర్వమునందు నెచ్చటను, మాతా ! లేదు శిక్షాస్మృతిన్
కుజనార్హంబగు శిక్ష నీవిభుఁడు నాకుం గూర్పఁగా, నింక నా
వృజినంబుల్ క్షమియించు టొక్కటె వినా యేదారియున్ లేదుగా !

అతిదురితము లొనరించుచు
హతచరితులమైన మమ్ము హరి కోపింపన్
బ్రతినిత్య మొనర్తువు నీ
వతిశాంతానునయముల మహాక్షాంతునిగన్. 13

నిరతము వాఙ్మనఃక్రియల నెన్నియొ తప్పు లొనర్చుపాపులన్
నరకములందుఁ గ్రోధుఁడయి నాధుఁడు ద్రోయఁగఁ బూన మాతరో!
'శర ' ణనినారుగా, అదియ చాలదె రక్షణసేయ, వారి సం
సరణమునుండి తేల్చు మని స్వామిని క్షాంతునిఁ జేసి ప్రోవవే !14

ఎప్పటి కప్పుడె క్రొత్తగఁ
దప్పుల నొనరించునేను ద్వత్పతి కెట్టుల్
మెప్పును గూర్తును ? నీ క్షమ
తప్ప మ తేదిక్కు నాకుఁ దనరదు జననీ! 15

రాగసాంద్రుఁడ నాదు దురాగములను
నీ యకం పానుకంపచే నెట్టివైచి
ప్రోవకుండిన నా కేది త్రోవ నీదు
నాయకు నజేయకోపంబు మాయఁజేయ! 16

రాగముతో దురాగముల రాసు లొనర్చితి స్వామికిన్, నినున్
సాగిలి మ్రొక్కుచుంటి నిఁక సర్వమునున్ క్షమియింపఁజేయుమీ
మా గుణదోషనిర్ణయవిమర్శల స్వామికి 'నాపరాధి గాఁ
గాఁగలవాఁడు పృథ్విపయిఁ గల్గఁ' డటంచును నచ్చఁజెప్పుమీ. 17

దివ్య కృష్ణోప లాల్యాకృతివి సులలిత
మేఖలాఢవు నతితరోన్మేషకటక
ధరవు వనమాలికా మహాస్థాన గతవు
నగుట నీవు క్షమాధర వగుదు వంబ! 18

హా హారణ్య హిరణ్యదానవ వపు ర్వ్యాపాటన ప్రజ్వల
త్కోపాటోప కృపీటసంభవశిఖాధూమ్రీనమున్, దేవదు
ష్ప్రాపానుగ్రహవిగ్రహాన్, నరహరి స్వామిన్ దుర్గిటిన్ శాంతుగా
నాపాదించినసీకు నెయ్యది యసాధ్యం బంబ! చేపట్టినన్? 19

సలిపినదోషసంతతికిఁ జాలిన శిక్ష లొసంగ వింతకున్
గలిగిన యెల్ల ఘోరనరకంబులుఁ జాల వటంచు భర్త పే
రలుకను బల్కు యంతనె క్షమామతియై శర ణన్ననాకు, నీ
పలుకునఁజేసి, స్వల్ప మని పల్కు వికుంఠము నేవి నీయఁగన్.

కరచరణంబులుదోడిగిన
కరుణవు, శాంతివియు, మోక్షకరవిద్యవు, నిన్
హరితోడన్ గొల్చిననరుఁ
డురువిబిడౌజున్ బిడౌజు నోర్చును జననీ! 21

'శర' ణను మాటమాత్రమున శాంతిలఁజేసితి పూర్వపాపముల్
మఱల గడించి పాపముల మాపుమటంచును వేఁడ సిగ్గుచే
నెరియుచునంటిఁ దల్లి! యిఁక నెట్లు క్షమించెదవో ననున్ పృథ
క్కారణముసేయకుండగ నకంపముగా ననుకంప యేర్పడన్. 22

ఒకపరి చాలు నిన్ శరణ మొందినచో మఱి వారి సౌఖ్యముల్
సకలము నీవ చూతు వపరాధము లెన్నియొనర్చియున్న నో
పిక వహియించి, క్షాంతిరసవృష్టిని గూర్తువు; నిన్నుఁగాక యే
యొకరుఁడు కృచ్ఛ్రసాధ్యమగు నొండొక దైవతముఁ భజించెడిన్?

ఎప్పుడు ఘోరకిల్బిషములే యొనరించిన నీక్షమావృతిన్
దప్పమటంచు మాకు దృఢధైర్యము క, ద్దిఁకఁ దద్బలమ్ముచే
నెప్పుడు మేము కృత్యముఁ ద్యజించి యకృత్యము నాచరించుచున్
దప్పులు సేయుచుంటి మనఁ దల్లి! భవత్క్షమదోషమేకదా! 24

కలిగినయట్టి యెల్ల నరకానుభవంబులఁ, బాచితంబులన్
దలఁగనియట్టి ఘోరదురితప్రతతిన్ 'శర' యన్న యొక్క మా
పలుకునఁ ద్రోతు వీవు; నిరుపాఖ్యము నిట్టి క్షమాగుణమ్ము మ
మ్ములఁ భరియింప నెవ్వలనఁ బొందితి వమ్మ! రమామహేశ్వరీ! 25

నిత్యకర్మలు చేయఁగా నేర మంబ!
ఆచమనమేని లేదు మాయందు; జ్ఞాన
వాసనయెటుండు? నీ క్షమావసతిఁ గనుట
స్వర్గ మపవర్గమును గరస్థములు మాకు. 26

చెప్పెదను సార మిఁక వేయి చెప్పనేల!
రక్షసేయుము నిన్ క్షమాభిక్ష వేఁడి
నాఁడ, నా పాపములఁగూర్చి యాడఁబోక
రక్ష యిడవమ్మ నీ దయావీక్షఁ జేర్చి. 27

మ్రింగిన దయశ్శలాక, జీర్ణింపఁజేయఁ
జాలునే దాని శంకీకషాయ మంబ!
చేసినవి ఘోరముల్, వానిఁ జెఱుప వేద
మందు మం దున్నె! నీ క్షమయందెకాక! 28

వాఙ్మనః కాయముల నవ పాపకర్మ
లెన్నొ చేసితి, నను క్షమియింపు మంబ!
ప్రకట కటకటరావ దంష్ట్రాకరాళ
భయద యమముఖ మింకఁ గన్పడకయుండ. 29

'శరణు శర' ణమ్మ! నన్ను నీ దరికిఁ జేర్చి
యహరహ మొనర్చు పాపముల్ సహనమునను
వేలకును వేలు క్షమియించి యేలుకొమ్మ!
నీ క్షమారాజ్యపీఠసన్నిధికిఁ జేర్చి. 30

# లక్ష్మీసహస్రకావ్యము

## ఉత్సవ స్తబకము

విపులముగ నుత్సవమ్ముల వెలయఁజేసి
యబ్జజాదులుఁ గొలుతు రే యంబ నట్టి
విశ్వకల్యాణదాత్రి, మా విష్ణుపత్ని
మానసోత్సాహకారణ మ్మగుత మాకు. 1

ప్రజలకుఁ గల దేహమనో
రుజలఁ దొలంగింప నెల్లప్రొద్దును నిన్నా
యజ రుద్ర మహేంద్రాదులు
భజియించెద రుత్సవముల సవముల నంబా! 2

ఈవు నీ భర్తఁగూడి యూరేగువేళఁ
గౌతుకము తన్ను వెన్నంటగా మదంబ!
ఇంటిపను లెల్ల విడి పరువెత్తె నొకతె
సంబరముఁ జూడఁగా విశ్లథాంబరమున. 3

పాఠాంతరము :-

ఈవు నీ భర్తఁగూడి యూరేఁగువేళఁ
గౌతుకము తమ్మ వెన్నంటఁగా నచటకు
నంబ! యవధూతగృహకార్య లై నయటి
పురవధూతతి త్వరఁద్వరఁ బరువులిడిరి.

చరణాభరణమణుల్ నూ
పురముల ద్రుతగతికి నంబ! పుడమిం బడఁగా
మఱి చూడ దొకతె మహామునఁ
దెరువులఁ దనయందెరవలు తెఱవలు గొనినన్. 4

గమనవేగంబునకు నడ్డు గల్గె ననుచు
నూగులాడెడుగుబ్బల కొకతె జనని!
కదలకుండంగ గట్టిగాఁ గట్టె నంత
నవసరాత్యయభయమున నవసరమున. 5

వాద్యరుతిఁ బట్టి నీ యుత్సవమున కొకతె
వడిఁ జన నగలచప్పు డవ్వాద్యరుతినిఁ
దోఁపనీకున్న గతివేగ మాఁపె జనని!
యపర యది గాంచి యపరయ యని హసించె. 6

ఉత్సవస్థల సంవీక్ష ణోత్సుకతను
నడకవేగంబు హెచ్చింప, మెడను బూల
హారములు దెగ్గిప్పఁ, గేలఁ బుష్పాంజలిగను
దాల్చి చనె నొక్క వనితామతల్లి తల్లి! 7

అంబ ! నీ యుత్సవంబును నరయుమతియె
మందగతికిని సద్గతి నొందఁజేసె
నన్న, నిత్యంబు సేవించుచున్ననాకు
దీప్రగతిఁ బ్రగతి యిఁక సిద్ధింపకున్నె? 8

మది కున్నవేగ మంబా !
బదములకే యున్న నెంత బాగుండు నటం
చదవదయై నీ యుత్సవ
పదరతితో నొకతె స్వీయపదగతిఁ దిట్టెన్. 9

తామర సోదర సోదర
ధామను నిను నుత్సవమున ధవుతోఁగని స్వ
ర్భామిని భూమిని జననీ !
కామిను లొక తృప్తిఁ గనరుగా మనములలోన్. 10

చరణాలంకృతిపరుఁడగు
వరుఁడే జాగునకు హేతు వని యొక్కతె త
చ్చరణములఁ గల్గు లత్తుక
యరుణిమఁ గనుగొనలయందె యందెను జననీ ! 11

దురితగతి జననీ ! వృషగిరి
గతులగు పతిసతుల మిమ్ముఁ గనుఁగొనఁ జనుచో
గతిరోధ మిడక స్వాగత
కృతి నెఱపెను దివిషదాళికిన్ విషదాళుల్. 12

శేషగిరిఁ జేరి యంబ ! యశేషసురలు
నగరుధూపపరీమళమ్మలమి యలమి
గప్పురపుదీపశుభకాంతి గదలి కదలి
యంబరము నంటఁ జూతురు సంబరమున. 13

నందనతరులు త్వదుత్సవ
సందర్భము నెంచి జనని ! సంతృప్తి సుమ
స్యందన మొనరుప వృషగిరి
నందువు సుమనసుల మనసు లుత్సాహపడన్. 14

అంబ ! ఆభరణాభరణాత్మ దేహ
రుచితరంగ పిశంగిత రుచిరసద్మ
వైన నినుఁ గని యనిమిషులైరి దివిజు
లుత్సవపుశోభ వపుశోభ నొకట నరసి. 15

చన రింఢ్లకు వనితలు తమ
పనిపాటుల నించుకంత భావింప రహో
నిను నుత్సవమంటపమునఁ
గనుగొని యెడలెల్లఁగనులుగను గొని జననీ ! 16

స్తనభరమును గమనత్వర
కనుకూలముగాకపోయె నని తిట్టిన య
వ్వనితయె పొగడెను నీకున్
బ్రిణతుల నతిఁ గూర్చి తోడుపడె నని జననీ ! 17

పారాంతరము :-

భక్తిభావంబుతో నుత్సవమున జనని !
నతులనొనరింప వినతయౌనపు, డొకర్తు
"తనులతనువంపగా ఘనస్తనత నీకుఁ
దోడుపడె" నంచు సైదోడుతోన పలికె.

పొంగి నిముఁ గొల్వ నుత్సవరంగమందు
సలిపి తాండవ, మందుఁ గ్రిక్కిదలగఁ దల
విమలమందాకినీశీకరములఁ జల్లి
శశిశిరుఁడు శిశిరులఁ జేసె జనుల జననిః 18

నతుఁడై హరుఁ డంబిక ! నీ
పతికిని నీ కమితభక్తిఁ బ్రణమిల్లెడిచో
క్షితిఁ దొలఁకి శీర్షగంగా
సతి పాద్యమునెఱపె నపుడు సతతోత్సుకతన్. 19

సురవనితల తలపిక్కిన
నరవనితలు జనని ! నిన్ను నాథునిఁ గనుచో
వరలిన యనిమేషతఁ ద
త్తరుణుల భేద మతె, తమరె తా మెఱుఁగ రరే! 20

మిముఁ గొలువఁగ నుత్సవమున
నమరులు మరులొంది వేంకటాద్రినివిడఁగాఁ,
దమలోకములకరుగఁగాఁ
దమలోఁ గమలా ! యొకింతఁ దలపోయరుగా! 21

కోరి సుర లసురలును నరు
లేరలు శిరములను నంజలింపరు నిన్నున్?
ఘోరమ్మగు సంసారా
పారాకూపారమునకుఁ బారముఁ గొనఁగన్? 22

అచ్చరలగణముతోడను
హెచ్చుగ నీ యుత్సవమున నృత్యము జననీ!
కచ్చలు బిగించి సలిపిరి
మచ్చిక మువిజనులు విజనమస్కృతు లిడుచున్. 23

మేధాపాధోనిధులై
వేధోనిభులైన మునులు వినుతింతురి రమా!
గాధాతతిఁ బాడుచు నిను
మాధవునిం దవుని వేదమంత్రార్థములన్. 2

స్తుతివాక్యస్తబకంబుల
నతులగుణంబులను గూర్చి యంబ మహామునన్
ప్రీతిజనుఁడును కలితాడన
గతికలితుఁడ యగుట సుగతికై నీ కిడఁదే! 25

పాఠాంతరము :-

స్తవకములను స్తబకములన్
నవగుణములఁ బ్రిజలు కూర్చినారు వృషాదిన్
భవ దారాధనమున కను
భవ దారా ధనములొంది భవకలి యెడలన్.

కన్నది యెన్నఁగ మహామునఁ
గన్నులకును గోటిరెట్లుగా నాలుకతే
యున్నఁ, దగు ననుచు వగఁగొని
ఖిన్నత శతమన్యుఁ డంబ కృశతముఁ డయ్యెన్. 26

అంబ ! చతురాననుఁడు చతురాననముల
శ్రుతులఁ బరియించి యుత్సవాగతుల కెల్ల
శ్రుతుల జడిమను బాపి త్వన్నుతు లొనర్చె
నహరహంబును హరిహరు లభినుతింప. 27

అంబ ! గరుడుండు నీ యుత్సవంబునందుఁ
బ్రబలమగురీతిగాఁ గూర్చెఁ బక్షము లను
వ్యజనముల జనముల తనువ్యథ యడంగ
గంధవహమును వేదసుగంధవహము. 28

అతులి తోత్సవ దర్శనాగతులు, శ్రుతులు
గతులుఁ దప్పక నటులతోఁ గలిసి, నటన
మొదలెఱుఁగనట్లు సలిపియు బడల రింత;
జనని ! యొసఁగునె భక్తిమిశ్రమము శ్రమముఁ 29

అహమహమిక జననీ! నీ
మహామునఁ దొలిపూజ సలుప మది నుత్సుకలై
మహిళలు చిరకాలము నట
విహరింతురి హరింతురి సకలవృజినభరమ్ముల్. 30

పారాంతరము :-

మునుకొని యహమహమికతోఁ
గనుఁగొన నిను నుత్సవమునఁ, గనుఁగొన లలరన్
జని చని కనకాంగులు మె
ల్లనఁ బాదమ్ములను దమ్ములను నంతు రహో!

దినకరుఁ జీఁకటు లెట్టులు
కనుఁగొనఁగాలేవొ యట్లె కనఁజాలవు నీ
ఘనమహమునుఁ గన నోచిన
జనునే వృజినములు, సౌఖ్యజననీ! జననీ! 31

సురల నరుల దానవపరంపరల బహుళ
పాదగతిహతి నయ్యుత్సవమున జనని!
మెసఁగిన ధరాపరాగ మాకసముఁ గప్పఁ
దాపకరుఁ డుపకరుఁడుగాఁ దనరెఁ దరణి. 32

భవదీయాస్యవిధున్ మా
నవ సుర కరపంకరుహగణమ్ములు గని యు
త్సవమున నుడుశోభాకృ
న్నవవరద! వరదాంబ! మొగిడినవి చిత్రముగన్. 32

జననీ! సమముగ మొగిడెను
జననయనచకోర హస్తజలజంబులు నీ
ఘనమహమునఁ బతికనులం
దనయము రవివిధులు వివిధులై భాసిలఁగన్. 34

ఉత్సవంబుల నినుఁ గొల్వ నుత్సహించి
యుద్యమించిన యోగమ్ము లుజ్జగించి
యమ్మ ! ధ్యానింతురు పరాశరాదిమునులు
మానస మ్మాన సమ్మద మ్మఖిలజనుల. 35

దేవమునులు నీదు దివ్యోత్సవమునందు
వేల్పుటావుపాలు పితికి తెచ్చి
అమ్మ ! నీకుఁజేసి రభిషేకములను ను
చ్ఛ్రియజుషముల యాజుషములఁ జదివి. 36

విధిశివేంద్రాదు లభిషేకవేళ నంబ !
గురులతోడను శిష్యులఁగూడ మెచ్చి
'రలరఁజేసిరి కడు సుస్వరములతోడి
ధ్వనుల నిగమమ్ములను మమ్ములను' నటంచు. 37

అల వృషగిరి నీ కభిషవ
ములఁ జేసినఁ, దాపశాంతి ముజ్జగములనౌ;
ఫలి యొక్కటి, ఫల మొక్కటి
నలరెను విబుధులును బుధులు నాశ్చర్యపడన్. 38

స్తవములతో నర్చింతురు
భువనేశ్వరి! సురలు మంత్రపుష్పములుగ ను
త్సవమందున శ్రితషట్పద
రవకులముల వకులములఁ గర మ్మనురక్తిన్. 39

చరణార్పితసురమకుటాం
తరనీలము లేవా నీపదార్చితకుసుమాం
తరషట్పదు లేవో ఝూం
కరణమె కరణమగు భేదగతిఁ గన నంబా ! 40

సుమనోయోగం బెంతటి
ప్రముఖఫలం బొసఁగు ? జనని ! త్వత్పదయుగళీ
సుమలీనమగుటఁగాదే
సుమలిన మలి నమసు లందె సుమనస్తతిచేన్ ! 41

వరదా ! నీచరణంబుల
సురగణ మర్పించినట్టి సుమమాలికలన్
శిరముల ధరియింపఁగ నరు
లరయఁగ సుమహితులు మహితు లగు టబ్బురమే ! 42

పాఠాంతరము :-

తమతలలన్, నీదగుపా
దములను సుర లిడినపూలు దాల్చిన, జననీ !
సుమహితులు మహితులును మహి
సమరహితు లమరహితులు జను లగుదు రహో !

పావన ఫలముల నీదు కృ
పాఽవనఫల మంద నుత్సవంబున జననీ !
నైవేద్యం బిడి రల భూ
దేవతలును దేవతలును దివ్యాన్నంబుల్. 43

అమ్మరో ! నీకు నారగింపైనపిదప
హరుస మెసఁగంగ నసురులు నరులు సురలు
నందఱునుగూడఁ బందిరిక్రిందఁ జేరి
తనివిగఁ బ్రసాదమును సాదమును భుజింతుర్. 44

జనమోదనము, భవదవే
క్షణసంస్కృతమును, సుధాన్యజనిని, మనోరం
జనమును, నోదవమును బ్రజ
ఘనతృప్తి భుజింతుర్, చింతుర్ కలుషము లంబా ! 45

నీదు భవనాగ్రివేదికమీఁద నిలిచి
వేత్రములఁ ద్రొక్కిడి నడంచు వేళ నంబ !
జయవిజయు లుత్సవంబున సరకుసేయ
రభవుఁడని భవుడని యిందుఁడని యమరుల. 46

జనసమ్మర్దశమోద్యమ
మున విష్వక్సేనవేత్రమున నీదు మహ
మ్మునఁ దాడితులగుచో నిఁక
గనరు నరుల్ యమునిభటుల ఘనతాడనముల్. 47

విపులస్తుతి నుత్సవమున
నపరిమితానందమొంది యరయుదు వంబా !
యపమృత్యు వుడిపి భక్తుల
నపరిపుపరిపుష్టమైన యైశ్వర్యమునన్. 48

అవలోకింపఁగఁ గను లీ
భవమున నజుఁ డొసఁగినట్టి ఫల మే మంబా !
యవలోకింపక నీయు
త్సవరసమున్ వరసమున్నత స్తవరసమున్. 49

వేయిమోములవాఁడైన వినుతిసేయ
జాలఁ, డల వేల్పుగురుఁడైనఁ జాలఁ, డంబ !
దివ్యభవదుత్సవమ్మును; దెలుపు టెటుల
నయ్యెడి ననల్ప మతులము నల్పమతుల ? 50

# లక్ష్మీసహస్రకావ్యము

## వదాన్యతా స్తబకము

అనితరసామాన్యం బే
జనని వదాన్యత్వ మట్టిసాగరకుల వ
ర్ధనియగు శ్రీదేవికి నే
ననిశము వరివస్య సేసి యానందింతున్. 1

రసనలను రెంటఁగాని నేత్రముల మూఁటఁ
గాని ముఖముల నాల్గిటఁ గాని యన్నె
కరములనుగానికల్గుచోఁ గవులు నీ వ
దాన్యతను సుంత వర్ణింపఁదగుదు రమ్మ! 2

జనని! వననిధిఁ బుక్కిటఁ గొనినవాఁడు,
దాని దూఁకినవాఁడును, దానియందు
నిరతమును బండుకొనువాఁడు నీవదాన్య
తను నుతింపంగఁ దగుదురో తగరొ యెఱుఁగ. 3

రయమున సర్వవై భవపరంపర లిచ్చుచు, మృత్యుదేవతా
భయ మెడఁబాపి తల్లి ! పరిపాలనఁజేసెదవీవు నిత్య మే
రయినను నెప్పుడైనను దయానిధి నిన్ను భజింపఁగావలెఁ
స్వయముగఁ బంచతన్ గనిన స్వర్గకుజంబులఁజేర నేమియో ! 4

నిను వెనుకొంచుఁ వాల్కడలినిన్ జనియించినయంతమాత్రిచే
తనె జగదంబ! లుబ్ధకవతంసుఁ డొకండును, వేఱొకండుచె
ట్టును, బసరంబొకండును గడుంగడు దానగుణంబుచేఁ బ్రసి
ద్ధినిఁ గనఁగల్గె నింక భవదీయవదాన్యత నెన్న శక్యమే ! 5

ఈ వొక దానశీల వన నిందొకచిత్రిమె ! యో రమాంబికా !
యీవు వసించుచోటునను నించుక లోభపుమాట లేదు, సం
భావన సేయ నీమది నివాసముగాఁగాని శ్రీనివాసుఁ డా
శ్రీవృషభాద్రినాయకుఁడు సేవితకామితదాయి యౌఁగదే ! 6

మొగము ముడుంచుకొంచుఁ గడుపోటరిమాటలఁ దూఁటుకొల్పి క్రొం
బొగ లెగయంగ దోషపరిపూరితుఁడౌచు హిరణ్యదాన మొం
తగనొ యొనర్చు నీ పతివదాన్యతకేమి, యటుండనిమ్మ ! నీ
జగదభినంద్యదాన మతిసత్కృతిపూర్వము సన్నుతించెదన్. 7

ఇహమునను బరమునఁగూడ నెట్లు మేము
యాచకావళివలెఁ బిశాచావళివలెఁ
దిరుగకుండుదుమో యట్టి దివ్యవిభవ
మొసఁగు మో తల్లి ! నీ దయ యొసక మెసఁగ. 8

నిరుపమాన దాననిధి వీవె సర్వ మీ
వలయుఁ గాని తల్లి ! ఫలము లొసఁగ
వట్టి యున్నతియె గలట్టి యుత్తమమైన
దానవారితరువు తగదు తగదు. 9

పరిచరనమశ్కృత మిదె, యో
రుచిరశ్రీవత్సజుష్టరుచి రమ్యాక్షీ
రచితాశ్రిత సుశ్రీ గుణ
ఖచిత ! పరివాలాంఘ్రి కామగవి నుతసుకవీ ! 10

పలమె యొసఁగెను శిబిచక్రివర్తి తొల్లి,
కళనె యొసఁగును మఱి శీతకరుఁడు, తల్లి !
నీరదము విషమొసఁగును, నీవు సకల
కాంక్షితాధికదాత్రివిగాదె మాకు ! 11

స్వర్గద్రుమము నీకు సాటిసేయుదమన్నఁ
జూడఁగా నెంతయో సుమిత మద్ది
ఘనుని నీ కెనగాఁగఁ గల్పించెదమటన్నఁ
దలఁచిచూడఁగ నప్ప్రదాత యతఁడు
కర్ణుని నీతోడ గణన సేయుదమన్నఁ
బరికింపఁగ నపార్థకరుణుఁ డతఁడు
బలిచక్రవర్తి నీ ప్రతిసేయుదమటన్నఁ
దలఁచిచూడంగ కుదాత యతఁడు

నీవిభునె నీకు సరిగా గణింతమన్న
నాతఁడు హిరణ్యహారియౌ నహహా ! యింక
నీకు నీవే సమాన వో నిఖిలజనని !
యేరు నీ సాటివారలు లేరు లేరు. 12

మొనసి మధుకాలయోగ మామోద మీయ
భవ్యశాఖాళ తోద్య త్సుపర్ణ వాహ
మై ఫలమ్ముల నర్థుల కమరఁజేయు
నీదు తనువు కల్పక మౌను గాదె! తల్లి ! 13

అంబ ! నీ దానయోగ్యుఁడైనట్టి యెవని
కి న్నరేశాధికై శ్వర్య మెన్ని యిడుదో,
చూచి యతనికిఁ గిన్నరేశుండుఁ దగఁ ద
టంచు భువిఁ బ్రాజ్ఞు లందు రయ్యది నిజంబ. 14

అన్నివిధాల సంపదల నప్పటి కప్పుడ సంఘటించు ని
న్నెన్ని భజించువారు భువనేశ్వరి ! కన్నులు నెత్తికెక్కఁగా
మన్నను మిన్నునుం గనక మత్తిలి యందఱఁ గేలిసేయునా
చెన్నటియల్పపుందొరలఁ జేరరు చూడరు కోర రెన్నఁడున్. 15

సరగున నీప్సితంబయినసంపదఁ గూర్చెడినీవుకల్గ నే
మొఱ కీఁక రాచదయ్యముల మ్రొక్కి భజించును దల్లి ! మాధురీ
భర ఫలనమ్రమై యెదుట వర్తిలునామ్రము వీడి కంటకా
కరమగు శాల్మలీతరువుఁ గన్గొని చేరుదురే ఫలార్థులై. 16

ఇహపరంబుల నంబ! సమృద్ధిదము ప్రా
ప్తిపరులకుఁ, ద్వత్పదద్వయముఁ గొలుతుఁ;
బరుషవాక్కులఁ బ్రాజ్ఞులం బరిహసించు
ధనమదాంధుల కింక నే తారిసపడను. 17

ఐహికాముష్మికార్థము లన్ని యొసఁగి
చల్లగా నీవు మాకాల మెల్ల నడుప;
గాలికిం దూలు మబ్బులఁబోలు శ్రీల
నెగసిపడువారితోఁ బనియేమి! తల్లి! 18

అరయ నొకింతయేని స్తవనార్హగుణమ్మది లేని నీచభూ
వరుల గుణప్రకాండులుగ వాకొన నీహ నొనర్పఁ దల్లిరో!
నిరుపమము న్నిరూహ్యము, ననిర్వచనీయము నైనయట్టి నీ
పరమగుణమ్ము వాకొనుదు బారకు నంగుళమేనిఁ జేరఁగన్. 19

సారాసారవిచారశూన్యులు, పిశాచభ్రష్టదుశ్చేష్టితుల్,
ఘోరాకారులు, రాజు, లా కుమతులన్ గొండాడనంబా! నినున్
దూరాపాస్తసమస్తకల్పతరుదానోదారధారన్ మహో
దారన్ తిర్పతివేంకటేశ్వరుమహోదారన్ బ్రశంసించెదన్. 20

# ల క్ష్మీ స హ స్ర కా వ్య ము

## యమక స్తబకము

జనని ! యదునాథసహధర్మచారిణీ ! య
శస్వినీ ! కామితార్థసర్వస్వసృజని !
కల్పధాత్రీరుహా యమక కల్పములు భ
వత్ప్రదము లగు నాకు సంపత్ప్రదములు. 1

సన్నుతింపంగఁబడుట నీ వున్నతముగ
నా స్తవము శస్త మగు, నిది వాస్తవ మగు;
రామ ! సన్ముని మానసారామ ! క్షేమ
ధర ! దయాపూర్ణసుహృదయధర ! కొను మిది. 2

చేతస్స్ఫురణమ్మగ నీ
చేతన్ ! నా చేఁత లఖిలసిద్ధుల నొసఁగన్,
మాతా ! నీ పదముల నిడు
మా తాదాత్మ్యమ్ముఁ జెంద మది నెమ్మదిగన్. 3

మా యాపద లెడలింపుము
మాయాపదమైన భవము మాయగఁ ద్రిజగ
ద్ధ్యేయా! దయోదయానుప
మేయా! మే యాఁకుండ మే లిడు మమ్మా! 4.

అమరపతి దలఁచు మది నే
యమరారివిలోపదముల నవిపదముల నా
రమపదముల మౌనిమనో
రమపదములఁ దలఁతు నే పరమపదములకై. 5

హరనుతవిభవ! భవామయ
హర! సురమహితా! హితాప్తికై నీదు సుధా
కరసదృశ దృశఁ దలంతును
దురితము లడఁగింపు మింపుతో తోయధిజా! 6

శ్రీ! ఘనాఘనభాసికి నా ఘనాఘ
నాశికి సదా సదాశార నేశి వీవు
హితవు సుహితాహితార్త్యాఁఉరహితవు, మాకు
కాశసంకాశకీర్తిప్రకాశ వగుము. 7

ప్రవిమల సరోరుహారామ వాస! మల్లి
కాసుమ సరోరుహార ప్రభాస! మమ్ము
వి త్తములఁజేసి పాపప్రవృత్తిఁ బోఁ ఐని
వి త్తములఁ జేసి మాకు బ్రిపత్తి నిమ్ము. 8

సు మనోజను నిరసనఁ జే
సి మనోజునికేళి కాపఁ జేసెడి పతులన్
కుమతుల విడి నినుఁ గన మా
కు, మతుల నిడుమమ్మ నిన్నుఁ గొలిచెద మతులన్. 9

కమల ! నిను మాపు రే పీడనమునుజేయఁ,
బాపురే పీడనముఁ జేయ నోపఁ డెవడు.
నాశమును నా శమనుఁడు నొనర్పకుండ
నేలవలె నను; నా కన్య లేల వలెను ? 10

జలజప్రీతిమానన ! యే
రలు నీ ప్రీతి మాననమున, రాజులఁ గొలువన్
ఫల మేమగు ? నకలంకత
నిలువ విలువ నిమ్మ, యమ్మ ! నిన్ను భజింతున్. 11

లోక మామోద మెంతయు స్వీకరింప
హరికరస్పర్శచేఁ బద్మ మట్లు, విభువి
లోక మామోద మెంతయు స్వీకరింప
హరికరస్పర్శచేఁ, బద్మ ! యలరె దీవు. 12

పలుకుపలుకున నమృతంబు లొలుక నెవరు
పలుకుదురు పలు కుదురుతోడఁ బతిని నిన్ను,
పరమపద మొందుదురు వారు పర మద హతి
యొనర, నాళీకనాళీకజనని ! జనని ! 13

గొప్ప నవనాళికేళము
లొప్పాఱు వనాళికేల నొంది తిరుమలన్
తప్పక విదేహముక్తిని
ఎప్పుడు నిడ నీవు తనువు నెత్తవె జననీ! 14

శ్రీపతిరామా! భక్త
ప్రాపితకామా! నుతింపరా మా తరమా!
నీ పరమపవనరచనస
గోపాలు నొనర్తు వీవు గోపాలునిఁగన్. 15

మది నీ నామసహస్రపుఁ
బదముల నెదియో గిరా జప రముని జేయున్;
సదవనదీక్షా! మోక్ష
స్పద మయ్యెది యోగిరాజపరమునిఁ జేయున్. 16

తామరసాలయ! పరిహసి
తామర సాల యమకమగు త్వత్పదయుగ మే
భూమాగమసంసక్తుఁడు
భూమిన్ భజియించు నతఁడు భూమాగముఁడౌ. 17

హృదయమునఁ బ్రతిదినమ్ము నీ వదన మరయ
నుదయలక్షలు సంపద లొదవు జనని!
మామకమలాపహారిగా కేమి? చంద
మామఁ, గమలాపహారినే యోము మోము. 18

పాఠాంతరము :—

వశితజగత్పతి వగునీ
దృశ నసదృశ మాదృశులకు నిడి శుభ మిడవే.
శశిసోదరి ! నీ పతి నేఁ
బ్రశస్తునిగఁ బ్రస్తుతింతు స్వస్తి యొసంగన్.

భవతిమిర మెడల శుభలా
భవతీ ! మత్ప్రభృతి పాపభవతీవ్రులు నీ
భువి నణఁతురు రంహస్సున
భవత్పదములంటిమెలఁగువా రంహస్సున్. 19

ప్రథమ నమనమ్ము నీ కిడుప్రథముఁడ నను
ప్రథ మన మనమ్మలోఁ దల్లి ! ప్రణతు లిడుదు.
నీ మహత్తరపూజల నౌమహత్త
నగుదు హంతగ నరులయహంత కేను. 20

భవ నాశనము విరాగుల
కవుఁ, దుది మోక్ష మగుఁ; బాయసాన్నమ్ములతోన్
భవనా శనమనురాగుల
కగుఁ, దుది మోక్ష మగు; నీ దయాదృతి నంబా ! 21

ఆయసమానసుఁ డదయత
నా యసమానుండు మాదునపరాధములన్
మాయింపఁడు హరి సుముఖున్
జేయింపుమ జనని ! కరుణచే నింపు మదిన్. 22

మాధవుండును దల్లి! యుమాధవుండు
స్తవముఁ గావింపలేరు వాస్తవము నిన్ను
నరులుఁ గిన్నరవరులు వానరు లసురులు
గళరవమ్మెత్తి పొగడఁగాఁ గలర! వమ్మ. 23

ఆర్తజనులకుఁ గరుణార్ద్రమూర్తి వీవు
హిత వవహితాహిమహిత వహితవిహితవు
రమణ తిరుపతివేంకటరమణహృదయ
రమవు పరమవు నుపరమరమవు రమరో! 24

నీకు దయగల్గియున్నచో మాకు నగు న
రమరమరమరమ, రమ! కరమ్ము వింత!
నీకు దయలేకయున్నచో మాకు నిఁక న
రమరమరమరమరమ మార్గ మగుపడున? 25

మహిత తాప ప్రిపా! పాహి మాం సురూప!
మ న్మనో ధ్వాంత లో పాహి మాంశురూప!
జననదోషాళి నీవారి జాతకములఁ
జనవు దుష్ఫలముల, వారిజాత! కమల! 26

* మందారా! మందారా
మందారా! శేషశైలమందారమ! మా
మందారా మందారా
మందారా! భక్తహృదయమందార! రమా! 27

* సారావాసారావా
సారావారగనగమ్మ జనులకు జననీ!
ఘోరార్తు లెడపఁ గరుణా
సారముఁ బ్రవహింపఁజేయ స్వాగత మొసఁగున్. 27

మదము మౌఢ్యమ్ముఁ ద్రొలఁగి శమమ్ముఁ దమముఁ
గలిగి పుణ్యాతిపుణ్యుఁడై మెలఁగి నీదు
నిమని, నిను నిత్యమును గొల్చునేని జనుఁడు
నిజ గదంబును జగదంబ! నిస్తరించు. 28

క్లాంత నరకాంత, నరకాంత కాంతను నిను
సంతతానతసురనరకాంత! జనని!
యజుషముల సూక్తములతోడ నర్చలిడక
నయజుషుఁ డెవండు వేఱొకనరునిఁ గొల్చు? 29

సురరిపుల నష్టి సలుపన్
మురరిపునకు గుండెబలముపుష్టినిఁ గొలుపన్
హరియురమందున నుందువు
సరసురసంతుష్టి సృష్టి నడుపుచు జననీ! 30

కానము సరి, త్రిజగత్స
మ్మానకునున్, హిమకరోపమాననకు, రమా!
దానమున నమరగవిచం
దానను మముఁ దృప్తిపఱచుదానకు నీకున్? 31

అమరు నమరులకును నంబరో ! యే నీదు
దివ్య దీక్షవలన దివ్యదీక్ష,
ఉరగనగమునందు నొందును నీ పాద
జలజనతుల నద్ది జడజనతల. 32

రాజీవకులము, హరిదా
రా ! జీవకులమ్ము నీదు రక్షణముననే
రాజిల్లును; రక్షింతువు
రా జిల్లునుఁ గూల్ప సోదరప్రేమమునన్. 33

ధీరమహోదారల హరి
దారల ముమ్మొదట నిన్నుఁ దల్లి ! భజింపం
గౌరుసపర్యాదీక్షా
ప్రారంభుల కీవు కల్పపర్యాయమవే ! 34

తనయంకపీఠి నంబుధి
తనయన్ నినుఁ జేర్చినపుడు త్వత్పతిఁ గను నే
జనుఁ, డా జనుఁ జన నిబిడౌ
జునిగ, బిడౌజునిగఁ జేయుచుందువు జననీ ! 35

ఉదధి కన్యాయతాపాంగ మెవని కబ్బు
నుదధిక న్యాయతా పాంగుఁడుర్వినతఁడు
తాన సత్కవి కథక వితానమందు
నన్యుఁడగుధన్యుఁ డఖిలమూర్ధన్యుఁ డంబ ! 36

నీ వా నరకాళిని నీ
సేవా నర కాళి విభుఁడు చేర్చునో యని త
ద్భావ మఘోరముఁజేయగ
నీ వా యనఘోర మాశ్రయింపవె జననీ! 37

కారాకల్పము సతత వి
కారాఽకల్పమ్ము తనువు కడు భారమగుఁ
రారాదా శుభవతివై
ప్రారబ్ధము లడఁప దాసు భవ తిమిరములఁ. 38

సారాసారవివేక వి
దూరులు దూరతులు నృపులతో నేల! నినున్
జేరెను మానస, మేఁతువె
మారామా! నన్ను, దురభిమానసమేతున్. 39

సారసువర్ణ వికారా
కార సువర్ణా! నుతింతుఁ, గర్ణ యుగమ్మున్
జేరుపు వర్ణన, మధ్యమ
తారకవర్ణా! నఖాస్తతారకవర్ణా! 40

హృత సదరిద్రవ్యా! ధీ
శ్రితజన విచ్ఛిన్న దుర్దరిద్రవ్యాధీ!
అతులకృపాయుత! యిఁక మా
మతులకుఁ బాయుత సమస్తమలినము నీచేన్. 41

కచ జి తోత్త్రప్రభ వనద ! యాగముల నెల్ల
నడఁచి శోషితభవనద ! యాగమముల
ననఖిభవన ద యాగుఁడై యలరుచు విభుఁ
డాత్మభవనదయాగుఁడౌ నటు లరయుమ! 42

ధీరా ! జయ ! తిరుమలవిభు,
ధీరాజ యతి నుత నిను, నుతింతురు సతమున్
ధీ రా జయతీవ్రిత కు, సు
ధీ ! రా జయ తివిరి సన్నుతింప నిరతమున్. 43

ఆయతనమందు నీ పూ
జా యతనము సల్పునట్టి సజ్జనులకు మా
నాయతనతులకు ననమా
నాయత నందింతు వంబ ! యాయతనములన్. 44

ఉరగవృషభాగవతి యతి
పరభాగవతీ ! ముకుందపరభాగవతీ !
పరభాగవతీ ! మా కిడు
పరభాగవతీయమైన పరమపదమ్మున్. 45

తన యాచార్యము వననిధి
తనయాచార్యముగ నార్య దనరించుటచే
ననయాచారుఁడు హిమనగ
తనయా చార్యంతరంగధరుఁడై శివుఁడౌ. 46

ఆయతకరుణాపరిధితా
మాయతమై కాకదనుజు మనిచినదృష్టిన్
మా యతనమ్ములు లేకయె
మాయ తగఁగా మాయునట్లు మనుపుము తల్లీ ! 47

రామునకును సుజనమనో
రామునకును సంతతానురంజితమౌని
గ్రామునకును రాక్షస సం
గ్రామునకును నిన్నుఁబట్టిగా జయ మంబా ! 48

దారుణ్య మొలయకుండగఁ
దారుణ్యారుణ్యకిరణతతి యుపవనమం
దారుణ్య మలమువేళలఁ
దారుణ్యక్రీడ విభునిఁ దనుపవె జననీ ! 49

వాణీ యమునా హితకర
వాణీ ! యములకును కుసుమవాణీయములన్
వాణీయములను బాపల
వాణీయములను దహించివైతువు జననీ ! 50

ఉపేంద్రవజ్రవృత్తము :-

మహా ఉపకా రాతిశ మా స్తదాయీ !
మహోపకా రాతిశ మాస్థఁ దాయీ !
మహోదయాసారము మాఁట నీవే
మహో ! దయాసారము మాట నీవే. 51

ఉపేంద్రవజ్రవృత్తము :-

సురక్ష ! యమ్మా ! దయఁ జూచి మామకా
సు రక్ష యిమ్మా ! దయఁ జూచి మామకా !
సురక్ష యోద్భూతినిఁ జూడనౌ నా
సురక్ష యోద్భూతినిఁ జూడ నౌనా ! 52

నీ కన్నుల సరిఁ గానము
నాక మ్మా నీదు దృష్టి నాక మ్మగుఁగా
నీ కన్నుల సరిఁ గానము
నా కమ్మా ! నీదుదృష్టి నాకమ్మ యగున్. 53

వైరమ్మకా రణ మ్మురు
వైరాగము విభునిమదిని వడిఁ దగఁ జననీ
వైర మ్మకారణ మ్మురు
వైరాగము విభునిమదిని వడిఁ దగ జననీ ! 54

ద్విపద :-

ర క్తి సమస్తచర్యల నించుదే ! వి
ర క్తి సమ స్త చర్యల నించు దేవి,
ర క్తి స మ స్త చర్యల నించు దేవి !
ది క్తతులను నీకు దీ పెవ రమ్మ ! 55

రాజీవాయతనా ! కృప
రా జీవాయతనములను రాజిలును సిరుల్
రాజీవాయతనయనుఁడు
రా జీ వాయతనుఁగన్న రాజ్ఞివిజననీ ! 56

మార వితా రకమును పర
మారవితారకము నభిమతార్థప్రదమున్
మా ! రవితారకమును నఘ
మార వితారకము నీదు మంత్రముఁ దలఁతున్. 57

కరమ హితాపహారికవుగాదె ! విశిష్టజనాపకృ ద్భయం
కర ! మహి తాపహారికవుగాదె ! పదానత భక్త హృద్వశం
కర ! మహి తాపహారికవుగాదె ! సదావృతదేవతాశివం
కర ! నిజకింకరప్రకరకామ్యమనోరథదా ! శుభంకరా ! 58

అంబ ! నీ పాదపద్మము లాశ్రయించి
యసదృశ మహోద యామితరసముఁ గొనమ !
యసదృశ మహో ! దయామితరసముఁ గొనమ !
యసదృశ మహోద ! యా మితరసముఁ గొనమ ! 59

ఎవ్వరు భజింప నేల మా కేలవలయు
ఎవ్వరు భజింప నేల మా కేలవలయు
ఎవ్వరు భజింప నేల మా కేల వలయు
ఎవ్వరు భజింప నేల మా కేల వలయు. 60

అవునె : నరామరమాన్యత
నవినాశాధ్యాయమహితమగుభవము నమా ।
అవునె నరామ రమాన్యత
నవినాశాధ్యాయ మహితమగుభవమున మా. 61

# లక్ష్మీసహస్రకావ్యము

## నక్షత్రమాలా స్తబకము

అశ్వినీ హ స్తి సంపన్నమైనయట్టి
సిరిని వెలయించి సౌఖ్యవి స్తృతినిఁ గూర్చి
భ క్తమందారము లనంగ వరలునట్టి
యిందిరాపాంగములు సదానంద మిడుత. 1

పరమాభరణీభూతగఁ
దిరుమలవిభుబాహుమధ్యదేశంబున సు
స్థిరయై భక్తులఁ బ్రోచెడి
పరదేవత నెపుడు నేను భజియింతు మదిన్. 2

కృ త్తికావాసుఁడై భిక్షమెత్తువాఁడు
నీ సహోదరు నెత్తిపై మోసియుంట
అఖిలభక్తాళి కంబ! తా నంతలోన
నిఖిలసంపత్ప్రదాతగా నిలిచినాఁడు. 3

అధిరోహిణి వైకుంఠము
నధిరోహింపఁగ ముముక్షునకు నేపె సుధా
మధురాపాంగం బగు, నా
మధుసూదనుదేవి భవశమం బిడు మాకుఁ. 4

మృగశిరోమణి దర్పమ్ము నేచుదృక్కు
లమృతదీధితిని జయించు నట్టిమోము
మెఱపుఁదీఁగెను నిరసించు మేను గలుగు
నీకు నుపమాన మెది ! తల్లి ! లోకమందు? 5

కరుణార్ద్రములై జనసం
సర ణాకూపార తరణ సత్కరణములై
శరణములై నీ చల్లని
యరుణారుణదృక్కు లంబ ! యలరించు మముఁ. 6

పర్వె పునర్వసుసుస్థితి
దుర్వాసశ్శాపమునను దూరాపాస్తా
ఖర్వవసుఁడైన యింద్రుని
కర్వాచీనముగఁ దల్లి ! యర్చింప నినున్. 7

అంబ ! యీపుష్యయుగమునం దాగమోక్త
భోగ్యమగునాయువు, నతులారోగ్య, మమిత
భాగ్య, మతిహృద్య విద్య, ప్రభాసమాన
కీర్తి, హరిభక్తి కల్గు నీ మూర్తిఁ గొలువ. 8

శేషాద్రీశాఽశ్లేషాఽ
శేషా ! భక్తానురక్తచిత్తవిశేషా !
భాషా గౌరీ ముఖ స
ద్యోషాపోషా ! మదీయ దోష మణఁపుమా ! 9

అంబ ! మఘవంతు స్వర్గలోకంబు శివుని
భవ్యకైలాసలోకంబుఁ బద్మభవుని
సత్యలోకంబు వైకుంఠసదన మొందు
త్వద్దయాప్రాప్తునకుఁ దృణప్రాయ మంబ ! 10

జనని ! సేవింతుఁ దను పుబ్బ నను, మనుపుత
మార్యభావితమై తటిదాభమై స
దా నమ త్సురయౌవతమై యభీష్ట
ఫలదదైవతమైన నీ పద్మగృహము. 11

సాగి మ్రొక్కిన యుత్తరక్షణమునందె
కోరికలఁ దీర్చి వెనుక వైకుంఠ మొసఁగి
మనుచునిను వీడి యిఁక మదోన్మత్తమతుల
నవనిపతులను గొల్వ తారాడ నమ్మ ! 12

సాధుతరుల సమూల నాశం బొనర్చు
నట్టి విధ్వంసితాగమహానిదాఘ
మును నణఁచు నీ దృగమృతకుల్యను భజింతు
హస్తముల మోడ్చి దాపత్రయంబు లణఁగ. 13

హరునిన్గొందఱు చిత్తమందు, హరినిన్, నాకేశునిం గొందఱి
ద్ధరఁ బూజింతురు స్వాత్మలాభముల సంధానింప; నే నెప్డు డా
హరునిన్, శ్రీహరినిన్, హరిన్ గొలువ నిత్యం బాత్మ నిన్నే మఱిన్
మఱి ధ్యానమ్మొనరించుకొందు నిఁక నమ్మా! యెట్లు రక్షింతువో!

సర్వస్వాతిశయంబు తావకకటాక్షం బెట్లు భాస్వత్తపో
ఖర్వుల్ సర్వసుపర్వు లొందుదురొ, శ్రీకాంతామణీ! యట్టులే
గర్వాంధ్యావృతమందబుద్ధినగునేఁ గాంతుంగదే! జెందదే
సర్వశ్రేష్ఠనగంబుపైఁ బడినవర్షం బా విషాగంబుపైన్. 15

కరిముఖునిన్, విశాఖస్వామినిన్ గన్న
గిరిజ యొక్కెడను చామరము వీవ
సర్వభాషల కధిష్ఠానదేవత వాణి
యును, నొకవైపు వీవనధరింప
కనుసన్నలన్ సురవనితలన్ బనిగొను
శచి కళాచి ధరించి చక్కఁ నిలువ
రంభా తిలోత్తమోర్వశు లెల్లయచ్చరల్
దాస్యలాస్యములతోఁ దగ భజింప

తమ్మిగద్దియపై వైభవమ్ము మెఱయ
కొలువుఁదీర్చిననినుఁ దొలిపలుకు లంబ!
తెలుపగాలేక పెన్గళవళమునంద
నేను నరమాత్రుఁడను నిన్గణింపఁగలనె! 16

ఘవత ననూరాధార్హా !
నిను నేనును బ్రిహ్మగూడ నేరముపొగడన్,
దనియింతు మైన నీమది.
జననికి ముద మిడవె సుతుల శక్త్యార్ధంబుల్ ! 17

జ్యేష్ఠసుతుఁడయ్యుఁ బితృవాక్యనిష్ఠఁజేసి
వనికి రాముండు నన వెంటఁ బడితి వీవు
లోకరక్షణగుణమును స్వీకరించి,
నీవులేకున్నయగునొకో—రావణవధ ! 18

శత్రుల సమూలనాశంబు సలుప సురలు
ము న్నొనర్చిరో యే పాదములకుఁ బూజ
నాపదలఁ దోలి ఘనసంపదాళి నేల
తమ మణఁపఁ జాలఁ గొలుతుఁ దత్పదము లంబ. 19

అనయంబున్ మునినాధులెల్ల విధిపూ ర్వాషాఢ కాషాయ ధా
రణ పంచేంద్రియశోషణంబులఁ బరబ్రహ్మానుసంధానులై
కను వైకుంఠము నీదుపాదయుగళీ కల్హార నిత్యార్చనా
ఘనులౌ మాదృశబాలిశాత్మలకునుఁ గల్గింతు వీ వంబికా ! 20

బాఢవియోగియౌ పతికి భానుజుఁ డించుక మాటసాయ మా
రూఢిగఁ జేసి నిన్వెదుక రోజననీ ! పడయండె యుత్తరా
షాఢమునీంద్రవంద్యగుణశాలినివాలినిఁగూల్చిరాజ్యమున్;
గాఢఫలంబుఁ జేర్పదె యగణ్యగుణాఢ్యుల కింతఁ గూర్చినన్! 21

శ్రవణమున భక్తరక్షణప్రవణ విధిని
నూరిపోయుచుఁ బతిపక్కఁ జేరియుండు
వదియె లేకున్న మాదృశావిదిత పాప
గతుల కొం డేదియును దిక్కు గలుగ దంబ! 22

నే నశక్తుండ దుస్సాధ నిష్ఠ, కగుటఁ
గర్మయోగంబు జ్ఞానయోగంబుఁ గనను;
కాన నీ పాదభక్తియోగమునుగూర్చి
తరణ మొందింప నాకీవ శరణ మంబ! 23

శతభిషక్సంయుతుండయ్యు క్షయముఁ గనఁడె
యంబ! భవదాలయద్వేషియైన రాజు;
త్వత్పరిగ్రహవైరంబు తనరెనేని
నెంతవాఁడును క్షీణించు నింతలోన! 24

పూర్వభాద్రపదంబు నీ పూజవలన
నింద్రునకుఁ గల్గెనేకాని యెందు నంబ!
పరమకోపిష్ఠియైన దుర్వాసుఁ డిడిన
శాప మెటనైన వ్యర్థమౌ జాడ గలదె? 25

భువనోత్తరభాద్రపదం
బవుగేహం బొందు నాతఁ; డంబుజగేహా!
యెవఁడు నమస్కారము నీ
భవనంబున కిడునో ప్రాతరారంభములన్. 26

బళిరే వతీర్ణవై పెం
జలువలు వెదఁజల్లుపాలసంద్రములోనన్
జలివెల్లుతోడ, హరిహృ
త్థ్సలి కెక్కుట మాదు తాపశాంతికె జననీ! 27

చిత్రపదరత్నబృందంబుఁ జేర్చి కూర్చి
సంతరించితి నీకు నక్షత్రమాల
నంబ! సతతంబు నీ హృదయంబునందు
మాలతోఁగూడ నన్నొకమూలఁ జేర్పు. 28

# లక్ష్మీసహస్రకావ్యము

## చిత్రచరిత్ర స్తబకము

చిత్రవిచిత్రచరిత్ర
స్తోత్రా! కారుణ్యపాత్ర! స్తుతియించెదఁ దా
పత్రియ మణపఁగ విష్ణుక
ళత్రా! సద్గుణపవిత్ర! రాగలవిత్రా! 1

అమ్మ! అవతార మపాకృతమ్మయైన
పాకృతుఁడుగనె పుట్టె నీ భర్త, నీవొ
యాదిభూతమున్ మధియింప నవతరిలితి,
వట్టులె ద్వితీయభూతమం దైతి వహహ! 2

తల్లి! 'బాధానుబద్ధ' మన్ దర్క-సంప్ర
దాయ మనలమ్మునందు శీతలపుటూహ;
ఆంజనేయునివాలమం దగ్ని నాఁడు
శీతలమ్మయ్యె నీచేతఁ జిత్రముగదె! 3

కాలక తేలియాడుటది గల్గునొ వహ్నినిఁ బడ్డవస్తు వే
కాలమునందు? నీ తనువు కాలదు, కూలదు, పేర్లిల, దబ్ధిలోఁ
దేలినయట్లు దేలినది దేవిరొ! దేవత లద్భుతాంబుధిన్
దేలఁగ, నీవు రాముఁడు విధించిన యగ్నిపరీక్షఁ దేలఁగన్. 4

బాధలఁబెటువారి కొఁ బాధఁ దలంపకయుంట నెంతగాన్
సాధువులైనవారలఁ గనంబడ; దంబ! నినున్ సమస్తదు
ర్బాధలఁబెట్టినట్టి యల రాక్షసకాంతల మిర్ంగి పీకు ని
ర్బాధమొనర్చివైతు నను వాయుజు నడ్డితి వెంతసాధ్వివో? 5

పాకారిపుత్రుఁడగు నా
కాకాసురుపైని నంబ! కరుణాలోకం
బేకం బిడ నీ వతని,క
నేకములను లోకములను నిడె విభుఁ డహహా! 6

తమసతుల కనుల నిడుకొను
రమణుల వినవచ్చుఁ, గాని రా దెటఁ గనఁగన్:
కమల! నినుఁ గనులనిడుకొని
కనుఁబడుఁ గమలాక్షుఁడనఁగఁ గాంతుం, డహహా! 7

సతిపైఁ బ్రేమాధిక్యము
పతి కుండిన విడక యుండవచ్చును గెడఁ, ద్వ
త్పతి యంబ! తొమ్మనకె ని
న్నతికికొనెన్; జూడ నెంతయాశ్చర్యమగున్! 8

ఎక్కువ యుపచారమునకుఁ
దక్కువ ఫల మిడుదు రన్యదైవంబులు నీ
వొక్కతె వపచారములనె
లెక్కింపవయారె! ఫలము లిడుదువు జననీ! 9

చేకొని వేణువున్ బలుకఁజేసినమాత్ర, జడమ్ముచేతఁ దా
వాకొనఁజేసె విష్ణు వని వాకొనఁ జెల్లునెం యద్భుతమ్ముగన్
మూకునినోట శ్లోకముల మూఁకలు పుట్టగఁజేసి తీ వహో!
లోకసవిత్రి! యీవిధములోన నుదాహృతి కేన నిల్చితిన్. 10

ఆ వృషాద్రిని జనని యర్చావతార
మూర్తిఁ గైకొన్నవిభునకే కర్తృత యిడి
విభునిబాహాంతరమున నీవే వసించి
రక్షసేయుట వింత మాదృక్షజనుల! 11

జననివి సర్వజగమ్ముల
కనుమాట నిజంబ యంబ! యైన, నసాధా
రణవౌచు నాకుమాత్రిమ
జననివిగాఁ బ్రోతు; వెంత సత్యాద్భుతమో! 12

# లక్ష్మీసహస్రకావ్యము

## నామవైభవ స్తబకము

నామైకమాత్రజపమున
కామితదము జ్ఞానదమ్ము కల్యాణగుణో
ద్దామదమునైన యా శ్రీ
ధామము మాకనులయెదుటఁ దనరుత మెపుడున్. 1

అర్ణవేంద్రతనయ! అతిదుర్ణరేంద్రుల
వర్ణనమున నెండువడిన నాదు
రసన మృదువు శీతలమునైన నీ నామ
కీర్తనమున నార్ద్రమూర్తి యగుత. 2

ఆర్తితోడ నీదు కీర్తనం బొనరించు
నరుని కషఫలమ్ము దరికిరాదు;
స్వర్గజనులచేత సంస్తూయమానుఁడై
యంబ! సర్వసుఖము లందు నతఁడు. 3

తగుపలాయనసిద్ధమంత్రము మరుచప
లతకు,ఘంటానినాదము ల్కపటభూత
ములకు,సాంత్వవచోమృతము విభుకోప
వహ్ని, కగు నీదు నామజపమ్ము! జనని! 4

అతులితామ్నాయదుగ్ధాబ్ధి కమృత మగుచు
నరివిదారణమునకు బ్రహ్మాస్త్ర మగుచు
నంబ! నీ నాధునిత్యజపంబె యగుచు
వరలు నీ నామ మది మాకు వరము లిడుత. 5

అహహ! నీ నామయజనుఁడైనట్టివాఁడు
జనని! యెప్పు డనామయజనుఁడు; నీదు
నామరక్షణపరుఁడైన నరుఁడు, సత మ
నామరక్షణపరుఁ డగుననుట నిజము. 6

సామవేదమునకు జన్మాంతరము,సర్వ
యాజుషమ్ములకుఁ బర్యాయపదము
సకలఋగ్వర్గంబులకు నన్యసర్గమౌ
నధ్వరాళికిఁ బ్రక్రియావిధమ్ము
వేదాంతములకెల్ల వినిమయరూపంబు
కర్మయోగమునకు మర్మపథము
భక్తియోగమున కాసక్తియోగం, బింక
జ్ఞానయోగమునకు సాధనంబు

నైన నీ దివ్యనామంబు నంబ ! యెవఁడు
నిత్యము జపమ్మొనర్చునో సత్యముగను
భవ్యమగువై భవంబును బడయఁగలుగు
నవ్యయానందపద మిట్టె యందఁగలుగు. 7

జ్ఞానాజ్ఞాన కృతంబుల
నేనస్సులఁ బరిహరింపనెంచి సతంబున్
నీ నామజపము సేయుచు
నీ నాధుని కంబ ! ముదము నింతురు మౌనుల్. 8

నీ నామము నీ ధామము
నూనినవర్ణముల నంబ ! యొంది వెలుంగున్;
శ్రీనాముఁడు శ్రీధాముఁడు
గా నీ పతి, గృహము దీపకళిక నెటు లటుల్. 9

అంబరో ! నింబకాష్ఠచూర్ణంబుఁ గూడఁ
బచ్చకర్పూర మిడఁ దావిఁ బరగు నటులఁ
బ్రిచురచతురంబుగాని మృద్వచనరచన
నీదు శుభనామ మంది రాణించుఁగాదె ! 10

"అంబ ! లక్ష్మి ! పద్మ ! అబ్ధిరాట్పుత్రి ! శ్రీ !
పద్మసద్మ ! విష్ణుపత్ని ! యమృత
సహజ ! రమ !" యటంచు జపియించువాతండు
శాంతిఁగొనెడు నెపుడు; శాంతిఁగనఁడు. 11

వేదశాస్త్రమ్ములను వల్లె వేయలేము,
మంత్రతంత్రమ్ము లభ్యసింపంగలేము
కాని నీ నామకీర్తనకార్య మొకటె
చేయఁగల మింక మమ్ము రక్షింపు మమ్మ! 12

నీ నామౌషధ మొక్కటె
గాని మఱేయౌషధంబుఁ గలుగదు భువిలో
నేనికి బహ్వాలంఘనముల
మానవిభవరోగములను మానుప నంబా! 13

కఠిననియమపూర్వకంబుగాఁ గర్మలు
సలిపి హరికిఁ బ్రీతిఁగొలుపలేము;
మాకు జనని! యింక మహితమౌ నీ నామ
కీర్తనంబె కలినివర్తకంబు. 14

కలియుగమున మా కెప్పుడుఁ
గలియుగమును బాప నాల్కఁ గల్గుత నంబా!
తులకింపఁజేసి భువి సిరు
లొలికించెడి నీదు నామ ముద్యజ్జపమై. 15

ధని కాసత్య గుణప్రకీర్తనము, త ద్దాస్యానుకూలప్రవ
ర్తన, మాత్మస్తవనమ్ము, నన్యజన నిందాకార్య సంబద్ధ దు
ర్మనఉల్లాసము, దుర్వచః క్రమము, దూరాజ్యాంగ దూరాడ్వమ
ర్శనమున్ వీడగ నమ్మ! నామజపదీక్షన్ నాల్కకి మ్మా! యిఁకన్,

జేనెండుపొట్టఁ బోషింప నాలుక సేయు
ఘోరవాక్పాపముల్ గూలునట్లు
'దేహి'యన్ దీనులచెస నుగ్రులగువారి
స్తుతియించు దుష్కృతుల్ దొలఁగునట్లు
శ్రుతులందు, స్మృతుల, సంహితలందుఁ గతిఁగాన
రానిపాపౌఘముల్ రాలునట్లు
ఎట్టుఁబోవఁగనీక చుట్టిన సంసార
ఘోరదావానలం బాఱునట్లు

భర్తృనామమ్ముజతఁగూర్చి పగలురేయి
పరగ నాల్కకు నీ నామజపముఁగూర్పు
మమ్మ! కలిలోన నామజపమ్ముకంటెఁ
గామధేనువు మఱియొక్క టేమిగలదు ? 17

మనసిజతాతపాదునకు మానసతుష్టికరమ్ములౌటలో
ననయము నంబ! సామమును నామము రెండు సమమ్ము లయ్యునన్
కనుఁగొన నందు మోవ మధికంబిడు నంతిమ మాదిమంబుక
న్నను భవదీయనాథునకు; నద్ది యుపద్రవశూన్యమౌటచేన్. 18

దాస పాపౌఘ నిదాఘ తాపము నార్ప
కరినమౌ పర్జన్యగర్జయగుచు
దేహరోగ వ్యాళ బాహుళ్య మణఁగింప
గరుడ గరు న్మరుద్ఘాతమగుచు

దారిద్ర్యహస్తి మస్తచ్ఛేదన మొనర్ప
నతిరూక్ష సింహాట్టహాస మగుచు
సంసార దీర్ఘ నిశావసానముఁ దీర్పఁ
బ్రత్యూష విహగ రావము గనగుచు

నంబ ! నీ నామజపము సతంబు మాకు
దోషములఁ గూల్చి, కూర్చి సంతోషములను,
ఐహి కాముష్మిక సుఖంబు లందఁజేసి
మహితపద మొంద సోపానమార్గ మగుత ! 19

కమలనిలయ యనుచుఁ గమలాక్షసతి యంచు
వార్ధికన్య యనుచు వరద యనుచు
శ్రీ యటంచు భక్తచింతామణి యటంచు
నిదురలేచి తల్లి ! వినుఁ దలంతు. 20

పాఠాంతరము :-

రాజీవాలయ యంచు దైత్యారి దురోరక్షా యటం చంబుధి
భార్గిజజ్జన్మ యటంచు సర్వజగదంబా యంచు శ్రీ యంచునున్
భూజా యంచును జానకీ యనుచు సంబోధించి పాత్రితస్సులన్
నా జన్మంబు తరింప వేఁడుకొందున్ నా తల్లి ! రక్షింపవే !

అర్ణవసుత ! నీ పంచ ష
వర్ణంబుల నామ మహాహా ! బహుళ మహోపా
ర్ణవ మెడపును; గృహ సము
దీర్ణ తమస్తతినిఁ జిన్నిదీప మణఁపదే ! 21

నీదు మహనీయ నామాగ్ని మీఁద నాదు
మానసకషాయమును గడు మఱుఁగఁగాచి
యంబ! సేవించి యచికిత్స్య మైనయట్టి
జనన మరణ మయామయ మ్మణఁచి మింతు. 22

భోగమోక్షప్రదంబు సంపూర్ణ శమిత
దురితము సువర్ణదీప్తి విస్తరిత మైన
నీదు నామము నాల్కఁ గనేకజన్మ
రాశికృత పుణ్యమునఁగాని రాదు జనని! 23

'పట్టుఁడు కొట్టుఁడు నెట్టుఁడు
కట్టుం, డను యమునిభటుల కఠినవచనముల్
ముట్టవు కర్ణము లంబా!
గట్టిగ నీ నామజపముగల్గినచోటన్. 24

దుగ్ధపాథోధిజా! కామదోగ్ధ్రి యగుటఁ,
బ్రితిపదన్యాస భాసురవర్ణ యగుట,
దివ్యరవ గోష్ఠసంశుద్ధి భవ్య యగుటఁ
గామధేనువుగా దె నీ నామలహరి! 25

అంబ! రసనేంద్రియంబు జడాత్మ, గాన
నది రసాంతర రమణంబు నందు; నైన
వ్యసనములఁ బాపు నీ నామ మంది రసన;
యది యెటుల నొందఁగలదు రసాంతరమును? 26

సౌరభవిశేషములను విస్తార మొందు
నట్టి నీ నామదివ్యసుమాళి నంబ!
నీ గుణగణాలతో మాలగాఁగఁ గూర్చి,
నీ విభుని కిచ్చు నాదు వాణీకుమారి. 27

అరయ మన్వంతరములు మన్వంతరములు
మాత్రమే యుండు ఫలములమాత్ర మొదఁగు;
నమ్మ! నీ నామమంత్ర మనశ్వరముల
నైహి కాముష్మిక ఫలమ్ము లందఁజేయు. 28

అరయ స్వనివిష్ఠ వర్ణత్రయమ్ము నోము
నంబ! వర్ణత్రయాత్మకమైన ప్రణవ,
మల చతుర్వర్ణముల నోము నద్భుతమ్మ
వరల నీ నామ మేక ద్వి వర్ణమయ్యు! 29

ఆతపశాంతికై మునిఁగినఁ
బాతకమునుఁ గూల్చుగాంగవారివిధముగా
నేతీరున నీ నామము
వాతెఱ వెడలినను దివ్యఫల మిడు నంబా! 30

ఓ జనని! నీదు పద మది
నా జిహ్వను జేరఁ జేరు నఖిలపదమ్ముల్;
రాజే వశపడ నీక నా
యై జనులును దమకుఁ దామయై వశపడరే! 31

భర్తపేరుకంటెఁ బరమయి నీ పేరు
గుణము నిచ్చు. భక్తగణము మెచ్చు;
శంకయేల నంబ ! ఓంకారమే దీని
దార్ఢ్యపఱచునట్టి తారకాణ. 32

అల్పనామజపము సల్పువారలు నీదు
పేరువిలువఁ దెలియలేరు తల్లి !
బూడిదఁ బొరలాడు గాడిద లెఱుఁగునే
పచ్చకప్పురంపుఁబరిమళమును ? 33

నిఖిల సౌఖ్యదమగు నీ నామమును వీడి
సౌఖ్యములకు హీనజపముఁ గొనుట
పెరటిలోన నున్న పెన్నిధిన్ విడనాడి
బిచ్చమెత్తి బ్రతుకువిధమెగాదె. 34

దేవి ! నీ నామధేయాభిధేయమైన
రుచిరపీయూషరసమును గ్రోలి, నేను
విడుతు హీనమ్ములగ వాజిపేయఫలము
లగు మహామంత్రములఁ దృణప్రాయములుగ. 35

పరమపురుష నామ పద పూర్వమందు శ్రీ
కార వర్ణమహిమ ఘనముగాదె !
ఎల్లసుఖము లిచ్చు నేకాక్షర మ్మది,
మరణశరణమైన మంత్రముగదె! 36

చేతము సుప్తమైనపుడు, శీఘ్రముగా నసువుల్ ప్రయాణని
ర్యాతములై నయప్పుడు, కఫార్దితమై గళమున్నయప్డు, ఘో
రాతత యాతనేంద్రియ సమాశ్రితమై తనువున్నయప్పుడున్
మాత ! జపింపనిమ్ము విభునామము నీశుభనామయుక్తితోన్. 37

అంబ ! నీ నామంబు లఖిలింగమంత్రమ్ము
లకును బర్యాయమ్ము లగునుగాదె !
తల్లి ! నీ యభిధానతతి యఘమర్షణ
మంత్రమ్ములకు మాఱుమాటగాదె !
మాత ! నీ వాచకమాల పుణ్యాహవా
చనమంత్రముల కొక సంజ్ఞగాదె !
జనని ! నీ పేరు లష్టాక్షరీమంత్రమ్ము
నకు మారుపేర్లుగా నగునుగాదె !

మహిత గాయత్రి పుంసూక్త మంత్రములకుఁ
బ్రణవమునకును వ్యాహృతిగణమునకును
నీ యభిఖ్య లెల్లను బ్రతినిధులె గాన
నంబ ! నీ నామ మఖిలమంత్రాత్మకంబ. 38

నేమముల నైహికాముష్మి కామితములఁ
గామితమ్ములఁ దీర్ప నీ నామములను
జపము నొనరించుఁగాత మోజనని; యింక
మీఁద నామాస్యనిరసన నాదురసన. 39

# లక్ష్మీసహస్రకావ్యము

## అరవింద స్తబకము

జనని, పీతాంబరునికుటుంబిని వసించుఁ
బ్రీతిపూర్వమ్ముగా నహర్నిశము నెందు
నట్టియరవిందవనము నే నభినుతించి
వందన మొనర్తు జన్మసాఫల్యమొంద ! 1

ఇందిరా ! సతము నీ యరవిందమంది
రమున నిందిందిరార్భకుల్ ప్రమదమంది
ద్వారపాలకధర్మంబుఁ దాల్చియుంద్రు
చారుకేసర యష్టికా ధారులగుచు. 2

ప్రౌఢతర శోభనఖరాంశు వైభవాప్త
మంజిమమ్ము, సదాళిసంభావితమ్ముఁ
ద్వాత్పదమ్ము నభిఖ్యవే వారిజ మని
సూరిజను లెల్ల నుతియించు చుంద్రు జనని ! 3

కలిమియు లేమియున్, మఱి సుఖమ్మును దుఃఖముఁ, ద్వద్గ్రహోత్తతా
కలనముఁ దద్విరోధమును గల్గఁజేయును గాదె! తల్లిరో!
యలరఁడె పద్మమిత్రుఁడు సహస్రవసుండుగఁ, బద్మశత్రువౌ
కలువలఱేఁడు భిక్షుకశిఖామణియై క్షయమందుచుండఁడే! 4

కపటకిటిరూపమున క్షమాకలితుఁడగుచుఁ
బంకజాతమ్మున వసించుఁ బతియటంచు
భర్తృధర్మమ్ము ననుసరింపంగ నీవు
జనని! వసియించెదో పంకజాతమందు? 5

వసుసమృద్ధి నెంత వహియించియును బద్మ
మరయ నవసుమత్వ మందు; వింత!
తదను కూలమైన తత్పతంగాంగమున్
బరగు వసుసమృద్ధి; మఱియు వింత! 6

అంబ! సన్మానసోల్లసనంబుఁ గూర్చి
మహిత సదసద్వివేక ధర్మంబుఁ దాల్చి
భవ్యశుభశబ్దముల శ్రుతిపథముఁ దనిపి
పరమహంసగణమ్ము త్వత్పదముఁ గొలుచు. 7

కలవెన్నో భువనంబు లత్యధికసౌఖ్యావాసయోగ్యంబులై
కలవెన్నో మణిహర్మ్యముల్ భువనవిఖ్యాతంబు, లైనన్ భవ
న్నిలయమ్మై జలజాతమే యగుట యెంతేఁ జిత్రముం గొల్పెడిన్;
జలజాతాధికవత్సలత్వము విశేషమ్మౌనుగా మాతకున్. 8

జలజములన్ రకమ్ములవి చాలఁగఁగల్గును, మల్లెమొల్లలున్
గలుగు విశుద్ధపుష్పములు, కాని సరోజమె నీ గృహమ్మగున్:
తులసినె తుష్టినొందుఁ బతి తోరపుసౌరభవస్తులుండినన్;
కలుగుపరీక్ష కంబ! యధికాంశ మదృష్టమె కారణమ్మగున్. 9

అరవిందగేహ! నీ యరవిందనిలయంబు
తద్విష్ణుపదమంచుఁ దలఁపఁబడును
వెలసి సూర్యాలోక విలసనంబున సద్ది
బహురుచ్యమధురసస్వాద్యమగును
అచట శ్రీకృష్ణరూపాళులు రసపరి
తృప్తి దీపింపగాఁ దిరుగునెపుడు
శ్రుత్యంతసంచార సుభగనాదముల 'న
న్నాదోఽహ' మనుగీతు లాలపించు

నమ్మ! ఆరీతినే నీదునాలయమున
రసము గళదఘ్నముగఁ గ్రోలి యసమలీల
లలర 'దాసోఽహ' మనుగీతు లాలపించు
నామనోభృంగమునకు నానందమిమ్మ! 10

మొనసి సూర్యాలోకమున హర్షమొందు దో
షాకరాలోకనమందు ముణుఁగు
నాశ్రితాళికి జీవనాధారముగ నిల్చుఁ
దలఁగఁ బంకంబు నధఃకరించు

రసనమన్వితభూము లందేలు నాళీక
శబ్దంబు వహియించు సంతతంబు
హంసలు తనుఁజేర నానందపదమిచ్చు
పూజార్హతను మించుఁ బొలుపు నించు

దేవి ! నీ సన్నిధానప్రభావమొంది
ఏవి వలసిన నవియ మా కీయఁగలుగు
త్వత్పదంబునకున్న వైభవముఁ దెల్ప
జన్మజన్మములకు నాకు సాధ్యమగునె ! 11

త్వత్పదరజమ్ము నెపుడు నౌదలధరించి,
నీకరమునొంది, నీపేర నిలిచి, పద్మ
మంబ ! నీమహోజ్జ్వలదాస్య మంది వరలు,
గురువులను శిష్యులేరీతిఁ గొలుతు రట్లు, 12

ప్రొద్దుననె తూర్పుగా నబ్ధి మునిఁగి వచ్చి
పరిచరభృత తప్తచక్రుఁడై శుచికరుఁడయి
విష్ణుపదస క్తితోడ వే వేగఁ దెఱచు
నంబ ! బ్రధ్నార్చకుండు నీ యాలయమును. 13

జనని ! సురజ్యేష్ఠజననంబునకుఁ దాను
నాధారభూతమై యమరియుండి
అమ్మరో ! చారుపీతాంశుకమ్మెను దాను
నెల్లవేళల ధరియించియుండి

అంబ ! సాంద్రామోద మనిశంబుఁ గని తాను
భువనంబులకు ననుభవముఁ దెచ్చి
మాత ! అమృతపదంబై యుండి తాను న
య్యమృతంబుఁ దనయాశ్రితాళి కిచ్చి

శ్రీనివాసాభిధానంబు నూని, హరికి
నన్నిట సధర్మమయ్యు నీ యజ్ఞగృహము
తన్మధుస్నిగ్ధత నగు వైధర్మ్య, మైన
గుణసమూహమునం దిది గణన కగునె ?

అంబ ! త్వన్మందిరాహితుం డైనవాఁడు
క్షయముఁగను, మఱి స్వాశ్రయఘాతుకుఁడగు;
నీరజవిరోధి క్షయమంది నెత్తికెక్క
పరమశివు నాదిభిక్షుగా నెఱపలేదొ!

అంబ ! నీధామమైన పద్మంబునకును
విష్ణుధామమౌ మార్తాండబింబమునకు
స్నేహము నిసర్గసిద్ధమై నిఖిలముదము
విడును; మాకునువిడు నవి నుడువవలెనె?

పేరునకు నెన్ని లేవు వేర్వేఱుపూవు,
లన్ని కలిసినఁ బద్మసామ్యంబు రాదు
జనని ! పద్మంబు హరికరచరణనయన
ధర్మముల నొందు నీ సన్నిధానమహిమ.

హరికరస్పర్శచేతఁ బ్రహర్షమొందు,
భవ్యరుచిరాశికాంతమై పయసునందు
జన్మమునుఁ గొను, నీ నివాసస్థలంబు
కమల ! కమలాఖ్యఁ గొనుట యుక్తంబుగాదె. 18

భృంగాంగనాబృంద సంగీతనినద మ
హోచయసౌభాగ్య మొందియుంట
మంజుల కింజల్కపుంజ విస్తారిత
స్తంభసహస్రముల్ దనరియుంట
సమ్యగ్వికాస విస్ఫారితదళ చిత్రి
భిత్తిసౌందర్యంబు హత్తియుంట
విమలమౌ సరసున వెలయుటఁ, గర్ణికా
స్వర్ణపీఠంబును బడసియుంట

పద్మ మది నీకుఁ జక్కనిసద్మమగుచు
నహహ ! యామోదమొసఁగు భక్తాళి కెపుడు;
మానితవిలాస ! తోషితశ్రీనివాస !
అమలదరహాస ! హరిహృదయాధివాస ! 19

జననిరో ! కుశేశయంబు నీ సన్నిధాన
మహిమఁజేసిస్వర్ణస్ఫీతిం బడయ, నందు
పుట్టినతఁడు హిరణ్యగర్భుండెయయ్యెఁ
ద్వదనుబంధ్యనుబంధుఁడున్ ధన్యుఁడుగదే! 20

కమలవనమధ్యపుండరీకమున నీవు
వసతిఁగావింప, నినుఁ బోలవలె నటంచు
నమలపురమధ్య పుండరీకమున విభుఁడు
వసతిఁ గావించె; మీ ప్రేమ మసమ మంబ! 21

అంబ! వైకుంఠపదముఁ, బద్మంబుఁ, గూడ
నీరజంబులు; రెండు నీ నివసథములె;
ఒక్కటి త్రిపాత్పదంబు, వేఱొకటి యందు
షట్పదపదంబు నగుట, యాశ్చర్యమగును! 22

అంబరో! సురాదిజీవసంఘంబు లెపుడు
నమృతనిష్ఠను నంతరంగముల నిన్నుఁ
దాల్చునని హరి వాని హస్తముల నిమిరి,
మీఁద సాలోక మెసఁగ నామోద మెసఁగు. 23

జలమునందును జననిరో! జలజమందు
కమలనామంబు రెండిటం గలిగియుండు;
నొకట హరి శాయియై యుండ, నొకట నీవు
స్థాయివై యుందు; విద్ది చిత్రంబుగాదె! 24

రమ! స్వర్ణ స్ఫూర్తిని, క్షమ
నమరియు 'నాల'మనుదాని నందును గుణదా
ర్ఢ్యముఁలేమి నళిన; మదియే
యమరు నలంకారమై త్వదాశ్రియవశతన్. 25

వరపరాద్వైతభావమ్ముఁ బడయునీదు
దర్శనము సద్గుణాళికతను వెలార్చు,
నీవు నాళీకపదమున నిల్తు;వింక
కల్పనగము నీ యాలోకగణము జనని ! 26

ఉత్తమస్ఫూర్తి యంత్రిత చిత్తవృత్తి,
సద్రజోవృత్తి. యయి సారసత్వ మగుటఁ
దనరును ప్రధానమగుచు నీ స్థాన, మెపుడుఁ
దాల్చియుండును మహదాదితత్త్వ మంబ ! 27

అంబ ! సింహాసనంబు నీ కర్హ మగుటఁ
దానె సింహాసనంబుగాఁ దనరనెంచి
తత్సరోజంబు కేసరిత్వము వహించి
నిభవిరోధంబుఁగూడ సహించి మించె. 28

అబ్జ మంబరమణివసు ప్రాప్తి నలరె,
విధుని ద్వేషించి యమృతైకవృత్తి నందెఁ,
గాంతుఁ దలరంగఁ గామమార్గణతఁ గాంచె,
దేవి ! నీ సన్నిధాన ప్రభావమునను. 29

హరిసహితను పంకజమం
దిరశయితను క్షీరవారినిధిదుహితను నిఁ
వరదా ! మేల్కొల్పరె బం
భరవైతాళికులు సుప్రభాతవినుతులన్ ? 30

జననిరో! సహంస కాసార ఘనబహూర్మి
కోజ్జ్వలయు వరకర్ణికాయుతయు నైన
యబ్జరాజి సహస్రివస్వాప్తి నలరు;
నాశ్రియింపవె సిరులు, నిన్నాశ్రియింప. 31

వేయిపడగలఁ గొని తల్లి! బిలశయమగు
భర్తృశయనంబు నీకు నివాసమగున?
సిరుల వే ఱేకులఁ గని కుశేశయమగు
భర్తృనయనంబు నీకు నివాసమగున? 32

పారాంతరము :-

వేయిపడగలఁ దాల్చునా? వేయిదళము
లలరునా? బిలశయమౌన? జలశయంబ!
నాధునకు శయన మొక్కటి, నయనమొకటి;
ఎటను నీ వాస మంబ? రెండిటను నగున?

అంబ! శ్రీసూక్త మనియె నీ యాలయముగ,
విభునికన్నుగ నాదిత్యవిద్య పొగడెఁ,
ద్వత్సుతునిజన్మభువిగ నధర్వ మనియెఁ,
బద్మమునకైనమహిమ నీవలనఁగాదె! 33

పారాంతరము :-

జలజమ నీ విభునయనము,
జలజ మ్మా మొదటివేల్పుజన్మస్థల, మా
జలజమ నీ గృహమగు, నిఁక
జలజాలయ! జలజమహిమ శక్యమ పొగడఁగా?

అంబ ! శైవాలకాంతరం బందియుండి
ప్రబల సారంగ లాంఛితవపువు నొంది
అమృతపదమంది దినకరప్రాప్తిఁజెంది
అబ్జ మది పుంనపుంసక ఖ్యాతివెలసె. 34

త్రిపదమితదేశ యాచనాప్రియుఁడు ప్రియుఁడు,
నీవు షట్పదమితదేశ నిలయ; వైనఁ
జిత్రమిది, మీర లిరువు రాశ్రితుల కెత్తు
రమితపదముల శతసహస్రముల, నంబ ! 35

నీ పాదద్వయమంటి రాలిన రజోఽనీకంబు మూర్ధంబునన్
బ్రాపింపంగలభాగ్య మానపడి స్వారాజ్యేంద్రుఁడే తావక
శ్రీపాదాగ్రములుంచు నంబుజము నాశ్లేషింపఁగా షట్పదీ
రూపంబుం గొనెనన్న, మాదృశులు మర్త్యుల్ తల్లి ! యేమౌదురో ?

పూర్ణచంద్రోదయ ప్రాశమున సరోగ
మంబుజము జ్వరోపహతమై, యంద నిన్ను
భాస్కరుఁడు వికసనము, విజ్వరముఁ, గూర్చు;
సవిత యారోగ్యదాత యౌ; జనని! నిజము. 37

కమలాసనగాఁ దన హృ
త్కమలంబున నెవఁడు నిన్నుఁ గని ధ్యానించున్,
కమలాసనుఁ డగు నాతఁడు;
కమలా ! ధ్యేయముగ ధ్యాత కాకుండునెటుల్ ? 38

తల్లి ! బహ్వాబ్దముల వ్యవధానమైనఁ,
దోడఁబుట్టువునుం జూడఁగూడ; దగుటఁ
జందురునిం జూడ నోడి, నీ సదన మీవు
వానియుదయంబునన్ మూసి వైతువాకొ ! 39

నీ నివాసమగుట నీరేజ మంబరో !
విష్ణునురముకంటె వేఱుగామి,
దానిభాగ్య మిట్టిదట్టిదంచును వేఱఁ
బొగడ నెట్లు శక్య మగును మాకు ? 40

# లక్ష్మీసహస్రకావ్యము

## అభయ స్తబకము

నీవే యభయప్రదవని
సేవించెద సతము, సర్వజీవులకును నీ
సేవా తదభావంబుల
దేవీ! యభయమ్ము భయము ద్వివిధమ్ము నగున్. 1

అనిలసుతునకు ననలభయమ్ము నణఁచి
యనిలసుతభయ మాసురాంగనల కెడపి
యభయమిడినావుగదె చల్లనైనతల్లి!
యాశ్రయించెద భవభయ మ్మడఁప నిన్ను. 2

ఆదర మేది దుఃఖవివశాత్మకుఁడై తపియించు నొక్క పు
హ్లాదుభయమ్ముఁ బాప, వెడలంగ నృసింహుఁడు సర్వలోకభీ
పదముఁడుగ స్తంభమం, దమృతవంతమునైనచటూక్తులన్ దయా
మేదురుఁజేసి తీ వుపశమింపఁగ లోకభయమ్ము లంబికా! 3

దిక్కఱియున్నమాదృశులఁదేల్పగ నీ వవతారమూర్తులన్
బెక్కులఁ దాల్చి కష్టముల వేఁగుట వీపతి చూడనోడి నీ
కెక్కడ బాధయౌనో యని యెన్నియఘమ్ముల నేమొనర్చినన్
లెక్కకుఁదేక మమ్ముఁ గరుణించి సుఖమ్మిడుఁగాదె ! యంబికా! 4

తల్లి ! సాధ్వసహితుఁడు సాధ్వసహితుండె
గాదె నినుభజింపనియెడ; నీదుమేని
ప్రభయ చంచల, దాని భావమున నిల్ప
ప్రభయచంచలుఁ డగుచు నెవ్వాఁడుఁగాఁడు. 5

స్తోత్రమ్ముల నీకరుణా
పాత్రులు పొందుదురు భక్తపాపలవిత్రీ !
అత్రాసముగాఁ బరమునఁ
జిత్రాసన; మిహమునందు సింహాసనమున్. 6

కారాగారముకన్నఁ ద్రాసకరమై కష్టాకరమ్మై మదా
ధారమ్మైన శరీరమందున సహంతామిశ్రితుల్ మాదృశుల్
పారావారసుతా ! నినున్ విడిచి యే బాటన్ బ్రవర్తింపనౌ
ఘోరమ్మైనయఘమ్ము నీఁగగ భవాకూపారమే లోఁగగన్ ? 7

అరుదౌ నీదుకటాక్ష మెప్పుడౌ యవశ్యప్రాప్యమైయున్నచో
జరుగున్ ముందె ఫలం, బభీతికరమై సర్వమ్ము సంధిల్లు; నా
సురసాసింహిక లెంత మ్రింగఁగొనినన్ చోద్యంబు వాతాత్మజున్
వెఱపే యంటదు తల్లి!యద్యతనభావిన్ నీదుచూపుండుటన్. 8

నీపాదాంబుజభక్తియుక్తులకు నౌనే మాకు జన్మవ్యథా
తాపత్రిసము. లల్పుఁడయ్యును బలస్థానాశ్రితుండైనచోఁ
బాపోదగ్రభయంబు లుండవుగదే! వ్యాధుండు! వేఁటాడునే
భూపాలాగ్రణి పెంచుచుండినమృగమ్మున్ బట్టి యేనాఁడునేన్. 9

వేదములవాసనయె లేదు, వేదవిదుల
సదమలాచారనిష్ఠయు మొదలె లేదు;
అయిన నీదయ నకుతోభయమ్ముగాఁగ
జననమరణాబ్ధి నీఁదు నా మనసు జనని! 10

స్ఫురదానందగుణా! సమస్తశరణా! భూతేశముఖ్యామరో
ద్ధరణా! నిత్యము నీవు నీ యభయముద్రాయుక్తహస్తమ్మునా
శిరసుంజేరిచి, చేరనీకు దరి రాశీభూతమాత్సర్య ధీ
దురహంకారవికారభూతముల చేతోభీతిదుశ్చేష్టలన్. 11

జనని! భవత్సమర్చనము సల్పుట కెవ్వఁ డనున్ముఖుండొ త
న్మనము భయావృతంబయగు, నౌ నభయం బిఁక నున్ముఖుండుగాన్;
నినుఁగొనిరాఁ బరాకువడి నీపతివింటికిభీతినొందె, య
ప్పనికి నుపక్రమించి వెఱఁబాసెను; భానుజుఁ డించు సాక్షియౌ, 12

నీ కనుకూలుఁడౌనెడ జనింపఁగజేయదు ఘోరరాక్షసా
నీకము లేశమున్ భయము, నీవ్యతిరేకిఁ దృణమ్మె వజ్రమై
దాఁకును; దల్లి! రాక్షసశతమ్ము లెదుర్కొన నాంజనేయునిన్
దాఁకెనె భీతి? కాకమును దాఁకెనుగాదె తృణమ్మె యస్త్రమై! 13

అంబ! వనమనుసంసారమంబుఁదిరిగి
తిరిగిఁ వానరులను నరుల్ తెలిసి నీదు
స్థితిని సంపాతియను గురుదేవువలన,
స్వామిహారినుడి మీఱియు భయముపడరు. 14

కమల! భజనకర్మకునెదిఁ గర్మయగునొ,
యెది యపాదాన మర్కయమేంద్రభీతి,
కట్టి త్వత్ప్రియాంఘ్రియుగి 'దాసోఽహ'మనినఁ
ద్వత్కరుణచే నభయసంప్రదాన మగును. 15

అమరేంద్రాదులకుఁ భయాస్పదము డాయన్ బ్రహ్మసామీప్య,మే
శ్రమయున్ లేక య,దాని నీకరుణఁ జేరన్ జాలఁగా నాకు ధై
ర్యము వాటిల్లును; దల్లి! దాడిమరుచిఁ రాజిల్లురాణ్మౌళిర
త్నము రాజ్ఞీకరకేళికాశుకము లతాగ్రసంబునన్ జేరవో! 16

"అవనీజన్ రఘురామమూర్తి కిడి, యన్నా! నిల్పు వంశంబటం
బెవఁ డంబా! దశకంఠుతాఁపులకు లక్ష్మీభూతుఁడై పల్కె నా
యవిభీతుండు విభీషణుం డసురరాజ్యం బొందఁడే రాముచేఁ!
లవలేశంబు త్వదర్థమౌ శ్రమ మహాలాభంబుఁజేకూర్పదే! 17

సంసారాంధతమిస్ర
ధ్వంసితులకు మాకు నీదు స్వర్ణాంగవిభా
మాంసలమై రక్షోలయ
శంసకమౌ దేహ మభయసాధక మంబా! 18

అనునిత్యమ్మను మృత్యుదేవతను బ్రత్యాసన్నఁగాఁజేయుచున్
దినముల్ చెల్లుచునుండెఁ, బాపముల కంతే లేదు నానాఁటికిన్,
కినుకన్ గాలుఁడు పాపులల్ విడునె? నా కేశిక్ష వేయించునో!
మనమల్లాడెడిభీతినొంది, యిఁక నమ్మా! త్రాసమున్ మాన్పవే!

ప్రభవం బొందు భయాభయంబులు హరబ్రహ్మాదిసర్వామర
ప్రభులన్ నీనిమిషోన్మిషంబులఁ, బరబ్రహ్మానుసంధాయినీ!
ఇభరాణ్మస్తక మెక్కి చాటెదను నే నీసత్యమున్ ఘంటికా
ప్రభవమ్మైన ఢణం ఢణంఢణఢణధ్వానమ్ము మిన్నంటగన్. 20

నిప్పులఁగ్రక్కునేత్రముల నిల్చి భయంకరకాలకింకరుల్
తప్పుల నెన్ని తీక్ష్ణతరదండనముల్ విధియించి నన్ను నే
తిప్పలఁబెట్టకుండ భయతీవ్రత సుట్టకయుండ, నమ్మ! నీ
తెప్పలలోసుధారసఝరిన్ వెలయించి కనుంగొనంగదే? 21

ఎత్తినకిన్క నాయఘము లెన్నియొ యన్నిటి కన్నిశిక్షలన్
కత్తులబోనులన్నిలిపి, కాకులచేఁబొడిపించి, సమ్మెటన్
సుత్తులఁగొట్టి, మంటలిడి చుట్టెద రంబ! పరేతరాడ్భటుల్;
చిత్తము భీతినొందె; ననుఁజేకొని నీ వభయం బొసంగవే! 22

అనిశము దేశకాలములయం దగు మార్పులతోడనున్నినా
తనుచరితమ్ము నారసిన, దారుణపాపుఁడనైననాపయిన్
కినుకవహించి శౌరిప్రతికృత్యము లెంచునటంచుఁదల్లి! నా
తనువు వణంకు; నీయభయ దానము నెంచిన ధైర్య మేర్పడున్.

బాహిరమందు, లోన నతిబాధలఁగొల్పును శత్రుషట్క మీ
దేహికి, వానియాతనలఁ దీర్పఁగఁజాల రజాదులేని, నా
శ్రీహరి శక్తుఁడయ్యుఁ గృపఁజేర్పఁడుపాపులఁ, దల్లి! "పాహి మాం
త్రాహి" యటంచుఁ దావకపదమ్ములఁ బట్టెద భీతి నెట్టెదన్. 24

తమసాన్వయంబు తద్వాల్మీకియందగుఁ
గాని నీభక్తులఁ గానమంబ!
మన్యుభారముశత మన్యునందేయగుఁ
గాని నీభక్తులఁ గానమంబ!
యమసంగమంబు సంయములయందేయగుఁ
గాని నీభక్తులఁ గానమంబ!
దృఢగదావాప్తి నీదేవునందేయగుఁ
గాని నీభక్తులఁ గానమంబ!

క్షుదహితధర్మ మద్ది రోగులనె యందె,
భవకృతము దుఃఖ మది మనోభవునె యందె,
త్రాస మది కుత్సితంపుమృత్యమునె యందె,
కాని నీభక్తులం దివి కానమంబ! 25

అందగ సృష్టిసంస్థితిలయంబుల లోకములెల్ల సర్వదా,
యందక చర్మచక్షువున, కందక మాటకు, వెల్గుబ్రహ్మమం
దుందువుగాదె మేము భయ మొందకయుండగ నెప్పుడంబ! నీ
వందు వసింపకున్న భయమౌ గద మాదృశభక్తకోటికిన్. 26

ముఖవికారుండు భీతుఁ డూష్మణుఁడునైన
రావణానుజుఁ డానందరసమునందుఁ
దేల వెన్వెంటనే భీతిఁ దీర్చె నంబ!
రామభద్రుండు త్వద్దయాప్రసరణమున. 27

అల్పవిదు లర్థముల మార్చ, నంబ! శ్రుతుల
గతులఁ బౌరాణికోక్తులు గాచినట్లు,
పాపతతి భీతి నణఁగు నీవాని నన్ను
వృద్ధినొందింపవే వెంట వెంట నుండి. 28

దుష్కాలానుగుణప్రతుల్ శ్రుతిపథాంధుల్ పుణ్యనిష్కాసకుల్
నిష్కారుణ్యమతుల్ తురుష్కయవనాస్వీతక్రియుల్ దుష్టధీ
శుష్కాలాపులు నాకుఁగూర్చ భయమున్ జోద్యంబుగాఁ ద్వద్దయా
విష్కారమ్మునఁ జేసి, పంగుజను నబ్ధిన్ బోలె దాఁటింపవే! 29

'కా కా ఉభయప్రదా' యను
వాకులు వ్యస్తములుగాగఁ బ్రశ్నించుకొనన్,
'కాకాఉభయప్రదా' యను
వాకు సమస్తమయి జనని! ప్రత్యుత్తరమౌ. 30

# లక్ష్మీసహస్రకావ్యము

## దేవతాంతరపరిసంఖ్యాన స్తబకము

ఏమహాలక్ష్మీకృప లభియింపకున్న
నక్షములౌ దేవతాంతరుల్ రక్ష, కట్టి
నవ్య వందారుబృంద మందారమైన
నందగోవిందసుందరి నాకు దిక్కు. 1

ఈవె గలిగిన దేవత లేల యింక ?
ఈవె యలిగిన దేవత లేల యింక ?
ముదములఁ గొలుపఁ దల్లి ! యాపదల దులుప
దేవతాంతరులకు శక్తి నీవకావె ! 2

అంబ ! చల్లనియుల్లంబు నంది యెల్ల
సంపదలఁగూర్చువిను వీడి, జాల్మఁడెవఁడు
తాపకారుండు సతతోష్ణధర్ముఁడైన
ఆశ్రయాశను నాశ్రయ మంద నెంచు ? 3

ఇడియుఁ దనియవు, భవముఁ దరింపఁజేయు
దీనవత్సల వీ నిన్ను మాని యెవ్వఁ
డల్పదశనున్న శుచిసఖు నార్పివైచు?
గంధవహుని బ్రిభంజనున్ గడఁగి కొలుచు? 4

యమవిషయగతిం బ్రాణుల కందఁజేయు
నప్రభుని బాశహస్తు నేయతఁడు తల్లి!
సాదరత్రాణచిత్తపరిశస్తవైన
పద్మహస్తను నిను వీడి భక్తిగొలుచు? 5

పరుషకరములఁ గువలయధ్వంసకుఁడగు
తపను సద్వసుహరుఁ గొల్చునెపుడునెవఁడు
సాదరైశ్వర్యకారిణిన్ సకలవిశ్వ
ధారిణిన్ నినుఁ జల్లనితల్లి విడిచి? 6

తనపుత్రుండగు కాకదానవునిబాధన్ బాపుకోలేని వ్య
ర్థుని దీనున్ శతమన్యు నెవ్వఁడు దనున్ బ్రోవంగ సేవించెడున్?
జననీ! శత్రునిఁ గాకదానవుని దీనత్రాణదీక్షామహా
ఘనతన్ గాచిన మన్యుదూరవగు నీకైంకర్యమున్ మానుచున్. 7

జననీ! నిన్ను మహావిభూతికమరస్వామీష్టదన్ వీడి యా
ధనదున్ గొల్తురు బుద్ధిలే కొరులు, లేదా! పోద! కోకొల్లగన్,
ధనమున్నందుకు మిత్రుభైక్ష్యదశనుం దప్పింపఁ డేనాఁడునుణ,
ధనదుండన్నయభిఖ్య సార్థమెటు? వ్యర్థం బశ్వకర్ణంబటుల్. 8

పూర్వపక్షప్రౌఢిఁ బొడచూపు నాతండు
వేదసిద్ధాంత సంవృతవు నీవు
బుద్ధిచూడామణిశబ్దవాచ్యుఁ డతండు
కాంక్షితాధికదానకరవు నీవు
అహిముఖదూషిత మహితకళుం డతం
డలఘుబుధస్తుతకళవు నీవు
అధిగతశితకలంకాశయుం డాతండు
నిష్కళంకాశయాన్వితవు నీవు

కలనొసంగినమాత్రన క్షయుఁ డతండు
సకలమొసఁగియు గూడ నక్షయవు నీవు
చంద్రునకు నీకు నింత వైషమ్య మమర
నెవఁడు ? నిను వీడి శశి నాశ్రయించునంబ ! 9

ఉచ్చభావ మనిత్యమైయుండి, యెపుడు
స్థానభేదంబుచేఁ గ్రూరతనువహించు
గ్రహములను, విన్ను సతతోచ్చగతిని సతత
మ్మృదుమతివి, వీడి, యెవ్వఁ డర్థించునంబ ? 10

భవ్యశాఖా ప్రవృద్ధ సుపర్ణవాహ
జలధిభవకల్ప తరువు నిన్ జనని ! విడిచి
స్థాణుజాతుని శరవణజను విశాఖు
న య్యపర్ణోద్భవుని నే ఫలార్థి గొలుచు ? 11

శ్రుతిపథంబునవర్తించుచున్న నిన్ను
తల్లి ! సాధుజనాదరాదరను వీడి
నిర్మితశ్రుతికంపనకర్మ శుద్ధ
సాధువారణముఖు నేరు సంశ్రయింత్రు ? 12

భవవిదూరను క్షీరాబ్ధిభవను నిన్ను
భక్తసులభను వీడి, యెవ్వాఁడు తాను
జననిరో ! గాఢతర భవసంగయైన
ఘనశిలోచ్చయభవను దుర్గను భజించు ? 13

స్థానమ్మౌను శ్మశాన మెల్లపుడు, భూతప్రేతబేతాళులా
స్థానస్తారులు, మాల లస్థితతి, వస్త్రం బార్ద్రిమాచర్మ మ
వ్వానిః శూలినిఁ గొల్తురిగా కోరులు; నేఁ బద్మాసనస్థన్ నినున్
ధ్యానింతున్ సురసేవితన్ గలితముక్తాహార వస్త్రస్తుతః. 14

అభిజాతను, హంసగతిన్,
విభవన్, నిను వీడి యెట్టివీఁటిడియును దా
నభవుని, నధరీకృతహం
సు భజించున్ నాభిజాతు శుభతతులొందన్ ? 15

ఇందిర ! వికసత్పంకజ
మందిర ! నీపాదపద్మమందెను నాచి
త్తేందిందిర, యసమాఖిల
బృందారక వగుట పాపబృంద మడంపః. 16

నీవు కరుణించినను కరుణింపకున్న
నన్యదైవము లేమి సేయంగలారు ?
తుష్టుఁడైనను రా జసంతుష్టుఁడైన
నంబ ! పరిజను లేమి సేయంగలారు ? 17

దృష్టాదృష్టములగు మా
యిష్టమ్ముల నీవె దీర్ప, నేలాయితరుల్ ?
స్పష్టపడవస్తు లరుణుని
ఘృష్టుల, మఱి వేఱె దీప మేలా? జననీ! 18

ధాత్రిపై శాశ్వతైశ్వర్యధాత్రి నీవు
గలుగఁ? బరిమితఫలదులఁ గొలుచునెవఁడు ?
సస్యభరితమ్ముఁ జోళరాజ్యమ్ము విడిచి
దేవి ! యెవ్వాఁడు వింధ్యప్రదేశమేగు ? 19

పామరుం డొక్కఁ, డన్యదేవతలు నీవు
నొక్కటే యన్న నీకేమి తక్కువంబ !
అమరనది, పంకగర్తమున్ సమములంచుఁ
గప్ప కూసిన సురనదిగొప్ప చెడునె ! 20

అంబ ! నీవిడుసిరులు నిత్యములు, గాని
క్షుద్రదేవత లిడునట్టిసొత్తు తిరమె ?
అన్నమును దిన్నపుష్టి నిత్యమగుఁ గాని
శ్వాసఁబూరింపఁ బుష్టి యేపాటినిలుచు ? 21

అంబ ! నీవొకతెవిడు కల్యాణఫలము
లితరు లిడలేరు వేయిమం దేకమైనఁ,
బూర్ణిమాచంద్రుఁ డిడినసంపూర్ణసుఖముఁ
గూర్చునే తారకల్ కోట్లుకొలఁదియైన ? 22

క్షణము భవదీయ పాదసంసక్తమైనఁ
జిత్త మెటు లన్యదేవతాయత్తమగును ?
క్రమమాకందపల్లవఖాదియైన
కోకిల వెదురుఁజిగురులఁ గోర్కెఁ గొనునె ? 23

భవతరణ మంబ ! నీపాదభజనఁగాక
క్షుద్రతరదేవతలఁ గొల్వఁ జొప్పడునొకొ ?
ప్రథిత గంభీరఘోర వారిధిని సుదృఢ
తరణినిన్ విడి, తెల్లుతో దాఁటనగునె ? 24

మాత ! నినున్ భజింప నొకమాఱు, లభించెడిసార్వభౌమవి
ఖ్యాతి త్వదన్యదేవతల నందఱఁగొల్చిన నౌనె ? యబ్ధిపై
సేతువుఁ జూచుచోఁ గలుగుసిద్ధి లభించునె యెన్నఁడైన, నా
సేతుహిమాచలమ్మునను జిల్లర వంతెనలెన్నిచూచినన్ ! 25

ఆశఁగొనుదురె త్వత్పదధ్యానధనులు
తరళతర మన్యదేవతాదత్తధనము !
నెన్నఁడైనను త్రిభువనసృష్టికర్త
యైందజాలికసృష్టి కాహ్లాదపడునె ? 26

ఆత్మపోషకుం బాము కాటందునట్లు
క్షుద్రదేవత లాత్మభక్తులనె కూల్తురు;
చెట్టు నీడనొసంగు స్వచ్ఛేదకులకు
నెట్లొ, దోషులనున్, బ్రోతు వట్లు నీవు. 28

ఎప్పుడుఁ దల్లి ! సౌఖ్యమిడు దీ వొకయింతభజింప, సేవలోఁ
దిప్పలుతప్ప సౌఖ్యములఁ దేల్చుట తక్కువ క్షుద్రదేవతల్;
కప్పురమమ్మ లాభ మధికంబగు, మోయుశ్రమంబు స్వల్పమౌ;
నుప్పను మోయ నొందుశ్రమమో యధికమ్ము, ఫలమ్ము స్వల్పమౌ.

అరయగ మీద్వయమ్ము విడి; యన్యుల నెందఱఁ గొల్వ నేమియౌ ?
గురుతరదీక్షతోడ నవకోటిశివాలయపూజఁ జేసియున్,
గిరిశునిఁ గొల్చియుం, దుదకుఁ గీడ్పడె నంబ! దశాస్యుఁ డింకఁ; ద్వ
ద్వరుశరణంబుతో సుచిరభాగ్యము లందె విభీషణుం డహో ! 29

నిన్ను సేవించువాఁ డంబ ! యెన్నఁడేని
దేవతాంతరసేవకై తిరుగునొక్కొ !
నిరవధికమైనసిరి తనపరముగాగ
నెవ్వఁడేన్ లోభిఁ గొలువఁగ నెగఁబడునొకొ ! 30

# లక్ష్మీసహస్రకావ్యము

## దశావతార స్తబకము

పదియవతారంబుల నిను
నెదియోరూపమున సంశ్రయించుటచే నీ
హృదయేశుఁడు సాధించెను
సదవనకార్యములు సౌఖ్యజననీ! జననీ! 1

నీదయారస సహితుఁడై నీదయితుఁడు
మత్స్యరూపంబు ధరియించి మాత! తొల్లి
ధాత నష్టశ్రుతుండుగాఁ దనర నాతఁ
డెపు డనష్టశ్రుతుండుగా నేర్పరించె. 2

"శ్రీసతిదృక్ప్రసారము ఫలించిన, శత్రులచేత నెన్నఁడో
పాసినసంపదల్ తిరిగి వచ్చును గజ్జెలుకట్టుకొంచు" నన్
భాస నిజంబుసేయుటకొ? త్వత్పతి త్వన్నయనాకృతిన్ గడున్
భాసిలుమత్స్యమై, యొసఁగె బ్రహ్మకుఁ బోయినవేదజాతమున్. 3

'సాహిశ్రీరమృతాసతా' మనుచు నీ సంజ్ఞాశ్రయంబుల్ శ్రుతుల్
బాహాటంబుగ నీకు దాస్య మొనరింపన్, శ్రీధరుం డెంతో యు
త్సాహంబొంది, పయోనిమగ్ననిగమోద్ధారంబుఁ గావించె, దా
సోఽహమ్మంచు భజింప నేమనిను, జన్మాంభోధి దాటింపడే ? 4

కమల ! నీయం దమందరాగంబుఁ గల్గి
యబ్ధియందున్న నిన్నుఁ దా నందఁదలఁచి,
నాఁడ దానవహంత సంతసముతోడ
మందరాగమ్ముఁదాల్పఁ, గౌర్మతను వొందె. 5

ఉరసుననే కాక నినుఁ
శిరసుననున్ దాల్ప జనని ! శ్రీహరి సీదౌ
పరమాంశయైన ధరణిని
ధరియించెను కోలరూపధరుఁడై తలపైన్. 6

ఆహిరణ్యాక్షుఁ డబ్ధిగర్భాంతరమున
దాఁచి, ధరణిని నీకు సోదరిగఁ గూర్చె.
కమల ! మఱచలికిం గల్గుకష్ట మరసి
హరి వరాహావతారుఁడై యాపెఁ దేల్చె. 7

చల్లనింటను బుట్టినచల్లనమ్మ
వుగ్రనరసింహుక్రోధముఖోద్ధమౌ మ
హానలముఁ జల్లఁబఱచితి వంబ ! నాఁడు,
కారణగుణమ్ము కార్యసంక్రమితమయ్యె. 8

అలహిరణ్యవర్ణ వని, హరిణివి నని,
యాగమముల దెలియనైన నీవ
యలహిరణ్యహారియగు హరిరూపుని
యంకపీఠి నిలుచు టంబ! యింత! 9

అవనగతితో గజావన మాచరించు
హరిణరక్షణదృష్టి నయ్యద్భుతహరి,
నబలవయ్యును నీ వంబ !యద్భుతముగ
గుణములం గూర్చి బంధించుకొంటివిగదె! 10

అంబ ! హర్యక్షపదమును, హరిపదమును,
ఆ హిరణ్యాంగదతయుఁ, బ్రహ్లాదవృద్ధి
కార్యము లభూతపూర్వముల్ గావు; పూర్వ
హరియ పురుషోత్తరుఁడుగ నీ కద్భుతమిదు. 11

జననీ ! నేను హిరణ్యదానరతులై సద్భక్తరక్షావిధా
ఘనదీక్షావ్రతులై దురాత్మక భయంకార ప్రికారాంగులై
యనిశ శ్రీకర పాపలోపకర దివ్యాలోకనాపాంగులై
జనులన్ బ్రోచుపురాణదంపతుల నశ్రాంతంబుఁ గొల్తున్ మిమున్.

వక్షమందున్న ని న్నంబ ! వామనుండు
హరిణచర్మంబునన్ గప్పె నాశ్రమాను
కూలముగ నందు, వటు లనఁగూడునె! బలి
కెడప నీదృష్టి, నజినమున్ దొడిగె నంతె. 13

బ్రహ్మచర్యమునను నిన్ను భర్త విడక
యంబ! హరిణాజినముగ దేహమునఁ దాల్చె;
ఈవె లేక మూఁడడుగులే నెట్లుదొరకు?
నెట్టు లవి జగత్త్రయముగా వృద్ధినొందు! 14

ఆకాంక్షన్ గొని కుప్రతిగ్రహము దైత్యప్రాప్తమున్, వృద్ధితో
నాకారంబును బెంచి దాత యఁట, గోత్రారాతితమ్ముండుఁ బా
త్రాకారంబును నొందె; నందె శివసౌఖ్యాపాదమౌపాదక;
మ్మోకల్యాణి! యఘావలిం గెడపునిన్ మోవంగ వక్షస్థలిన్. 15

వడుగ! యెచ్చట నీదువాసమ్ము దెల్పుమా?
సద్గుహాంతరము వాసమ్ము మాకు,
అడుగుదో నీవు ఘనాశనమ్మను వటూ?
అఘనాశనాదర మగును మాకు,
ఈవు పాణిగ్రహణేచ్ఛతో వచ్చితో?
నెమ్మిమాకేలఁ బాణిగ్రహణము,
అడుగు మేమడుగుదో? యడుగులు మూఁడిడు
మదియె త్రిజగన్మిత మగును మాకు,

బలివిభునిప్రశ్నలకు బదుల్ వ్యాజరీతిఁ
బలుకువటుపటువచనలో మెలఁకువఁ గవి
నవ్వుకొనవాక్కాన్ నాధువిన్నాణమునకు
నురమునం దంబ! కనుపడకుండి నీవు! 16

"బలియిడగాఁ ద్రిపాత్కృతలభాగము, శ్రీపతివయ్యుఁ, బేఁదవై
తలపడి వామనాకృతిని దానమువట్టితి"వంచు హేళగాఁ
బలుకగనీవు; సిగ్గుపడి భార్గవరామవతారమందుఁ దా
నిలనిఖిలంబు నీదుపతి యీయఁడె కాశ్యపమౌని కంబికా! 17

ప్రమదంబారగ నీవు భార్గవకుఠారస్థాస్నువౌటన్ విభు
భ్రమితోద్యత్పరశుప్రచారములు తీవ్రాఘాతముల్గూర్పగా
విమత క్షోణిప లక్షకంఠ విస రావేగోద్ధితాసృగ్ఝరీ
భ్రమితోఁ గుంకుమరంజితమ్ముగను గాత్రం బొప్పె నీ కమ్మరో!

స్వధితిధారణమును మన్యువర్ధనమును
శాస్త్రవిజ్ఞత జ్యాధర్మసంగ్రహమును
బహుసమిద్ధరణంబును వరల జనని!
బ్రాహ్మ్యమును, క్షాత్రమునుగూడ వరున కిడవె! 19

అంబ! పంచత్వమందెఁ బంచాస్యుచేత
నాహిరణ్యాక్షుఁ; డతఁడ దశాననుఁడయి
యఖిలభూబాధఁగొలుప, నేకాననుఁడయి
త్వత్పతి చతుర్ముఖాస్త్రమ్ము వైచి చంపె. 20

సప్తాశ్వాన్వయమందునన్ దశరధక్ష్మాపాలువంశమ్మునన్
బ్రాప్తోద్భూతుఁడు మోచితద్విపుఁడు నాపత్తిప్రశూన్యుండు వి
శ్వాప్తుండౌ రఘురాముచే, సురధవిఖ్యాతాశ్వపత్తిద్విప
వ్యాప్తుండయ్యు, దశాస్యుఁ డీల్గె నిను సంబా! తెచ్చి బాధించుటన్.

నాఁడు రఘురామ శంకయన్ వ్యాజమునను
రాక్షసాశుచికర గృహాభక్షణమున
నశుచియైన ట్టియగ్ని, త్వదంగ మంటి
శుచియగుట కంబ ! నీ వగ్నిఁ జొచ్చినావొ ? 22

హరధనుర్భంజనమ్మును బరశురాము
గర్వనిర్వాపణము సేతునిర్వహణము
రావణవధమ్ము సల్పె శ్రీరాముఁ; డీవు
తలఁపునందున్న నెది యసాధ్యంబు జనని ! 23

పాఠాంతరము :-

హరకోదండవిభంజనంబు భృగురామాఖర్వగర్వాంధ్యసం
హరణమ్మున్ జలరాశిబంధనము లంకాధీశనాశమ్మునున్
జరిగించెన్ రఘురామచంద్రుఁడు నిను౯ భావించి లోనుంచుటన్,
పరమాశ్చర్యములైన చర్యలివికావా ! యంబ ! లోకంబునన్ !

మాత ! నీదగుసంకల్పమాత్రమున నె
అనిలసుతువాలమునఁ జల్లనైనయగ్ని,
యఖిలజగదపవాద సంహరణమునకు
స్వయముగా నీవె బొఁఅఁబడఁ, జల్లఁబడదె ! 24

శ్యామాకలాభిరతుఁడున్
వ్యామోహాఁడు భద్రశాలి భాస్వద్భూభి
త్కాముఁడు నీలాంబరి హాలి
నీమహిమనె భోగియయ్యె నిజమిది జననీ ! 25

చూడ శ్యామవు నీవు, కృష్ణుం డతండు;
రుక్మిణివి నీవు, గాంగేయలోలుఁ డతఁడు;
తొలిపలుకు నీవు; మధురోదితుం డతండు;
అంబ ! అనురూపదాంపత్య మగును మీకు. 26

అంబ ! రామానుషంగవిహారసక్తుఁ
డై త్రిలోచనజితుఁడయినట్టి పంచ
బాణుని మనోజ్ఞు నీయాత్మభవునిగాగ
నొంది సంపూర్ణసంతుష్టి నందితీవు. 27

వితత గంభీర భావాహికృతమహార్థ
వితతి సంపన్నటీకార్థశుభ్రితిమృదూక్తి,
యైన తద్గీతవోలెఁ గృష్ణాస్యసౌర
భజ్ఞవై యంబ ! శుభయోగభావ్యవీవు. 28

ఘనమహావై నవనీతహృ
దనపాయినివగుచు నాశ్రితవ్రిజబాధా
పనయన బలభద్రివికా
సనవై నీ వెపుడు భర్తృసమవగు దంబా ! 29

ప్రియోధ్యానగరిష్ఠల
మాయాచ్ఛేదినివి, కాంచి మధురవలగ్నో
ద్ఛాయవు, శోభావంతివి,
శ్రేయోద్వారవతి, వంబ ! శ్రీకాశి, వహో ! 30

తల్లి! తుచ్ఛుల మ్లేచ్ఛుల నెల్లఁ గెడపి
కలినడఁచు, నింక కృతయుగకర్మ నిలుపు,
తమముఁ బోఁద్రోలు, భూసురత్వమ్ముఁ బ్రోచుఁ,
గల్కియగు; హరి నీదు వాక్యమునఁజేసి. 31

కలికాలేశత, శాఖా
దళనాశత, నంబ! గతసదామోదతనున్,
గలిగిన యసుహృద్యవనా
వళిహాని మహావని గెడపవె మాధవుచేఁ. 32

ప్రబలవాతవ్రాత పరినాహముంబోలె
నవధూతకలికుఁడై యలరఁగలఁడు
ఘనమహారణ్యముగతి ఖడ్గియై ముని
యటుఁ గృతార్ధజనకుఁడగు నతండు
ఆంద్రీయమైన జిహ్వాగ్రమునుంబోలె
నమ్లేచ్ఛగా భూమి నరయు నతఁడు
కార్తాంతశబ్దసంఘాతమ్మువలెఁ బ్రజఁ
శ్రుతిగతి నడిపింపఁజూచు నతఁడు

నీకు ముదమొనరింపఁగా నీవిభుండు
కలికిరూపంబు ధరియించి ఖడ్గియగుచు
దుష్టతమ పాపచిత్తులఁ దునిమి తునిమి
కలినిఁ గృతయుగముగఁ జేయఁగలుగు నంబ! 33

మాత్స్యసౌందర్యసంభరితమై మందర
క్షణపదమ్మై మహాశ్చర్యముగను
జనని ! యనంతహర్షావహమ్మగుచు హ
ర్యాస్యస్ఫ్రశమ్మయి యద్భుతముగ
చారువర్ణి యగుచు సంతతాశేషాధి
కోపక్రియాగుణరూప మగుచు
హరిణసంపద్ధరమై కామపాలవై
భవమయి భవ్యపరిభావమగుచు

కృష్ణ మై కలిహరమయి యిష్టదమగు
తావకాపాంగమున జగదంబ ! నేను
త్వత్ప్రియుదశావతారవై భవముఁగాంచి
సర్వసంపూర్ణ ఫలమొంద జపమొనర్తు. 34

కేశపాశమ్ము శ్రీకృష్ణావతారమ్ము
మత్స్యావతార మంబకయుగమ్ము
అధర మ్మమందరాగధరమ్ము మధురమ్ము
దోర్యుగం బంబ ! సౌకర్యధరము
స్తనభూమి ముఖహరితాయుతమ్మగు, వలి
శ్రీమధ్యమాంగ సంవృతిభృతమ్ము
జఘనమ్ము రామాగ్ర్యజననపరిసిద్ధంబు
రోమాళి యమునావిరూపకమ్ము

జంఘ మభిరామసంపత్ప్రసాధకమ్ము
పాదపద్మమ్ము కలిగుణధ్వంసకమ్ము
అంబ ! ఏవంవిధమ్ము దశావతార
ధర్మమున నీకు విభునిసాధర్మ్య మమరె. 35

చిత్రరచనావిలక్షణచిత్తుఁ డఖిల
ఘనరసాలంకృతిపరిసాధనరతుండు
కలితదశరూపకుండునౌ కాంతు నీవు
కవివరునిఁబోలెఁ గని తుష్టిఁ గనుదు వంబ !

# లక్ష్మీసహస్రకావ్యము

## చిత్రస్తబకము

క. విబుధాళిమౌళి చిత్ర
స్తబకార్చిత చరణజలజ జలజన్ గొలుతున్,
కబరీరచనాసుమన
శ్శబలాలంకరణకార్య సంశ్రితగిరిజన్. 1

అపశబ్దాభాసము :

తే. గీ. వేధ వేధాంతవిద్యలు వేవిధములఁ
దెలిసి సర్వోత్తమత్వప్రతిష్ఠ నీకె
తక్కఁజేయుటచేఁగాదె దాస్యవృత్తిఁ
దివిరి యొనరించు నీకు వాగ్దేవి జనని ! 2

(ఇందు "వేధవేధాంత" అనుపదములు అపశబ్దములుగాఁ బైకిఁ గన్పించును.)

## గోమూత్రికాబంధము :

(పైపంక్తినుండి క్రిందిపక్తికి, క్రిందినుండి పైకి ఒకక్షరమువదలి ఒక్క క్షరముకలుపుకొని చదువవలెను.)

క. కలుములచెలికరుణాశీ
తలదృష్టి సమస్తవాక్కృతాఘము లొడుగన్
పలుకులచెలికరుణాశీ
తలవృష్టి సమగ్రవాగ్వృతార్థము లెదుగున్. 3

| క | లు | ము | ల | చె | లి | క | రు | ణా | శీ | త | ల | దృ | ష్టి | స | మ | స్త | వా | కృ | తా | ఘ | ము | లొ | దు | గన్ |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ప | లు | కు | ల | చె | లి | క | రు | ణా | శీ | త | ల | వృ | ష్టి | స | మ | గ్ర | వా | గ్వృ | తా | ర్థ | ము | లె | దు | గున్ |

## గూఢప్రథమపాదము :

మొదటిపాదము మిగిలినమూఁడుపాదములలోనియక్షరములతోనేర్పడి గూఢమై యుండును. అప్పుడక్షరములక్రమముతో నిమిత్తములేదు  ఇందు అంకెల ననుసరించి యక్షరములవరుస నేర్పఱచుకొనవలెను

తే. గీ. పాలమున్నీటిపుత్రి ! "మాం పాహి పాహి"
1 3 2 4 5
కోటిపాపము లడఁచి కన్నీటిఁ దుడిచి
9 6 7
తేల్చి పాలింపు మమ్ము ముక్తిప్రదాత్రి !
8 10 11 12
భవ్యమాంగల్యా! వైదేహి ! పాలితమహి ! 4

## గూఢచతుర్థపాదము :

నాల్గవపాదము మిగిలినమూడుపాదములలోని అక్షరములలోను గూఢమై యుండును.

2 9 10
తే. గీ. ఎల్లమలినుల శిక్షించు నితఁడని, విభు
12 4 11
కరినహృదయంబుఁ దేలింపఁగాఁ దలంచి
1 6 3 5 8 7
శ్రీమహావిష్ణునియురమ్ము సేరియుండు
శ్రీమహాదేవి మమ్ము రక్షించుఁగాక ! 5

## నిరోష్ఠ్యము :

ఓష్ఠ్యాక్షరములగు ప, ఫ, బ, భ, వ, మ, ఉ, ఓ, ఔ అనుఅక్షరములు లేనిది,

క. ధరణీస్థలిని జనాళికి
హరియించి యఘాళి నిచ్చ లారగ నిడి యా
కరిగిరినెలకొనియెడి నీ
కెఱఁగెద జగదార్తిహారిణీ! హరిరాణీ! 6

## క్రియావంచనము :

క్రియయుండియు లేనట్లగుపడును. దీనిని "ప్రహేళిక" అనియునందురు. ఇందు "రా" అనునది క్రియ "రామాదైవతమణి" అని సమాసముచేసినపుడు క్రియకన్పట్టదు.

క, రామాదైవతమణి! నీ
ప్రేమాపాంగముల భయము వెడలిచి నిత్య
మ్మే మొనరుచునఘముల ని
స్సీమమ్ములఁ గెడపి మమ్ముఁ జేదుకొనంగన్. 7

## సప్తవిభక్తివంచనము :

ఇందు "మా" అనుదానిని ఒకప్పుడు విభక్తిప్రత్యయములతోఁగూడినదిగను మఱొకప్పుడు లేనిదిగను జదువ నగును, దీనినిగూడఁ బ్రహేళిక యనియు నందురు.

సీ. మాపాపములఁబాపుమాత నిత్యము మాను
గనునెడ సుఖములు గలుగుచుండు
మాచేత సర్వమ్ము మహితఫలమ్మగు
మాకై సమస్త మమర్చనగును
మావలన జరుగు మహనీయసౌఖ్యముల్
మాకొదవపని సంపదనొసంగు
మాయందొఱఁగుదుము మఱఁగినభక్తిచే
ఓమాకృతిన్ ప్రీతి నొందుదుగదె!

అనుచు నుతితతిపరవశు లైన స్వీయ
భక్తజనులకు మాకు సంపదల నొసఁగి
కోరికలఁ దీర్చి తుదిని వైకుంఠ మొసఁగ
ధవుని బ్రితిమాలుతల్లి ప్రత్యక్షమగుత. 8

## అర్థపాదానులోమప్రతిలోమము:

పాదములోనిసగముభాగమును అనులోమముగాను, ప్రతిలోమముగాను జదివి
నను, ఒకేవిధముగా నుండును.

సావిత్రీవృత్తము:

మారామా! కారుణ్యా
ధారా! ధారాఽపాంగా!
సారాసారాకారా!
వేరావే నన్బ్రోవణా. 9 A

## అర్ధపాదావృత్తిప్రతిలోమము:

అర్ధ పాదమును ప్రతిలోమముగాఁజదివిన మిగిలినయర్ధ పాదమగును,

సా వి త్రీ వృ త్త ము :

మారామా మారామా
సారాగా గారాసా
మారాజా జారామా
వేరావే వేరావే. 9 B

## పాదానువృత్తిప్రతిలోమము :

మొదటిపాదమును బ్రతిలోమముగాఁజదివిన రెండవపాదమగును మూఁడవ పాదమును బ్రతిలోమముగాఁజదివిన, నాల్గవపాదము నగును.

వి ద్యు న్మా లా వృ త్త ము :

సాసాకారామానామామా
మామానామారాకాసాసా
రాధారాధానానూనాగా
గానానూనాధారాధారా. 10

## అర్ధపద్యావృత్తిప్రతిలోమము :

అర్ధ పద్యమును [మొదటిరెండుపాదములుగలిసినభాగము] ప్రతిలోమముగాఁ జదివిన మిగిలినఅర్ధ పద్యము [3,4 పాదములు] అగును.

సావిత్రీవృత్తము :

మారామామారామా
సారాగాగారాసా
సారాగాగారాసా
మారామామారామా. 11

## పద్యప్రతిలోమము :

అనులోమముగానున్నపద్యమును ప్రతిలోమముగాఁ జదివిన మఱియొకపద్యమగును.

అనులోమము :

విద్యున్మాలావృత్తము :

సామాధామాసారాభీమా
కామారామాకామాభూమా
రామాధామారారాభామా
భామాకామాభామాభూమా. 12

ప్రతిలోమము :

విద్యున్మాలావృత్తము .

మాభూమాభామాకామాభా
మాభారారామాధామారా
మాభూమాకామారామాకా
మాభీరాసామాధామాసా. 13

## అనతిరిక్తపద పదార్థానులోమ ప్రతిలోమము :

అవేపదములు, అవేఅర్థములుగలిగి అనులోమముగాఁ జదివినపుడొకపద్యము, ప్రతిలోమముగాఁజదివినపుడు మఱియొకపద్యము వగును.

అనులోమము :

మాణవకవృత్తము :

నీవవనీ చారురుచా
భావివిభా దాననదా
రావవరా మారరమా
నావవనా వేగగవే. 14

ప్రతిలోమము :

మాణవకవృత్తము :

వేగగవేనావవనా
మారరమారావవరా
దాననదాభావివిభా
చారురుచానీవవనీ. 15

## అపునరుక్తవ్యంజనము:

ఒకమాఱువచ్చినహల్లు మఱియొకమాఱురాదు.

ద్విపద :

అచ్ఛసంగ ఫణిశయమనోజ్ఞదేవి ;
హెచ్చైన బహుబాధు లింకింపఁజూడు. 16

## ద్వి శృంగాటకబంధము:

చిత్రములోనియంకెలననుసరించి గడులందలి యక్షరమును మఱలమఱలఁ జదువనగును.

రారామా వేరా రేసంసా
రారణ్యా ప్తుల్ రాగోద్ధామా
మారెవ్వార్ రామాతాసంస్తృ
త్యారాధ్యావాణ్యాధారారా. 17



## ద్విచతుష్క చక్రబంధము :

ఇది గోమూత్రికాబంధమునగును. చిత్రములోని యంకెలననుసరించి గడులందలియక్షరములు పునరుక్తములగును

విమానవృత్తము :

భజింతు శ్రీదేవిఁ భక్తిన్
త్యజింతు సంసారాసక్తిన్
సృజింప శ్రీ భావిన్ రక్తిన్
యజింతు సంభారాశక్తిన్. 18



## అష్టదళపద్మబంధము:

బొడ్డునందలి "మా" తో నారంభించి పైకిఁజదివి దళాగ్రమునుండి రెండవ దళాగ్రమందలియక్షరము గలిపికొని, దానిక్రింది గడికలిపికొని దాని ప్రక్కనుండి పైకిఁ జదివి క్రిందికిదిగి తిరిగి బొడ్డునందలి యక్షరము గలుపుకొనవలెను. ఇట్లే నాల్గుపాదములునగును ఇది చతురరచక్రబంధముగాను నగును.

మాణవక వృత్తము:

మారము మా మేర రమా
మా రరగాఁజేయు రమా
మారయుతా నీవ రమా
మారవ మమ్మోము రమా .





## షోడశదళపద్మబంధము:

ఇది ద్విచతుష్కబంధముగాను గోమూత్రికాబంధముగాను గూడ వ్రాయ నగును దళాగ్రమందలి "క్ష" తో నారంభించి బొడ్డునందలి "మా" ను కలుపు కొనుచుఁ బైకిఁ గ్రిందికిఁ జదువుచు రావలెను.

ప్రమాణివృత్తము:

క్షమాసమాగమారమా
ప్రమాకరీమాతిమానమా
ఉమా సమాభిమానమా
కుమార్గమాదిమాపుమా. 20



## అర్ధభ్రమయమకము:

ఇందు అడ్డముగను, నిలువుగనుకూడ మొదటివరుసలలో మొదటిపాదము యొక్క మొదటిసగభాగము ఒకే రీతిగనుండును. అట్లే రెండవవరుసలలో రెండవ పాదముయొక్క సగభాగము, మూడవవరుసలలో మూఁడవపాదము యొక్క సగభాగము, నాల్గవవరుసలలో నాల్గవపాదము యొక్క సగభాగము ఒకేరీతిగా నుండును.

విద్యున్మాలావృత్తము:

నాకాసారాసారావాసా
కాకాకాకామాభాభావా
సాకారారాకావాభారా
రాకారాజాస్యాకామాసా.

21

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| నాం | కాం | నాం | రాం | సాం | రాం | వాం | సాం |
| కాం | కాం | కాం | కాం | మాం | భాం | భా | వాం |
| సాం | కాం | రాం | రాం | కాం | వాం | భాం | రాం |
| రాం | కాం | రాం | జా | స్యా | కాం | మా | సాం |

## శరబంధము :

శరముయొక్క పిడియందలి అక్షరములును, కొనయందలి అక్షరములును గూడ పద్యముయొక్క పూర్వార్ధమునందును, నుత్తరార్ధమునందునుగూడ సంబంధముగ గ్గియుండును. పిడి యందలి యక్షరములు పూర్వార్ధమున పై గడులతోను, మధ్యగడులతోను ఉత్తరార్ధమునఁ గ్రిందిగడులతోను మధ్యగడులతోను, పైకి క్రిందికి కలుపుచు చదువుకొనవలెను.

ప్రమాణీవృత్తము :

సముద్రజోన్నతామహో
క్షమాసుధీప్రతారికా
సముద్రజోన్వితారిహో
కుమార్గధీప్రతారికా.

22

(సముద్రజో [న్న / న్వి] తా [మ / రి] హో [క్ష / కు] మా [సు / ర్గ] ధీ [ప్ర / ప్ర] తారికా >

## మురజబంధము :

చిత్రమున నాల్గువరుసలుగా నాల్గుపాదము లున్నవి. ప్రథమపంక్తియందలి ప్రథమాక్షరమును, ద్వితీయపంక్తియందలి ద్వితీయతృతీయాక్షరములను, తిరిగి ప్రథమపంక్తియందలి చతుర్థపంచమాక్షరములను, మరలద్వితీయపంక్తి యందలి షష్ఠసప్తమాక్షరములను, తిరిగి మొదటి పంక్తియందలి అష్టమాక్షరమును, కలిపి చదివిన ప్రథమపాదమగును ఈవిధముగ ద్వితీయపంక్తి యందలి ప్రథమాక్షరమును, ప్రథమ పంక్తియందలి ద్వితీయతృతీయాక్షరములును, తిరిగి ద్వితీయ పంక్తి లోని 4, 5 అక్షరములును, మరలమొదటిపంక్తిలోని 6, 7 అక్షరములును, తిరిగి ద్వితీయపంక్తిలోని 8వ అక్షరమును గలిపి రెండవపాదమును, చదువుకొనవలెను. ఈవిధముగానే తృతీయ చతుర్థపంక్తులను ఏర్పడును,

సమానివృత్తము :

ఇందిరాంబ ! మాకరుణా
మందిరాంబ ! మాకరుదా !
వందనీయ ! మోక్షము నీ
వంద నీయ మోక్షముతో. 23



## సజాతీయవర్ణనిరంతరయమకము :

ఇది సజాతీయమైన ఒక వర్ణమునకు ఆవృత్తి కలిగిన యమకము.

మదనార్తావృత్తము

కాకానన భూభూ మమకాకార రమా మా
కా కావవ రా రామమఘాఘాతతపాపా
కాకాననానాకక ! కా కాక కమా మా
కా కాగగ వే వేరల గాఁ గానన జేజే. 24

## గరుడగతిచక్రబంధము:

చిత్రములోని అంకెలననుసరించి గడులందలియక్షరములు పునరుక్తములుగాఁ జదువుకొనవలెను.

విద్యున్మాలావృత్తము.

మాతా యీవే భూజాతా సీ
తా తాయీ భూతాజాసీమా
మాతాపాతాపా యీవే ప్రి
స్ఫీతాగ్ర్యానంతార్ధశ్రీ మా. 25



## చతురంగబంధము:

వరుసగా నాల్గుపంక్తులు నాలుగుపద్యపాదములు. అట్లు పద్యము రెండుసార్లు తిరుగును చిత్రమునందు మొదటిగడినుండి గుఱ్ఱపుదాటుగడులు వరుసగా 64 ను అంకెలతో చూపఁబడినవి. వరుసగా ఆగుఱ్ఱపుదాటుగడులలోని అక్షరములను కలుపుకొని 1 నుండి 32 వరకు చదువగా మఱియొకపద్యమగును. 33 నుండి 64 వరకు నున్నగడులలోని అక్షరములుకలిపినను అదేపద్యము మఱియొకసారి తిరుగును.

విద్యున్మాలావృత్తము:

రారా రావా రాధాతామా
ధ్యారామా భామా కామారా
జే రాజాతా సారాభాపో
మా రా జే ధీపేతా మా. 26

తురంగపదోద్ధృత పద్యము.

రామారామా మారా మా రా
రామాతాపోపేతా రాధ్యా
జా మారావాసాతా రాధా
భామాకా ధీభారా జేజే. 27

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| 1 రా | 30 రా | 9 రా | 20 వా | 3 రా | 24 ధా | 11 తా | 26 మా |
| 16 ధ్యా | 19 రా | 2 మా | 29 భా | 10 మా | 27 కా | 4 మా | 23 రా |
| 31 జే | 8 రా | 17 జా | 14 తా | 21 సా | 6 రా | 25 భా | 12 పో |
| 18 మా | 15 రా | 32 జే | 7 మా | 28 ధీ | 13 పే | 22 తా | 5 మా |
| 33 రా | 62 రా | 41 రా | 52 వా | 35 రా | 56 ధా | 43 తా | 58 మా |
| 48 ధ్యా | 51 రా | 34 మా | 61 భా | 42 మా | 59 కా | 36 మా | 55 రా |
| 63 జే | 40 రా | 49 జా | 46 తా | 53 సా | 38 రా | 57 భా | 44 పో |
| 50 మా | 47 రా | 64 జే | 39 మా | 60 ధీ | 45 పే | 54 తా | 37 మా |

## సర్వతోభద్రబంధము :

నాల్గుప్రక్కల మొదటిపంక్తులందు అనులోమముగ చదివినను, ప్రతిలోమముగ చదివినను సమానముగా పద్యముయొక్క మొదటిపాదము తిరుగును. అట్లే అనులోమప్రతిలోమగతులతో నాల్గుప్రక్కల రెండవపంక్తులుచదివిన రెండవపాదమును, నాల్గువైపుల మూడవపంక్తులుచదివిన మూడవపాదమును, నాల్గువైపుల నాల్గవపంక్తులుచదివిన నాల్గవపాదమును తిరుగును.

విద్యున్మాలావృత్తము :

రామా రామా మారామారా
మామామామామామామామా
రామాకారారాకామారా
మామారాజే జేరామామా. 28

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| రా | మా | రా | మా | మా | రా | మా | రా |
| మా | మా | మా | మా | మా | మా | మా | మా |
| రా | మా | కా | రా | రా | కా | మా | రా |
| మా | మా | రా | జే | జే | రా | మా | మా |
| మా | మా | రా | జే | జే | రా | మా | మా |
| రా | మా | కా | రా | రా | కా | మా | రా |
| మా | మా | మా | మా | మా | మా | మా | మా |
| రా | మా | రా | మా | మా | రా | మా | రా |

## త్రిస్వరచిత్రము :

అ, ఇ, ఉ అను మూఁడుఅచ్చులుమాత్రమే ఉపయోగింపఁబడుట ఇందు చిత్రము.

ఆ. వె. జలధిదుహిత! పుడమి నిలుపంగ మలుపంగ
వలఁతి వహిత్రములను దులిపి నడిపి
కలుములిడి ముముక్షువుల మమ్ము నిహపర
ములసుఖమ్ముఁగొలుపఁ గొలుతు మమ్మ! 29

## ఏకస్వరచిత్రము :

"అ" అనెడు ఒక్కఅచ్చుమాత్రమే పద్యమునందంతట నుపయోగించుట ఇందుచిత్రము.

ఆ. వె. కమలచరణభజనకలసన సఫలత
సకలసంపదమలసద్మ మలర
రమ్యతరకళత్రరతమహ మమరంగ
తనయతనయతనయజనన మరయ. 30

## త్రివ్యంజనచిత్రము :

పద్యమంతట "మ, ర, త" అను హల్లులుమూఁడుమాత్రమే ఉపయోగించుట ఇందు చిత్రము.

మేరమీరె మాతమోరతి మాతరో!
మా తమమ్ము తరుమ మాతరమ్మ!
మాత! రమ్ము తరుమ మా తమ మ్మార్తతా
తాత్రితృతారతా! రమా! తిరమ్మ. 31

## ద్వివ్యంజనచిత్రము :

పద్యమంతట రెండుహల్లులు (ల, క) మాత్రమే తిరుగుట ఇందు చిత్రము.

తే. గీ. ఏలకోకేల ! కాలకాలాలికాల
కా ! కలంక లేల ! లీలలా ! లోకలోల !
లౌకికాకాలకల్లోలలోకకాలి
కా ! కలికి ! లౌకికాకాల ! కాంక లేల ? 32

## ఏకవ్యంజనచిత్రము :

పద్యమంతట ఒకేహల్లు (మ) తిరుగుట ఇందుచిత్రము.

ద్విపద :

మమ్మోమమీ మోమ మా మామమామ
మమ్మోము మమ్మమ్మ మమ్మ మా మేము. 33

## విషయమకసర్వతోభద్రము :

ఇది హల్ద్వయనియమాశ్రితసర్వతోభద్రబంధము. ఇందు ర,మ అను రెండు హల్లులే యున్నవి. 28 వ బంధమునకువలెనే దీనికిని లక్షణము.

విద్యున్మాలావృత్తము :

మారామారా రామారామా
రారారామా మారారారా
మారారారా రారారామా
రామారామా మారామారా. 34

| మా | రా | మా | రా | రా | మా | రా | మా |
|---|---|---|---|---|---|---|---|
| రా | రా | రా | మా | మా | రా | రా | రా |
| మా | రా | రా | రా | రా | రా | రా | మా |
| రా | మా | రా | మా | మా | రా | మా | రా |
| రా | మా | రా | మా | మా | రా | మా | రా |
| మా | రా | రా | రా | రా | రా | రా | మా |
| రా | రా | రా | మా | మా | రా | రా | రా |
| మా | రా | మా | రా | రా | మా | రా | మా |

## ఏ క స్వ ర ద్వి వ్యం జ న ము :

రెండుహల్లులు (మ, య) ఒకఅచ్చు (అ) మాత్రముపయోగింపఁబడుట యిందలి చిత్రము.

వి ద్యు న్మా లా వృ త్త ము :

మాయామాయా మాయామాయా
మాయామాయా మాయామాయా
మాయామాయా మాయామాయా
మాయామాయా మాయామాయా, 35

## అష్టదళపద్మబంధము

(కవిపేరును కావ్యముపేరును గలది)

బొడ్డునందున్నయక్షరముతో (మా) ప్రారంభింపవలెను. ఎడమవైపునుండి పైకి అక్షరములఁకలుపుకొని, దళాగ్రమునుండి దిగువఅక్షరములుకలుపుకొనుచు, కుడివైపునకు దిగుచు అందు చివరిఅక్షరమునుమాత్రము మూఁడుసార్లు కలుపుకొని, యూర్ధ్వముగా నడచి క్రిందికి దిగి బొడ్డునందలి యక్షరమును [మా] కలుపుకొనవలెను. రెండుదళములకొకపాదము పూర్తియగును. ఇట్లేమిగిలినవియునుండును. దళాగ్రములగడులలోని యక్షరములు "రఘునాధనందనుఁడ" యని యగును. మూలకర్తతండ్రి రఘునాధుఁడు. రఘునాధునియందు సంతోషించువాఁడు [రామభక్తుఁడు] అని అనువాదకర్త పరమైన యర్థము. ఇందు ప్రతి పాదాంతమందలి నాలుగక్షరములు ప్రతిలోమగతితో తరువాతి పాదమునందు మొదటి నాల్గక్షరములుగా వచ్చును,

స్రగ్ధరావృత్తము :

మాతా! రమ్యాక్షి! రమ్మామరగగః గర మంబా! ఘృణద్దేవతా! మా.
మాతా! వద్దేదినా కామపదద! దరమమ్మా! చరిత్రావ్రతీ! మా!
మాతీవ్రిత్రా! యనంగా మహితతతహిమ మ్మాద రమ్మా! రతోమా!
మాతోరమ్మా! ఘనుండంబరమ మమర్బ్రహ్మాండగమ్యా! రతా! మా!



## షష్ఠారచక్రబంధము :

ఆరుఆకులుగలది. 1, 2, 3, 4, 5, 6 ఆకులలోనిమూఁడవగడులలోని అక్షరములు తర్వాత 6వ గడులలోని అక్షరములు కలిపి "వేంకటశర్మలకమలాసహస్రం' అని చదువనగును.

శా. నిత్యావేక్షణకర్మరక్ష ! హరిరాజ్ఞీ ! సర్వదాశస్త ! మా
స్తుత్యంక మ్మిది మంగళావహము "దాసోఽహం" సుశర్మ ప్రభా!
భృత్యాటల్క్రమలాస్యసంగహరణా ! విస్రంభమూలప్రమా !
మా ! త్యాగానిశ ! నిస్తులప్రభృతధామా ! విష్ణుభామా ! రమా! 37



## అష్టారచక్రబంధము :

ఎనిమిదిఆకులలోను 1, 3, 6, 8 గడులలోని అక్షరములను వరుసగా కలుపు కొనిన మూలానువాదకవుల గోత్ర నామ గుణ ప్రార్థనలను దెలుపు మఱియొక పద్యమును ఉద్ధారము చేయవచ్చును

శా, ఆదిధ్యేయ రమా ! ప్రకాశ ! మహిజాతా ! భాగ్యదాయామ ! (శ్రీ) !
యా దేయున్, హృదయాలయున్, శమములన్ బ్రారబ్ధమున్ జించు శ్రీ
తేజుఁడా, వేంకటపాదుఁ బ్రోవు; మహి రాట్ఛ్రిద్వారు వే శర్మ మా
యాదా! కట్కట యీభవంబు మఱుమాయన్ జార్చి కర్మన్ ననున్.

ఉద్ధారపద్యము ·
విద్యున్మాల :

ఆ యాత్రేయశ్రీ శ్రీమానున్
ధ్యేయున్ వేంకట్యాజిం శర్మన్
మాయాపాయీ భారద్వాజా
శాయున్ బ్రోవన్ జాలన్ రా మా ! 39



## గవాక్షబంధము :

నిలువుగామధ్యవరుసయందు "వేంకటమఖి శ్రీనుతిజై" అని కవికావ్యనామములు వచ్చును, అడ్డముగాఁజదివిన నన్నిగడులలోని అక్షరములు కలిసి పద్యమగును.

క. వే వేంకటవక్షోటన
దేవీ ! మాతా ! మహత్త్వదీప్తి, నిఁక సుఖి
త్వావాసం బిడుమా నీ
శ్రీవాసాపాంగవినుతిఁ జేసితి జై జై. 48



## భిన్నవృత్తానులోమ గోమూత్రికాబంధము:

బేసివరుసలలో (1, 3, 5, 7) నొకవృత్తము, సరివరుసలలో (2, 4, 6, 8)మఱొకవృత్తమును గలవు. గోమూత్రిపద్ధతితోఁ గూడ రెండువృత్తములు చదువ నగును.

వంశస్థవృత్తము:

ప్రవాహసంసారి విపద్వివాదినీ!
స్తవింతు రమ్మమ్మ! భృశమ్మునున్ నతిన్
వివేకదీపమ్మున వేగఁ బ్రోవు నన్
ద్రవించి మాచిక్కులు దవ్వవాఱఁగన్. 41

ఇంద్రవంశవృత్తము:

భావార్తిసంతారిణి! పద్మవాసినీ!
శ్రావింతు రమ్మమ్మ! భృశమ్మునున్ నుతిన్
వేవేయి దీప్రమ్ములు వేగఁ బ్రోచి నన్
ద్రావించుమా దృక్కులు దప్పి వాయఁగన్. 42

| ప్ర | వా | హా | సం | సా | రి | వి | ప | ద్వి | వా | ది | నీ! |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| భా | వా | ర్తి | సం | తా | రి | ణి! | ప | ద్మ | వా | సి | నీ! |
| స్త | విం | తు | ర | మ్మ | మ్మ! | భృ | శ | మ్ము | నున్ | న | తిన్ |
| శ్రా | విం | తు | ర | మ్మ | మ్మ! | భృ | శ | మ్ము | నున్ | ను | తిన్ |
| వి | వే | క | దీ | ప | మ్ము | న | వే | గఁ | బ్రో | వు | నన్ |
| వే | వే | యి | దీ | ప్ర | మ్ము | లు | వే | గఁ | బ్రో | చి | నన్ |
| ద్ర | విం | చి | మా | చి | క్కు | లు | ద | వ్వ | వా | ఱ | గన్ |
| ద్రా | విం | చు | మా | దృ | క్కు | లు | ద | ప్పి | వా | య | గన్ |

## ఖిన్నవృత్త అనులోమప్రతిలోమ గోమూత్రికాబంధము :

పైనుండి బేసివరుసలు (1, 3, 5, 7) అనులోమముగాఁజదివిన నొకవృత్తమును, అడుగునుండి బేసివరుసలు విలోమముగాఁజదివిన మఱియొకవృత్తమును వచ్చును. మొదటిపద్యమునకు అనులోమముగా గోమూత్రిగతియు, రెండవపద్యమునకు విలోమముగా గోమూత్రగతియు నగును.

అనులోమపద్యము :
స్రగ్విణీవృత్తము

వేదభూజాత ! మా వేంకటేశాంగనా
చేఁదు మీవే పతిన్ చెంది, నేరాఁగనన్
నీదుసేవావిధిన్ నేను మైనీఁగనౌఁ
గాదె నీ వీవితో కావఁగా రాఁగదే. 43

ప్రతిలోమపద్యము :
చతుష్పదద్విపద :

విగతిగాక కాచువిధి నీదెగా
విగతమైన "నేను"విధి నేఁదు నీ
ప్రగతి నేను చెంద పతిమీఁదుచే
తగదటే! వివేకతరుభూమివే. 44

| వే | ద | భూ | జా | త! | మా | వే | ఙ్క | టే | శాం | గ | నా! |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| వే | మి | భూ | రు! | త | క | వే | వి | టే | ద | గ | త |
| చే | ఁదు | మీ | వే | ప | తిన్ | జెం | ది | నే | రాఁ | గ | నన్ |
| చే | ఁదు | మీ: | తి | ప | ద | జెం | ను | నే | తి | గ | ప్ర |
| నీ | దు | సే | వా | వి | ధిన్ | నే | ను | మై | నీ | గ | నౌ |
| నీ | దు | సే | ధి | వి | ను | నే | న | మై | త | గ | వి |
| గా | దె | నీ | వీ | వి | తో | కౌ | వ | గా | రాఁ | గ | దే |
| గా | దె | నీ | ధి | వి | చు | కా | క | గా | తి | గ | వి |

## అష్టదళ పద్మ బంధము :

దళాగ్రములందలి గడులలోని యక్షరములు కలిపిన " లక్ష్మీదేవీ ! రక్షించమ్మా" అను వాక్యమగును.

బొడ్డునందున్నయక్షరము (వే) తో రెండుదళములుఁగలిసిన ఎడమవైపు గడిలోని అక్షరమునుగలిపి, ఊర్ధ్వదళమందలి ఎడమవైపుఅక్షరమును దళాగ్రమందలి అక్షరమును గలిపికొని, దిగువనున్నఅక్షరమును కుడివైపునరెండుదళములు కలిసి ఏర్పడిన గడిలోని అక్షరమును గలిపికొని, తిరిగి బొడ్డునందలియక్షరమును కలుపుకొనవలెను. తిరిగి బొడ్డునందలి అక్షరముతోప్రారంభించి పైవిధముగనే అక్షరములను కలుపుకొనవలెను రెండుదళములకొక పాదము పూర్తియగును.

స్రగ్విణీ వృత్తము ·

వేదజాలమ్మివే వేయి లక్ష్మీ ! యివే
వేదులం దేల్చె వేవేలు నీ వీయవే
వేదభూరక్ష వేవేళ శిక్షింపవే
వేదురన్, చన్న వేవేవా యిమ్మాస్తి వే. 45



మృగీయుగవృత్తము:

గాయత్రీచ్ఛందమున 19వ వృత్తము. మూలములోని 48వ శ్లోక మీరెండు వృత్తములలో ననువదింపఁబడినది.

లేరు నీసాటివా
రేరు నన్ బ్రోవ శ్రీ
కారికాకారి కా
కారికాకారి కా. 46

శ్రీమహాలక్ష్మి ! న
న్నోమగా రాఁగదే
నామయానామయా
నామయానామయా. 47

వంశస్థవృత్తము:

అపేక్షఁ గొమ్మీ పరమార మా రమా
అపావృతాపావధికాధికాధికా
అపూర్ణ నన్నినయనాయనాయనా
ద్యపాత్తకర్ణోత్సవదున్ వదావదున్. 48

## ఖిన్నవృత్త అనులోమ ప్రతిలోమ గోమూత్రికాబంధము :

ఒక్కొక్క వరుసలో నాకొక్క ఖిన్నవృత్తముండి అనులోమముగను, ప్రతిలోమముగను, గోమూత్రికాగతిగను నడుచును పైనుండి రెండువరుసలకు అనులోమగతితో క్రిందినుండి రెండువరుసలకు విలోమగతితో గోమూత్రికాగతి నడుచును.

నారాచవృత్తము :

రామా మదీయపాపముల్
క్షమింపఁజేయవే యెదన్
నీమారుదేని గాసమో
సామాశయా సురాదరా. 49

ప్రమాణివృత్తము :

రమా ! త్వదీయపాదముల్
నమింతుఁ జేరి వేడెదన్
సుమాత ! దేవి ; గావుమో
యమా ! దయాపరాత్పరా ! 50

నాగరవృత్తము :

రామమదీయతాపసం
క్షమపరాయణా ! యెదన్
నీ మరు లూని తోన రా
సామి శచీసుమోద ! రా ! 51

## ఛిన్నవృత్త అనులోమప్రతిలోమ గోమూత్రికాబంధము :

| రా | మా | మ | దీ | య | పా | ప | మున్ | క్షి | మిం | ప | జ్ఞే | య | వే | యె | దన్ | నీ | మా | రు | దే | నిః | గా | న | మో | సా | మా | శ | యా | సు | రా | ద | రా |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| ర | మ్యా | ప్ప | దీ | య | పా | ద | మున్ | న | మిం | తుం | జ్ఞే | రి | వే | డె | దన్ | సు | మా | త! | దే | వి! | గా | వృ | మో | య | మా | ద | యా | ప | రా | త్ప | రా! |
| ర్వా | ద, | మో | సు | చే | శ | మి, | సా | రా | న, | తో | న్, | టా | రు | ము | నీ | దన్ | యె | ణా | య | రా | ప | మ | క్షా | సం | ప | ప్రా | యా! | హే | మ | మ! | రా |

## అర్ధభ్రమ యమకానులోమప్రతిలోమ గోమూత్రికాబంధము:

పద్యములోని మొదటి అర్ధభాగమును (1, 2 పాదములను) ప్రతిలోమముగాఁ జదివిన 3, 4 పాదములగుట అర్ధభ్రమయమకము. మఱియు నిది అనులోమప్రతిలోమగతులతో గోమూత్రికాబంధముఁగూడ నగును

భద్రక వృత్తము:

మాసవాసరసరాసమా
మాసరాసరసవాసమా
మాసవాసరసరాసమా
మాసరాసరసవాసమా. 52

| మా | స | వా | స | ర | స | రా | స | మా | మా | స | రా | స | ర | స | వా | స | మా |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మా | స | వా | స | ర | స | రా | స | మా | మా | స | రా | స | ర | స | వా | స | మా |

చేయుదు పద్మా ! వాసము
పాయక నారాతిగుండెపైఁ; బద్మావా
సా ! యాసపడెద, మును నీ
వాయాసంపడుట సీతవై చిత్రగిరిన్. 53

మునిజనధృతనామహితా !
యనిశసమారాధితామరాధిపమహితా !
వినుతింతురు నిను మహి తా
రనఘాత్ములు; వేదబాహ్యులకుఁ గర మహితా ! 54

కమలాలయ ! నాలుక యు
గ్రమహోష్ణను దృష్ణను నధికమలాలయయౌఁ
గమలాలయ గా, దిఁక ధని
కమలాలయ మెడపి కొలుచుఁ గమలాలయమున్. 55

జననీ ! భక్తతమ
స్తేన ! నిను, హయగ్రీవదేవు నతులసమస్తే
నునిగాఁ గనినసమస్తే
ననుఁ, గొల్చెద నెటు మను తువా ! నన్ను నమస్తే 56

శుభవిద్యుత్ప్రభవపుషివి
ప్రభవపుషివి సంపదలకుఁ, ద్వత్కృపచేఁ ద్వి
ద్విభుఁడు వృషాచలవిభుఁడగు
ప్రభు వమ్మృషాచలవిభవములను దేల్చు మమున్. 57

హృతసుఖవారిజనిలయము,
సితవారిజనిలయమును భజింపుమ ! శ్రీవా
సితమును, హితమహితము నో
మతి ! యహిత మిమ్మతరపతన, మది వలదుసుమా ! 58

పరిపదనభారతి ! భారతి
కపరాధము లేనుచేసినవి కావఁగదే !
అపపధులకును నునిడ నీ
శ పధమును, శపధమును గొనవె సాంద్రితరకృపన్. 59

సారము భాంతము కృతహిం
సారంభాంతమును దృక్ప్రసారము నిడి చే
కూరుపు రక్షోపాయము
నీ రక్షోఉపాయదృష్టి నిహతు లరులుగాన్. 60

నతి యనుకంపారమ్యో
న్నతి ! పారమ్యోన్నతికిని ననుఁ జేర్పఁగదే !
కృతహితయాచిత్రులకును ను
చిత చిత్రశ్రీ లొసంగుశ్రీన్ నిమఁ గొలుతున్. 61

# లక్ష్మీసహస్రకావ్యము

## సంకీర్ణ స్తబకము

పరిపూర్ణమంగళశ్రీ
కరగుణసంకీర్ణ మఖిలకామప్రద మ
య్యరవిందగృహము మామక
వరదముఁ బరదైవతమును బ్రార్థింతు నెదన్ 1

ఔదార్యసేవధివి నీ
వౌదువు, మఱి కాంతిసింధువౌదు, మహౌజ
స్స్వాదుపరీసాదనిధి, విఁక
వైదర్భివికావె కవులపాలిటి కంబా ! 2

తగుశుభారంభమైన యత్నమున మాకుఁ
బరమమందును బ్రాప్త్యాశ వరలఁజేసి
నాయకునిచేత నెప్పుడు నాటకమటు
కలుగఁజేయవె నియతాప్తిఫలము జనని ! 3

వ్యాప్తినిఁ బ్రసిద్ధ, వాశ్రితపక్షపాత,
వవసితవిపక్ష, వఖిలబాధానభిజ్ఞ
వగుటచేతను సద్ధేతువట్లు నీవు
ధ్రువఫలము మాకు నొసఁగుచుందువు మదంబ ! 4

ప్రకృతిరుచిరవు, ప్రత్యయప్రదవు, నంబ !
యధికగుణవృద్ధి సాధుతాప్తవు, నయి
స్థిరతరానంతపరణతిధేయ వగుచు
వ్యాకృతి వజాదుల నభీష్టపదము నిలుప. 5

తల్లి ! యధికరణాది సీదద్విపక్ష
మయిన వేదార్థతత్త్వమ్ము వ్యక్తపఱచి
దురవగమ కర్మమోహమ్ముఁ దొలఁచె దీవు
పూర్వమీమాంస శాస్త్రమ్ముపోల్కి నహహ ! 6

అంబ ! చతురాకృతివి, లక్షణాభిరామ
వగుచుఁ; బరదేవతాగుణాపాదకవయి
జనుల కొసఁగుదు వపవర్గసంపదలను;
సతత ముత్తరమీమాంస శాస్త్రమట్లు. 7

బ్రహ్మణనుతంబు, సౌవర్ణభాసురంబు,
శుభకర పదర్చనమునయి శ్రుతికులమ్ముఁ
ద్వైతస్వరూపమ్ము నొకచె; భేద మిది యౌను;
ధ్యేయమొకటగు; నంబ ! అధ్యేయమొకటి. 8

వికసిత కమలావృతవై
ప్రకట ద్విజరాజ సేవ్యవై యవిహతవై
యకలంకామృతధునివై
సకలభవ విదాహ శాంతి సలుపవె జననీ! 9

భవదీయ వాత్సల్యభావ పరిభావంబు
నఖిలంబుఁ దెల్ప శక్యంబె జనని!
దుర్ఘటసాధ నోద్యుక్త తావకశక్తిఁ
గార్త్స్న్యంబు వివరింపఁగలమె తల్లి!
తావకాపాంగ లబ్ధ ప్రాభవౌన్నత్య
మంతయు నుడువ సాధ్యమె సవిత్రి!
సహజ నిర్హేతుక జాయమాన భవద్ద
యాపూర్ణతను దెల్పనగునె యంబ!

నీ సహజవత్సలతకుఁ గాకాసురుండు,
ప్రతిఘటన శక్తి కనిలజ వాలవహ్ని,
దృఢమహౌదార్యమునకుఁ దద్దేవవిభుఁడు,
సుష్ఠుకరుణకు నేను సాక్షుల మొకింత. 10

కౌటిల్య మెపుడు నీ కనుబొమలనె పొందెఁ
గఠినత నీ చనుఁగవనె యుండె
రాగంబు భవదధరంబుననె వసించె
దారిద్ర్య మంగమధ్యమ్ముఁ జెందెఁ

తామస మ్మది భవత్కచపాశమును బొందెఁ
జంచలత్వము నేత్రసరణి నొందె
మౌగ్ధ్యమ్ము నీయాస్యమండలమ్ము వరించె
మాంద్యమ్ము పాదపద్మములఁ బట్టె
కుటిలత, కఠినతయు, రాగపటుత, లేమి,
తామసముఁ, జంచలతయు,మౌగ్ధ్యమ్ము, మాంద్య
మనెడునివి దోషగుణములే, యైన నంబ!
గుణములుగ మాఱె; నీయంగగణము నంటి. **11**

భవదపాంగావలోక లవమ్ము నన్ను
నర్భకుని శ్లోకకర్తగా నంబ! సేసె;
నింక "అహం శ్లోకకృ" త్తనియెడు శ్రుతి నిల
నుచ్చరించుచు మోక్షంబు నొందఁగలను. **12**

విశ్వతశ్చక్షువయ్యు, నీవిభుఁ డధోక్ష
జుండునయ్యును, నాతండుఁ జూడకుండ
నాదుపాపంబులకు నేర్పినావొ జనని!
తెలిసిన క్షమింపఁడనుచు నదృశ్యవిద్య! **13**

నన్ను రక్షింపుమంచు నీనాథుఁ జేరి
యొక్కపరిఁ దెల్పు, చాలు, నా కౌనరు ముక్తి;
అనిశమును నమ్ముకొన్న దాసునకు నాకు
నంబ! యీపాటి మాటసాయంబు నిడవె! **14**

నీకు దయయున్న నాచేత నిత్య మంబ!
పుణ్యకర్మముల్ సేయించి ముక్తి నిడుము;
నీకు దయగల్గకున్ననుం దిగులునొంద
నంబ! నైరాశ్యమును ముక్తి యగునుగాన. 15

వలదు దుర్గమమగు నపవర్గ, మింక
స్వర్గమును వల, దితరమ్ము వలదు; నాకుఁ
దావకపదాబ్జభక్తిమాత్రమ్మె చాలు;
నదియు నిడవేని నేమిసేయగల నమ్మ! 16

కోపము సేయకమ్మ యనఁగూడనిదైనను నందు, నీదు నా
నాపటుకార్యజాత ఘటనాఘటనాన్యఘట పరిభావమే
నాపరమైనచో, నిల జనమ్ముల నెల్లర మోక్షమార్గసం
ప్రాపకులం బొనర్పనొ! భవద్దయ నేలను నేలనో మఱిన్! 17

జగతిలో సౌందర్యసర్వస్వనిధి వీవ
ముదమును మొలిపించుభూమి వీవ
మహిత సమస్తార్థ మంజూషవగు దీవ
నిఖిలకాంతికి మూలనిధివి నీవ
శాంతివాసించు నిశాంతస్థల మ్మీవ
సరసకలామృతజలధి వీవ
ప్రథిత దాక్షిణ్యశరణ్యసద్మ మ్మీవ
దాతృత్వవిశ్రాంతిధామ మీవ

సద్యశమ్ములకెల్ల నా స్థాన మీవ
భవవిదాహ ప్రశాంతికిఁ బ్రపవు నీవ
ఆదిమధ్యాంత రహితమహార్ధ మీవ
జనని ! యనిశమ్ము మా యభీష్టంబ వీవ. 18

నిశ్శ్రేయసానంద నిశ్రేణికవు నీవ
చింతాతమ శ్చంద్రికాంతి వీవ
భవమోహ మెడలించువనమూలికవు నీవ
మధుసూదనునికంఠమాల వీవ
చేతస్సుఖావహ సిద్ధఘుటిక వీవ
జ్ఞానవిద్యాగృహశారి వీవ
పరిశుద్ధ మన్మనఃపారిజాతమ వీవ
మోదాబ్ధివీచీప్రపూర మీవ

సృష్టిఁగలప్రజ్ఞల కుపఘ్నయష్టి వీవ
కవిమనోవాంఛితామరగవివి నీవ
నష్టధనులకుఁ బ్రాణప్రతిష్ఠ వీవ
భక్తజనులకుఁ దల్లి ! సర్వస్వ మీవ. 19

పుణ్యమ్ములకుఁ బరిపూర్ణ విపాకమ్ము
వనజవిలాసవివర్తరూప
మాత్మజ విత్తాది హర్ష కారణభూత
మమృతప్రవాహ నిష్యందగృహము

కారుణ్యపీయూషసార పారావార

మఖిలవిలాస జన్మావసథము

వాణీవిలాస శర్వాణీవిలాసమ్మ

లోకకూట గురియు వర్షోదయమ్మ

కలుషపరిహారమునకు గంగాజలమ్మ

కల్పవృక్షమ్మునకు వికల్పరూప

మైన భవదీయశీతలాపాంగ మంబ!

విజయమందుత! నిత్యప్రవృద్ధమగుత! 20

అస్మదాదులకు శ్రేయఃప్రరోహమ వీవ

త్వత్పతినయనోత్సవమ్మ వీవ

పాపామయములకుఁ బరమౌషధమ వీవ

భవవార్ధి కావలిపార మీవ

స్వర్గాంగనలకు సౌభాగ్యరక్షణ మీవ

అంబుధీంద్రతపః ఫలంబ వీవ

దారిద్ర్యమూల విద్రావణాగమ మీవ

అఖిలనాయకునినాయకివి నీవ

కమలవనజాతముల కలంకార మీవ

ప్రణతశరణార్థి జనపరాయణవు నీవ

బహువిధాగమభాగ సర్వస్వ మీవ

జనని! మద్భాగధేయ విస్తార మీవ. 21

మారణహోమంబవు సం
సారమహాయాతనలకు, జనని ! యురోఒలం
కారమవు హరికి, జ్ఞానుల
ధీరుచికి నవీనసంస్కృతివి నీవ సుమీ. 22

మునిమానస కలహంసాం
గనవో ! హరిమంజుకల్పకపుమంజరివో !
కన శ్రుతిపంజరశుకివో !
జననీ ! గుణరత్నగణ లసత్పేటికవో ! 23

మెఱపుందీవెకు జననీ !
మరుసృష్టియొ, మరి శిరీషమంజరులకునుఁ
పరివృత్తియొ, యిఁక కాంచన
పరివాహమొ నీదుమూర్తి భావింప నహో ! 24

నవనవమ్మగు జగన్నాటకమ్మున కీవు
ప్రస్తావనారంభపదవు జనని !
క్రౌర్యోగ్రసంసార కాళరాత్రికి నీవు
సుప్రభాత ప్రభాదీప్ర వమ్మ !
దుర్గర్వ పిశితాశ వర్గమ్ములకు నీవు
దుర్దాంతధూమకేతువవు దేవి !
దుర్దోష విటపిసందోహమ్మునకు నీవు
శ్లక్ష్ణధారా కుఠారమవు మాత !

యతిమనోదంతి కాలానయష్టి, వెల్ల
యాసలను దయ్యములఁ దోలునట్టి మంత్ర
మూర్తివి, దయాతరంగిత పుణ్యనదివి,
అల్ల యమలోకయాత్రి కట్టాఁక వంబ! 25

తామసాబ్దంబులకు శరత్కాల మీవ
ఘనమహాసంపదల కుపోద్ఘాత మీవ
ప్రియవశీకారకార్య మూలికవు నీవ
జనని! నా కెల్ల వేళల శరణ మీవ. 26

# లక్ష్మీసహస్రకావ్యము

## నిర్వేదస్తబకము

శరణీకరణీయమ్మై
వరణీయమ్మైన నీదు పదయుగ మంహో
హరణమ్మై నిర్వేదో
ద్ధరణమ్మై వరలు, తాపదమనీ ! జననీ ! 1

నీపదముల సేవింపమి,
నీపదతత్త్వమ్ము నెఱుఁగనేరమి నెన్నో
పాపింపించి నాకు జన్మలు
లోపించెను దల్లి ! పాపలులితము లగుచున్. 2

మోక్షకథలు వీడి ముప్పొద్దు నింద్రియ
గ్రామ కామసేవకతనుఁ గూడి
నిత్యతృప్తిఁ గూర్చునీసేవ విడనాడి
వ్యర్థపఱచినాఁడ బ్రదుకు జనని ! 3

ఆవధీరిత సత్సంగుల
నవమార్గాసక్తగుణుల నధమాధములన్
వివిధాపచారబుద్ధుల
నవుదును నేనొకఁడ ననుచు నలుగకు; జననీ! 4

తలఁచి తలఁచి కలుషముల మది పసిఁదప్పె,
కాళ్ల నొప్పి పుట్టె ఖలులయిండ్ల
కడకు నడిచినడిచి ఖలనుతిఁ గొనె నాల్క,
మరి మ, రేమి జనని! మనవు లిడుదు! 5

విహిత మఖిలంబు విడి, గర్హ్యవిధు లొనర్చి,
తదుచితఫలంబు లిట నటఁ బిదపఁ గుడిచి,
జనని! యీరీతి నెన్నాళ్లు చచ్చి చచ్చి
పుట్టవలయునొ యని మదిఁ బట్టె దిగులు.

అంబ! తృణమట్లు సుతకళత్రాదుల విడి
యెందఱెందఱు నినుఁగొల్చి బుద్ధిఁగొనిరొ!
విషయ విషయంత్రములఁ బడి విపదనుసృత
మైనభవమున నేడ్చుచున్నాను నేను. 7

సత్కులమ్మునందు జన్మింప ఫలమేమి?
ఎల్లవిధులు నేర్చి యేమిఫలము?
జనని! సభల మెప్పుఁగొనినను ఫలమేమి?
చిత్తమందు నిన్నుఁ జేర్పకున్న? 8

తిరిగితిఁ జెడుచోటుల కే
సరిగితి నృపసభల కంబ! యతిదీనోక్తుల్
నెఱపితి ఫలమగుపడకయె
మరలితి నినుఁ గొలుచుతలఁపు మఱచితి నంబా! 9

నెఱపితి నిన్నినాళ్లుఁ బ్రీతి నిత్యముఁ దద్యమలోకయాతనా
భరమగురాజసేవన మపావన, మంబిక! చాలు; నీపయిన్;
దురితవిమోచకమ్ముఁ బరితోవృతమేచకమైన తత్పరా
త్పరమహమున్, భవద్ఘటితతత్త్వముఁ బ్రత్యహమున్ భజించెదన్.

మును జనితహృదవసాద
మ్మను నిర్వేదంపువాదమును శుష్కమ్మౌ
మనమున విడి ధైర్యముతో
నిను, నీభర్త నిఁక జనని! నేను భజింతున్. 11

తల్లి! నిర్విణ్ణుఁడను నన్ను దయఁదలంచి
శీతలాపాంగ లవములఁ జేర్చి నాకు
సర్వసంపూర్ణ జయమిచ్చి స్వామిచరణ
శరణవరణ సామ్రాజ్యాభిషవముఁ గూర్పు. 12

# లక్ష్మీసహస్రకావ్యము

## శరణాగతి స్తబకము

దురితమ్ము లడఁపి, మాపయి
వరకరుణారసముఁ బఱపి, వరలక్ష్మి నిరం
తరమును, హరిచరణాంబుజ
శరణాగతి నెఱపి, మాకు సంపద లిడుతన్. 1

దుర్విషయాటవి మృగమై
పర్విడునను, నీయపాఁగవరజాలములన్
బర్వించి హరిపదమ్ముల
కిర్వంటలఁ గట్టి యేలుమీ యిఁక జననీ! 2

హితము నహితమ్ము నెఱుఁగక యే ననార్య
మార్గమునఁబన, మళ్లింపుమమ్మ నన్ను,
కూప పతనోన్ముఖుండగుకొడుకుఁ గాంచి
తత్క్షణమె రక్షసేసెడి తల్లి భంగి. 3

పాఠాంతరము :-

హితమహితమ్మెఱుంగ, మతిహీనుఁడ, నే నపమార్గమందు దు
ర్గతికెదురై చరించునెడఁ గావవె మార్గముఁ ద్రిప్పి తల్లిరో !
సుతుఁడు వివేకశూన్యుఁడయి చూడక కూపమునందుఁజొచ్చుదు
ర్గతిఁ గనుగొన్న మాత, యధికత్వరఁ గావక యూరకుండునే !

విశ్వధాత్రి ! దయను వీక్షింతువని నిన్నె
విశ్వసించి యభయవృత్తినుంటి ;
వరము లిడుదొ, లేక నరకంబె గూర్తువో,
కీర్తిఁగొనెదొ, మఱి యకీర్తిఁజనెదొ ! 4

శ్రుతిఫణితు, లబ్ధిఘోషలు,
స్మృతివాక్కులు పిచ్చిమాటలేకావేని॥
మతి నిన్నె కొలుచునాకున్
సత మంబా ! జయము మోక్షసంపదలు నగున్. 5

గీతోపదేశమెఱుఁగని
పాతకుఁడను నన్ను నీవె పాలింపవలెన్,
మాతా ! యేమగు నితరుల
చేతను ? బద్ధుండు ముక్తుఁజేయునె బద్ధున్? 6

భక్తియు, జ్ఞానముఁ, గర్మా
సక్తియు నొకటేనిలేని సంతతపాపా
సక్తుఁడ దయనీయుఁడ నీ
దృక్తతిఁ బడకున్న గతియె లేదిఁక, జననీ ! 7

హారికలుషితచిత్తాంభః
పరిశుభ్రంకరణ కతకఫల సమవాక్య
స్ఫురణమ్ముఁ గలుగు నీవే
శరణము నాకే నన్యశరణుఁడ; జననీ ! 8

భవదవతప్తుఁడ, నిస్స్వుఁడ,
భవ దుపజనితప్రబుద్ధ భావుఁడను, సదా
భవదీయపతి పదాంభో
భవ సేవాకృషికె నాదుభవమగు; జననీ ! 9

సత్కులమ్మనిచ్చి, ఛాయామిత్రమములట్టి
గురుల భవభవోష్ణహరుల నిచ్చి,
శరణవరణమొసఁగి, శౌరిపాదమ్ము లో
సంగితివి; మతే మొసంగు దింక ! 10

ఏతత్పద్యసహస్ర సంశ్రవణ సంహృష్ట ప్రకృష్టాత్ముఁడై
మాతా ! శేషుఁడు శీర్షకంప మొసరింపన్, బుట్టువాతాహతిన్
జేతఃప్రీతి రతాంతవేళలఁ గడున్ క్రీడా ప్రగాఢశ్రమా
స్వేతగ్లాని హరింప, నీవిభుఁడు మెచ్చున్ వేయి నాకిచ్చునున్. 11

నాకృతి కీర్ష్యఁ జేసి కుమనస్కులు కొందఱు మెచ్చకుండినన్
నాకొకహానిలేదు, సుమనస్కుల కియ్యది హాయిఁగొల్పెడిన్;
కోకిలకాకలీరుతులొకింత వియోగిజనమ్ములన్ మన
శ్శోకముఁగూర్చినన్, గవలఁ జొక్కగఁజేయదె హాయిసేయదే !

స్వ స్తరువగు నీ స్తుతి యిది
శ స్త స్తబకములఁగూడి, జననీ ! సుమనః
ప్రిస్తుతము, సదానందన
వ స్తువు, నామోదరసముఁ బడిదెస లలమున్. 13

సుపదనిష్యందసమ్ములు, స్తోత్రికాల
కంపిత సరస్వతీశిరోఘటిత పుష్ప
శ స్త మధురసమములు, శతృభైర
వములు, నాపద్యములు బుధప్రమద మిడుత ! 14

శౌరి త్వద్గుణలేశపేశలము, డింభ
జల్పితము, దీని నినుఁగూడి చక్కఁగ విని
పారితోషికమిడ నాకు స్వర్గమోక్ష
పదములును చాలవని యేదొ వెదకు నంబ ! 15

అమృత కల్పసూ క్తియైన యీ నీ స్తవ
మ్మెవఁడు వినును, చదువు, నెవఁడువ్రాయు
నాతఁ డేదికోరు నదియెల్ల నగునంబ !
వలయునేని మోక్షపదమె గలుగు. 16

సుమనస్కు లెవరు భ క్తి
క్రమమున లక్ష్మీసహస్రకావ్యము శరా్మ
గమముఁ బఠింతురొ, తద్భవ
నముల మహాలక్ష్మి సతము నాట్యముసల్పున్. 17

భారద్వాజపవిత్రగోత్రజుఁడ, భవ్యాత్రేయ దౌహిత్రుఁడన్
గౌరాంబా కలశాబ్ధిగర్భ మణిగాఁగన్, సూర్యనారాయణాం
శా రాజత్ప్రభవుండ, వేదులగృహాంచజ్జాతుఁడన్, వాణినో
రారన్ దానె నుతించె శ్రీ; నిటు మదీయాస్యాంతరాసీనయై. 18

ఆత్రేయనామ పవిత్రగోత్రంబునం
దాభరణంబుగా నవతరించి
నట్టి శ్రీ శ్రీనివాసాధ్వరికిని నయ
చణునకుఁ బౌత్రుఁడై జననమంది
శ్రీరామపాదాబ్జ సేవా నిహితచిత్తుఁ
డగు రఘునాథ యజ్వాత్మజుఁడయి
త్రయ్యంతవిద్యా విధాన సద్గురుఁడైన
వేంకటనాధు శిష్యాంకితుఁడయి

వేంకటాధ్వరి యనుకవి వెలయఁజేయ
నమరభాషను లక్ష్మీసహస్రకృతిని,
సరిగ సూర్యనారాయణశర్మ నేను
తెలుఁగుఁ జేసితిఁ జదివి వర్ధిల్లుఁడయ్యా! 19

స మా ప్త ము

# శృంగారనషీయము

తెలచెద ముందు వాక్సతి మదిన్, వదనంతరమందు శ్రీరమా
లలనను, శాంకరీసతిఁ జెలంగెడుమోదమునన్ దలంచి వా
రలపిౖయులన్ దిౖమూర్తులఁ గరం బెవ నెంచి వినాయకుణ్ గడున్
దలఁచి పురాతనంపుకవితల్లజులన్ నుతియించి భక్తి ను
జ్జ్వలమగుబుద్ధితో గురులపాదములన్ భజియించి, సత్కవీ
శులకు జొహారు లొగ్గి యతిశుష్కకవిత్వముమాత్రిచేఁ గవీం
దుౖలను హాసించుకాకవుల రోసపుటీర్ష్యఁ దిరస్కరించి నే
నల నిషధాధినాధునికథామృత మాశువుగా నొనర్తు వా
గ్బలమున, సావధాను లయి కర్ణపుటంబుల నాస్వదింపుఁడీ.
కలకలలాడుభూసతిముఖంబునకున్ దిలకాయమానమై
యలరుచునుండుఁ దొల్లి నిషధాభిధ దేశ మొకండు, దానిశో
భల గణుతింప నా గురుఁడు పద్మభవుండును పాపజేఁడునున్
వెలవెలఁబోయి రన్న మఱి నే వచియింపఁగ నెంతవాఁడ, నా
పలుకులకల్కిఁతేనిఁ దొలిపల్కుల మెచ్చరు వృద్ధుఁ డంచు భూ
తలసురులచ్చటన్ ; మివుల ధర్మజయైకమనుష్కులై మహా
బలయుతు లైన యట్టి నరపాలురు వాలినిఁ జెట్టు మాటుగాఁ
గలిగి వధించి స్వార్థమునుఁ గైకొనె నం చల రామచందుౖనే
చెలఁగి తృణీకరింతు, రట సెట్టివతంసులు బిచ్చగానికిన్
జెలి యని యా కుబేరుసిరినిం గని కేలి నొనర్తు, రందు కాఁ
పులు కడు భీతిభక్తులను మోదముఁ గూర్చెద రెల్ల వారికిన్,
లలి లలనామతల్లు లకలంకచరితౌ నరుంధతీసతీ
తిలకము నీడు వత్తురు పతిపిౖయజీవన లై యెసంగి, యా

కలుములముద్దరా లటనె కాంక్ష విహారము సేయు నెన్న యి
ట్టుల నది యట్టు లద్దియుఁ గడుంగడు నొప్పునటంచు వేఱుగా
దెలియఁగఁ జెప్ప నేల! యటఁ దీటగువస్తుసమృద్ధి నాత్మలోఁ
దలఁపుడి, యట్టు లెంచినను తత్త్వములో నొకపీస మేనియున్
దెలియఁగలే రటన్న గణుతించుటయెట్టులు వాక్కులన్; మహా
లలితము, నిర్జరాలయము లాగుఁ జెలంగెడు నట్టిదేశమున్
నలుఁడనుచక్రివర్తి, రిపునాశకతన్ సమవర్తి, దానమం
దలశిబిచక్రివర్తి, జనతాదరణైకపథానువర్తి, య
య్యలరులతూపుజోదుఁ బరిహాస మొనర్చుమనోజ్ఞమూర్తి భూ
వలయజనార్జితాద్భుతతపఃఫలపూర్తి, తుషారరాజతా
చలఫణిరాజరాజకరశారదనీరదశుద్ధకీర్తి, రం
జిలి, ప్రజ లెల్ల సన్నుతులు సేయఁగ, ధర్మము నాల్గుపాదముల్
నిలువగ నేలు; నొక్కపుడు నిష్కుటసీమఁ గతున్ విహారమున్
సలుపుచు, నాతఁ డందుఁ గల చక్కని పూఁబొదరిండ్లసోయగం
బులు, ఫలనమ్రసాలములపొల్పును, పక్షులయాటపాటలున్
గలయఁగఁ జూచి, యందొకట కాంతసరోవర మొండుగాంచి, యం
దలపున నొక్కపద్మమున హాయిగ నిద్దురఁ గాంచునట్టి యం
చలలన నొండుఁ గాంచి, మెయిచక్కఁదనంబును మెచ్చి చేకొనన్
వలె నని మెల్లమెల్లఁ జని పట్టిన నయ్యది దైన్యలాపియై.
కలువలరాకొలంపుతలకట్టువు నీ విల నేలుచుంటి వన్
బలమున నిర్భయంబుగనుఁ బండితి నిం దిపు డీవె పట్ట, మ
మ్మల నెవరాదరింతురు ప్రభూ! యని గొల్లున నేడ్వ; రాజు సం
కలితదయాంతరంగుఁడయి క్రచ్చఱ దానిని వీడె, నంత క
న్నులను కృతజ్ఞతారసము నూల్కొన నయ్యది తేనికిట్లనున్.
సలలితభావ! నన్విడిచి నాగృహ మంతకుఁ బ్రాణదాన మీ

వెలమి నొనర్చి తీఋణము నెట్టులఁ దీర్చెద నైనఁగాని నా
కలవడుకార్య మొండు గల దద్ది యొనర్చెద నేను నీకు నా
నెల కొక నూలుపోఁగు వలె నీవు గ్రహింపు మ దెట్టు లంటివేన్.
కలదు విదర్భదేశమునఁ గాంతల నెల్లను గాంతయై యిలా
తలగతయౌ శచీపతియొ దర్పకునెచ్చెలియో యనంగ రా
జిలు దమయంతినాఁగ నొక చేడియ యయ్యమ నీక పోలు నా
నెలఁతుక నీకుఁ గూర్చి పడు నేరుపుఁ జూపెద నీ కభీష్టమున్
గలుగఁగఁ జేయునే యిది యనన్ నునుసిగ్గున లేఁతనవ్వు మో
ములమఁగ మౌనముద్రఁ బలు కాడక యుండిన నద్దె యిచ్చగా
దెలిసి యనుజ్ఞనుం బడసి దివ్యపథంబునఁ బోయె నంచ, యా
నలుఁడును హంసపల్కుల మనంబున నెంచుచు మోహమగ్నుఁడై
యల దమయంతిరూపము హృదంతరదర్పణమందు నెప్పుడున్
నిలువ, విరాళి పైకొనఁ గణింపఁగ శక్యముగాని బాధపై
నలమఁగ నిట్లు చింతిలెఁ గటా ! తనయంతట తానె యట్టులం
చల తలమానికంబు సరసంబుగ ముద్దియఁ గోరుదే యనన్
దెలివి యొకింత లేక యొక తిన్ననిమాటనె పల్కనైతి నా
వలపునుఁ దెల్పనైతి ; సతివాంఛ విహీనుఁడు వీఁ డటంచు లో
పలఁ దలపోయునేమొ ? పరభావవిదగ్రిణి యంచ యదెటుల్
దలఁచును, మౌనమే యనుమతంబని యెంచదె ! యెంచుఁగాక య
య్యలఁతిపులుంగ దెట్లు దమయంతినిఁ జేరెడుఁ; జేరి చాటుగాఁ
దెలుపుట యెట్టు, తెల్పెటులొ తెల్పిన నా సతి మెచ్చు టెట్టు లా
పులుఁగు కృతజ్ఞతన్ పలుకుపొందునఁ జూపెనెగాని దానికిన్
దలమగునే యొనర్పఁగఁ గృతజ్ఞత కాదుగదా కృతఘ్నతన్
సలిపెను, బాళిఁ గూర్చి ననుఁ జంపుటకే యిటుఁ బల్కెనంచుఁ జే

రలుకనుఁ బూనియున్, తిరిగి యాదృతిఁ బూనియు నాఁటినుండియున్
వెలి మెయిఁ దోపఁగా విరహవేదనఁ గుందుచు నుండె హంసయున్
కలజవ మెల్లఁ జూపి యలకాపురిఁ గాపురి సేయు శ్రీలతో
నలరెడు నావిదర్భవిషయాంతరకుండినపట్టణంబులో
పల నెలఁదోట సాళియయి భైమి విహారమొనర్చుచోట వ్రా
లె ; లలనలెల్లఁ జూచి తనలీలలకెంతయు నబ్రమందఁగన్.
చెలువున నా పులుంగు తనచిత్తము లోఁగొన దానిఁ బట్టఁగాఁ
దలఁచి విదర్భరాడ్దుహిత దానిసమీపముఁ జేర. నద్దియున్
మెలఁకువ మెల్లఁగా నళిననేత్రికు నంపియు నందకుండఁగా
మెలఁగుచు, నట్లు దూరము గమించి యొకండుఁ హర్మ్యసీమ నా
లలనకు నంది, యాపెయుపలాలనఁ బెల్లుగఁ బొంది యిట్లనున్.
తొలకరిమించుమించు వెలివ్రోసెడు నీ తనువల్లి యిప్పుడె
ట్టుల వసివాడెఁ! బాదము లెటుల్ గనుగందెనో! సన్నుఁ బట్ట చా
పలత యదేల ! మన్మధుని బంగరుచాపలతా ! యటంచు నా
పొలఁతుకతోడ నెంతయును ప్రొద్దు గడుంగడు ముచ్చటాడి ప
ల్కులసుధ నాపెఁ దేల్చి యొక కొంచెముసేపటి కెద్దో జ్ఞప్తికిన్
గలిగినటుల్ నటించి గజగామిని ! పోయెద వీడు మంచు ను
త్తలపడసాగ తత్పదసుధన్ గడుఁగ్రోలియుఁ దృప్తిలేక యం
చలరతనంబ ! యేల యిటు సంభ్రమమొందెద విందె యుండి నా
చెలివయి, వాక్సుధారసముచే ననుఁ దేల్చుచు నుండరాదె ! నీ
కిల నెటనైననేమి ! యనియెంతయుఁ బొచ్చెములేనియట్టిప్రే
మలహరి యుబ్బునొందఁగ దమస్వస బల్కిన, రాజహంస మం
జులతరవాక్యగుంభనము చూపడ నిట్లను; నోత్రిలోక మో
హలతిక ! యీయిలాతలమునందు నలుం డను ఱేఁడుకల్గు నా

నలువ కడంగి స్వీయరచనాపటిమన్ గడు ధారవోసి, యీ
లలితశరీరునిన్ నృపలలాముని సృష్టియొనర్చి తాను పే
ర్మిలుపుకొనెన్ ; మహానిమనీష నెవస్తురభాగ్యరాశి నా
నలునకుఁ గూర్చు నూహనుపొసర్చెనొ ! అమ్మకచెల్ల ! మీనులన్
గెలిచెడుకంటిసొను, నునుఁ గెంపునుమించధరంపుతీరు, నా
కలువలజేనిఁ గెల్చెడుముఖంపుహొయల్. కనకంపుమేనిడాల్
కలికిమిటారి ! నేత్రములఁ గాంచఁగఁబోలును కాని, చెప్ప నా
పలుకులు వాల; వాసలువిధాతతి దేవమునుల్ వచింపఁగా
వలఁపునుఁ బొంది యాతని వివాహమునాడఁ దలంచి, వెండి యీ
నలునకుఁ దాను పోలఁదగు నాతినిఁ గానని యెంచి రంభ, వి
హ్వాలతను చేపనేనయిన నాతనిఁ బోలె నటంచుఁ దృప్తిచే
నల నలకూబరున్ బరిణయంబునుగాడె నటన్న, వాని యీ
చెలువు నదేమనందు; నని చిత్తము మోహపువార్ధిఁ దేలఁగాఁ
దెలిపి యొకింతలౌక్యఫణితిన్ దగ నిట్లను రాజహంస మ
వ్వలఁ, జెలి ! కన్నెయొద్ద మగవారిపరిసంగము లెంతమాత్రమున్
సలుపఁగఁగూద, దైన నలసత్తమనంబునఁ జేసి యే నిటుల్
సలిపితి, దీని నీవు గడు సమ్మతితో క్షమియింపు మట్టి యీ
నలునకు ధాత్రునానతి విస్రమత సేవ లొనర్చుచుందు, నే
తొలఁగ నిమేషమాత్ర మతిముఃఖితుఁ డౌనతఁ, డేనుగూడ నా
నలు విడియుండ, మానసమునన్ గల నా చెలికాండ్రఁజూడ నె
ట్టులొ సెలవందిపోవుచుఁ గడుంగడు నాతనిరూపరేఖికా
విలసనముల్ సమస్త మొకపీసము భేదము లేక నీయెడన్
గలుగుటఁ జూచి మా నిషధ కాంతునకున్ సరియైనచేడె భూ
తలమునఁ గల్గెనే ! యనుచు తద్దయు నచ్చెరువంది చూచిపో

వలెనని వ్రాలి నిన్నుఁ గన భావము విస్మృతిమొందఁ బెట్టఁగాఁ
నిలిచితి, నిన్ను వీడ మదినిన్ గడుదుఃఖము నాకుఁ గూడ నీ
వలెనె జెలంగుఁ ; గొందొక నెపంబును బెట్టుచు నప్పుడప్పు డా
నలు విడివచ్చి నీ కరమునన్ దనరారెదఁ బోయివత్తు. నం
చెలమి వచింప, భీమసుత యెంతయుఁ గౌతుకసక్తయై నలా
కలితమనస్కయై కుసుమకార్ముకతీక్ష్ణకృపాణవిద్ధయై
యలరుచు, నేమి నెచ్చెలివె హంసమ ! యిప్పటి నుండియుంటి. య
య్యలరులవిల్తుములుకులకు నర్పణఁజేసి చనంగ నెంచితే !
వెలువడనిత్తునే యిఁకను. వీడను నిన్నని నొక్కిపల్కి రా
గలత గడిందిసాగఁ దనకామిత మెంతయు స్పష్టరీతిగన్
దెలిపి, మమున్ వియోగభరసారధినుండి తరింపఁజేయు న
య్యలయిక యంత నీదె యని, యంతరునంతరు ప్రేమ సాగఁగా
నిలువఁగలేక మూర్ఛలిన, నీడజ మెంతయు శీతలక్రియన్
దెలివినిఁ గల్గఁజేసి, పొలఁతీ ! భయమందకు, నీదు భావమున్
దెలియ యదార్థసంగతిని నేను మఱుంగొనరించితిన్, గడున్
నలుఁడు భవద్గుణౌఘములు నావలనన్ విని మోహమంది. నీ
వలఁపు నెఱుంగ నన్బనిచె, వాస్తవ మిద్ది యటంచు. నెవ్వా దా
సల నొనరింప భైమి కడు సంతస మంది "విళంబ మేమియున్
సలుపక పోయి, నాదుతమిసంగతి నంత నెఱుంగఁజెప్పి, మ
మ్ములఁ గడువేగమే మివుల మోహపువార్ధిఁ దేల్చు" మన్న దం
జిలి కలహంసమున్ సెలవుఁ జేకొని నైషధుఁ జేరి యంతయున్
దెలిపి 'సుశీఘ్రమేవ భవదీయవివాహముహూర్త మ' స్తటం
చెలమి వచించి వీడుకొని స్వేచ్ఛగ నాకసమందుఁ బోయె, నా
నలదమయంతులున్ దమ మనంబుల నెంతొ వియోగబాధచేఁ

గలఁగుచునుండి, రంతట నొకానొకయప్డు విదర్భభూమిభృ
త్తిలకము భీమరాజు కడుతేరినకూరిమి గూఁతుపెండిలిన్
సలుపఁగ దేశదేశములఁ జాటఁగఁజేసె స్వయంవరంబు, నం
త లలితదేహులౌ నృపతితల్లజు లెల్లరు నన్నె నన్నె యా
పొలఁతి వరించు నం చధిక భూషణముల్ మెయిఁ దాల్చి ఠీవి పెం
పలరఁగఁ గుండినేశుపురమందు వసించిరి ముందె పోయి; యా
కలహాసమిత్తనారదముఖంబున దాని నెఱింగి యంత ది
క్పాల కధినేతలౌ శతముఖుండును, పాశి, యమాగ్నిహోత్రులన్
నలువురు భైమిపై వలఁపునన్ బయనం బొనరించి రంత భూ
తలమునకున్; గరమ్ము ఫలిత మ్మగు స్వార్థమటంచు నెంచి లో
నలరి నలుండునున్ బయనమయ్యెను, పిమ్మట మార్గమధ్యమం
దల నలుఁ గాంచి దిక్ప్రభువు, లంతకుఁ దొల్లియె భైమి నైషధున్
వలచెను గట్టిగా ననుచు భావములోన నెఱింగియుండుటన్
వెలవెలఁబోయి, రంత, బలభేది, నలుం గని యెంతొ కైతవా
కలితమనస్కుఁడై యిటులగా ననె "యోనలరాజ! యేమియీ
ఫలపరిపాకసూచనలు! వహ్వారె! నిన్నన మేము నీరసా
స్థలి దిగినంతనే యిటకుఁ జయ్యన వచ్చితి వీవె యిప్డు, నీ
వలనన కాని కాని యొకభారపుకార్యము మాకు నియ్యెడన్
గలిగెను దానిఁ గూర్పఁగ వినమ్రత వేఁడుచుంటి మద్ది నీ
వెలయిబ నొసర్చెదే! యనిన నెంతయు మోదమునన్ నలుండు వే
ల్పులయొకిమ్మిండ్లకున్ గరము మ్రొక్కి, సురాధిపులార! మీకునున్
బొలుపడనట్టి కార్య మది భూమినిఁ గల్గెనె! సప్పరీక్షనున్
సలుపఁగఁగోర! యేమయిన సమ్మతియే, మఱి మీకు నేమి కా
వలయును? ప్రాణమైనసరె ప్రాణముకంటెను నెక్కువైనదీ

యిల మఱి యెద్ది? యేదయిననేని నొసంగెదఁ, జెప్పుఁ డన్న మా
యలకు నిధానమైనదివిజాధిపుఁ డాత్మకరమ్ములోన నా
నలుకర ముంచి తప్పక పొనర్తు నటంచును నెన్నియెన్నొ యొ
ట్టుల నొనరింపఁజేసి, మది దొంకర యోయుమూసదాస! మే
మల దమయంతిపై వలపు నందితి మాపెను మాకుఁ గూర్ప నీ
వెలమిని దూతకృత్యమున నేగుట మా దగుకోర్కె నీవు దీ
ని లలి నొనర్చి నీ విపుడు నీకులవృద్ధున కైన మెచ్చనుఁగా
బొలియఁగఁజేయు, మన్న నలభూవరుఁ డయ్యది వజ్రిపాత్రమై
కలఁత నొనర్చినన్, ధృతినిఁ గ్రచ్చఱ దానినిఁ గప్పి, యిట్లుతే
సలిపెద నన్న, నాతనికి శాంబరివిద్య నొకండుఁ జెప్పి, నీ
వల దమయంతిమందిరమునందుఁ జరించెడునప్పు డెవ్వరున్
దెలియఁగలేరు నిన్ను, మఱి నీవు సమస్తముఁ గాంచుచుందువం
చెలిమిని దేవభర్త వచియింపఁగ, దైవతకార్యభార మా
దల ధరియించి వేగమె విదర్భనృపాత్మజరాణివాస మే
రలుఁ గనకుండఁ జేరి నలరా జట భైమినిఁ గాంచి మోహపుం
జలధి మునింగి ధైర్యమున సత్వరమే తెలివొంది వెండియున్
కలఁతను బొంది యెచ్చటనుఁగాంచిన భైమియె తోఁప నేపెతో
సలుపుదు దౌత్య మంచు కడుసంభ్రమపాటునుఁ బొంది, వెంటనే
తెలివినిఁబొంచె, యెంతయును తేఁకువ యొప్పఁగ నొంటి నున్న యా
పొలఁతినిఁ గాంచి, యోయలరుఁబోడి! దిగీశులదూత నేను, వా
రలు భవదీయభాగ్యమున రాగమునొంది, భవద్వశాంతరం
గు లయిరి; వారిలో నొకరిఁ గోరి శరీరముతోన స్వర్గమం
దెలమి వసింపు, మీవు స్వరధీశునిఁగోరుదె! ధర్మరాజుపై
నెలమి వహింతె! కాంతినిధినెంతువె! యప్పతిపైనిఁ గూరిమిన్

గలిగితె ! యేరిపై వినయిఁకఁ బరె యొక్కనిపై నిఁ బేరిమిన్
గలిగి సుఖింపు, మంచుఁ బలుకన్ నలుఁ; డంతట భైమి యోయి! నే
నల మునిమానినీవిటుని కాసనొనర్ప, లులాయవాహనున్
దలఁపను, సర్వభక్షకు నెదన్ దలపోయ; జలాధినాథునం
దెలమి వహింపఁ, దక్కుల మఱెవ్వరిఁ గోరను. వారి నిచ్చటన్
దలఁపకు మంచుఁ బల్కుటయు, నైషధుఁ డంతట నోర్పుతోడ వా
రలఁ గడుఁ బెద్దగా నుడివి రాగముఁబుట్టఁగఁజేయ నెన్నొరీ
తుల బతిమాలిచెప్పి, మఱి తుట్టతుదన్, నిను వారు బల్మిఁగ
ల్పలతనొ, కామధేనువునొ ప్రార్థనఁజేసియొ. సీదుతంత్రినిన్
గెలిచియొ కాని పొందు టది నిక్కము; గావున నీవె వారినిన్
వలచిన మంచి, దంచు భయభంగి వచింపఁగ వార లట్టులే
తలఁచినఁ బ్రాణమే వదలెదన్ చితిలోఁ బడికాని, వార్థిలో
పలఁ బడికాని కాని యలవారికిఁ దక్కుదునే నలేశ్వరున్
దలఁపదు భైమి యేమి తలవన్నుకపోయెడికార్య మైన నం
చెలమి వచింప నాపె; నలుఁ డెంతయు లేనగ వొప్ప నోసతీ
తిలకమ ! వెఱ్ఱిదానవుగదే, మరణించిన, వారి కెంతయున్
సులభముగాదె నిన్గొనుట చూడు ; చితింబడ నగ్గివేల్పునిఁకఁ
సులువుగఁ జేకొనున్ ; జలముఁ జొచ్చిన పాశికి వశ్యవౌదు వె
ట్టులమరణించినన్ యమభటుల్ సమవర్తికి నప్పగింతురి గా
న లలియొసంగ నీవె సురనాథులలోపల నేరినైననున్
వలచి సుఖింపు మంచుఁ బలుభంగులఁ జెప్పిన వానిలెక్కగన్
దలఁపక వానివాక్యరచనానిపుణత్వము భావసూచనా
విలసనముల్ మదిన్ ముదముఁ బెంపఁగ నాదమయంతి, యోయి ! నీ
పలుకులపోడిమిఁకఁ దలఁప భారతి పుంస్త్వముఁ దాల్చినట్లుగన్

దలఁపు జనించు నిన్నుఁ గన నా కదియేలనొ చెప్పలేనిక్రొం
దలఁపులు గల్గుచున్నయవి తథ్యము ; కావున నీదునామమున్
దెలుఁపగ వేఁడుచుంటి నని దీనముగా దమయంతి వేఁడ నా
నలుఁ డిక పట్టలేక తననామము, స్వాగమనక్రమంబునున్
దెలియఁగఁ జెప్పఁ గ్రిచ్చఱ జనించినసిగ్గును, మోదముఞా మదిన్
వలఁగొనఁగా తటాలునఁ గవాటపుచాటున డాగి, మోహపున్
జలధి మునింగె భైమి; మఱి, నైషధుఁడున్ కడురాగవార్ధిలో
పల నడుగంట మున్గి యటుపై దిగధీశులకార్య మేమియున్
ఫలితముఁ జేయఁజాలమికి భావములోఁ దను దానె దిట్టుకొం
చలదివిజోత్తరుల్ నిలిచినట్టిప్రదేశము వేగఁ జేరి యా
కెలఁకులఱేండ్ల కంత నెఱిఁగించెను నైషధుఁ డంత నెంతొ చిం
తిలి మఱి వారు కృత్రిమమతిన్ నలువేషము తాముఁ బూనియా
నలుకడఁ గూరుచుండి రలనైషధుఁడెవ్వఁడొ యేర్పరింపఁగా
నలవడనట్టిరీతిని స్వయంవరమందిరమందు నంతటన్
చెలియ నొకర్తు నానుకొని చేతను చంపకపుష్పమాలికన్
సలలితభంగిఁ దాల్చి నృపసంఘము లావెదవింటిజోదుతూ
పుల బడిస్రుక్క నాభువనమోహనసుందరి యాయనంగుచా
పలతిక, యాతటిల్లలితభైమి మనోహరరీతి వచ్చినఞా
తళతళభాసమానమగుతత్తనుకాంతికి ముగ్ధులై యటన్
గలనృపు లెల్లఁ గట్టెదుటఁ గల్గినయద్దములందుఁ దమ్ము తా
గలయఁగఁ జూచుకొంచుఁ దమకంబున మీసల నీటుబుచ్చుచా
రలు, మణిభూషణమ్ములు సదాసరి దిద్దెడువారు, మోటుగాఁ
జెలఁగెనటంచుఁ గొన్నిఁటిని శీఘ్రమ తీసెడువారు నుంగరం
బులఁ గడుఁబైకిఁ గన్పడెడుపొల్పున హస్తములన్ దెమల్చువా

రలునయి యాపెపైని ననురాగపుఁజూపులఁ బర్వఁజేసి యా
పొలఁతుక యెట్లుచూచినను మోహముతో,దముఁ జూచె నంచు న
గ్గలముగుకూర్మి నాభువనకాంతులు పెంపుగఁ గూఁచుండఁగన్
చెలియ నృపాలశేఖరులఁ జేతను జూపుచు వారివారిపే
రులు, గుణపుంజముల్ గడు నెఱుంగఁగఁ జెప్పుచురాగ వారి గుం
డెలు గడు విచ్చిపోవఁగ వడిన్వడి చూచుచుపోయి యొక్కచో
నలువుగ నిల్చిభైమి యట నైషధపంచకమీక్షసేయుటన్
నలు లిట నెందఱో గలిగినారలు హంసయు నాకు దీనినిఁ
తెలుపనెలేదు, హా! హతవిధీ! యిపు డేమియొనర్తునే నహో
తెలిసిన దల్లదిక్ప్రభులు డీటుగ నైషధువేష మూనిరా
నలుఁడును నిందె యుండు మఱి నా కిపు డానిజనైషధుం డెటుల్
దెలియు నటంచుఁ దాఁ దనమదిఁ గడుదుఃఖము నొంది, యొంది ది
వ్యలకపటంబు దివ్యులె సుబోధము సేయవలెన్ మఱెవ్వరున్
దెలియఁగలే రటంచుఁ బ్రిఋతించె నిటుల్ బలుకుంబొలంతి; నో
నలువమొగంపుతమ్మివయి నాట్యమొనర్చు మరాళరత్న! నీ
లలితకటాక్షవీక్షణబల మ్మొకవీసము గల్గినన్ కరా
మలకముగా నెసంగును సమస్తనిగూఢపదార్థజాల మా
బలము కొఱంతవడ్డ నరుభావము దీపములేని గీమెకా
తలఁపఁగఁ దల్లి! నీవిభుఁడు తద్భ్రమన్ సృజియించినట్టియా
నలుఁ డిపు డిందునెవ్వఁడొ కనంబడఁజేయవె! నాకు సత్కృపా
కలిత! సమస్తసన్నుత! జగజ్జననీ! యని పెక్కురీతులన్
జెలఁగి నుతించి తుట్టతుద నింగికిఁ జేతులనెత్తి చూచుచున్
తొలఁకనిభక్తి నోపలుకుతొయ్యలి! నైషధభిన్ను నెప్పుడున్
దలఁపక యుంటినేని నిజనైషధుఁ డెల్పొదుగాక లేనిచోఁ

దల శతధా ప్రభిన్నమయి ధారుణిఁ గూలెదఁగాక నే నటం
చెలుఁగిడి, గట్టుఁగొంపఁ బరివహించెడియేఱువలెన్ కవోష్ణబా
ష్పలహరి గుబ్బమిట్టలను జాఱఁగ నేడ్చె భరంబునన్ బటాం
చలమున మోముఁ గప్పుకొని సాధ్వి రసాలవినూత్నపల్లవా
కలితకషాయకంఠ కలకంఠమనోహరగీతిరీతి, ది
క్కులయెకిమీంద్లహృచ్ఛిలలుగూడ ద్రవించి స్రవించె నంత ద్యో
తలమునుండి యోవరవిదర్భనృపాత్మజ ! యేరిరూపుతో
మెలఁగినఁగాని వారి యనిమేషత తప్పదు దేవతాళి కీ
మెలఁకువ గుర్తెఱుంగుము నిమేషయుతుం డలనైషధుం డటం
చెలమి వినంబడన్ మునము నెంతయుఁ బొంది యథార్థనైషధున్
దెలిసి విదర్భరాడ్భవ జనించినసిగ్గున నోరచూపు ము
ల్కులఁ గడుఁ గ్రుచ్చె నా కుసుమకోమలు దేహము గాడిపాఱ నా
నలుఁడును కూర్మిభైమిఁ జిఱునవ్వుఁదొలంకగఁ జూచె నంత నా
వలపుటవస్థ యిట్టిదని వర్ణనసేయఁగ శక్యమౌనె యా
చిలువలతేనికైన నజుచేడియకైనను నాక్షణమ్మునన్
విలువనుఁగట్టుచో నల కుబేరుసిరుల్ సరిగావు ; పిమ్మటన్
లలి, దమయంతి పూసరము నైషధుకంఠమునందు వైచెఁ, గొ
ల్లలుగను క్రొన్ననల్ గురిసి లాస్యమొనర్చిరి దేవమానినుల్
చెలఁగెను దుందుభిధ్వను లశేషముగా భువినిన్ దివిన్ గడున్
నలు నుతియించి రెల్లరు ననంతరమందు ముహూర్తవేత్తలౌ
కొలముపురోహితుల్ దెలుప కూఁతును నల్లుని భీమరాజు మం
గళతరమైనస్నానముఁ దగన్ బచరింపఁగఁజేసె నంత నా
నలదమయంతు లిర్వురు వినమ్రతతోడ వివాహవేదికా
స్థలము నతిక్రమించిరి ముదంబున నైషధుఁ డంత భైమికిన్

గళమున భవ్యసూత్రమును గట్టెను, భూసురవేదనాదముల్
బలుపగు తూర్యనాదము నభస్స్థలవీధుల సంచరింపఁగన్
సలలితమైన యా కుతుకసంపద కంతకు నాది హేతువై
చెల్లగినహాంసతల్లజము చేరి కడున్ పరిహాసవాక్యముల్
పలుకఁగ లేతనవ్వు ముఖపద్మమునం దుపయింప నంత వా
రలు తలఁబ్రాలు నొండొరుశిరంబులపైఁ దమిఁ బోసికొంచు బం
ధులకు ముదంబుఁ గూరిచిరి తోరముగా మఱి భీమరాజు రా
ట్తిలకములన్ సగౌరవమతిన్ దగుమన్ననఁ జేసి పంపె నా
నలదమయంతులున్ సుఖమునన్ గడు దోగిరి నాఁటినుండియున్.

శ్రీయుత మైన కాకరపురిన్ ద్విజులన్ బొడవౌ ద్వివేద్యభి
ఖ్యాయుత వంశమందు శివు గౌరినిఁ బోలినయట్టి సూర్యనా
రాయణగౌరమాంబలకు నౌరసపుంగొమరుండు సూర్యనా
రాయణశర్మ దీని నొనరన్ బొనరించెబు ధాళి మెచ్చగన్.

నా సలుపఁబూనినట్టి లక్ష్మీ సహస్ర
కావ్యము నిరంతరాయముగా రచింపఁ
బడఁగఁ జేయు మటంచు సద్భక్తి విఘ్న
దేవునకు నంకితంబుగా దీని నిడుదు.



# లక్ష్మీసహస్రకావ్యానుబంధము

ప్రారంభ స్తబకము

శ్రీలక్ష్మీ చరణాంభో
జాలక్తాంకిత భుజాంత రాభ్యంచితునిన్
లీలాసృష్టిస్థితిలయ
శీలున్ శ్రీవేంకటేశుఁ జిన్మయుఁ గొలుతున్.

పై పద్యము 1 వ పద్యమునకుఁ బాఠాంతరము.

వక్షస్స్థలావస్థాన స్తబకము

లక్ష్మీ! త్వత్పదలాక్షీయ లక్ష్మను, నిను
హృదయమున నొంది శేషాచలేశుఁ డెపుడు
కోపియును గృష్ణుఁడును నయ్యుఁగూడఁ దాల్చ
ననవరత మధికారుణ్య మంచుఁ దలఁతు.

పై పద్యమును 25 వ పద్యము తర్వాతఁ జేర్చుకొనవలెను.

ఐశ్వర్య స్తబకము.

మూలములోని 11 శ్లోకమునకు 11, 12 పద్యములు అనువాదము.

నామవైభవ స్తబకము

మూలములోని 17, 18, 19 శ్లోకములకుఁ గలిపి 17 వ సీసపద్య మను
వాదము,

ధ్యేయమౌనట్టులు వచోవిధేయమటులు
దేవి ! యధ్యేయమును సువిధేయము నయ
వరలు నీనామధేయ మెల్లరకు భాగ
ధేయమును దెచ్చు; ముక్తిపాధేయ మిచ్చు.

పై పద్యమును 31 వ పద్యము తర్వాతఁ జేర్చుకొనఁదగును.

చిత్ర స్తబకము.

సుఖబోధ కొఱకు మఱల రచింపఁబడిన చతురంగబంధము.

చతురంగబంధము : విద్యున్మాలావృత్తము.

శ్రీరాసారా, మారాపారా,
రారా, రాధారా, వామాదా,
కారా, ధీరాసారా, పారా,
రారా, రా, వే, రావా, రోమా !

తురంగపదోద్ధృతము : విద్యున్మాలావృత్తము.

శ్రీరామా, మా, మారా, వేరా
సారా, పారావారా, రారా,
ధీరారా, రా, సారోదారా.
పారావారా ధారాకారా !

1 వ పద్యము. అర్థము:- శ్రీ-రా. శ్రీ = శోభాయుక్తమైన, రాస = రాసక్రీడలందు, ఆ = భావమును, రా = గ్రహించుదానా! (రాతీతి రా) మా-రా. మార + ఆ = మన్మధునకు స్థానమైన దానవును, అపార + ఆ = హద్దులేనిదగు సముద్రము స్థానము గాఁగలదానవునైనదానా! రారా = ధనమును గ్రహింపఁజేయుదానా!

రాధారా = రాధకు నివాసమైనదానా ! వామ+అదా = ప్రతి కూలురగు వారికియ్యనిదానా ! క+ఆ+రా: క = విష్ణు, మన్మధ, అగ్ని, వాయు, యమ, సూర్యాదులను, ఆ = సంపూర్ణ ముగ, రా = స్వీకరించుదానా ! ధీర+ఆసారా ! = విద్వాంసులకు, లేక, ధైర్యవంతులకు మిత్రబలమైనదానా ! పార+అర+రా; పార = హద్దును, అర = స్వీకరింపనిదైన (హద్దులేని) ఆ = సంపూర్ణమైన, రా = ధనమైనదానా ! హద్దులేని పూర్ణధనరూపిణీయనుట, వే = వేగమే, రా = రమ్ము, రావా ! = రావా ! వత్తువనుట, రో, మా = ధనమాతా. 'రై' అను ప్రకృతికి తత్సమపదము రో. మా = తల్లీ ! ని, రాత్రియాం హేమ్నిశాలాయాం. ని. ఆసారస్తు సుహృద్బలమ్ ఇతిరత్నమాలా. ని. కో బ్రహ్మార్కానిలాగ్ని విష్ణౌ, ని. ఆకారస్తుపదేభావే, 2 వ పద్యము :- అర్థము : శ్రీరామా ; శ్రీ = మంగళప్రదమైన, రామా = స్త్రీ ! మా = లక్ష్మి ! మారు+ఆ = (నీకు) ప్రతియున్నారా ! లేరనుట. వేరు+ఆ = మేము నీకు వేరు మనుష్యులమా ! ఆత్మీయులమే యనుట. సారా = శ్రేష్ఠ రాలా ! పార+అవార+ఆ = సముద్రము వంటి భావము కల దానా ! ప్రేమ వారాశీ ! యనుట. ధీర+ఆ+రా = ధైర్యవంతులను పూర్తిగా స్వీకరించుదానా, (సాహసేలక్ష్మీ.) రా = రమ్మ. సార+ఉదారా = శ్రేష్ఠమైన యీవిగలదానా ! పారావార+ఆధార+ఆకారా ! = సముద్రుఁడు ఆధారముగాఁ గల (జనసాధారముగాఁ గల) స్వరూపము గలదానా ! ని, ఆకారస్తు పదేభావే ఇతి రత్నమాలా.

ఏకవ్యంజన చిత్రము : ద్విపదపద్యము.

రరరార, రా, రోరరరరేరరైర !

రరరారరేరరో, రార, రారార !,

పైపద్యమును 32 వ పద్యము తర్వాతఁ జేర్చుకొన వలెను.
అర్థము : ర...ర ; ర = వజ్రాయుధమును, ర = గ్రహించు నట్టి ఇంద్రునకు, రా = ధనమును, ర = ఇచ్చుదానా ! దుర్వాసశ్శాప గ్రస్తుఁడగు నింద్రునకుఁ దిరిగి రాజ్యమిచ్చినదానా ! యనుట. రా = రమ్మా. రో...ర, ర + ఉ = రో, ర = అగ్ని, ఉ = శివుఁడు, రర = వజ్రాయుధ హస్తుఁడగు నింద్రుఁడు, వీరందఱిని; ర = గ్రహింపఁ జేయునట్టి, రా + ఇల (రలయోరభేదః) రా = ధనమునకు, ఇల = భూమి యైనదానా ! రై ర, రై = ధనమును. ర = గ్రహింపఁ జేయుదానా ? ర...రో, ర = నాశమును, ర = పొందునట్టి వారిని. రా = స్వీకరించుదా నవును. అర = (నవిద్యతే రంధనం యస్యసః అరః) ధనహీనునకు, రా = ధనమునకు, ఇలరో ! = స్థానమైన దానవు నైనదానా ! (రలయోరభేదః) రా...రా, ర + అ; ర = కోరికతో, అ = విష్ణువును, ర = స్వీకరించు వారికి, రా = ధనమును. ర = గ్రహింపఁ జేయు వారియందు. ఆ = సంపూర్ణమైన. ర = కోరిక గలదానా ! విష్ణుభక్తులకు ధనమొసంగు వారి యందు ఆసక్తి చూపుదానా! యనుట. 1 ని. రః పుమాన్. పావకే. కామే. క్షయే. వజ్రే. శయే, రుతౌ. 2 ని. ఉకారః క్షత్రియే నేత్రే హరి మౌళాహరే. హరౌ. 3 ని, అకారో బ్రహ్మవిష్ణ్వీశ కమఠేష్వితి రత్నమాలా.
మూలములోని 48 వ శ్లోకమునకు 46, 47 పద్యములు అనువాదము.

## సంకీర్ణ స్తబకము

మూలములోని 19, 21 శ్లోకములకు 19 వ సీస పద్యమును, 22, 23, 24 శ్లోకములకు 21 వ సీస పద్యమును, 28, 29 శ్లోకములకు 25 వ సీస పద్యమును, అనువాదముగాఁ దెలియఁదగును.

# లక్ష్మీసహస్రకావ్యము

## లఘువ్యాఖ్య
## 1 ప్రారంభ స్తబకము

1 పు. 1 ప. 'ప్రారంభుండు' అనుపదమువలన ప్రారంభ స్తబకము సూచింపఁబడుచున్నది.

2 ప. విశేషణములన్నియు లక్ష్మికి విష్ణువునకు ఇర్వురకు నన్వయించును. అరుణ + అంబుజ + అక్షులు = 1 ఎఱ్ఱని పద్మమువంటి కన్నులుగలది లక్ష్మి 2 సూర్యుఁడు చంద్రుఁడు కన్నులుగా గలవాఁడు విష్ణువు; అసదృశులు ; 1 అ = విష్ణువు, విష్ణువుతో సమానురాలు లక్ష్మి, 2 సాటిలేనివాఁడు విష్ణువు; విలసత్ = ప్రకాశించుచున్న, పయోధర = 1 స్తనములయొక్క, ఉద్యన్మూర్తి స్ఫురితులు = ఉన్నతములైన స్వరూపముచే దోఁచునది లక్ష్మి. 2 ప్రకాశించుచున్న మేఘరూపమున దోఁచువాఁడు విష్ణువు. లోకమాత = 1లోకములకుఁదల్లి లక్ష్మి 2లోకములనుకొలిచినవాఁడు (త్రివిక్రమరూపమున) విష్ణువు.

2 . 6 :- అమృతము = 1 మోక్షము 2 సుధ, అహీనగుణులు = 1 నీచగుణములేనివారు 2 (అహి + ఇనగుణులు) ఆదిశేషువును

తాత్రికుగాఁజేసినవారు, విబుధులు = 1 పండితులు 2 దేవతలు, శ్రీ = 1 లక్ష్మీదేవి 2 సంపద.

5. 20 :- సుమిత = 1 పుష్పితము 2 మిక్కిలి స్వల్పమైనది; కుచేలుఁడు = 1 కృష్ణుని మిత్రుఁడు 2 శిథిలవస్త్రములుగలవాఁడు (నిఱుపేద)

7. 28 :- వేంకటకవి సూర్యాకరము = 1 వేంకటాధ్వరి యను కవి పండితునకు స్థానమైనది. 2 (సూర్య + ఆకరము) సూర్యనారాయణ శర్మ రచనకు నివాసమైనది (నామైకదేశేనామగ్రహణమ్)

7. 29 :- కృతిపక్షమునను, పద్మము పక్షమునను రెండర్థములు :- శ్రీకరభాస్వదలంకృతి = 1 శోభాకరములై ప్రకాశించు అలంకారములు గలది కృతి 2 లక్ష్మీదేవి చేతియందు అలంకారముగా ప్రకాశించునది పద్మము; రసిక + అశిరమ్యము = 1 రసము నెఱిఁగినవారగు పండితులసమూహమునకు ఒప్పిదమైనది కృతి. 2 రసిక + అళిరమ్యము = మకరందరసమును గ్రోలు తుమ్మెదల సమూహముచే నొప్పునది పద్మము; సూరి + ఆలోకమున = 1 పండితులచూపుచేత (కృతి) సూర్య + ఆలోకమున = 2 సూర్యుని ప్రకాశముచేత (పద్మము) 3 సూర్యనారాయణశర్మ యొక్క యాలోకమున (తెలుఁగునకుఁదెచ్చి వెలుఁగుఁ గొలుపుటచేత.)

## 2 ప్రాదుర్భావస్తబకము

8. 1 :- 'ప్రాదుర్భవించె' నను పదముచే ప్రాదుర్భావస్తబకము సూచింపఁబడినది.

2 ప. :— చతుః + ఆస్య = 1 నాల్గుముఖములుగల బ్రహ్మ 2 చతుర + ఆస్య = నేర్పుగల ముఖములతోఁగూడిన

9 పు. 4 ప. :- లక్ష్మీపక్షమునను, చంద్రపక్షమునను రెండర్థములు 1 జీవన్ + జీవములను, జీవన్ = భూమియందు, జీవములను = ప్రాణులను (లక్ష్మీపరము) 2 జీవంజీవములను = చకోరపక్షులను "వర్గయుక్పరశములు పరంబులగునపుడును ద్రుతమునకుఁ బూర్ణబిందువగు" (చంద్రపరము,) తమోభరమున్ = 1 తమోగుణముయొక్క బరువును [లక్ష్మి] 2 చీఁకటియొక్క భారము (చంద్ర) సత్ + చక్రము :- 1 మంచివారి సమూహము (లక్ష్మి) 2 నక్షత్రమండలము (చంద్ర)

6 ప. :— సుమనస్సమూహము = 1 పండితసమూహము 2 దేవతాసమూహము, విబుధమాన్యుఁడు = 1 పండితులచేఁ బూజ్యుఁడైనవాఁడు 2 దేవతలచేఁ బూజ్యుఁడైనవాఁడు, మఘవంతుఁడు = 1 (మఘము = యజ్ఞము) యజ్ఞమొనర్చిన సోమయాజి 2 ఇంద్రుఁడు, సన్మార్గులు = 1 మంచి నడవడికలవారు 2 నక్షత్రమార్గమునఁదిరుగు వారైనదేవతలు. ని. భవాన్యాంతు సతీస్త్రీస్యాన్నక్షత్రేతు నపుంసకమితిశేషః. దిగ్వసనుఁడు = 1 వస్త్రహీనుఁడు 2 శివుఁడు, సర్వజ్ఞుఁడు = 1 సమస్తము తెలిసినజ్ఞాని. 2 ఈశ్వరుఁడు. సిత + అంశుకదానము = 1 తెల్లనిబట్టను దానముచేయుట 2 తెల్లని కిరణములుకల చంద్రునొసంగుట. పరమపురుషుఁడు = 1 శ్రేష్ఠుఁడగు పురుషుఁడు 2 విష్ణువు. మూలమున 'సితాంశుకం దదౌ' అని యున్నది. సంస్కృతమున వస్త్రపర్యాయముగ సితాంశుకపదము నపుంసకలింగమగును. చంద్రపర్యాయమున నదే పుంలింగమగును. రెండులింగములందును

ద్వితీయావిభక్త్యేకవచన రూపము 'సితాంశుకమ్' అనియే యుండును. తెలుఁగున నట్లుగాదు. చంద్రపర్యాయముతో పుంలింగమునకు ద్వితీయలో 'సితాంశుకుని' అనవలెను. వస్త్రపర్యాయమున "సితాంశుకమును" అనవలెను. వ్యస్తముగఁ గాక, దానపదముతో సమాసముగఁ గూర్చి 'సితాంశుకదానము' అని పుంనపుంసకలింగముల నేకపదమున నిముడ్చుట అనువాదమున విశేషము.

11. 15. :- కౌతుక = 1 వివాహము 2 కోరిక.

## 3 వక్షస్స్థలావస్థానస్తబకము

14 . 1 :- 'వక్షస్స్థలమున నిరవుకొని' అను పదముచే వక్షస్స్థలావస్థానస్తబకము సూచింపఁబడుచున్నది.

16 . 10 :- ఇందు విష్ణువక్షస్స్థలపక్షమునను, గోష్ఠము పక్షమునను రెండర్థములు వచ్చును. శ్రీవత్సశోభితము = శ్రీవత్సమను మచ్చచేఁ బ్రకాశించునది విష్ణువక్షము 2 చక్కని, ఆవుదూడలచేఁ బ్రకాశించునది (గోష్ఠము), హరితదీప్తి = 1 ఆకుపచ్చనిరంగు (విష్ణువక్షము) 2 పచ్చగడ్డియొక్క ప్రకాశము (గోష్ఠము) అమృతము = 1 మోక్షము 2 పాలు,

16 . 12 :- సూరస్థానముఁ (సు + ఉరస్స్థానమున్) = 1 చక్కని ఱొమ్ము భాగమును, 2 సూరస్థానమున్ = సూర్యునియొక్కస్థానమును, అమృతమున్ = 1 మోక్షమును 2 విష్ణుస్థానమును (ధ్యేయస్సదా సవితృమండల మధ్యవర్తీనారాయణః)

16. 13 :- ఇందు లక్ష్మీపరముగను, దొంగవానిపరముగను రెండర్థములు :—
బలివసుహారుని + ఉచ్చ + ఉరస్థ్సలమునన్ = బలిచక్రవర్తి యొక్క యైశ్వర్యమును హరించిన విష్ణువుయొక్క గొప్ప వక్షస్థ్సలమును (లక్ష్మీపరము), బలివసుహారుని ఉత్ + చోరస్థలమునన్ = బలముగలవాని యొక్క ధనమునుహరించు నట్టి దొంగవాని యొక్క స్థానమునందు,(దొంగవానిపక్షము). మా చిరకలితంబులన్ + అర్థములకు = మేముచిరకాలమునుండి సంపాదించిన ధనములను అని దొంగపక్షము, మా చిరకలితంబులు + అనర్థములను = మేము చిరకాలమునుండి చేసిన పాపములను అనిలక్ష్మీపరము-
"శ్లో బలివసుముషః ప్రిహర్తా దుచ్చోరస్థ్సలముపేత్య కమలేత్వమ్ అస్మాకమపథగానాం హరసేచిరకాల సంచితానర్థాన్" మూలములో 'చిరకాలసంచితానర్థాన్' అనుచోట, చిరకాలసంచితాన్ + అర్థాన్, అని ద్వితీయా, విభక్త్యంతవ్యస్తపదము, చిరకాలసంచిత + అనర్థాన్, అని లక్ష్మీపరముగను పదచ్ఛేదము చేసినపుడు సమాసపదమగును. ఒకర్థమున వ్యస్తపదముగను, మఱొకయర్థమున సమాసపదముగను శ్లేషవిఱుపు జరిగినది. అనువాదమున చిరకలితంబులన్ + అర్థములను అని, చిరకలితంబులు + అనర్థములను అని విఱుపుతో రెండర్థములు సాధింపఁబడుటయేకాక మూలమునందువలెనే ద్వితీయా విభక్త్యంతమును రాబట్టఁ బడినది. సంస్కృత విభక్త్యంత శ్లేషవిఱువులు తెలుఁగునఁ దెచ్చుట మిగుల క్లిష్టమైనపని. ఇచ్చటననువాదము చక్కగ నమరుట విశేషము.

17. 14 :- కృష్ణధారి = 1 నల్లనిది (మచ్చను) ధరించినవాఁడు. లేక, కృష్ణసారంగమును ధరించినవాఁడు (నామైకదేశేనామగ్రిహ

ణమ్) 2 కృష్ణుని ధరించినవాఁడు, కృష్ణధార్యవు = కృష్ణునిచే (విష్ణువుచే) ధరింపఁదగిన దానవు.

17. 15 :- వనమాల = 1 వనపంక్తి 2ఆకులుపువ్వులు కూర్చికట్టిన తోమాల, (వైజయంతి)

17. 16 :- ఇందు కృష్ణుని యురముగొప్ప ఆరామముగా నారోపింపఁబడినది. కాన ఉరము, ఆరామము ; ఈ రెండిటిపరముగా నర్థములు :- వనమాలికా శోభితము = 1 వైజయంతితో శోభించునది (విష్ణుని యురము) 2 వనపంక్తులచే శోభించునది (మహారామము) పరమ తులసీ + ఇతము = 1 గొప్పవైన తులసీదళములచేఁ బొందఁబడి నది, లేక, పరము + అతుల + సీతము = మిక్కిలిసాటిలేని సీతా దేవి గలది (విష్ణునియురము) 2 పరము + అతుల + శీతము = ("శసయోరభేదః" అనియుండుటచే 'సీ' 'శీ' గా మారెను) శ్రేష్ఠ మైనదియు సాటిలేనిచల్లదనము గలదియు, లేక మిక్కిలి సాటిలేని నాగేటిచాళ్లు (సీత = నాగేటిచాలు) గలది (ఆరామము). సులక్ష్మణము = చక్కనిచిహ్నముతోఁ (శ్రీవత్సముతో) గూడినది. లేక, మంచివాఁడగు లక్ష్మణునితోఁ (లక్ష్మణుని సేవలతో) గూడినది (విష్ణు నియురము) 2 చక్కని సారసపక్షులతోఁ గూడినది. ని. లక్ష్మణౌ షధిసారస్యోరితివిశ్వః. ప్రథితసద్రూపము :- ప్రథిత + సత్ + రు + ఉపము = 1 ప్రసిద్ధి కెక్కినట్టి మంచివారికొఱకైన,యుద్ధ ములతోఁ (యుద్ధమునందగు వ్రణకిణాంకములతో) గూడినది. ని. రు, ర్నా,యుద్ధే భయే ధ్వనా వితిరత్నమాలా. లేక ప్రసిద్ధి కెక్కినమంచి రూపము గలది (ఉరము) 2 ప్రథితసత్ + ద్రు + ఉపము = ప్రసిద్ధిగల చక్కనిచెట్లతోఁ గూడినది (ఆరామము)

'అనచిచ' యనుసూత్రముచే, 'సదూప్రమము' ను 'సద్దూప్రమము' ననియునవచ్చును. మహా + ఆరామము = 1 ఉత్సవమునకు నివాసమైనది (విష్ణునియురము) 2 మహా + ఆరామము = 2గొప్ప వైన తోటలు కలది.

18 :- స్నేహపూర్ణము = 1 సోదరప్రేమతో నిండినది కౌస్తుభము 2 చమురుతో నిండినది దీపము. త్రిదశోపసేవ్యము = 1 దేవతలచే సేవింపఁదగినది కౌస్తుభము 2 మూఁడు వత్తులతో గూడినది దీపము.

23 :- నిరంజనులు = 1 అంజనము లేనివారు 2 జ్ఞానులు.

24 . తామరస శరణవయి = 1 పద్మము నివాసముగాఁ గలదాన వైనను, నతామరసశరణవు = తామరసశరణవు కాని దానవు. అని విరోధము, నత + అమర + సశరణవు = నతులైన దేవతల విషయమై రక్షణతోఁ గూడిన దానవు అనిపరిహారము, పరము రస్ఫురణ + అరి = శత్రువైన మురాసురునియొక్క అతిశయము నకు, అరిని = శత్రువగు విష్ణువును, పరమ + ఉరస్ఫురణమ్మున న్ = గొప్పదైనట్టి వక్షస్థలమున నతిశయించి యుండుటచే. శ్లో॥ జనని ! పుష్యసితామర సంపదం వితను షేచ తామర సంపదం పరమురస్ఫురణ ప్రతిరోధినం, పరమురస్ఫురణం నయసేఽద్భుతమ్. మూలములో "నతామరసంపదం" అనునప్పుడు 'నత + అమరసంపద' అనునర్థమునఁ "నత" అనునది పదము. దానిలోని "నకారము" రెండవఅర్థమున నిషేధార్థకమైన 'నఞ్' గాఁ బ్రయోగింపఁబడినది. మఱియు "తామరసం, పదమ్" అని యొక అర్థమున సం = ద్వితీయా విభక్త్యంతముగానరెండును విడిపదములు.

"తామరసంపద" అనునప్పుడు సమాసపదములో "సం" అక్షరము సమాసములోని దైనది. ఇట్టి విభక్త్యంతశ్లేషలు తెలుగునకు దెచ్చుట విశేషము. తెనుఁగున రెండునుసమాసములే. "నతామరస" అనునపుడు ఇందున్న 'న' వ్యతిరేకార్థక' నకారము' గాని, 'నఞ్' కాదు. విరోధాభాసాలంకారము.

## 4 కారుణ్యస్తబకము

20 . 1 :- "కారుణ్య" పదప్రయోగమునఁ గారుణ్యస్తబకము సూచితము.

24 . 22 :- సమంచిత ధనంజయుఁడు = 1 ఒప్పుచున్నవాఁడు, ధనంజయుఁ డను పేర్వడినవాఁడు (అగ్ని) 2 ఒప్పుచున్న అర్జునుఁడు కలవాఁడు, (విష్ణువు) ఉదారహేతి = 1 గొప్పమంటలు కలవాఁడు (అగ్ని) 2 గొప్పఖడ్గము కలవాఁడు (విష్ణువు) రవిమండలాంతరగుఁడు = సవితృమండల మధ్యభాగమును బొందువాఁడు. (అగ్ని) "అగ్నిం వా ఆదిత్యస్సాయం ప్రవిశతి" అనిశ్రుతి. 2 సూర్యమండలమధ్యవర్తి [విష్ణువు] 'నారాయణస్సవితృమండలమధ్యవర్తీ' అని శ్రుతి. హరి = 1 విష్ణువు 2 అగ్ని. (హరింపఁ జేయువాఁడు)

## 5 కటాక్షస్తబకము

25 . 1 :- "కటాక్ష" శబ్దముచే కటాక్షస్తబకము సూచితము.

26 . 4 . :- అప్పులు = 1 నీళ్లు 2 ఋణములు "సలిలబింబః" అని జలా

ర్థమున మాత్రమే వాడబడిన మూలశ్లోకములోని పదమునకు మూలములో లేని "ఋణబాధలు" అను మఱియొక అర్థమును గూడ స్ఫురింపఁజేయునటులుగాఁ అనువాదమున వాడఁబడిన "అప్పులు" అను పద ప్రయోగము విశేషార్థమును సాధించినది.

28. 15 :- స్థిరవసు, వనీపకున్ = స్థిరమైన ధనముగల భూపతిని, అస్థిరవసుని, వనీపకునిగ = స్థిరసంపదలేని ఆటవికునిగా.

29. 20 :- ప్రాజ్ఞులకున్ = 1 గొప్పవారికి (అపాంగపక్షమున) 2 నగరపుత్రులకు (గంగాపక్షమున) భాసితముల రూపములన్ = 1 ప్రకాశమానము లైన శరీరములను (అపాంగ) 2 బూడిదరూపములను (గంగ) భవదాహము = 1 జన్మనాశమును, 2 ఈశ్వరనాశము అభంగ = 1 ఆశ్రితులకెట్టి భంగపాటు రానీయనిది (అపాంగ) 2 తరంగములు లేనిది [గంగ] వ్యతిరేకాలంకారము. మూలములోఁ "భవం శోషం నేత్రీ" యనియున్నది. పుంలింగమునందు, నపుంసక లింగమునందుఁ గూడ ద్వితీయావిభక్తి ఏకవచనము ఒకేరూపములో 'భవమ్' అనియే యుండును. తెనుఁగున ఈశ్వరార్థమున భవుని = అనియు, జన్మము అను నర్థమున భవమును, అనియునగును. అనువాదములో భవదాహము అని సమాసము చేయఁబడుటచే నీ క్లిష్టత వారింపఁ బడినది. భవదాహము = ఈశ్వరుని దహించునది. అభంగ = కెరటములు లేని అను అర్థములు చిత్రార్థములు.

21. 29 :- ప్రతీపగతి = చివరినుండి యారంభించి మొదటికి వచ్చుట. "శ్రీక్షయ" (శ్రీనశించునది) ప్రతీపగతినిఁ జదువగా 'యక్షశ్రీ' అయినది. అపుడు కుబేరసంపద అని యర్థము వచ్చును.

29.23 :— దేహి = 1 దేహము కలవాఁడు (ఈ యర్థమున నిదిసుబంతము) ఒసగుమా (ఈయర్థమున తిజన్తరూపము) జగద్వయమున = ఇహపరలోకములందు.

30. 24 :- సుగుణతాల సదుచ్ఛ్రయము, 1 సుగుణ = మంచితాత్రిపు గల, తాల = తాళపుచిప్పల యొక్క, సత్ = చక్కని, ఉచ్ఛ్రయము = ఉన్నతి (నటునిపక్షము) 2 సుగుణతా = మంచితనముచే, లసత్ = ప్రకాశించుచున్న, ఉచ్ఛ్రయము = ఔన్నత్యము (కటాక్ష పక్షము) సంశ్రిత మృదులాస్యరంగములన్, సంశ్రిత = ఆశ్రయించిన, మృదు = మృదువైన, లాస్యరంగములన్ = నాట్య రంగస్థలము లందు (నటుని పక్షము) 2 సంశ్రిత = ఆశ్రయించిన వారియొక్క, మృదుల = మృదువులైన, ఆస్యరంగములన్ = ముఖప్రదేశములందు (కటాక్షపక్షము)

30. 25 :- మహత్తమ శ్రీయుత = 1 మిక్కిలి గొప్పసంపదతోఁ గూడిన 2 గొప్ప చీఁకటిశోభతోఁ గూడిన ("అనచిచ" యను సూత్రమున 'మహత్తమ శ్రీయుత' అనునది, 'మహత్తమ శ్శీయుత' అనియు నగును. 1 కృష్ణమూర్తి = కృష్ణస్వరూపముగ 2 నల్లని రూపముగ.

30. 26 :- అపాంగపక్షమునను, వల్లీ (లత) పక్షమునను రెండర్థములు. మాధవుని = 1 వసంతుని (వల్లీపక్షము) మా, ధవుని = 2 మా సంబంధమైన మనుష్యుని మా మనుష్యజాతిని అనిభావము. "వి. ధవఃపత్యౌ నరే ధూర్తే ఇతివిశ్వః" 3 విష్ణువును (అపాంగపక్షము) ఆమోదభారమ్ము = 1 పరిమళభారము (వల్లీపక్షము) 2 సంతోషా తిశయము (అపాంగపక్షము) సుప్రసిద్ధ + అగమ + అంచత్ =

1 మిక్కిలిప్రసిద్ధమై చెట్టునందొప్పుచున్న (వల్లీ) 2 సుప్రసిద్ధ + ఆగమ + అంచత్ = మిక్కిలి ప్రసిద్ధమైన వేదమున నొప్పుచున్న (అపాంగ) సుమిత = 1 పుష్పించినట్టిది (వల్లి) 2 మిక్కిలి చిన్నదైనది. (అపాంగ) అనంతఫలములు = 1 హద్దులే నన్ని పండ్లు. [వల్లీ] 2 హద్దులేని ఫలితములు (అపాంగ) కార్వేటిన గర ప్రతిలో 'పురోవసంతమ్' అని యున్నది. ఆ ప్రతిప్రకారము 1 పుర = ఎదుట, వసంతం = నివసించుచున్న జనుని అనియు 2 పురః = ఎదుటనైన, వసంతం = వసంతఋతువును అనియు రెండర్ధములును అనువాదములో 'మాధవుని' పదముతో 1 వసంత ఋతువునందు 2 మా, ధవుని = మా యొక్క యెదుటనున్న జనుని అని రెండర్ధములు రాఁబట్టఁబడినవి. మూల

శ్లో॥ వికస్వరామోదభరం వితన్వతీ।పురోవసంతం ప్రథితాగమాంచితా
కటాక్షవల్లీ తవ మాధవప్రియే।ప్రసౌత్యనంతం సుమితాప్య సౌఫలమ్

27 :—అపాంగమూర్తి = 1 అపాంగమూర్తి యనెడు అపాంగమూర్తి (అప + అంగమూర్తి)1 మన్మథుఁడు, 2 క్రీఁగంటి చూపులయొక్క స్వరూపము. ఈరెండిటియందు రెండర్ధములు స్ఫురించును. విప్రయోగులు = 1 వియోగులు (మన్మథపక్షము) 2 విప్రులును యోగులునైనవారు (అపాంగ పక్షము) మార్గణ + అవళిన్ = 1 బాణముల సమూహమున (మన్మథ) 2 యాచకుల సమూహమున (అపాంగ) పంచతన్ = ఐదుసంఖ్య అగుటను [మన్మథ] 2 చనిపోవుటను

(అపాంగ) భవనాశము = భవునిచే (ఈశ్వరునిచే) నాశము (మన్మథ) 2 జన్మనాశము [అపాంగ] శ్లో॥ నవిప్రియోగి వ్యసనాయ కల్పతే। నమార్గణానాం సహతేవ పంచతాం। భవం జవాత్ ప్రిత్యుత దండహిత్యయం। జయత్యపాంగ స్తవ చిత్రిమిందిరే॥ మూలములోని 'భవమ్, అపాంగ' అనువానిని అనువాదమున లింగభేదముచే వ్యస్తములుగ భవుని, భవమును, అపాంగుని అపాంగమును అనవలెను. అప్పుడు శ్లేషచెడిపోవును. కాన భవనాశము, అపాంగమూర్తి అని సమాసములలో వానినిమిడ్చి శ్లేష సాధింపఁబడుట యిందువిశేషము.

30. 28 :- ఇందు అపాంగపక్షమునను, శరదృతువు పక్షమునను రెండర్థములున్నవి. స్వచ్ఛకమల + అభివృద్ధికి = 1 స్వచ్ఛములైన కమలముల యొక్క వృద్ధికి [అపాంగ] 2 స్వచ్ఛమైన జలాభివృద్ధికి [శరత్] ని. కమలం సలిలేతామ్రేజలజే ఇతివిశ్వః; నిర్మలున్ = 1 ప్రసన్నునిగ [అపాంగ] 2 స్వచ్ఛతగల వానినిగ [శరత్] సదుపాస్యునట్లు = 1 మంచివారికి సేవ్యుఁడగునట్లు [అపాంగ] 2 నక్షత్రములచే సేవ్యుఁడగునట్లు [శరత్] విధుని = 1 విష్ణువును [అపాంగ] 2 చంద్రుని [శరత్] ఆపత్ + ఆటోపము = 1 ఆపదల వేగిరపాటును [అపాంగ] 2 ఆపద + ఆటోపము = మేఘాడంబరమును [శరత్] అపాంసమూహః అపః, ఆపఃదదాతీతి ఆపదమ్. ఇందుకు రసికజనమనోభిరామమున-

క. నదమా, పొక్కిలి; జాంబూ। నదమా, మైచాయ; కోక నదమా, పద; మా
పదమా, జడ, నడుమువియ। త్పదమా; సూ గారు గూఢపద; మాచెలికిన్"

అని కూచిమంచితిమ్మకవి ప్రయోగము. ఉజ్జృంభితాపము = 1 అతిశయించిన సంసారతాపమును [అపాంగ] 2 ఉజ్జృంభిత + ఆపము = అతిశయించిన నీరుగలది మేఘాటోపము [శరత్] శ్లో॥ వికచకమల శోభా విభ్రమోద్భూతిసీమా । విధుమిహసదుపాస్యం తన్వతీ సుప్రసన్నం । శరదివ తవపీడశార్ఙ్గిణః ప్రాణకాంతే । శమయతికిలమే ఘాటోపముజ్జృంభి తాపమ్॥ ఇచ్చట "మేఘా టోపము" అనునపుడు 'మే + అఘాటోపము' అని కటాక్షపరము, 'మేఘ + ఆటోపము' అని అని శరత్పరము విడఁదీయవలెను. 'మే' అనునది కటాక్షపరమున షష్ఠ్యంతము, శరత్పరమున మేఘశబ్దము లోనిది. ఈ శ్లేషను అనువాదమున 'ఆపదాటోపము' అనుపదమున నిర్వహించుట విశేషము.

32. 32 :- గోత్ర + అధికృత్త్వము = 1 వంశౌన్నత్యము, లేక, భూపతిత్వము (ఐహికమున) 2 గోత్ర = పర్వతములను, అధి కృత్త్వమున్ = భేదించుటను అనగా ఇంద్రత్వమును (ఆముష్మికమున) ఉత్ + చామరపాళి = 1 ఎత్తిపట్టుకొనిన వింజామరల సమూహము (ఐహిక) 2 ఉచ్చ + అమరప + ఆళి = ఉన్నతులైన దేవతాపరిపాలకుల సమూహము (ఆముష్మి) జైత్రస్థానము = 1 జయశీలమగుస్థానము లేక జైత్ర + అస్థానము = జయింపగోరు శత్రువులకుఁ బ్రవేశింపశక్యముకాని స్థానము. మహాదుర్గాదిస్థానము (ఐహిక) 2 ఇంద్రాదిపదము (ఆముష్మి) ఉత్తమ సంతాన సమస్త భవ్యసుమనస్త్వాంచితామోదసౌఖ్యములన్ = సమస్తమైన ఉత్తమమైన సంతానముతో, లేక, సప్తసంతానములతో లేక, చక్కని

మంచి మనస్తత్వముతోడి సుఖసంతోషములతో (ఐహిక) 2 శ్రేష్ఠములైన కల్పవృక్షములయొక్క చక్కని పూవులందలి సహజమైన పరిమళమువలనఁ గలిగినసుఖములతో (ఆముష్మి)

32. 33 :- శీతల + ఆప + అంగము = 1 చల్లని నీటికి నివాసమైన ప్రదేశము. చలిపందిరి (ప్రప) 2 శీతల + అపాంగము = చల్లని క్రీగంటిప్రసారము.

32. 35 :- ఇందు విష్ణుపరముగను, వృద్ధుని పరముగను రెండర్థములున్నవి. అజీర్ణ + అఘ + నాశనున్ = 1 నశింపని పాపములను బోఁగొట్టువానిని (విష్ణువు) 2 అజీర్ణ + అఘన + అశనున్ = అజీర్ణరోగముచే, స్వల్పమైన యాహారము గలవానిని (వృద్ధుఁడు) బడుగున్ = 'వబయోరభేదః' కాన, వడుగున్ = 1 వామనావతారమున బ్రహ్మచారియైన విష్ణుని (విష్ణు) 2 బడుగున్ = కృశించిన వానిని, (వృద్ధ) దృఢగదాకరున్ = 1 దృఢమైన గదహస్తమునఁ గలవానిని, 2 దృఢగదా + ఆకరున్ = దృఢములైన రోగములకు నివాసమైన వానిని (వృద్ధ) పురాణపురుషున్ = 1 ఆదిపురుషుని (విష్ణు) 2 చాల ముసలివానిని (వృద్ధ) అలంఘనున్ = 1 నీ యొక్క ఆజ్ఞను మీరని వానినిగా (విష్ణు) 2 లంఘనములు (భోజనము చేయకుండుట) లేని వానినిగా (వృద్ధ)

శ్లో॥ అజీర్య దఘనాశనం దృఢగదాకరం దేవి యత్
పురాణమపి పూరుషం పునరలంఘనం పుష్యతి
తదేత దిహ పాతు నస్తవ కటాక్షదివ్యౌషధం
ఫణీంద్రశయజీవికే భవవిపన్మయా దామ యాత్॥

అనువాద పుష్టికై 'బడుగు' అనువిశేషణము అదనముగాఁ జేర్పఁ బడుటయిందు విశేషము.

33. 37 :- ఇందు కటాక్షపరముగ, తటాకపరముగ రెండర్థము లున్నవి. అమృతపాన + ఉత్క-, సద్ద్విజ + ఆక్రమితము = 1 నీటిని ద్రావుట యందాసక్తికల చక్కని పక్షులచే నావరింపఁబడి నది (తటాకము) 2 మోక్షమును పొందుటయందాసక్తిగల మంచి బ్రాహ్మణులచే నావరింపఁ బడినది (కటాక్షము)

33. 38 :- అధన్యదుర్లభము = ధన్యులు కాని వారికి లభింప శక్యము కానిది, అత్యంతము = 1 మిక్కిలి 2 చిట్టచివరిది (చివరకు పొందఁబడునది) అనవలోకము = 1 చూపులేకపోవుట, (గ్రుడ్డితనము) 2 అనవ = క్రొత్తదికాని, పురాణమైన, లోకము = వైకుంఠలోకము ; 'అత్యంతము' అనునది మూలమున లేదు, అనువాదమున నిదియొక విశేషము.

33. 39 :- రిక్తము నాధిపదంబున్ = ఆధికి (మనోవ్యాధికి) నివాసమైన రిక్తమున్ = దారిద్ర్యస్థితిని, లలితభవదీయవీక్షణ లవముచేత, అరసి = చూచి, సంపదాధిక్యమును = ఎక్కువసంపదను చేర్చి, జనుని, అహో, సమాధి = 1 మిక్కిలి మనోవ్యాధిని 2 సమాధిస్థితిని ఒందింతువు, చిత్రముగదె. చిత్రమైన మఱి యొకఅర్థము :- రిక్తమున్ = వట్టిదైన, (నిరుప పదమైన) ఆధిపదంబున్ = 'ఆధి' అనునట్టి శబ్దమును, లలితభవదీయ వీక్షణ లవముచేత, అరసి = చూచి, సంపదాధిక్యమును చేర్చి =

"సం" అను శబ్దమును అధికముగాఁ జేర్చి ('ఆధి' యను శబ్దమునకు 'సమ్' అను శబ్దమును ముందుఁజేర్చి) సమాధిన్ = 1 సమాధి యను శబ్దమును (సమ్ + ఆధి = సమాధి) నీకటాక్ష బలము ఒరిదుర్గినికి సంపదనిచ్చి సమాధియోగము గూడ గల్గించునని భావము.

34 . 41 :- సూనశ్రీలన్ = 1 [సు + ఊన, శ్రీలణ] = మిక్కిలి తక్కువ సంపదలచే, అపారగంధయుతమై = హద్దులేని గర్వముతోఁ గూడినదై, 2 సూనశ్రీలణ = పుష్పసంపదలచే, హద్దులేని సువాసనతోఁ గూడినదై,

34 . 43 :- అపాంగమూర్తి యనెడు అపాంగమూర్తి [కటాక్ష మనెడు మన్మథుఁడు] జలజాతశరతన్ = 1 పద్మములు బాణములగుటను, [మన్మథపక్షము] 2 "లడయోరభేద" అను దానిచే జడజాత శరతన్ = జడులసమూహము విషయమై హింసతోఁ గూడి యుండుటను, లేదా, జడుల సమూహమునకు సుఖము కల్గించుటకు 'శంసుఖంరాతి గృహ్ణాతీతిశరః తస్యభావః శరతా' [కటాక్ష పక్షము] మధుకాలసంగతిన్ = 1 వసంతకాలముతోఁ గూడి యుండుటను [మన్మథ] 2 మధువనురాక్షసునకు యముఁడైన అనఁగా [నాశకుఁడైన] విష్ణునితోఁ గూడి యుండుటను [కటాక్ష] పర్వమంగళా + ఈశాన కలనన్ = పార్వతీవిభునితోఁ గలిసి యుండుటను, [మన్మథ] 2 సమస్తమంగళములకు ప్రభువై యుండుటను,

శ్లో॥ జగదంబ తవాపాంగో । జలజాతశరః ప్రకృష్టమధుకాలః
కమలే ! కథయ కథంవా । కరోత్యసౌ సర్వమంగళేనాప్తిమ్॥

మూలములోని 'అపాంగ' శబ్దము, కటాక్ష మన్మథ పక్షముల రెండి టను గూడ పుంలింగము. తెనుఁగున మన్మథార్థమున 'అపాంగుఁడు' అని కటాక్షపక్షమున 'అపాంగము' అని యగును. శ్లేష సరిపడుటకై 'అపాంగమూర్తి' అని మూర్తిపదముతో సమాసము చేయఁబడినది. మూలములో 'సర్వమంగళేన' అను నపుడు "సర్వమంగళముతో' అనుఅర్థమున వ్యస్తపదము తృతీయా విభక్త్యంతము. సర్వమంగళకు ఇనుడు (భర్త) అను అర్థమున సమస్తపదము. అనువాదమున 'సర్వమంగళేశాన' అని రెండర్థములు సమాసములో సాధింపఁబడినవి.

35, 47 :- ప్రభాత పరముగా, కటాక్షపరముగా రెండర్థములు : 1 సూర్య + ఆకలనము (ప్రభాత) 2 సూరి + ఆకలనము(కటాక్ష). తమోభరము = 1 ఎక్కువ చీఁకటి (ప్రభాత) 2 తమోగుణాతిశయము (కటాక్ష). దోషాకరశక్తి = 1 రాత్రి నివాసముగాఁ గల తామసశక్తి. (ప్రభాత) 2 దోషములకు నివాసులైన దుర్మార్గుల శక్తి (కటాక్ష). కల్గునా నాకవిదీప్తి = (కల్గు + ఆ, నాక, విదీప్తి) = 1 ప్రసిద్ధమైన ఆకాశమందలి నక్షత్రాది ప్రకాశము (ప్రభాత) 2 ప్రసిద్ధమైన స్వర్గమందలి ప్రకాశము, లేక, నానా, కవిదీప్తి = అనేకులగు కవులకు బుద్ధి మొదలగు వాని ప్రకాశము (కటాక్ష). సారసవనంపు సిరుల్ = 1 పద్మవన సంపదలు (ప్రభాత) 2 సార, సవనంపు సిరుల్ = శ్రేష్ఠములైన యజ్ఞ సంపదలు (కటాక్ష).

శ్లో॥ కటాక్ష ప్రీత్యా ప్యేషే తవమిషతి కంసారి దయితే!
తమశ్శ్యామ్యత్యంతర్గత మపి చ సూర్యాకలనయా
స్వయందోషోన్మేషో విరమతి పునస్సారసవన
శ్రియస్సంపద్యంతే దివిచ భవితా భాసనమపి ॥

35. 48 :- కటాక్షపక్షమునను వసంతుని పక్షమునను రెండర్థములు : భూమిజతతికి = 1 భూజనుల సమూహమునకు (కటాక్ష) 2 వృక్షముల సమూహమునకు (వసంత) అ + విపత్ + లవత = 1 విపత్తుల యొక్క లేశము కూడ లేకుండుట (కటాక్ష) 2 అ + వి + పల్లవత = పల్లవములు లేకుండు స్థితి లేక పోవుట, అనఁగా చిగుళ్లతోఁ గూడియుండుటను (వసంత). సుమనోవిభూతి = 1 దేవతల సంపద [కటాక్ష] 2 పుష్పసంపద [వసంత]. అదీప్తిక + ఆననములన్ = 1 దీప్తివంతములు కాని ముఖములను [కటాక్ష] 2 అదీప్తి + కాననములన్ = వెలుఁగులేని వనములను. ఆమోద పరిపూరితములు = 1 సంతోషముతో నిండినవి [కటాక్ష] పరిమళముతో నిండినవి [వసంత].

శ్లో॥ సురభిస్తనుతే తవావలోక
స్సుమనస్సంపద మంబ! భూమిజానాం
అవి పల్లవతాం విధాయపుష్ణా
త్యపిచా మోదమ దీప్తి కాననానాం ॥

35 . 49 :- కరుణా పరముగ, సముద్రి పరముగ రెండర్థములు:- మంద, రక్షణ వికసి తామంద హృదయమున్ = 1 మందులగు వారిని రక్షించుట యందు వికసించిన గొప్పమనుస్సును [కరుణ]

2 మందరపర్వతము వల్లనైన ఉత్సవముచే వికసించిన మధ్య భాగ
మును [సముద్రము] సుమనోఽనురాగము = 1 పండితులకు అను
రాగమును [కరుణ] 2 దేవతలకు అనురాగమును [సముద్రము].

శ్లో॥ కమలే! గభీరకరుణాజలధే।
త్వయి మందరక్షణ వికాసహృది।
కలితోదయా మృదుకటాక్ష సుధా।
ప్రథయ త్య సౌసుమనసాం ప్రమదం ॥

36, 54 :- అపవర్గగర్భగాన్ = 1'పవర్గ' ములోని అక్షరములతోఁ గూడు
కొననిరీతిగా 2 మోక్షముతోఁ గూడినదిగా.

37. 57:- వైకుంఠము, నివాసము రెంటిపరముగ రెండర్థములు:- పీతాంబరా
కలితాతి దీప్తము = 1 పీతాంబరులతో అనఁగా విష్ణుసారూప్యధరు
లతోఁ గూడి యుండుటచే మిగుల ప్రకాశించునది. [వైకుంఠము]
2 పట్టుపీతాంబరములతోఁ గూడి ప్రకాశించునది [నివాసగృహము]
ముక్తాది భూషితము = 1ముముక్షువులు మొదలగు వారిచే భూషి
తమైనది [వైకుంఠ] 2 ముత్యములు మొదలగు వానిచే భూషిత
మైనది [నివాసము]. పదముఁ = పరమపదమును [వైకుం
ఠము] 2 నివాస గృహమును. విరజనది = వైకుంఠము నందలి
యొకనది.

37. 58 :- దుర్వర్ణములను = 1 చెడ్డయక్షరములను 2 వెండిని. రాజతాభ్యు
దయము, రాజత = వెండియొక్క 'రజతమేవరాజతం.' అభ్యు
దయముఁన్ = అభివృద్ధిని, 2 రాజత్వము యొక్క అభ్యుదయ

మును. ముంచు రజతనాశమును గల్గించి తిరిగి రజతమును వృద్ధి పఱచుననుట చిత్రార్థము. లలాట లిఖిత దుర్వర్ణములను జెఱిపి మహారాజత్వ మొసంగు ననుట వాస్తవార్థము.

37. 59 :- నీయపాంగ కాదంబిని = నీ క్రీగంటి చూపనెడు మేఘపంక్తి. విస్ఫూర్జడనెడు హీనభువిన్ = దరిద్రుఁ డనెడు మరుభూమి యందు [నీటివనరులేని భూమి] అపాంగపక్షము నను, మేఘ పంక్తి పక్షము నను రెండర్థము లీక్రింది పదములందు వచ్చును. ఎక్డా = ఒకప్పుడు, కానకవృష్టి = కనక సంబంధమైన వర్షము [అపాంగపరము]. ఎడ్డ = ఎప్పుడును, నిరంతరమును, ఒక = ఒక, అనకవృష్టి = ధ్వనించుచున్న మేఘములనుండి వచ్చు వర్షము.ని. మృదంగే, స్వనదంబుదే , ఆనక ఇతిశేషః. 'ఆనకః పటహే భేర్యాం మృదంగే స్వనదంబుదే ఇతివిశ్వప్రకాశశ్చ'. (మేఘపంక్తి పక్షము). సుకీర్తి = మంచియశస్సు (అపాంగ) సుకీర్తి = గొప్పబురద. (మేఘ) ని. 'కీర్తిః ప్రసాద యశసో ర్విస్తారే కర్దమేఽపిచ ఇతివిశ్వః'. వరమతిశాలియై = శ్రేష్ఠమైన బుద్ధితో నొప్పువాఁడై . (అపాంగ) వరము = శ్రేష్ఠమైన, అతి = మిక్కిలి, శాలి = వరిపంట (మేఘ).

శ్లో॥ దేవిదుర్గత మరౌ తవవీక్షా ।
కాలికా దిశతి కాంచనవృష్టిమ్ ।
తస్య సిద్ధ్యతి సుకీర్తి రుదంచ ।
ద్ధీరసస్యవిభవశ్చ తతస్స్యాత్ ॥

"కాంచనవృష్టిమ్" అనునప్పుడు కాంచనలోని 'కామ్' ఒకర్థమున ద్వితీయా విభక్త్యంతము, 'చన' అవ్యయము. రెండవ యర్థమున "కాంచన" అంతయుఁ గలిసి సుబంతపదము. అనువాదములో "ఎప్డొకానకవృష్టి" అనుపదములతో నీ శ్లేషసాధింపఁ బడుట విశేషము. 'ఎప్డు + ఒకానక' అని విరిచిన 'ఒకానక' అనునది "ఒకానొక' అనుఅర్థమున వ్యవహారసిద్ధమయి (గ్రాంధికము కాక పోయినను) మూలార్థమును ధ్వనింపఁ జేయుటయు నిండుఁగలదు. 'ధీరసస్యవిభవః' అను నపుడు, "ధీ + రసస్య" అని విరిచిన పుడొక యర్థమున రసశబ్దము షష్ఠ్యంత పదము. "ధీర + సస్య" అని విరిచినపుడు సమాసము. అనువాదమున "వరమతిశాలి" యనుపదముతో రెండర్థములు సాధింపఁబడుట విశేషము.

7. 60 :- మధువ్రతుండు = మధువున (మద్యపానమున) దీక్షగలవాఁడు, తుమ్మెద. మధు + ఆ హారితోడన్ = 1 మధువును సమగ్రముగ హరించువానితో లేక, మధువు ఆహారముగా గల వానితో, 2 మధు వనురాక్షసుని సమగ్రముగ నాశముఁజేసినవిష్ణువుతో. నీరజపుసంగతులన్ = 1రజోగుణములేని వాని యందు కూడి యుండుటలను, 2పద్మముతోఁగలిసియుండుటను, మూలములో "మధునాశనమ్" అను పదము మధునా + అశనమ్ అని ఒకర్థమున, మధు + నాశనమ్ అని మఱియొక అర్థమునను విరుగును. మొదటి యర్థమునందలి తృతీయా విభక్త్యంతము రెండవ యర్థమున సమాసములో నిమిడినది. అనువాదమున "మధ్వాహారి" అనునపుడు 1 మధు + ఆహారి 2 మధు + ఆ + హారి అని విరిగి రెండర్థములు సాధింపఁ బడుట విశేషము.

38. 61 :- స్వాపాంగము = 1 స్వాప + అంగము = నిద్రకు అవయవ మైనది. (నిద్రాసంబంధమైనది) 2 స్వ + అపాంగము = నీయొక్క కటాక్షము. వినిద్రితమ్మవు విబోధము = 1 నిద్ర లేనట్టి మెలకువ 2 మిక్కిలి జాగృతమైన విజ్ఞానము.

38. 62 :-శిశిరమ్ము = 1 చల్లనైనది 2 శిశిర ఋతువు. రజోమయము = రజోగుణమయమైనది, ధూళిమయమైనది. వేధో దృగూష్మాగమము = 1 బ్రహ్మయొక్క దృష్టి వలననైన ఉష్ణత్వమును పొందుట. 2 ఊష్మాగమ శబ్దము వలన గ్రీష్మఋతువు యొక్క ఆగమము ధ్వనించును. రౌద్రాంచిత దృగ్ఘనాగమము = 1రుద్రుని సంబంధమైన ఒప్పునట్టి దృష్టియొక్క, అధికమైన ఆగమనము 2 అంధ్య హేతు భీకరదర్శన వర్షఋతువు యొక్క ఆగమనమును. మధుకాలదీప్తి = 1 మధువనురాక్షసునకు మారకుఁడైన విష్ణువు యొక్క ప్రకాశము (విష్ణుని అనుగ్రహదీప్తి) 2 వసంతకాల ప్రకాశము, సుమనస్సత్త్వావహమై = 1 మంచి మనస్సుగలవారికి సత్వగుణాపాదకమై 2 పుష్పబలము కల్గించునది. లక్ష్మి బ్రహ్మ రుద్రాదుల వలన భయముఁ దీర్చి విష్ణువుయొక్క అనుగ్రహమును భక్తులకుఁ గల్గించునని భావము ధ్వనించుచున్నది. శిశిరఋతువు తర్వాత వర్షగ్రీష్మఋతువులు రావని వసంతఋతువే వచ్చునని భావము.

38. 63 :- అదృష్టవంతున్ = 1 భాగ్యశాలిని 2 చూపులేవానిని (గ్రుడ్డివానిని). సహస్రాక్షుగన్ = 1 ఇంద్రునిగ 2 వేయి దృక్పథములు గల వానినిగ, మంచి చూపుగల వానిగ ననియర్థము. అసదృక్పథంబునన్ = 1 సాటిలేనిస్థానమున (వైకుంఠమున) 2 దృష్టితోఁ గూడి యుండని రీతిని (గ్రుడ్డితనమున)

# 6 యత్న స్తబకము

39 . 1 :- 'యత్న' పదప్రయోగము వలన యత్నస్తబకము సూచింపఁ బడినది.

40 . 5 :- తను బాధ = స్వల్పమైన బాధ, లేక, శరీరసంబంధమైన బాధ; అతను బాధ = ఎక్కువబాధ, లేక, మన్మథ సంబంధ మైన బాధ.

40 . 7 :- భవచాపలతాంతబుద్ధిన్ = 1 సంసారమందలి చపలత్వమును నశింపఁజేయు బుద్ధిని 2 ఈశ్వరునియొక్క ధనుస్సును నాశము చేయు బుద్ధిని.

41 . 10 :- కౌతుకము = 1 సంతోషము 2 పెండ్లి.

41 . 11 :- 1 యోగ్య + ఏకపదంబులు = మిక్కలి యోగ్యమైన స్థానములు. 2 యోగి + ఏకపదంబులు = యోగులకు మిక్కలి తగినస్థానములు; చతుర్విధమోక్షములు.

43 . 20 :- కుశేశయాక్షుఁడు = పద్మాక్షుఁడు, కుశేశయత్వము = 1 పద్మత్వము 2 దర్భశయనుఁడగుట. శ్రీరాముఁడు సముద్ర తీరమున దర్భశయనము నొందెనని పురాణములు తెల్పుచున్నవి. వసథ + అభిలాషతో = నీ నివాసమైన పద్మమందలి కాంక్షతో. అవసథము, యొక్క రూపాంతరము వసథము. "వష్టిభాగురిరల్లోప మవాప్యోరుపసర్గయోః" అని అవసథము, వసథ మగును.

44. 26 :- అలంకా (న + లంకా) + ఉపరోధము అని విరిచినపుడు, లంకోపరోధ మానఁ జేసినవారికి 'అలంకోపరోధ' మొనరుతువు అనుట విరోధము. విభునికి + అలంకోప + రోధము అని విరిచినపుడు ప్రభువగు శ్రీరామునకు గొప్పకోపమును నివారించుట యను నర్థ మున విరోధము పరిహారమగును. 'అలం అత్యంతం కుప్యతే ఇతి, అలంకోపః' అని సమాసనము. అలం అను అవ్యయముతో సమాసము చేయనగును. లేదా, విభుని, కలంక + ఉపరోధము అని విరిచి శ్రీరాముని యొక్క కలంకమును (కోపము వచ్చినచో నెవ్వరిని క్షమిం పఁడను కలంకమును) నివారించుట యనునర్థమున విరోధమును పరి హరింపవచ్చును. శ్రీరాముఁడు కోపించి బాణముఁ దొడిగిన, నిఁక తిరుగులేదు. అట్లు కోపించి బాణముఁ దొడిగినపుడును సీతాదేవి ఆతని కోప నివారణము చేసి రక్షింపఁజేసిన కాకాసుర రక్షణము మొదలగు ఘట్టములు కలవు. నీవు విభునితోఁగలిసియున్నపు డాతనికిఁ గోపములేకుండఁ జేయుదువని వానరులు నిన్ను దెచ్చు కొనుటకై యే లంకను నాశము చేసిరని భావము.

శ్లో॥ ప్రభోరలం కోప నిరోధమంబ ! ।
కృతేఽపరాధేఽపికరిష్యసీతి ।
లంకోపరోధం రఘువీరదాసాః ।
హస్తత్వదర్థం హరయో వితేనుః ॥

44. 27 :- పలాశచ్ఛేదము = 1 మోదుగు పుల్లలను విఱుచుట, (యజ్ఞమున) 2 పల + అశ + ఛేదము = మాంసాహారులగు రాక్షసు లను సంహరించుట (యుద్ధమున) అయోముఖమునన్ =

1 కొడవలిచే (యజ్ఞమున) 2 బాణముచే (యుద్ధము) మహా
హావము:- మహా + హావము = 1 గొప్పయజ్ఞము 2 మహా +
ఆహావము = గొప్పయుద్ధము.

44 . 28 :- విప్రయోగి = 1 విరహముగలవాఁడు 2 బ్రాహ్మణయోగి,
ధర్మగుణానుషంగమునన్ = 1 ధనువునందు; నల్లె త్రాడు
నందు. సంగముతో 2 పుణ్యగుణములందాసక్తితో, ఆ శక్తిన్ =
1 ప్రసిద్ధమైన శక్తియను ఆయుధమును 2 ఆసక్తిన్ =
(శసయోరభేదః) ఆసక్తితో. తొడివి ప్రహస్త పరముగన్ =
1 ప్రహస్తుఁడు అను రాక్షసుని విషయమై. ధరించి 2 విప్రహస్త
పరముగన్ = బ్రాహ్మణుల హస్తముల వశమగునట్లుగా. తొడి =
ధరించి కనకదాన, కార్యము = 1 కనక = చూడకుండ
(ఆలోచనలేకుండననుట) దానకార్యము = చీల్చివేయు పని
(ప్రహస్తుని సంహారకార్యము) 2 కనకదాన = బంగారమును
ఇచ్చుటయను కార్యము = పని.

శ్లో॥ త్వల్లిప్సయైవధర్మేష్వాసక్తో విప్రయోగివద్వ్యసనీ ।
కాంచనదానసమృద్ధిం । భువివరదేవిప్రహస్తమనయదినః ॥

"ధర్మేష్వాసక్తః, కాంచనదానసమృద్ధిమ్, వరదేవిప్రహస్తమ్"
అనునవి ఒక అర్థమున విభక్త్యంతములుగను, అవ్యయములు
గను, రెండవ అర్థమున సుబంత శబ్దములుగను, సమాసగత పదములు
గను నున్నవి. ఇవి తెనుఁగునకుఁ దెచ్చుట దుర్ఘటమైన పని
యైనను క్రమముగా నవి 'ధర్మగుణాను షంగమున, కనకదాన
కార్యము, తొడివిప్రహస్తపరముగ' ననువానిచే రెండర్థములు

సాధింపఁబడుట యను వాదమున విశేషము. 'ఆశక్తిన్' అనునది మూలమున లేనిది. అనువాదమున అధిక స్వతంత్రిశ్లేష.

45. 29 :- లలితోరణాగ్రిభూమి = 1 లలితో = విలాసముతో, రణాగ్రభూమిన్ = యుద్ధభూమియందు 2 లలి = అందమైన. తోరణ + అగ్రిభూమి = బహిర్ద్వారమునకు వెలుపలిభూమి యందు. రణాగ్రభూమి, తోరణాగ్రిభూమి, రెండింటి పక్షమున నర్థములు :- 1 ఘన, సత్ + అసి + ఆయతమ్ము = గొప్పవైన ఖడ్గములచే విరివియైనది (రణాగ్రిభూమి) 2 ఘన, సదస్య + ఆయతము = గొప్పవారగు సభికులచే విరివియైనది (తోరణాగ్రభూమి) 1 అతికాయ, మాన, ఘన, మహా + ఆలయము = అతికాయుఁడను రాక్షసునియొక్క గర్వమునకు, మిక్కిలి గొప్ప నివాసము. లేక, మహా + లయము = గొప్పనాశము గలది. (రణాగ్రభూమి) 2 అతి, కాయమాన, మహా + ఆలయము = ఎక్కువ పందిళ్లతో గొప్పవైన యిండ్లుగలది (తోరణాగ్రభూమి)

శ్లో॥ సదస్యుదారేప్యతికాయమానే ।
మహాలయేసత్యభి తోరణాగ్రే ।
జయశ్రియా హంత బలాద్వృతోపి ।
త్వయ్యేవవిన్యస్తమనాః కపీంద్రః॥

ఇందు 'సదసి' అనునది సభయందు అనునర్థమున సప్తమ్యంత వ్యస్తపదము. సత్ + అసి = చక్కని ఖడ్గము అను నర్థమున సమాసదము. 'అభితోరణాగ్రే' అనునపుడు, అభితః + రణాగ్రే =

యుద్ధభూమి యందంతట నను నర్థమున 'అభితః' అనునది అవ్య యము, అందలి 'తో' అభి + తోరణ + అగ్రే = తోరణభూమికి ముందంతటను, అనునర్థమున సమాసములో కలిసియున్నది. ఇట్టి సభంగా భంగ శ్లేషలు తెలుఁగునకు దిగుట దుర్ఘటము. 'సదస్యాయతము' లలితో రణాగ్రభూమి' అను పదములచే, నను వాదమున రెండర్థములఁ దెచ్చుట విశేషము.

45 . 30 :- హంసకుల సార్వభౌముఁడు = 1 సూర్యవంశమహారాజు, 2 హంసల సమూహమున శ్రేష్ఠమైనది. తపః + స్వరూప విచ్ఛేద ములకున్ = 1 తపస్సుయొక్క రూపము యొక్క నాశములకు 2 గ్రీష్మర్తు రూపవినాశములకు, మేఘనాద + ఆస్ఫటీః = 1 'మేఘనాదుడు' అనుపేరుగల ఇంద్రజిత్తుయొక్క ఆర్భాటమును, 2 మేఘ ధ్వనియొక్క ఆర్భాటమును.

శ్లో॥ విష్ణుస్స్వయం త్వద్విరహాసహిష్ణు ।
రఘాంసులే హంసకులా వతంస ః ।
తపస్స్వరూపస్య కృతప్రభేదం ।
నినింద ఘూనందిని ! మేఘనాదం॥

45 . 31 :- గజకుంభము, కుంభకర్ణుఁడు రెండింట రెండర్థములు :- 1కనన్ + ఐరావణపోషణము = కనుఁగొనఁగా, ఐరావణమను ఏనుఁగుయొక్క బలుపును, (గజకుంభ) 2 కననై, రావణపోష ణము = చూడనై; రావణునియొక్క పోషణము (కుంభకర్ణ). అంత స్తనవైరి = 1 అంత; స్తనవైరి, అంత = అప్పుడు, స్తనవైరి = నీకుచములతో విరోధముగలిగినది. (గజకుంభ),

2 అంతస్తన = లోపలివాఁడగు, వైరి = శత్రువు: కుంభకర్ణుఁడు మొదటినుండి బైటపడి వైరము సాధించిన శత్రువుకాఁడనుట (కుంభకర్ణ). కుంభవధము = 1 యుద్ధమందు ఏనుఁగుకుంభములను పరిమార్చుట 2 కుంభకర్ణునివధించుట (నామైకదేశే నామగ్రహణమ్)

శ్లో॥ ఉచ్చైరావణపృష్టః । కుంభస్తవ కుంభినీతనయే ।
సద్యస్తనవైరీ క్రోధా । దేనం జఘాన రఘునాథః॥

'ఉచ్చ+ఐరావణపృష్టః' అని విరిచినపుడు, 'ఉచ్చై' అనునది సంధిగతమై సమాసములోని పదము, మఱొక అర్థమున ఉచ్చైః అని అవ్యయమునగును. అట్లే 'సద్యస్తనవైరి' అనినపుడు సద్యః అనునది ఒక అర్థమున, అవ్యయము. రెండవ అర్థమున సమాసగతపదము నగును. ఇట్టివి తెనుఁగున వచ్చుట దుర్ఘటము. 'కననైరావణ' అని 'అంత,స్తనవైరి' అను వానితో రెండర్థములు అనువాదమునఁ గుదుర్చుట విశేషము.

**45 . 33** :- పుణ్యజనులు = 1 పవిత్రులగు జనులు 2 రాక్షసులు. ఆహవము = 1 యజ్ఞము 2 యుద్ధము, స్వర్గకన్యలను బరిణయముఁజేసెననఁగా యుద్ధమున సంహరించెనని భావము.

**46 . 34** :- ధర్మము = 1 పితృవాక్యపరిపాలనా విధిని, 2 ధనుస్సును. అధి, కాననాదులను = 1 గొప్ప అరణ్యములందు, 2 అధిక+ఆనన+ఆదులను = ఎక్కువతలలు గల రావణాదులను, కాలక్షేపము = 1 కాలమును వెళ్లించుట 2 యమునియందు త్రోసివేయుట (సంహరించుట).

46 . 35 :- పాపదశక వినాశనాపాది = 1 పది పాపములనునా శమునొందించినవాఁడు 2 దశ = పది, క = తలలుగల రావణుని, వినాశమొందించినవాఁడు. ని. కం శిరోఽంబునోః ఇత్యమరః.

46 . 38 :- అంత, రంగమునా; అంత = అప్పుడు, రంగమున్ = తగరమును అని చిత్రార్థము. అంత = అప్పుడు రంగమునా = శ్రీరంగమును రంగనాధుని అని భావము. లేక అంతరంగమున్ = మనస్సును అని వాస్తవార్థము.

శ్లో॥ కాకుత్స్థః కమనీయ భూషణమణి క్షౌమాగ్ర్య హేమాదిభిః।
తోషం దేవి ! నినాయ వానరభటాన్ త్వత్కార్యధుర్యాన్ భువి ।
ఏతద్వ్యక్త మిదం తు విస్మయకరం యత్సర్వనిర్వాహిణే।
రంగం హంత ! విభీషణాయ దదిశే రత్నాది యోగ్యాయ సః॥

మూలములోని 'రంగం' అనునది 1 తగరము 2 శ్రీరంగనాధుని అనునర్థముల వాడఁబడినది. విభీషణునకు శ్రీరాముఁడు శ్రీరంగనాధునొసఁగిన గాధమాత్రము వ్యాఖ్యానములలోఁ దెలుపఁబడలేదు. 'అంత, రంగమునొసంగె' అనియు, అంతరంగము (మనస్సు) నొసఁగెననియు శ్రీరాముఁడందఱకు నశ్వరములగు సంపదలనిచ్చి విభీషణునకు అనశ్వరమగు తన మనస్సునందు స్థానమొసఁగె నని యనువాదమున మఱియొక క్రొత్తయర్థము చెప్పఁబడుటయు 'అంత' అను తెనుఁగు దేశ్యపదము రెండవఅర్థమున 'అంతరంగ' అను సంస్కృత పదమునఁ గలిసిపోవుటయు నిందు విశేషములు.

# 7 మం గ ళ స్త బ క ము

48 . 1 :- 'మంగళ' పదముచే మంగళ స్తబకము సూచింపఁ బడెను.

50 . 7 :- లక్ష్మిచూపు భవతారకము, అనఁగా సంసారమునుండి తరింపఁ జేయునది యనియు ఈశ్వరుని జన్మనక్షత్రి (ఆర్ద్రి) మనియు రెండర్థములు. కాఁగా లక్ష్మిచూపుపరముగ భవతార పరముగ రెండర్థములు :- అతిశివ + ఉదయకరి = మిక్కిలి మంగళము నభివృద్ధి చేయునది (చూపు) అతి, శివా + ఉదయకరి = మిక్కిలిగా పార్వతికి అభివృద్ధినిఁ గూర్చునది (భవతార). దయన్ + ఆర్ద్రి = దయచేఁ దడిసినది (చూపు) ఆర్ద్రి = ఈశ్వరుడు పుట్టిన నక్షత్రిము (భవతార). మఘవంతుఁడు = 1 ఇంద్రుఁడు 2మఘానక్షత్ర జాతకుఁడు, జ్యేష్ఠాశ్రియుఁడయి = 1అమంగళదేవతా శ్రియుఁడై 2 జ్యేష్ఠానక్షత్రిముగలవాఁడై. పునర్వసు వర్గము = 1 తిరిగి సంపదల సమూహమును, 2 పునర్వసునక్షత్రి సముదాయమును. అతులుఁడు = 1 సాటిలేనివాఁడు 2 తులారాశితోఁ గూడి యుండనివాఁడు. ఆర్ద్రికు భవతారకతయు, శివోదయ కరతయు యుక్తమే. మఘానక్షత్రియుక్తునకు పునర్వసుప్రాప్తి జ్యేష్ఠాశ్రయత్వము, తులారాశినిగూడి యుండకుండుటయు చిత్రము. నీచూపు వలన ఇంద్రుఁడు, అంతకుముందు శాపమువలన వచ్చిన దారిద్ర్యము పోయి తిరిగి సంపదలుపొంది సాటిలేనివాఁడగుననుట వాస్తవార్థము.

50 . 8 :- నీనుతి, పావనరీతిగలది అనఁగా పవిత్రమైనది. పవనసంబంధ మైన రీతిగలది అని యర్థము. కాఁగా నుతి పరముగ, పవన పరముగ రెండర్థములు :- సుమంగళత = 1 చక్కని మంగళ త్వము (నుతి) సుమం;గళత = 2 పువ్వునురాల్చుట (సుమం గళ తీతి సుమంగళః, అలుక్సమాసః తస్యభావః సుమంగళతా) లేక, సుమములుగల ది సుమఅనఁగా పుష్ప మంజరి. సుమన్ = పుష్ప మంజరిని, గళత = జార్చుట, అనియైనను జెప్పనగును. అప్పుడు "వర్గయుక్స్వరళములు పరములగునపు డొకానొకచో దుత్రము నకుఁ బూర్ణ బిందువును గానంబడియెడిని" (పవన) కుజనులకున్ = 1 చెడుజన్మకలవారికి అనఁగా పాపాత్ములకు ననిభావము 2 చెట్లకు.

50 . 9 :- కుజనుఁడు = 1 పాపజన్మగలవాఁడు 2 కుజగ్రహము, అంగా రకుఁడు, మూఢుఁడు = 1 మూర్ఖుఁడు 2 అస్తంగతుఁడైనవాఁడు. మంగళ + ఆఖ్యుఁడు = మంగళుఁడను పేరుగలవాఁడు (కుజుని వారము మంగళవారముగాఁ బిలువఁబడుచున్నది.) బుధ + అగ్ర గణ్యుఁడు = 1 పండితులలో మొదట లెక్కింపఁదగినవాఁడు 2 బుధగ్రహముకంటె ముందు లెక్కింపఁ బడువాఁడు (మంగళ వారము తర్వాతనే బుధవారము లెక్కింపఁబడును)

50. 10 :- అచ్యుతుఁడు = 1 విష్ణువు 2 "అ" కారము చ్యుత (జారినది) మైనవాఁడు, ఇన + సంబంధము = 1 సూర్యవంశముతో సంబం ధము 2"ఇ" అను అక్షరముతోనే కలిసియుండుట: ఇన + సంబంధ మున్ = 1భర్తృసంబంధము 2 "ఇ" కారము తోనే కలిసి యుండుటను. శివతాతన్ = 1 విష్ణువును 2 శివునితండ్రిని 3 "శివతాత" యను పదమును, శివతాతిగన్ = 1 మంగళకరునిగ

2 "శివతాతి" యను పదముగ, "శివతాత" పదము న 'అ' కారము పోయి 'ఇ' కారము నొంది "శివతాతి" యైనది. శివతాతి = విష్ణువు. నీకు భర్తయగుటచే విష్ణువు నిత్య మంగళుఁ డయ్యెనని వాస్తవార్థము. ఒకప్పు డినాన్వయము నొందిన సతని నెల్లప్పు డినాన్వయము నొందించితి వనుట చిత్రము.

శ్లో॥ జగృహే క్వచ దచ్యుతోఽవతారే ।
జగతాంమాత రినాన్వయం పురా యః ।
త మజ సృ మినాన్వయం నయంతీ ।
శివతాతం శివతాతి మాతనోషి ॥

'ఇనాన్వయం' అనునప్పుడు ఇన = సూర్యునితో, అన్వయము = సంబంధము అనుఅర్థమున 'ఇన' అనునది సమాస గతపదము. ఇనా = ఇకారముతో అను అర్థమున నది తృతీయా విభక్త్యంతము. ఇట్టి సభంగము నభంగమునగు శ్లేషను తెనుఁగు సేఁత దుర్ఘటము, ఇన = సూర్యఅనియు, ఇన్ + అ = ఇకారమునే యని ద్వితీయాంతముగా గాని, లేక, ఇ + న అని తృతీయాంత ముగా గాని, తెనుఁగున విఱిచి సంబంధపదముతోఁ జేర్చి అనువదింపఁబడి రెండర్థములు రాఁబట్టుట విశేషము.

౧. 11 :- కు + ఉత్పత్తిమూలము = 1 చెడ్డపుట్టుకకలవారికి మూలము, చెడ్డదైన సృష్టికి మూలము 2 భూమియొక్క పుట్టుకకు కారణము. కపాలి = 1 పునుకలుగలవాఁడు, అమంగళుఁడు 2 శివుఁడు. శివత్వము = 1 మంగళత 2 శివుఁడగుట.

51. 13 :— హరిద్రాజశ్రీన్ = 1 హరిద్రా = పసుపువలన, జ = పుట్టిన, శ్రీన్ = శోభతో, 2 హరిత్ = దిక్కులకు, రాజ = ప్రభువు లైన దిక్పాలకుల యొక్క, శ్రీన్ = సంపదతో.

## 8 సౌందర్య స్తబకము

52. 1 :— 'సౌందర్య' పదముచే సౌందర్య స్తబకము సూచితము.

53. 5 :— సూర్యచంద్రులు = సూర్యుఁడు, చంద్రుఁడు నను పేర్లుగలిగి శిరస్సునఁ దాల్చునగలు. ఇవిపూర్వముండెడివి. పుష్పవత్పదము = పుష్పవంతు లను మాట. సూర్యునకుఁ జంద్రునకుఁ గలిసి 'పుష్ప వంతౌ' అను ఏకపదము గలదు. ని. ఏకయోక్త్యా పుష్పవంతౌ దివాకరనిశాకరౌ ఇత్యమరః. ఉత్తమస్థ్సితి = 1 ఉత్తమస్ + స్థితి = హెచ్చైన చీఁకటులస్థితి, అనఁగా నల్లఁదనమని భావము. 2 ఉత్తమస్థ్సితి = ఉత్తమ మైన స్థితి. "అనచిచ"యను సూత్ర మున సకారమునకు ద్విత్వము.

53. 6 :— విజయుని (అర్జునుని) పరముగ, కుంతలముల పరముగ రెండర్థ ములు :— సుమనోఽగ్రవాస వాసనగమతను = సుమనస్ = దేవతలందు, అగ్ర = శ్రేష్ఠుఁడైన, వాసవ = ఇంద్రుని యొక్క, ఆసన = పీఠమును, గమతను = పొందుట చేతను (విజయపరము) 2 సుమనస్ = పువ్వులలో, అగ్ర = శ్రేష్ఠము లైన వానియందు, వాస = నివసించునట్టి, వాసన = పరిమళము

యొక్క, గమతను = పొందుటను, 'వాసన గమత'యను సపుడు సాధ్య సమాసము. లేక, వాసనకా = పరిమళమును, గమతను = పొందుటను, అనివ్యస్తముగను జెప్పవచ్చును. (కుంతల పరము)సకలాపజయతన్ = కలాపుఁడనఁగా,కళలకుపతి చంద్రుఁడు. సకలాపుఁడు = చంద్రునితోఁ గూడినవాఁడు ఈశ్వరుఁడు, అతనిని జయించుటను (విజయ) 2 సకలాప = పింఛములతోఁ గూడినవగు నెమిళ్లను, జయతన్ = జయించుటను (కుంతల)· కృష్ణ ఘనత్వమునున్ = 1 కృష్ణునిచే గొప్పతనమును (విజయ) 2 నల్లని మేఘభావమును (కుంతల). కనుదే = 1 పొందుదువా ! విజయత = అర్జునధర్మము, అమరును (విజయ). 2 కను = పొందునట్టి, దేవి = ఓదేవీ !, జయత = సర్వోత్కృష్టత. అమరును.

శ్లో॥ సుమనో వరవాసవాసనా । ధ్యుషితాః కృష్ణ ఘనాప్తిశాలినః।
వరదేవి జయంతి కుంతలాః। భవదీయా స్సకలాప భృజ్జయాః॥

"వరదేవిజయంతి" అనునపుడు, వరదే = వరముల నిచ్చుదానా! విజయంతి = విజయునివలె (అర్జునుని వలె) ఆచరించుచున్నవి. అని విజయపరముగను, వరదేవి = శ్రేష్ఠురాలైన ఓ దేవి ! జయంతి = సర్వోత్కృష్టముగా నున్నవి అని కుంతలపరము గను శ్లేషవిఱుగును. మొదటియర్థమున "విజయంతి" అనునది ఆచారార్థక్విబంతము. అందలి "వి" రెండవ యర్థమున "దేవి" అను పదగతము. ఇట్టివి అనువాదమునకు దుర్ఘటములు. "కనుదేవి జయత" అను పదములతో మూలమందువలెనె "వి" ఇటునటు గూడ విఱువఁ దగి యుండుట యిందు విశేషము.

53. 7 :- కుటిలమ్ములగు = 1 వంకరైనదగు 2 మోసము గలదగు కుంతలాళియను కుంతలాళికి = కేశపాశ మను దుష్టసమూహమునకు, కేశపరముగను దుష్టపరముగను రెండర్థములు. జలభృద్రుచినిఁ = మేఘముల కాంతిని. (కేశ) 'లదయోరభేదః' జడభృద్రుచినిన్ = జడులను పోషించు వాని యందాసక్తిని. (దుష్ట) శిఖులయెడన్ = 1 నెమిళ్లయందు (కేశ) 2 బ్రాహ్మణుల యందు (దుష్ట) తమస్సమావృతిన్ = 1 చీఁకట్ల యొక్క ఆవరణమును (కేశ) 2 అజ్ఞానావరణమును (దుష్ట)

కుటిలములు = 1 వంకరయైనవి (కేశ) 2 దుస్స్వభావము గలవి. (దుష్ట) ఇడుమహిబంధనమ్ము = 1 ఇడుము + అహిబంధనమ్ము, అహిబంధనమ్ము = పాామువంటి బంధనము అనఁగా పాముపలె జడగానల్లుట లేదా, అహిబంధన మనఁగా నాగాభరణమను భూషణమును ధరించుట యన నగును. (కేశ) 2 ఇడు = ఇమ్ము. మహిన్ = భూమియందు, బంధనమ్ము = కారాగృహవాసము. (దుష్ట) సంసారబంధమే కారాగారవాసము. విశేషణబలమున కుంతలములకు దుష్టులను నర్థము స్ఫురించును.

శ్లో॥ జలభృద్రుచి భాజిసింధు కన్యే ।
శిఖిషు ద్వేషముపేయుషీ ప్రకామం ।
తమసా కలితే తవోపపన్నః ।
కుటిలే కుంతల మండలేహిబంధః ॥

'కుంతలమండలేఽ హిబంధః' అను చోటున 'అహిబంధః' అనియు, హి, బంధః అనియు శ్లేషవిఱుగును. మొదటిదానిలో 'అహి' సుబంత పదము, అంతేకాక అకారము పూర్వరూప సంధి

లోనిది. రెండవ దానిలో' హి' అవ్యయము. అప్పుడు పూర్వమందు సంధిగతమైన అకారము లేదు. ఇట్టిది తెనుఁగునకు దుర్ఘట శ్లేష. 'ఇడుమహిఽబంధనము' అను అనువాదమున 'ఇడుము + అహి' అని 'ఇడు + మహి' యని విఱువఁబడి రెండర్థములు వచ్చుట. మూలమందున్న 'అహి' వచ్చుట విశేషములు.

53. 8 :- అలకాకృతిన్ = అలకల యొక్క (ముంగురుల యొక్క) ఆకారమునందు, అలకాకృతి = అలకాపట్టణము యొక్క ఆకారము, కలదు. కాన, అలకల పరముగ, అలకాపుర పరముగ రెండర్థ ములు. అగ్ర్య, పుష్ప, కాంత = 1 శ్రేష్ఠము లైన పుష్పము లచే నందమైనది, (అలకల యాకృతి) 2 అగ్ర్య, పుష్పక + అంత = శ్రేష్ఠమైన పుష్పక విమానముచే మిగుల నంద మైనది. (అలకాపురి) ని. అంతః ప్రాంతేఽంతికే నాశే స్వరూపేఽ తిమనో హరే ఇతివిశ్వః ॥ శ్రీదోజ్జ్వలిత = 1 శ్రీ = శోభను, ద = ఇచ్చుటచే,ఉజ్జ్వలిత = మిక్కిలి ప్రకాశించునది(అలకల యాకృతి). 2 శ్రీద = కుబేరుని చేత, ఉజ్జ్వలిత = ప్రకాశించునది (అలకాపురి) వరనీలవిభాకలిత = 1 శ్రేష్ఠమైన నల్లని కాంతితోఁ గూడినది (అలకల యాకృతి) 2 శ్రేష్ఠమైన 'నీల' యను నిధితోఁ గూడినది (అలకాపురి) ముకుంద భాగ్యఖని = విష్ణువు యొక్క అదృష్టమునకు నిధి (అలకల యాకృతి) 2 'ముకుంద' అనుధననిధి గలది (అలకాపురి)

54. 9:- వరఘన శైవాల కాళివలెఁ = వర = శ్రేష్ఠమైన, ఘన = మేఘము, శైవాలక + అళి = 1 నాఁచు 'స్వార్థేకః శైవాలకకు'

శైవ + అలకాళి = శివసంబంధమైన అలకల సమూహము అనఁగా శివ జటాజూటము, కచతతి యౌఘ = నీకేశపాశ మున్నది. ఇందలి విశేషణములకు 1 మేఘము 2 నాఁచు 3 శివ జటాజూటము 4 లక్ష్మీకేశపాశము నను నాల్గింట పరములుగ నాల్గర్థములున్నవి.

1 మేఘపరమైన యర్థము :- పరము + అహిమ + ఆలయ, జని విస్ఫురముగ = పరము = శ్రేష్ఠమైనది, అహిమ = ఉష్ణము నకు (హిమము గానిది) ఆలయ = నివాసమైన అగ్నియొక్క, జని = పుట్టుకచే, విస్ఫురముగన్, మిక్కిలి ప్రకాశించు నదిగ, పిడుగులు గలిగి విద్యుత్తులచేఁ బ్రకాశించునదిగ ననుఁ; 2 నాఁచు పరమైన యర్థము :- పరమహి = మిక్కిలి తేజస్సు గల, మా = లక్ష్మికి, ఆలయ = నివాసములగు పద్మముల యొక్క, జని = పుట్టుకచే, విస్ఫురముగ = ప్రకాశించునదిగ, నాఁచు పద్మములతోఁ బ్రకాశించును.

3 శివ జటాజూట పరమైన యర్థము :- పరమ = శ్రేష్ఠమైన, హిమాలయ = హిమవత్పర్వతము నందు, జని = జన్మగల పార్వతీదేవిచే, విస్ఫురముగన్ = ప్రకాశించునదిగ. (అర్ధనారీ శ్వరుఁడగుటచే శివ జటాజూటము పార్వతీ కేశపాశముచే నంద గించు చున్నది) లేక, పరము = శ్రేష్ఠమైనది, యగు, అహి, మాలయ = పాము లనెడి మాలికయే, జని = తన పుట్టుకకు, విస్ఫురముగ = ప్రకాశము నిచ్చునదిగా, శివ జటా జూటము పాములచేఁ జుట్టఁబడుటచే నల్లగా ప్రకాశించు చున్న దని భావము.

4 లక్ష్మీకేశ పరమైన యర్థము :- పరమహి = మిక్కిలి తేజస్సు గల, మా + ఆలయ = పద్మముల యొక్క, జని = పుట్టుకచే, విస్ఫురముగ = ప్రకాశము నిచ్చునదిగ, కాంతిమంతము లైన పద్మములు లక్ష్మీకేశపాశమునం దలంకరింపఁ బడి శోభించుచున్న వని భావము. లేక, పరమహిన్ = వైకుంఠమునందు, మాలయ (మా + ఆలయ) = శ్రీనివాసునకు, జనిన్ = భార్యయైన లక్ష్మియందు, విస్ఫురముగ = విశేషముగఁ దోఁచునదిగ, ని. "భార్యాజాయాజనిః" ఇతి ధనంజయః.

1 మేఘ పరమైన యర్థము. భువనాగ్ర్య సింధుభూషితము. భువన = నీటిచే, అగ్ర్య = శ్రేష్ఠము లైన, సింధు = సముద్రము యొక్క, భూ = తీరభూములందు, ఉషితము = ఉండునది (మేఘము జలపానార్థము సముద్రతీరములనుండు నని ప్రసిద్ధి.) లేక, సింధు = నదులకు, భూషితము = భూషణమైనది (నదులు వర్షములవలనఁ బొంగును కాన మేఘములు నదుల నలంకరించున వనుట.)

2 నాఁచు పరమైన యర్థము. భువనాగ్ర్యసింధు భూ + ఉషితము = శ్రేష్ఠము లైన నీరుగల నదుల గట్టులం దుండునది.

3 శివజటా పరమైన యర్థము. భువనాగ్ర్య = నీటిచే శ్రేష్ఠమైన, సింధు = గంగానది యొక్క, భూ = పుట్టుకతో, ఉషితము = ఉండినది (ఆకాశమున నుండి శంభుని శిరంబందు వసించినది గంగ).

4 లక్ష్మీకేశపరమైనయర్థము. భువనాగ్ర్యసింధు = ప్రపంచమందు శ్రేష్ఠమైన సముద్రమగు పాలసముద్రము నందు, భూ = జన్మించిన లక్ష్మీదేవి యందు, ఉషితము = ఉండునది.

1 (మేఘు) శ్రీ = శోభచేత, సురభిత = మనోజ్ఞములుగాఁ జేయఁబడిన, మీన = చేఁపలు, అంకము = చిహ్నములుగా గలది (మేఘము వర్షించుట చేతనే నీటి యందు చేఁపలుచక్కఁగా నుండుననుట)

2 (నాఁచు) శ్రీ = శోభచేత, సురభిత = అందమైనవిగాఁ జేయఁబడిన, మీన = చేఁపలు, అంకము = చిహ్నముగాఁ గలది. (చేఁపలు నాఁచు తిని పుష్టినొందును).

3 (శివజటా) శ్రీసురభి = శోభచే మనోజ్ఞుఁడైన, తమీ + ఇన = రాత్రికి భర్తయైన చంద్రుఁడు, అంకము = చిహ్నముగాఁ గలది. (చంద్రికలచే శోభించునది).

4 (లక్ష్మీకేశ) శ్రీసురభిత మీనాంకము = శోభచే మనోజ్ఞుఁడైన (మీనాంకుఁడు) మన్మథుఁడు గలది. (విష్ణుని మన్మథోద్రేకునిఁగాఁ జేయునది)

శ్లో॥ భువనోత్తరసింధు భూషితో ।
ఘనశైవాలక వత్కచోద్ధ్రువం ।
సురుచా మహితో హిమాలయో ।
దితయోద్భాసిత మీన లాంఛనః ॥

"సురుచా మహితోహిమాలయోదితయా" అను నపుడు 'సురుచా' తృతీయాంతము, 'మహితోఽ హిమాలయా' అని యొకప్పుడు 'అహిమాలయా' అని మఱొకప్పుడు 'హిమాలయ' అని శ్లేష విఱుగును. మొదటిదానిలో పూర్వరూప సంధిలో "అ" కలిసి పోవును, 'మాలయా' అనునది తృతీయాంతము. "హిమాలయో దిత" అనునపుడు తృతీయా విభక్తి ప్రత్యయమగు "యా" సమాసపదములోఁ గలిసి పోయినది. ఈ విధములగు శ్లేషలు తెనుఁగునకు దిగుట దుర్ఘటము. "పరమ హిమాలయ జని విస్ఫురము" అను పదముతో నవి సాధింపఁబడినవి.

54, 12 :- సుతరామలకాళి ; 1 సుతరాము = మొదలంటఅనఁగా, పూర్ణముగానని భావము. అలక + ఆళి = ముంగురుల సమూహము 2 సుతల + ఆమలక + ఆళి (రలయోరభేదః) = మంచి ప్రదేశమందలి ఉసిరి చెట్ల సమూహముతో, పొలుచున్ = ఒప్పును, అలకలు, ఆమలకాళి పరముగ రెండర్థములు :- అమ్లానశోభితము = 1 వాడి పోకుండ శోభించునది (అలకాళి) అమ్లాన = 2 పులుపుచే (అమ్లము + న, సూ॥ లు,ల,న,లు పరంబులగు నపుడు మువర్ణమునకు లోపము, తత్పూర్వ స్వరంబునకు దీర్ఘంబునగు.) శోభితము = ప్రకాశించునది (ఆమలక) ప్రసూనపాళి = 1పూవుల సమూహము 2 పండ్లసమూహము; తన్మహారామ వినుత = 1 ఆ గొప్ప శ్రీరామునిచేఁ (విష్ణునిచే) గొనియాడఁ బడునది(అలకాళి) 2 తత్‌మహారామ = ఆ ప్రసిద్ధి గల తోటలందు, వి = పక్షులచే, నుతము కొనియాడఁ బడునది (ఆమలకాళి) సురభిసంవాసిత =

1 పరిమళముతోఁ గూడునది (అలకాళి) 2 వసంతునితోఁ గూడినది (ఆమలకాళి) (వసంతర్తువున చైత్రామలకములు ప్రసిద్ధి).

శ్లో॥ సుతరామలక ప్రజప్రసూనా ।
న్యలమమ్లాని విశోభితాని బిభ్రత్ ।
సురభిస్ఫురిత స్సపుత్రిధాత్ర్యాః ।
సుమహారామ విభూషితో విభాతి ॥

'అమ్లాని విశోభితాని' అనునపుడు అమ్లాని = పుల్లనివి యను నర్థమున, ద్వితీయా బహువచనాంతములోని 'ని', అమ్లాని = మ్లానము లేనట్టి అను నర్థమున సమాసగత పదములోఁ జేరిపోయి నది. 'అమ్లాన' = పులుపుచేత అని తెనుఁగు వ్యాకరణ సిద్ధమైన తృతీయ లోని 'న' కారముతో అనువాదమున రెండర్థములు సాధింపఁ బడుట విశేషము.

4. 13 :- ప్రసూనకులము = 1 పువ్వుల సమూహము 2 ప్ర = అత్యంతము, సు = మిక్కిలి, ఊన = తక్కువవారి యొక్క (హీనుల యొక్క) కులము = సమూహము.

5. 17 :- మధుసూదనుఁడు = 1 మధువును, (మద్యమును) నశింపఁజేయు వాఁడు 2 మధువను రాక్షసుని చంపినవాఁడు. విష్ణువు. మధుప + ఆవళికి = 1 మద్యపానముచేసినవారి సమూహమునకు 2 తుమ్మెదల సమూహమునకు.

55 , 18. వికచసూన గంధము, = 1 వికచ = వికసించిన, సూన = పువ్వులయొక్క. గంధము = పరిమళము, 2 వికచ = కచము లేని (ముండితశిరస్కులగు) సు + ఊన = మిక్కిలి హీనులగు వారియొక్క, గంధము = సంబంధము.

56 . 19 :- 1 కల,యమారజని స్థిరనిలయము, = కల = కూడిన, అమా = అమావాస్యనాఁటి, రజని = రాత్రికి, స్థిరనిలయము = స్థిరనివాసము. మిక్కిలినల్లనైనది యనుట. 2 కలయన్ = కూడునట్లుగా, మార = మన్మధునియొక్క, జని = పుట్టుకకు, సిర నిలయము = స్థిరనివాసము; మన్మధోద్రేకమును పుట్టించునది యనుట. సౌరభానువృత్తి, 1 సౌర = సూర్యసంబంధమైన, భానుకిరణములయొక్క, వృత్తి = వ్యాపారము 2 సౌరభ + అనువృత్తి, = పరిమళవ్యాపారముఅని వాస్తవార్థము.

శ్లో॥ నిహితా స్తవ కుంతలాంధకారే। నిబిడేమారజనిప్రకర్షే।
కలయంతి నవస్రజో విచిత్రం। కమలే కామపిసౌరభానువృత్తిమ్॥

"నిబిడే మారజని ప్రకర్షే" అనుమూలమున, 'నిబిడే + అమార జని ప్రకర్షే' అనియు 'నిబిడే,మారజనిప్రకర్షే' అనియు పద చ్ఛేదము. ఒకయర్థమున 'నిబిడే' అను సప్తమ్యంత పదము తర్వాత పూర్వరూప సంధిలో మిశ్రితమైన 'అ' కారము, రెండవ అర్థములో నదృశ్యమయినది. అను వాదమున 'కలయమారజని' అను పదములలో 'కల + అమారజని' అనియు, 'కలయ + మారజని' అనియు, విఱిచి రెండర్థములు సాధింపఁబడినవి.

56 . 20 :- సరిగట్టినన్, 1 సరిన్ = సరిగా, కట్టినన్ = కట్టినప్పటి కిని, (గట్టిగా బంధించియుంచినను) 2 సరిఁ = మాలచే, కట్టినన్ = బిగించినను (పూలతో సలంకరింపఁగా) చంచలతల్ = 1 చపలబుద్ధులు 2 తళుక్కు-తళుక్కు-మను టలు, తమోరుచినిన్ = 1 తామసగుణమందాసక్తిని 2 చీఁకటివంటి నల్లనికాంతిని, కుంతల వ్రజము = 1 కేశసమూహమనెడి కుంతలదేశమందలి నీచుల సమూహము, (రెండిటపరముగ రెండర్థములు వచ్చును.) పరిశోభిత మాలోన్నతిఁ, 1 పరిశోభి = మిక్కిలి ప్రకాశించునదియగు, తమాల = చీఁకటి చెట్లయొక్క, ఉన్నతిన్ = ఔన్నత్యమును, లేదా, పరిశోభితమైన మా,లా + ఉన్నతన్ = హారౌన్నత్యమును లేదా, పరిశోభిత, మారోన్నతిన్ (రలయోరభేదః) = ప్రకాశించుచున్న మన్మథౌన్నత్యమును (కేశ) 2 పరిశోభితము + ఆరోన్నతిన్ (ఆర + ఉన్నతిన్) ప్రకాశించునట్టి కుజగ్రహాధి క్యమును. పరి పోషించును = వృద్ధిచేయును. (దారిద్ర్యావస్థ లేక రోగావస్థ గల్గి యుండునను‌ట) ని. ఆరోవక్రోప్రహీజశ్చ ఇతి గ్రహనిఘంటుః॥ (సీచ) 'కుంతలోని యమితోపి' యను మూలమునగల 'నియమిత' పదమును అనువదించుటకు 'కట్టిన' అనుపదమే చాలియుండినను 'సరిగట్టిన' అని అనువదించి, సరిన్ = దండతో, అను అర్థము కూడ రాఁబట్టుట విశేషమగును.

56 . 23 :- మహాదర్శలీలలు. 1 మహా + ఆదర్శలీలలు = గొప్ప అద్దముయొక్క కాంతులు. 2 మహా + దర్శలీలలు = గొప్ప అమావాస్యకాంతులు 'సూర్యచంద్రగతులు కలిసినపు డమావాస్య యగును.

57 . 25 :- వికచము = 1 కచము (జుట్టు) లేనిది. 2 వికసించినది. నీరసత్త్వయుతము = నీరసస్థితిలోనున్నది; రసస్థితిలేనిది, 2 నీర = నీటియందు. సత్త్వయుతము = నివాసముండునది. (జలజము) "లడయోరభేదః" అని జడజముకాగా, జడుని = వలనఁ బుట్టినది 2 నీటియందుఁ బుట్టినది,

57 , 26 :- రాజు = 1 చక్రవర్తి 2 చంద్రుఁడు. దుర్గేశశీర్షార్చ్య మానపాదుఁడు = 1 దుర్గాధిపతుల శిరస్సులచేఁ బూజింపఁబడు పాదములుగలవాఁడు (చక్రవర్తి) 2 దుర్గాభర్తయగు శివుని నెత్తిపైని పూజనీయములగు కిరణములు గలవాఁడు (చంద్రుఁడు) ఆతపస్పృహ = 1 ఎండయందు వాంఛ గలది (పద్మసమూహము) 2 సమగ్రమగు తపోవాంఛగలది (మునులసమూహము) వనాంత వాసి = 1 నీటిమధ్యనుండు నది (పద్మసమూహము) 2 వనమధ్య నుండు(మునులసమూహము) కుశేశయ + ఆళిని, దర్భశయనులగు మునుల సమూహమును 2 పద్మముల సమూహమును.

57 . 27 :- నదవనజము = 1 నదమునందలి పద్మము. 2 'నదవనజ' యనుపదము. మహాతపంబునయందు = 1 మహా + ఆతంబున యందు = గొప్పయెండ యందు 2 మహా + తపంబున యందు = గొప్పతపస్సున, నిష్ఠన్ = 1 నిలిచియుండుటచే 2 దీక్షతో, 'నదవనజ' అనునది తలక్రిందుగాఁజదివిన 'జనవదన' అనియగును,

58 . 30 :- అశోకసంపద = 1 దుఃఖములేని సంపద 2 అశోకవృక్ష సమృద్ధి, సాలకాంతము = 1 స + అలక + అంతము, అలకల తోడి యందము గలది. 2 సాల + కాంతము = చెట్లచే నంద మైనది. మాధవుఁడు = 1 విష్ణువు 2 వసంతుఁడు.

58 . 31 :- ద్విజరాజపదము = 1 చంద్రుఁడనుశబ్దము 2 రెండు విధములుగ జన్మించినవాఁడు అనుమాట.

58 . 33:- సుధాన్యభూమివోదువు = చక్కని ధాన్యముపండు మాగాణిభూమివోదువు. మాగాణిభూమిలో గోధుమలు, పెసలు, తిలలు, కూడ పండును. మాగాణి భూమి పక్షముగ, లక్ష్మీదేవిపరముగ రెండర్ధములు :- నవతిలకాననమునన్: నవ, తిలక + ఆననమునన్ = 1 క్రొత్త బొట్టుగలముఖముచేతను (లక్ష్మి) 2 నవ + తిల + కాననమునన్ = క్రొత్త తిలసస్యవనముచే (మాగాణి) సముద్గతాభన్, సమ్ + ఉత్ + గత + ఆభన్ = చక్కగానున్నతి నొందిన కాంతిచే, (లక్ష్మి) స + ముద్గతా + ఆభన్ = (ముద్గములనగా పెసలు) పెసరపంటతో గూడిన కాంతితో (మాగాణి) అణు మధ్య శోభన్, అణుమధ్యన్ + శోభన్ = అణువువంటినడుమునందు శోభచే (లక్ష్మి) 2 అణువులను ధాన్యజాతి సస్యము మధ్య భాగమున గల్గుటచేఁ గల్గిన శోభచే (మాగాణి); పెంపాటియనవయవ సమాగతిన్, పెంపాటి = అతిశయించి, అనవయవ = అనంగునియొక్క లేక, అవయవశూన్యుఁడగు పరమాత్మునియొక్క సమాగమమును, (లక్ష్మి) 2 పెంపాటియ = అతిశయించియే నవయవ = క్రొత్త, యవలయొక్క (ధాన్యవిశేషము) పొందుటను (మాగాణి) కుసుమాప్తిన్, 1 కు = భూమిని, సు, మా + ఆప్తిని = చక్కనైన లక్ష్మినిపొందిన వానిని, విష్ణువును, భూదేవిని శ్రీదేవిని భార్యగాఁ బొందిన విష్ణువును, లేదా, కుసుమ = తామరపువ్వుయొక్క, ఆప్తిన్ = పొందుటను (లక్ష్మి) 2కుసుమ +

ఆప్తిన్ = 'కుసుమలు' అను పేరుగలిగిన ధాన్య సస్యవిశేషము యొక్క పొందుటను (మాగాణి) సుధా + అధరతన్ = 1 అమృతమువంటి అధరోష్ఠమును గల్గియుంటను (లక్ష్మి) 2 అమృతమును తక్కువగాఁ జేయుటను, (మాగాణి) సుధాన్యభూమివి 1 సుధా + అన్యభూమివి = సుధకు అన్యమైన జన్మదేశమైనదానవు. అమృతము నొసఁగుదానవు. (లక్ష్మి) 2 సు + ధాన్యభూమివి = చక్కని ధాన్యముపండు భూమివి. (మాగాణి)

శ్లో॥ ఉపాశ్రితానవయవముద్గతశ్రియం।
ప్రియంగుణాధిక్య మణుమధ్యమా శుభమ్।
ఉపేయుషీవరతిల కాననారమే।
సుధాన్యభూరుచిర సుధాధరాప్యసి॥

'ముద్గతశ్రియమ్' అనునపుడు, 'ఉద్గత + శ్రియమ్' అని యొక అర్థమున, 'ముద్గతః' అని యొక అర్థమున శ్లేష విఱుగును. 'ముద్గతః' అనునపుడు ముద్గములవలన అను అర్థమున (పంచమ్యాస్తసిల్) తః ప్రత్యయము; ఇది తెనుఁగునకు దిగదు. 'సముద్గతాభన్' అను పదముతో ననువాదమున రెండర్థములు వచ్చినవి. 'ప్రియం గుణాధిక్యమ్' అనునపుడు, ప్రియమ్ + గుణాధిక్యమ్ అనియు, ప్రియంగుణా = ఒకదినుసు ధాన్యము చేత అనియు, విఱుగును. మొదటిదానిలో 'ప్రియమ్' ద్వితీయావిభక్త్యంతము, రెండవ 'ప్రియం గుణా' లో ననుస్వారము ద్వితీయను దెలుపునది. అంతేకాక, 'ప్రియంగుణా' అను దానిలోని 'ణా' అను తృతీయాప్రత్యయము, 'గుణాధిక్య' మను

సమాసశబ్దగతమై పోయినది. అనువాదములో 'కుసుమాప్తి' అను పదముతో రెండర్థములు సాధింపఁబడినవి, 'ప్రియంగువు' లకుబదులు 'కుసుమ' లు చెప్పఁబడినవి. 'ఉపాశ్రితానవయవమ్' అనునపుడు, ఉపాశ్రితా + అనవయవమ్ అని విఱిచినపుడు, 'ఉపాశ్రితా' వ్యస్త స్త్రీలింగ పదము, తా, అనవయమ్ అని దానితో సవర్ణసంధిగతమైన దగుటచే రెండవఅర్థమున 'ఉపాశ్రితా + నవయవ 'అనియు విఱువఁబడినది. తెలుఁగుననట్లురాదు. కాన 'పెంపాఱియనవయవ' అను పదములో ఒక అర్థమున 'పెంపాఱి + యనవయవ, అనియు, మఱొక అర్థమున 'పెంపాఱి య + నవయవ, అనియు విఱిచి రెండర్థములు తేఁబడినవి.

59 . 34 :- సరోగనభోగతానివర్తనములు : 1 స + రోగతా = రోగముతోఁ గూడియుండుట 2సరః + గతా = సరస్సును బొందియుండుట, 1 న + భోగతా = భోగములులేకుండుట 2 నభః + గతా = ఆకాశమును బొందియుండుట.

59 . 37 :- శ్రుత్యంతజుష్టము = 1 వేదాంతములను, ఉపనిషత్తులను బొందినది 2 చెవుల చివరిభాగము నొందినది, 1 అతివిభాసి + తామరస + భా + అతిమహితమై = మిక్కిలి ప్రకాశించు పద్మముయొక్క కాంతిచే మిక్కిలి గొప్పదై 2 యతి + విభాసిత + అమరసభా + అతిమహితమై = యతులతో ప్రకాశించు దేవసభచే మిక్కిలి గొప్పదై, కామజననహేతువై = 1 కోరికలుపుట్టించుటకు కారణమై, 2 మన్మథుని పుట్టుకకు కారణమై, కృష్ణరూపమై = 1 నల్లనిదై 2 కృష్ణుని స్వరూపమే తానయినదై.

59 . 38 :- రాజున్ = 1 ప్రభువును 2 చంద్రుని, మండలమున్ = 1 రాజ్య భాగమును 2వలయాకారమును, దుర్గవిభున్ = 1దుర్గమునకుఁ బ్రభువును, 2 దుర్గకువిభుఁడైన ఈశ్వరుని,

60 . 39 :- వర్ణరీతి = 1 కాంతియొక్కరీతి 2 అక్షరములరీతి.

60 . 40 :- రాజు = 1 ప్రభువు 2 చంద్రుఁడు. వికచమ్ముగన్ = 1 తలగొఱిగించిన దానినిగ 2 వికసించినదానినిగ, రాజు పాదములు = 1 ప్రభుచరణములు 2 చంద్రకిరణములు, పట్టున్ = గ్రహించును,

60 . 41 :- కువలము = కలువ, ని. కువాలయం, కువలయం, కువాలం కువలం, కువమ్.

60 . 42 :- శ్రుతిసీమ = 1 వేదభూమి 2 కర్ణప్రదేశము, చాక్షుషప్రమాణము = 1 ప్రత్యక్షప్రమాణము 2 కన్నులసంబంధమైన వైశాల్యము, కైముత్యన్యాయము = అర్థాపత్తి అలంకారము.

60 . 43 :- ధృతరాష్ట్రజాతాఖ్య = 1 ధృతరాష్ట్రుని కుమారుఁడగు దుర్యోధనునిపేరు 2 ధరింపఁబడిన రాజ్యసమూహము కలదనుపేరు, కర్ణమిత్రము = 1 కర్ణునకు మిత్రుఁడు 2 చెవులతో చెలిమి గలది. (చెవులవరకు వ్యాపించినది) కృష్ణార్జున ప్రదీప్తియోగము = 1 కృష్ణునియొక్కయు అర్జునునియొక్క ప్రకాశవంతమైన మైత్రిసంబంధము, 2 నలుపు తెలుపు కాంతులతోడి సంబంధము. కనులకుఁ గాటుకతోఁ గూడినపుడు నలుపు, లేనపుడు తెలుపునని చెప్పకొనవలెను.

61 . 45 :- నేత్రియుగము = 1 కన్నులజంట 2 ప్రభువులజంట. ని. నేత్రోనేతరీతివిశ్వః. చెవులు గొఱుక = 1 చెవులవరకు వ్యాపింపఁగా 2 కొండెములు చెప్పఁగా, కుశేశయ + ఆళి = 1 శతపత్ర పద్మముల సమూహము 2 దర్భలపైనిఁగూర్చుండువారి సమూహము, యోగులు. కువలయము = 1 కలువ 2 భూమండలము, వనము మఱుఁగునన్ = 1 జలములోపల 2 అడవిలోపల. 1 సుహృద్య + మీన + ఆళి = 1 మిక్కిలి మనోహరములైన చేఁపల సమూహము, 2 సుహృత్ + యమీ + ఇన + ఆళి = మంచి హృదయముగల యోగీంద్రుల సమూహము.

63 . 54 :- అవామయా నీదు శ్రుతిని = 1 నీదక్షిణ కర్ణమును 2 ఋజుగతిగలిగి నిన్ను ప్రతిపాదించు వేదమును. 'త్వమీశానా జగతోవిష్ణుపత్నీ' అను శ్రుతిని, స్మృతిజన్మకారణము =

1 శ్లో॥ సర్వలోకేశ్వరీ లక్ష్మీః । బ్రహ్మేశాద్యమరార్చితా ।
నేవ్యాసర్వజనైర్నిత్యం । భుక్తిముక్తి ప్రదాయినీ ॥

అనుమనుస్మృతికి కారణమును, 2 మన్మథునికి కారణము, సుమనోఽంచితము = 1 పూవులతోఁ గూడినది. 2 దేవతలచే నొప్పునది, శ్రుతిశిరము = 1 చెవి చివర 2 వేదాంతములు, ఉపనిషత్తులు.

63. 55 :- ద్వితీయశ్రుతిని = 1 రెండవచెవిని, ఎడమచెవిని, 2 ద్వితీయ = (విష్ణుని) భార్యను గూర్చిన. 'చంద్రాం ప్రభాసాం యశసాజ్వలంతీం' శ్రియంలోకే దేవజుష్టాముదారాం తాం పద్మినీ మీం శరణం

ప్రపద్యే' అనుశ్రుతిని. 1 అనంగభావానురూప = మన్మథ భావములకుఁ దగినది 2 అనంగ = శరీరము లేని, భావ = మోక్షభావమునకు, అనురూప = తగినది. అశేషశేషివర్తి = 1 స్తంభాది బ్రహ్మపర్యంతము కంటె మిగిలి యుండువాఁడు, 2 భగవంతుఁడగు విష్ణువు, కర్మకారకతను = 1 నీ కిష్టములైన పనులను చేయుటను 2 షట్కారకములలో నొకటియగు 'కర్మకారక' మగుటను, కర్తకు ప్రాధాన్యము, కర్మకు అప్రాధాన్యమునగును కాన శ్రీదేవికి భర్తృద్వారా కించిదప్రాధాన్యమునిందు కవి సూచించెను.

64. 59 :- శ్రుతులు = 1 చెవులు 2 వేదములు, ముక్తాభ్యుదయమును = 1 ముత్తెముల శోభను 2 ముక్తులగు వారి యొక్క అభివృద్ధిని, జ్యోతిష్పథము = 1 ప్రకాశమార్గము 2 అర్చిరాదిమార్గము, చక్రధరసన్నుతుల = 1 రాజ్యచక్రమును ధరించిన ప్రభువుల మన్ననలను 2 విష్ణుస్తుతులను.

65. 62 :- అటన్ = నశింపఁగా, 1 నిశాచర కేశసంహారము = నిశాచర = రాత్రివలె నున్నట్టి (నల్లనైన) కేశ = జుట్టుయొక్క, సంహారము = ముడియొదవు నట్లుగా, 2 నిశాచరక + ఈశ + సంహారము = రాక్షసరాజగు రావణవధ. విదేహజయా మోదము. 1 విదేహజ! = సీతాదేవీ! ఆమోదము = సంతోషము 2 విదేహజ = సీతతోడి యామోదము. 3 విదేహ + జయ + ఆమోదము, విదేహుండగు మన్మథుని వల్లనైన జయమునకు ఆమోదము, మన్మథుని కోడిపోవుటచే నైన సంతోషమని భావము. 1 ఎటు =

ఏ విధముగాను, ఎనయఁడు = పొందఁడు 2 ఎటు = ఏ విధ
ముగా, ఎనయఁడు? = పొందఁడు ? అనిప్రశ్న, తప్పక పొందు
ననుట ఇందు విరుద్ధగతిత్వమున రూప కాలంకారము.

శ్లో॥ శ్రీరాస్య కాంతిజలధౌ సవిభాతినాసా ।
సేతు స్తవాఽప్లుతగతిః కలనేన యస్య ।
నాథ స్స్వమేతి స విదేహజ యాన్వయం హా ।
లంకేశ పాశ కలనా దపయాత ధైర్యః ॥

ఇందలి, "హా లంకేశ పాశ కలనాత్" అనుదానిలో, హా + అలం +
కేశపాశ కలనాత్ అని హా + లంకేశ పాశకలనాత్, అని విఱువ
వలెను. అట్లే విదేహజయా + అన్వయం, విదేహజయా న్వయం.
ఇట్టి సభంగాభంగ శ్లేషలు తెనుఁగున దిగుట దుర్ఘటము. 'నిశాచర
కేశసంహారము' 'విదేహజయా మోదము' అను పదములతో నీశ్లేషలు
రాఁబట్టుట ఇందు విశేషము,

65. 63 :- నస = నాసిక. ని. 'నాసికా నాసా నసా'

66. 69 : భవతీ ! = పూజ్యురాలా ! భవతి = నక్షత్రములు గలది.
రాత్రి. భవతీహాసజ్యోత్స్నిక = నీయొక్క నవ్వువెన్నెల.

66. 70 :— అగ్రవర్ణమ్ము = 1 శ్రేష్ఠమైన కాంతిని 2 శ్రేష్ఠమైన కుల
మును 3 మొదటి యక్షరమైన 'హ' కారమును. అమిత, విధు,
పాదజాత, మైత్రిని = 1 మితిలేని చంద్రకిరణ సమూహముతో
మైత్రిని, లేక, విధు = విష్ణునియొక్క, పాదజాత = గంగతో,
మైత్రిని = స్నేహమును. 2 అమిత = సాటిలేని, విధు =

విష్ణువు యొక్క. పాదజాత = పాదములనుండి పుట్టిన శూద్రులతో, మైత్రిని = స్నేహమును, అతిమందునకు = 1 మిక్కిలి జడునకు, హీనునకు, 2 మందహాసమునకు. అధర + ఆప్తి = 1 తక్కువ వారితో సంబంధము 2 పెదవులను పొందుట.

67. 72 :- బంధుజీవము = మంకెనపువ్వు. పాటలత్వము = 1 తెల్లదనము 2 పాటల మను పేరుగల కుసుమమగుట.

67. 74 :- మధువైరి = 1 తీపియం దిష్టము లేనివాఁడు 2 మధువను రాక్షసునిఁ జంపిన విష్ణువు.

69. 80 :- భవహరణము = 1 శివునిహరించునది 2 జన్మలేకుండఁ జేయునది (మోక్షమిచ్చునది) కాలకంఠాభిలాపమున్ 1 ఈశ్వరునిఁ గూర్చినమాటను, 2 కోకిలలకూఁతను. శ్రుతిమధురము = 1 వేదములందు వర్ణింపఁబడినది. 2 చెవులకింపైనది. శుకముఖాలాపములకు = 1 శ్రీశుకమహర్షి మొదలగు వారి మాటలకు, 2 చిలుకలపలుకులకు.

70. 84 :- ఆదిలో = 1 పూర్వమున 2 మొదట తొలియక్షరముగాననుట, రూపయుక్త = రూపముతో గూడినది. 2 రు + ఉపయుక్త = 'రు' అను అక్షరముతోఁ బ్రయోగింపఁబడినది; మొదటి కాలమున గుండ్రముగా చక్కని రూపముతో నుండునట్టి ద్రాక్ష. మొదటి అక్షరము 'రు ఉన్న 'ద్రాక్ష' అనఁగా 'రుద్రాక్ష' వంటిదని భావము. అధికమై మధ్య = 1 నడుమున నెక్కువరుచికలదై 2 నడుమ

'క' అను అక్షరముగలదై, ఇక్షుజమైన = చెఱకునుండి పుట్టిన, సిత = పంచదార(చెఱకునందు మధ్యభాగము రుచియైనది). 2నడుమ 'క' అను అక్షరముగల 'సిత' అనఁగా, సికత = ఇసుక. అగ్రజన యుక్తమగు సుధ = 1 దేవతలకు జ్యేష్ఠసోదరులైన రాక్షసుల కుపయోగ పడని అమృతము 2 అగ్రజనులగు దేవతలకే యుపయోగ పడిన అమృతము 3 చివర 'జన' అను అక్షరములతోఁగూడి 'సుధా'యనగా, 'సుధాజనం' అగును. అనఁగా గంజియని యర్థము. పాఠాంతరమున:- 1 శ్రేష్ఠులకుపయోగ పడని తేనె (తేనెఈఁగలచే నెంగిలిపరుపఁబడినదని, ఆచారనిష్ఠులు కొందఱుపయోగింపరు). 2 అగ్రిజ = మొదటనున్న అక్షరముతో, నయుక్త = కూడి యుండని, మధూళి = 'మధూళి' యనుపదము, అనఁగా ధూళి = దుమ్ము.

70 . 85 :- నిస్సార వంశము = 1 నీచకులము 2 సారములేని వెదురు. ద్విజవ్రజ = 1 దంత సమూహము 2 బ్రాహ్మణ సమూహము మాతంగకుల = 1 ఏనుఁగుల సమూహముయొక్క 2 చండాల కులస్థులయొక్క, ని.మాతంగా కరి చండాలావితి నానార్థరత్నమాలా.

71 . 87 :- నీ, రదాళి = 1 నీ దంతసమూహము 2 నీరద + ఆళి = మేఘసమూహము, ఈ రెండింట రెండర్థములు. సహాసోన్మిషిత, 1 సహాసా + ఉన్మిషితా = 1 నవ్వుతోఁ గూడినదియు, ప్రకా శించునదియు (దంత) 2 హఠాత్తుగా మెఱసినది (మేఘ) 'సహసా' అను అవ్యయముతో సమాసము. 'సహసానఖంపచస్తన దత్తపరి రంభ' మని మనుచరిత్రలో ప్రయోగమున్నది. అముకముకుంద మైత్రి; అముక = 1 ముకారరహితమైన, కుందముతో మైత్రి,

అనఁగా, కుందముతో మైత్రి = మల్లెలతో మైత్రి (దంత) అముక = 2 ఈ, ముకుంద = విష్ణువుతో, మైత్రి (మేఘ) సజ్జఘనాగమ; సత్ + జఘన + అగమ = చక్కని కొండవంటి పిఱుదు గలదానా! మెల్లన్ = మెల్లగా (దంత) సజ్జ + ఘన + ఆగమము + ఎల్లన్ = సిద్ధమైన వర్షాకాలమంతయు (మేఘ)

శ్లో॥ పత్రికాశతేసజ్జఘనాగమే! త్వయి। ప్రగల్భశోభోదయినీరదాళిః।
రమే! ముకుందేనధృతాకిలాముమా, ద్యుతిర్యదీయాసహసో
న్మిషన్ముదా॥

'సజ్జఘనాగమే' అనునది ఒకర్థమున సంబోధనా ప్రథమావిభక్తి, మఱొకర్థమున 'సప్తమీవిభక్త్యేక వచనాంతము. అనువాదమున 'సజ్జఘనాగమమెల్ల' అను పదమున నీ శ్లేష తేఁబడినది. 'శోభోదయి నీరదాళిః' శోభోదయినీ అను ప్రథమాంత మందలి 'నీ' రెండవ అర్థమున నీరద' అను పదములోని ప్రథమాక్షరమైనది. 'నీరదావళి' పదముతో నీ శ్లేష సాధింపఁబడినది. 'అమునాముకుందేన' అనుదానిలోని 'అమునా' రెండర్థములందును తృతీయావిభక్త్యంతమే' 'అముకముకుంద' పదముతో నిది రాఁబట్టఁబడినది. ఈదుర్ఘట శ్లేషలు రాఁబట్టుట విశేషము.

71. 88 :- ద్విజానీకము = 1 బ్రాహ్మణసమూహము 2 దంతపంక్తి ఈ రెండిటి పరముగ నర్థములు. 1 అముక ముకుందమహాప్త వర్గమై; అముక = ఈ (పురోవర్తియగు) ముకుంద = మోక్షమునిచ్చునట్టి నీ భర్తకు, మహాప్త వర్గము = మిక్కిలి

ఆప్తుల సమూహమై (బ్రాహ్మణ) 2 అముక = 'ము' కారము లేని = "ముకుంద" = 'ముకుంద' పదముతో అనఁగా 'కుందము' తో (మల్లె మొగ్గలతో) మహా + ఆప్తవర్గము (దంత) సత్ + ఆదృతమై = 1 మంచివారిచే నాదరింబఁడినదై లేక, ఎల్లప్పుడు నాదరింపఁ బడినదై. (బ్రాహ్మణ) 2 నక్షత్రములచే నాదరింపఁ బడినదై, నక్షత్రములఁ బోలినదై యనుట (దంత). శుచిమంతమై = 1 అగ్నిహోత్రము గలదై, లేక, శుచిత్వము కలదై (బ్రాహ్మణ) 2 తెల్లనిదై (దంత). ముక్తాకృతి = 1 ముక్త + ఆకృతి = మోక్షస్వరూపము (బ్రాహ్మణ) 2 ముక్తా + ఆకృతి = ముత్యములవంటి ఆకారము (దంత)

71. 89 :- జపాసదృక్ష = మంకెనపూవుతో సమానమైన, బీజాపూర విభ్రాంతిన్ = దానిమ్మపండులోని గింజలనెడు భ్రాంతిచే.

72. 92 :- కాననకౌముది = 1 అడవిఁ గాచినవెన్నెల, 2 క + ఆనన + కౌముది = బ్రహ్మదేవుని ముఖములకు వెన్నెల వంటిది. ని. కో, బ్రహ్మరాజ్ఞి లాత్మాగ్నావితి రత్నమాలా. అవనగుణ = 1వన గుణము లేనట్టి, అడవి కానట్టి; 2 రక్షణ గుణము గలిగిన, వనజ నిలయ = 1 అడవి యందుఁ బుట్టిన వారి యందుండునది. 2 పద్మము నందు వసించునది. అధికవనసంస్థితి = 1 గొప్ప అడవి యందుండుట 2 గొప్ప కవిత్వస్థితి, మొదటిది చిత్రార్థము, రెండవది వాస్తవార్థము.

72. 95 :- శుకలాలితము = శ్రీశుకమహర్షిచే వర్ణింపఁ బడినది. కింశుక = మోదుగుపువ్వు వలె లలిత మైనది.

72. 96 :- అధరజీవము = అధరోష్ఠమనెడు మంకెనపువ్వు ; ఈ రెండిట రెండర్ధములు; వివృతరాగము = 1 ప్రకటింపఁబడిన ఎఱుపు గలది (మంకెన) 2 ప్రకటింపఁ బడిన ప్రేమ గలది (అధర) విహృత పల్లవము = 1 విడిచి వేయఁబడిన చిగురు టాకులు గలది, ఆకులు లేనిది (మంకెన) 2 విరాగముచేత పరిహరింపఁ బడిన విటుఁడు గలది (అధర) ద్విజ + ఆవృతము = 1 పక్షులచే ఆవరింపఁబడినది(మంకెన)2దంతములచే నావరింపఁబడినది(అధర) అమృత వృత్తము = 1 వాడని తొడిమ గలది. (మంకెన) 2 అమృతమువలె వర్తించునది (అధర) అరుణ బింబ భేదము = 1 ఎఱ్ఱని దొండపండుతో భేదము నొందునది. అంతకన్న నెఱుపైనది (మంకెన)2 దొండపండుకన్న నందమైనదియు, సూర్యబింబ భేదముఁ గూర్చునది యనియు విష్ణుసాయుజ్యముఁ గూర్చునదియు. (అధర)

73. 97 :- భేదము = 1 విరోధము 2 రెండుపదములు విడివిడిగా నుండుట. సాధుపద వర్తనులు = 1 మంచిమార్గమందుండు వారు 2 వ్యాకరణ శాస్త్రజ్ఞులు, సంధి = 1 రాజీచేయుట 2 వ్యాకరణ సంధిచేయుట, అగ్రివర్ణము = 1 మంచికాంతి, లేక, మంచి కులము 2 మొదటి అక్షరమగు ఓకారమును. తదంతిమ వర్ణమున్ = 1 దానికంటె తక్కువ రకపుకాంతిని, లేక, దాని తక్కువ కులమును 2 దానిచివరి యక్షరమగు 'అ' కారమును.

73. 98 :- గుణోత్తరము = 1 గుణములచే శ్రేష్ఠమైనది. అధరము = 1 తక్కువది 2 పెదవి. ఉత్తరమునకు విరోధపదము అధరము. విరోధలక్షణావృత్తిచే అధరము అనునది తక్కువది యను

నర్థమును గాక ఉత్తరము = శ్రేష్ఠమైనది యను నర్థము నిచ్చు నని భావము. ఆదిమునులకు అమృత (మోక్షము) మిచ్చు విష్ణువు నకు అమృత పానేచ్ఛఁ గొలుపునది గాన అధరమను పేరుగలదైనను విరోధిలక్షణచే దానికే శ్రేష్ఠమైన దని యర్థము చెప్పుకొన వలసినదే.

74, 102 :- కనకాసురాంగ పాటన, ఖరములు = హిరణ్యకశిపుని శరీరమును చీల్చుట యందు వాడియైనవి; నఖరములు = 1 గోళ్లు 2 సార్థకములు ; న + ఖరములు = వాడియైనవి కానివి, మృదువైనవి అను నర్థముచే సార్థకములు.

74. 104 :- విధుపేరు = విధుఁడనుపేరు, విధుఁడు అనగా విష్ణువు, చంద్రుఁడుకూడ నర్థములే; గళాత్మదరమ్ము, క్రిందుగాన్ = కంఠరూపమైన శంఖము తనకు క్రిందనగు నట్లుగా, ముఖము క్రింద కంఠముండుటచే చంద్రుని కంటె శంఖము తక్కువయైనది యని భావము.

74. 105 :- కమలాక్షు, పాంచశర, జన్యమునన్ = 1 విష్ణుమూర్తి యొక్క మన్మథ సంబంధమైన యుద్ధమున, (రతివేళ) 2 'పాంచశరజన్యము' అనుపదమున అంతస్థ + ఊష్మ + ఉత్క్రమణము చేన్. లోపలగల "మణిత" మను పేరుగల రతికాలపు నిశ్వాసము బయలు వెడలుటచే లోపలి తాపము బైటకు వచ్చుటవలన, 2 "పాంచశరజన్యము" అను పదములోని అంతస్థవర్ణమైన "ర" కారము, ఊష్మవర్ణమైన "శ" కారము బయటకు నెట్టివేసినచో "పాంచజన్యము" అనుపదమైనది. అనఁగా విష్ణువు ధరించు శంఖ

ముతో నీగళశంఖము యుద్ధము సేయు చున్నదనుట. 'ఓశంఖమా' పాంచశరజన్యమున మన యిద్దరలో అంతస్స్థోష్మోత్క్రమణము। సమానమని లక్ష్మి కంఠము గర్జించుచున్నదని భావము.

74, 106 :- హితచక్రాహ్వాయము = తనకు మిత్రుఁడగు చక్రము యొక్క పేరును, చక్రవాకము అనుపేరును, స్వీయ + భుక్త + ముక్త + ఆహారమ్మును = 1 తానుతిని దిగఁబెట్టిన ఆహారమును 2 (ముక్తా + ఆహారము) తాను ధరించిన ముత్యాలదండను, స్తన శిరసులన్ = 1 స్తనము లనెడి తలలపైని 2 కుచాగ్రము లందు, లోకమున జయించినవాఁడు, ఓడిపోయిన వానిచేత, తన యెంగిలిమూటలను మోయించుట ప్రసిద్ధి.

75, 109 :- ఎపుడును = 1 తలక్రిందైనన్ను చివరి నుండి మొదటికి జదివినను, వర్ణవిపర్యయము = 1 కాంతి మార్పునొందుట, 2 కులము మారిపోవుట 2 అక్షరములు తారుమారగుట 'కన్దుక,' 'కఞ్చుక' పదముల చివరి నుండి మొదటికి జదివినను 'కన్దుక, కఞ్చుక' అనియే యగును. సుగుణులు = 1 మంచిగుణము గలవి, 2 మంచి దారములు గలవి, కుచకుభృత్తు = 1 కుచమను కొండ 2 కుచ మను రాజు. ఆద్యమున్ = మొదటిదగు కందుకమును మైత్రితోఁ జూచును, కుచములు కందుక సామ్యము నొందుచున్న వనుట, చరమమున్ = చివరిదైన కంచుకమును, తలఁజేర్చున్ = నెత్తిమీఁదఁ బెట్టుకొనును, కుచశిరస్సులచే ధరించు ననుట.

75, 111 :- 1 మహా + అక్షతములన్ = గొప్పవైన 'అక్షింత' లను 2 మహా + క్షతములన్ = గొప్పవైన నఖక్షతములను.

76. 112 :- భూభృత్ + యుగము = 1 పర్వతముల జంట 2 ఇరువురు రాజులు. ఔన్నత్యము = 1 పొడవు 2 ఉచ్ఛస్థితి. చక్రి = 1 విష్ణువు 2 రాజ్యచక్రమున కధిపతి, సార్వభౌముఁడు. కర + అర్పణము = 1 చేతుల నుంచుట 2 కప్పము చెల్లించుట.

76. 113 :- మహా + ఆహారము = 1 గొప్పఆహారము, మహా + హారము = పెద్దదండ.

76. 114 :- భూమిభృత్ + ఆళి = 1 పర్వతసమూహము 2 రాజసమూహము. 1 సూర్య + ఆశ్రితసాధు చక్రము = సూర్యునాశ్రయించి యోగ్యముగ జీవించు చక్రవాకపక్షి. చక్రవాకములకు పగలు సంయోగము, రాత్రి వియోగము కాన సూర్యునాశ్రయించి యుండును. 2 సూరి + ఆశ్రితసాధు చక్రము = పండితులతోఁ గూడి యుండు మంచివారి సమూహము. ఊర్ధ్వముగాఁగను = 1 నిక్కి బలిసి యుండును. 2గర్వించి మీదికిఁ జూచును.

76. 115 :- 1 అతను + ఆజ్య + వతీర్ణ బలము = విస్తారమైన నేయి వలన సంక్రమించిన బలము, 2 అతను + ఆజి + అవతీర్ణ బలము = మన్మథ యుద్ధము వలన సంక్రమించిన బలము. సుస్వాదుతర, పయః, ప్రబలశక్తిన్ = మంచిరుచియగు పాలు వలనఁ గలిగిన గొప్ప శక్తిని, 1బహుమహా + హార + సమృద్ధిన్ = అనేకములైన విలువగల కంఠహారముల సమృద్ధిని. 2 మహా + ఆహార సమృద్ధిన్ = గొప్ప ఆహారముల సమృద్ధిచే.

76. 116 :- గురుత్వము = 1 ఆచార్యభావము 2 బరువుగల్గుట. 1 పలు + కుభృత్తులు = అనేక పర్వతములు 2 పలుకు భృత్తులు = పలు

కులను ధరించువారు, అనఁగా పండితులు. క్షమాధర లక్షణము = 1 పర్వతముల లక్షణము 2 శాంతిని ధరించియున్న వారి గుణము.

శ్లో॥ వివేకవార్తా విరహేపి పద్మే ।
గురుత్వభాజోఽస్యకుచద్వయస్య ।
గిర్యుత్తమాబిభ్రతి శిష్యభావం ।
క్షమాధరాణాం క్షమమేతదేషాం ॥

'గిర్యుత్తమాః' అనుచోట, గిరి + ఉత్తమాః = మాటయందు, ఉత్తములు అనఁగా పండితులు అనియు, గిరులయందు (పర్వతములందు) శ్రేష్ఠమైన వనియు రెండర్థములు. మొదటి యర్థమున 'గిరి' 'గిర్' శబ్దమునకు సప్తమ్యంత రూపము. రెండవ యర్థమున 'గిరి' సమాసగత పదము. ఇట్టిది తెనుఁగు సేయుట దుర్ఘటము. 'పలుకు భృత్తులు' అను పదమున రెండర్థములు దెచ్చుట విశేషము.

77.117 :- చేతులనలిపినన్ = 1 యాచింపఁగా 2 చేతులతో మర్దింపఁగా, అతను దానము = 1 గొప్పదానము 2 మన్మథదానము.

77.118 :- ప్రహ్లాద జనకములు = 1 మిక్కిలి సంతోషకారణములు 2 ప్రహ్లాదునికి తండ్రియైనవి, హిరణ్యాచల సంపదలు = బంగారు పర్వతమగు మేరువుయొక్క ఘనతలు 2 హిరణ్యకశిపుని యొక్క తరుగని సంపదలు, ('నామైకదేశేనామగ్రహణమ్' అని యుండుటచే హిరణ్యపదమునకు హిరణ్యకశిపుఁడని యర్థము.)

77 . 119 :- అగస్త్యుఁడు కుంభసంభవుఁడు. అతఁడు ఖర్వుఁడు. కుంభమునఁ బుట్టినవాఁడు కాన ఖర్వుఁడు (హ్రస్వుఁడు) అగును, వింధ్యమును ఖర్వపఱచినవాఁడు గాన ఖర్వుఁడగును. కారణ గుణముచే కార్యగుణము నూహింపఁగా ఖర్వునిఁ గన్న కుంభము ఖర్వమే యగును. ఖర్వమగు కుంభముతో నీకుచసాదృశ్యముఁ జెప్పుటెట్లు ? అని కవి చమత్కరించెను.

78 . 124 :- సుదృక్ + ఆక్షిప్తులకు = 1 స్త్రీలచే నెట్టివేయఁబడినవారికి 2 మంచి వారిచే ద్రోసివేయఁబడినవారికి.

78 . 126 :- నీ స్తనయుగమ్ము సాహితీమదోత్కటము. 1 రెండును కలిసి యుండుటచేఁ గల్గిన క్రొవ్వుచే నతిశయించినది. 2 సాహితీ మద = విద్యామదము చేత, ఉత్కటము = అతిశయము నొంది నది. స్తనపరముగ, కవిసాహితీపరముగ రెండర్థములు : ఘటి కాశతోదయంబు. 1ఘటికా = కుండకంటె స్వార్థేకప్ 'ఇత్వంచ' శత = అనేకముల రెట్లు, ఉదయము = అభివృద్ధికలది; స్థౌల్యవర్తులత్వములచేఁ గుండలను మించినది యనుట (స్తన) 2 ఘటికా = ఒక గడియ కాలములో (24 నిమిషములు) శత = నూరు శ్లోకములయొక్క, ఉదయము = పుట్టుకకలది (సాహితి) ధన్యతమ కాంతగురు మహోదయము = 1 ధన్యతముఁడైన భర్తయొక్క గొప్పయుత్సవముయొక్క యుదయము కలది (స్తన) 2 ధన్యతముఁడైన వేదాంతదేశికాచార్యులనుండి బుట్టినది (సాహితి) క, వి, చక్రనిర్జయమును = నీటిపక్షులగు చక్రవాకము లను జయించుటను (స్తన) 2 కవులసమూహమును జయించుటను

(సాహితి) ఇందు సాహితి మూలగ్రంధకర్తృ సంబంధమైనది. శ్రీ వేదాంతదేశికులు వారిగురువులు.

79. 127 :- 1 సురత + రుచిరవిలాసునిగ = రతియందు చక్కని విలాసము గల వానినిగ 2 సుర, తరు + చిరవిలాసునిగ = కల్ప వృక్షముయొక్క శాశ్వతవిలాసముగల వానినిగా, దాతనుగా ననుట. 1 పృధుల + కుచయుగమున్ = పెద్దవైన స్తనముల జంటను 2 పృధు + లకుచయుగమున్ = పెద్దవైన రెండు నిమ్మపండ్లను, విభునకు = 1 భర్తకు 2 ప్రభువునకు. చాప లతను = చంచలబుద్ధితో, హిరణ్యాపహర్త = 1 హిరణ్యాక్ష హిరణ్యకశిపులను సంహరించినవాఁడు 2 బంగారమును దొంగి లించువాఁడు.

79. 128 :- ఉన్నమత్ + సరమయ్యు = పైకి ఎగయుచున్న హార ములు గలదైనను స్తనయుగము, కందుకమునన్ = బంతి విషయమై, అనున్న = తెగిపోని (నశింపని) మత్సరము = ఈర్ష్య గలది. బంతిని మించినదనుట. అంగగురుతా + ఉషితం బయ్యు = అవయవగురుత్వముతోఁ గూడినదయ్యును, స్థూల మైనదనుట, అనంగ + గురు + తోషితము = మన్మధుని తండ్రి యగు విష్ణువుచే సంతోషింపఁబడినది, విరోధాభాసాలంకారము.

79. 129 :- జగదీశుఁడు = జగత్ప్రభువు, 1 విష్ణువు 2 రాజు, జనార్ద నుఁడు = 1 శ్రీహరి 2 ప్రజాపీడకుఁడు, 1 ఉదగ్ర + హారమౌ = గొప్పకంఠహారములు కలదియౌ (స్తన) 2 ఉత్ +

అగ్రహారము = గొప్పవైన బ్రాహ్మణులకిచ్చిన ఈనాం గ్రామములు గలది. (రాజ్యమండలము.) కుచమండలాంతరమునన్ = స్తనములనెడు రాజ్యమండలమధ్య భాగమున, కర = 1 చేయి 2 పన్ను. హిరణ్యహర్త = 1 హిరణ్యాక్ష హిరణ్యకశిపులను నాశముచేసిన విష్ణువు 2 ప్రజల భాగ్యమును హరించురాజు.

79 . 130 :- గళహారమను స్వర్ధునీమతల్లి = కంఠహారములనెడు నాకాశగంగ, హారపరముగ ఆకాశపరముగ రెండర్థములు. 1 భోగ్య + ఆయతస్రక్సమంచితమగు, త్వత్కుచగిరీశమౌళిపైఁ బడుచు = అనుభవయోగ్యములైన, పొడవైన మాలికలచే నొప్పు నీ స్తనములను పర్వతశిఖరములపై నుండుచు (హార) 2 భోగి + ఆయతస్రక్సమంచిత = పెద్దపాముల మాలలచేఁ జక్కనైన, గిరీశ = శంకరునియొక్క, మౌళిపైన్ = శిరస్సుపై (ఆకాశగంగ) ఉద్వృత్తతను = 1 ఉన్నతమైన వృత్తాకారముతో (హార) 2 గర్వముతో (ఆకాశగంగ).

79 . 131 :- పితామహుఁడు = 1 బ్రహ్మ 2 తండ్రి తండ్రి 1 ముక్తాహారము = ముత్యాలహారము 2 ముక్త + ఆహారము = విడిచి పెట్టఁబడిన భోజనముకలది.

81 . 141 :- అనష్టాపదుఁడైనవానిన్ = 1 నష్టముకాని ఆపదలు కలవానిని 2 అష్టాపదము (బంగారము) లేనివానిని, దరిద్రుని. వేగ, నష్టా పదవాసుగాగన్, 1 వేగ = శీఘ్రముగా నష్టమైన ఆపదలు గలవానినిగ 2 వేఁగన్ = ప్రతిదినము తెల్లవారునప్పటికే, అష్టాపద + ఆవాసుగాగన్ = బంగారమునకు నివాసునిగ,

2 అష్ట + ఆపత్ + ఆవాసునిగ = అష్టకష్టములకు నివాసునిగ అని విరోధము కూడవచ్చును. బంగారమునకు నివాసునిగ నని పరిహారము.

శ్లో॥ అసావనష్టాపదమర్థినం ద్రాగ్ । గష్టాపదావాసమహోవిధాయ ।
ఆపత్కథాదూరగమర్థికన్యే । కరోతికల్యాణికర స్త్వదీయః॥

1 వేగన్, + అష్టాపదావాసు 2 వేగ + నష్టాపదవాసు, అని విఱిచినప్పుడు వేగ, = శీఘ్రముగా, నష్ట + ఆపదావాసుని జేసి యను మూలమునలేని యర్థముకూడ సిద్ధించినది,

82 . 142 :- స్వర్ణవత్త్వము = బంగారమును కలిగియుండుట 2 సు + అర్ణవత్త్వము = చక్కని సముద్రమగుటను, నదీనులు = 1 దీనులు కానివారు 2 నదీ + ఇనులు = నదులకు భర్తలు (సముద్రులు) లక్ష్మీకుమారులు = 1 లక్ష్మీదేవికి కుమారులు 2 భాగ్యవంతులు. లక్ష్మి సముద్రుని పుత్రిక. సముద్రుఁడే లక్ష్మీపుత్రుఁడగుట వింత. భాగ్యవంతులు అనునర్థమున వింత పరిహారమగును, లేక, లక్ష్మీకుమారులనునపుడు లక్ష్మి కుమారిగాఁ గలవారు సముద్రులు, అని చెప్పినను వింతపరిహారమగును,

82 . 143 :- మీన మకర రేఖావృతములు = 1 మీనములయొక్క, మకరములయొక్క పంక్తులతో నిండినవి (హ్రదములు) 2 మీన మకర ఆకారములతోడి రేఖలతో నిండినవి (హస్తములు) మధువర్ధక గృహములన్ = 1 తేనెను వృద్ధిచేయు తుమ్మెదలు పట్టు

కొనుటచే (అంబురుహము) 2 మధువను రాక్షసునియొక్క, వర్ధకుఁడగు = చీల్చినవాఁడగు విష్ణువు పట్టుకొనుటచే (హస్తము).

82 . 144 :- 1 స్వర్ణస్ఫురద్వివిధోర్మికంబు = బంగారుచేఁ బ్రకాశించు ననేకములగు నుంగరములు గలది. (కరము) 2 సు + అర్ణస్ఫురద్వివిధోర్మికంబు = చక్కని నీటితోఁ బ్రకాశించు ననేక తరంగములు గలది (రత్నాకరము) జనార్దన తేజము = 1 విష్ణుని పరాక్రమము 2 జనులను పీడించునదియగు మొసలియొక్క బలము; ఆక్రాంతభువనరాజి = 1 ఆక్రమింపఁబడిన లోకసమూహము కలది (విష్ణుతేజము) ఆక్రమింపఁబడిన నీటి చేతఁ బ్రకాశించునది (మొసలి).

82 . 145 :- పంచశాఖము = 1 చేయి 2 విశాలమైన కొమ్మలుగల చెట్టు. అమరెడు నీ పంచశాఖము = 1 ఒప్పునట్టి నీయొక్క హస్తము 2 అమరెడున్ + ఈ + పంచశాఖము = పురోవర్తియగు చెట్టు, ఒప్పును. చేయి, చెట్టుపరములుగ రెండర్థములు. అమలచ్ఛాయము = 1 స్వచ్ఛమైన కాంతికలది (చేయి) 2 చక్కని నీడగలది (చెట్టు). దానవారిపదపోషకమై, 1 దానవ + అరి + పదపోషకమై = దేవతలలోకములను గాపాడునదై, లేక, దానవహంతయగు విష్ణుపాదములను (సంవాహన కార్యముచే) పోషించునదై, 2 దాన = ఈయఁబడిన (పోసిన) వారి = నీరు, పోషకముగాగలదై, నీటిచే వృద్ధినందినదై (చెట్టు) సుమనః పరిపాలకమై = 1 మంచివారిని, లేక, దేవతలను పోషించునదై (చేయి) 2 పువ్వులను వృద్ధినందించునదై (చెట్టు).

33. 150 :- విధుఁడు = 1 చంద్రుఁడు 2 విష్ణువు.

33. 151 :- గోళ్ల పరముగా చంద్రపరముగా రెండర్థములు. అల = ప్రసిద్ధమైన, వారాశి = సముద్రునియొక్క, ఉన్నతసత్కుల = గొప్ప మంచికులమందలి, కన్యా = పుత్రికయగు లక్ష్మీదేవి యొక్క, శస్త = ప్రశస్తమైన. హస్త = చేతులయందు. గురుభాసితుఁడు = గొప్పగాప్రకాశించు వాఁడుగా, ఔన్ = అగును, విచిత్రాకృతిన్ = ఆశ్చర్యకరమగు రీతి, వెలయ, నఖ+ఆకృతిః = గోళ్ల ఆకారముతో, వెలుంగువిధుని = ప్రకాశించు చంద్రుని, నుతింపన్ = పొగడగా, తులన్ = సామ్యమును, కనఁడు = పొందఁడు. ఇట్టి చంద్రునిఁ బోల్ప నెవరును సరిగారని భావము. ఇది నఖాకృతినొందిన చంద్రపర మైన యర్థము. ఇఁక కేవల చంద్రపరమైన యర్థము:- రాశి+ ఉత్తమ = రాసులందు శ్రేష్ఠమైనదియు, సత్+కుల = నక్షత్రసమూహము గలదియు, కన్యా = కన్యారాశిచేత, శస్త = మేలైన, హస్తః = హస్తానక్షత్రమున, గురుభాసితుఁడు = గురునిచేఁ బ్రకాశించువాఁడు, లేక, గొప్పవాఁడుగా ప్రకాశించు వాఁడు. ఔన్ = అగును. తులన్ = తులారాశిని, కనఁడు = పొందఁడు. వి+చిత్ర+కృతిన్ = విడిచిన చిత్తానక్షత్ర కార్యముతో, వెలయన్ = ప్రకాశించునట్లుగా. న+ఖ+ఆకృతిన్ = (ఖే ఆకృతిః ఖాకృతిః, నవిద్యతే ఖాకృతిః నఖాకృతిః) ఆకాశమున రూపములేనట్లుగా, [అమావాస్యనాఁడు] వెలుంగుః = ప్రకాశించును. విధుని = ఇట్టి హస్తభాసితుఁడగు చంద్రుని, నుతింపః = కొనియాడగా; అలవా! = శక్యమా! (అలవి+ఆ. ఏమ్యాదులలోఁ జేర్చిన సంధియగును.)

శ్లో॥ విభాతివారాశివరేణ్య కన్యా । ప్రశ స్తహాస్తోల్లసితోనఖాత్మా ।
విధుర్విచిత్రాగమపవనూనం । నాసౌతులామేతి యతః కదాపి ॥

ఇందు 'విభాతివారాశి' అన్నపుడు ఒకర్థమున విభాతి + వారాశి అని విఱుగును. అప్పుడు 'వా' పదములోనిది, మఱొక యర్థమున, 'విభాతి + వా + రాశి' అని విఱుగును. ఇప్పుడు 'వా' అవ్యయము. ఇది దుర్ఘటశ్లేష, 'అలవారాశి' అను పదములో 'వా' ప్రశ్నార్థక ముగను, 'వారాశి' అనినపుడు 'వా' పదగతముగను, అనువాద మునను గుదురుకొనుట విశేషము.

153 :- హరిసమీక్షలఁ = విష్ణువీక్షణములచే, విష్ణుమూర్తి కన్ను లలో నొకటి సూర్యుఁడు, మఱొకటి చంద్రుఁడును· దాక్షిణ్య శాలి + ఆశ్రియ + ఉన్మిషితము, = 1 కుడి వైపుననున్న సూర్యా త్మక నేత్రముచేఁ బ్రకాశింపజేయఁబడినది. 2 దయగలిగిన వీక్ష ణముచేఁ బ్రకాశింపఁబడినది. అదాక్షిణ్య శాల్యాశ్రయముకుళితము = 1 ఎడమవైపున నున్న చంద్రాత్మక నేత్రముచే ముకుళింపఁబడి నది, 2 దయారహితమైన చూపునాశ్రయించుటచే మూసికొని పోవునది.

84 . 156 :- స్తనభూభృత్ + యుగము = 1 కొండలవంటి స్తనములజంట 2 స్తనములనెడు ఇరువురు రాజులు. ఆరు శతఘ్నిని = నూగారనెడు నూరుగుండ్లు పేల్చుమారణాయుధ మును, సజ్జఘనకుభృత్ స్థలమునన్. 1 సత్ + జఘన + కుభృత్ + స్థలమున = చక్కని కొండవంటి జఘనభాగమున 2 సజ్జ = సిద్ధమైయున్న, ఘన = గొప్పవారగు, కుభృత్ =

రాజులయొక్క 1 స్థలమునఁ = రాజ్యప్రదేశమున, నాభిగర్త
మును = బొడ్డు అనెడు గోతిని,

85 . 160 :- పంచ + ఇషు + ప్రథాప్రాప్తి = 1 అయిదు ఆయుధములు
గల వాఁడను ప్రసిద్ధినందుట 2 మన్మథుఁడను కీర్తినొందుట.

85 , 161 :- జీవనార్థము = 1 జలముకొఱకై 2 బ్రదుకుకొఱకై.

86 . 162 :- చషాలము = యూపస్థంభ శిరోభాగమందలి దారుమయ
మైన కడియము.

88 . 174 :- కాంచిన్ = 1 ఒడ్డాణమున 2 కాంచీపురమున, ఈ రెండిటి
పరముగ రెండర్థములు. సజ్జఘనకరిగిరి, 1 సత్ + జఘనకరిగిరి =
చక్కని జఘనమను 'కరిగిరి' యనుకొండ (ఒడ్డాణము)
2 సజ్జ = సిద్ధమైయున్న, ఘన = మేఘములుగల, కరిగిరి =
కరిగిరియను కొండ, (కాంచీపురము). పంచాయుధస్వామి =
1 మన్మథుఁడు (ఒడ్డాణము) వరదరాజస్వామి. (కాంచీపురము)
నాభియ = నాభియే. అనంతసరసి = అనంతసరస్సను పేరు
గల సరస్సు (కాంచీపురములోని సరస్సు) వళిధిష్ణ్యము = కడుపు
పై ముడుతలనెడు మూలస్థానములుగలది.

89. 177 :- మధ్యాత్మ = నడుము రూపమున నున్న, శబ్దగుణ =
ఆకాశము యొక్క, (వ్యాకరణజ్ఞుని యొక్క,) అంతికమున =
సమీపమున, కర్ణ + అభ్రిమునన్ = చెవులనెడు ఆకాశము నొద్దం

89. 179 :- 1 మేఖల = ఒడ్డాణము. 2 మే + ఖల. మేన్ = నీ శరీరము నందు, ఖల = నీచగుణము కలది. కాదె ! = కాదా ! అగుననుట. లేక, కాదుసుమా అని. అవును, కాదు అనికూడ రెండు భావములు: 'మేఖల' పరముగ, 'ఖల' పరముగ రెండర్థములు : మధ్యమ + ఆశ్రియమై = 1 నడుము నాశ్రియించినదై (మేఖల) 2 ఉన్నతులుగాని రెండవ రకము వారి యాశ్రియము గలదై (ఖల) నిజమణులన్ = 1 తన యందున్న రత్నములచే (మేఖల) 2 తన సంపదలచే (ఖల) పరిశమిత + ఉత్ + తమస్ + స్థానము = 1 పోఁగొట్టఁబడిన యున్నతమైన చీఁకట్లకు స్థాన మైనది (మేఖల) 2 పరిశమిత + ఉత్తమ + స్థానము = పోఁగొట్టఁబడిన మంచి వారి స్థానములు గలది (ఖల) 1 శ్రీ + మదన + ఆదరము ; శ్రీ = కాంతిచే, మదన = మన్మధుని యందు, ఆదరము = ఆదరముకలది, మన్మధోద్రేకముఁ గల్గించునది (మేఖల) 2 శ్రీమత్ + అనాదరము = శ్రీమంతుల యందాదరము లేనిది, (ఖల)

శ్లో॥ ఉపాశ్రితా మధ్యమ మద్రికన్యే ।
మణి పరిభాభిశ్శమితోత్తమ స్థితిః ।
అసౌ కృత శ్రీమదనాదరా రమే ।
న మేఖలా న పరిభాతి మే ఖలా ॥

ఇందు మొదటి 'మేఖలా' అనుదానికి ఒడ్డాణము అనునర్థము, రెండవ 'మే + ఖలా' మే = నాకు, ఖలా = నీచురాలు అనిపించుచున్నది, అనియర్థము. రెండవదానిలోని 'మే' షష్ఠ్యంత

పదము. తెనుఁగు సేఁతలో మే = [నీ] శరీరమందు. ఖల = నీచురాలు అని అర్థము చెప్పి మూలమునందు వలెనే 'మే' శ్లేషార్థమున సభంగాభంగముగఁ జూపఁబడుట విశేషము. శ్రీదేవీమేఖలను కేవలము 'ఖల' యనకుండ 'కాదె' యను పదముతో అవును, కాదు అను రెండర్థములు స్ఫురింపఁజేసి యౌచిత్యమును గాపాడుట మఱొక విశేషము.

89. 180 :- సుమధ్య = చక్కని నడుమునందు, తావకసువర్ణ సహిత సూత్రము = నీ బంగారు మొలనూలు. అనంతపాణినిహితము గాన ; అనంత = విష్ణుని యొక్క, పాణి = చేతితో, నిహితము = ఉంచబడినది, కాన, వృద్ధిగుణముల = పెక్కురెట్లు వృద్ధితో, ప్రకృతిశోభనమయి = సహజశోభ గలదై, సుశబ్దములన్ = ఆ మొలనూలి యందలి చిఱుగంటల యొక్క చక్కని ధ్వనులను : రెండవ యర్థము, సుమధ్య ! = ఓ చక్కని నడుము గలదానా ! సువర్ణ సూత్రసహిత సూత్రము = మంచి యక్షరముల తోడి వ్యాకరణ సూత్రము; అనంత, పాణిని, హితమయి = భాష్యకర్త యగుననంతునికి (పతంజలికి) సూత్రకర్త యగు పాణినికిఁ గూడ నిష్టమైనదై, వృద్ధిగుణములన్ = వృద్ధి గుణసంధుల చేతను, ప్రకృతి శోభనమయి = 'ప్రకృతి భావము' అను సంధిచేతను చక్కనిదై, సుశబ్దములన్ = చక్కని సుబంతతిజన్తశబ్దములను.

89. 181 :- కాంచి = నీ ఒడ్డాణము, కాంచియట్లు సెలంగున్ = కాంచీ పురము వలె మన్నది. ఒడ్డాణము, కాంచీనగరము రెండిట రెండర్థములు:- శ్రుతిమంజునాద యుతమై = చెవులకింపగు ధ్వనులతోఁ గూడినదై

(ఒడ్డాణము) 2 వేదముల యొక్క మృదు నాదముతోఁ గూడినదై (కాంచీపురము) సతమై = 1 శాశ్వతమైనదై 2 ఎల్లప్పుడు గలదై స + వలగ్న, నాభి, జఘన, ద్యుతివిస్తృతమై = నడుము, బొడ్డు, పిఱుదు అను వీనితోఁ గూడిన కాంతిచే విస్తరింపఁ బడినదై (ఒడ్డాణము) సవ, లగ్న, నాభిజ, ఘనద్యుతి విస్తృతమై = యజ్ఞమునందు సక్తమైన విష్ణు నాభియందుఁ బుట్టిన బ్రహ్మయొక్క గొప్పకాంతిచే విస్తరింపఁ బడినదై, బ్రహ్మ కాంచీపురమున అనంత సరస్సు నొద్ద యజ్ఞము నిర్వర్తించె నని పురాణవచనము. (కాంచీపురము) అనంతసరసి దృగతి హితమై, అనంత = విష్ణుని యొక్క, స + రసి = రసముతోఁ(ఆనందముతో)గూడిన, దృక్ = చూపులకు, అతిహితమై = మిక్కిలి యిష్టమైనదై (ఒడ్డాణము) అనంతసరసిన్ = అనంతసరస్సుచేత, దృగతిహితమై = చూడ మిక్కిలి జక్కనిదై (కాంచీపురము)

90, 183 :- కాంచిని = 1 ఒడ్డాణమున 2 కాంచీపురమున, రెండర్థములు :- సద్రత్నగణము = 1 మంచి రత్నసమూహము (ఒడ్డాణము) 2 మంచివారిలో శ్రేష్ఠులగు వారి సమూహము, (కంచి) అభిజాత దీప్తిమంతము = 1 ప్రశస్తమగు కాంతి గలది (ఒడ్డా) 2 మంచి కులమునఁ బుట్టిన జనులచేఁ బ్రకాశించునది (కంచి) వరదరాజ విరాజ కృపాంకురములు = 1 కోరికల నెఱవేర్చు నట్టి రాజులయొక్క దయాలేశములు, (ఒడ్డా) 2 వరదరాజ స్వామి యను దైవము యొక్క కృపాలేశములు (కంచి)

90. 184 :- అంబరమునకు శూన్య మర్థము కాన నడుమునకు అంబర పదము యొక్క అర్థముతోఁ బోలిక. లగ్నవాసము = కట్టు కొన్నబట్ట. శబ్దము చేతనే యంబరము, అనఁగా వాసమును 'అంబ రమును' పర్యాయపదములని భావము. అంబరమన ఆకాశము కూడ నర్థమే కాన మెఱుపు లాకాశమున నుండుట యిట నుత్ప్రే క్షింపఁ బడినది.

90. 185 :- అక్ష్యపదము = 1 అక్షి + అపదము = కంటికిఁ గనుపడనిది. 2 అక్ష్య = ఇంద్రియ గోచరమగు. పదము = స్థానము గలది. ఆకాశ మున వైభవము, (విభుత్వము) అనైంద్రియకత (ఇంద్రియ గోచ రము కాకుండుట) అను ధర్మములు రెండుగలవు. నడుము నందు వైభవమను ధర్మమును గూర్చి వివాదము లేదు. నడుము చక్షు ర్గోచరము కాకున్నను, అణు మాత్ర రూపము గలదగుటచే నాకాశ మునకున్న పూర్ణ ధర్మము లేదు. కాన ఆకాశమే నడుము కన్న కొంచెము గొప్పదని భావము. అణురూపమునఁ గనఁ బడునది కాన నడుమే ఆకాశముకన్న గొప్పదనియు చెప్పనగును. 'అంబరమ వరము' అనునప్పుడు అంబరము + అ = అంబరమ = ఆకా శమే. వరము = శ్రేష్ఠము, అనియు, అంబరము + అవరము = ఆకాశము తక్కువది యనియు రెండు విధముల విఱువ వచ్చును. 'అంబ రమే వర మంబర మేవ' అనుమూలము నందును, వరమ్, అవరమ్ అనివిఱువ వచ్చును. 'రమే + అవరమ్' అను నపుడు పూర్వరూప సంధివలన 'రమేఽవరమ్' అయి రెండర్థములు వచ్చును. ఇట్టిది తెనుఁగు సేఁత దుర్ఘటమైనను సాధింపఁ బడుట విశేషము.

91 . 187 :- నేత్రము = 1 కన్ను 2 వస్త్రము, నేత్రయుగము = 1 రెండు కన్నులు 2 రెండు బట్టలు. త్రినేత్రిత్వము = 1 మూఁడు బట్టలు కల్గియుండుట 2 ఈశ్వరుఁడగుట. ని. నేత్రిం వస్త్రేఽక్షిణి ఇతి రత్నమాలా. శంబరారికి = మన్మధునకు, సంపదాస్పదము = అభివృద్ధికి నివాసము. అదెట్లు = ఎంత ఆశ్చర్యము: త్రినేత్రుఁడు మన్మధ విరోధి. ఇఁట త్రినేత్రుఁడు మన్మధవృద్ధి కరుఁడగుట చిత్రము. నడుము మన్మధవృద్ధి కరమనుటవాస్తవము.

91 . 190 :- అత్యల్పభావ + ఆశ్రియము = 1 మిక్కిలి అల్పమైయున్నదని పించు భావము 2 మిక్కిలి నీచభావము, అతుల కల్యాణగుణ సమంచితము = 1 సాటిలేని శుభగుణములతోఁ గూడినది. 2 సాటిలేని బంగారు తీగెలతోఁ గూడినది. బంధనప్రాప్తి = 1 సంసార బంధము నొందుట. నీచభావములు కల్గుట సంసారబంధ హేతువు 2 కట్టబడియుండుట, నడుము ఒడ్డాణముచేఁ గట్టబడునది యని భావము.

91 . 191 :- వలగ్నము = నడుము, బలఘ్నసమము = ఇంద్రునితో సమానమైనది. నడుము, ఇందుృఁడు వీనిపరముగ రెండర్థములు. 1 తత్ = ఆ, సురా + అశన = అమృతాహారము విషయమై ప్రధన = రాక్షసులతోడి యుద్ధమునకు, నిదానతను = కారణమగుటచేతను (ఇందుృఁడు) 2 తత్ = ఆ, సు = చక్కని, రాశన = ఒడ్డాణము సంబంధమైన. ప్ర, ధన = ప్రకృష్టమైన సంపదకు [కాంతికి] నిదానతను = కారణమగుట చేతను (నడుము) 1 రుచిర = చక్కనైన, ఊరు = తొడలుగల, రంభా =

రంభయను వేశ్యయందు, సమాత్త = పొందఁబడిన, నేత్రి యుక్తతను = కన్నులు గలిగి యుండుట చేతను (ఇంద్రుఁడు) 2 రుచిర = అందమైన, ఊరు = తొడలనెడి, రంభా = అరటి బోదెల చేత, సమాత్త = పొందఁ బడిన, నేత్రియుక్త తను = వస్త్రములతోఁగూడి యుండుట చేతను (నడుము) 1, 2, ఉపేంద్ర = 1 విష్ణువునకు, 2 ఇంద్రుని తమ్మునకు. మోద + ఉత్సవతకు = సంతోషోత్సవములు గలవాఁడగుటచేతను,

92. 192 :- పరమము = 1 శ్రేష్ఠమైనది. 2 చివర 'మ' కారము కలది ('మధ్యమ' పదములో చివర మకారమున్నది.). ఆదిమము = 1 సనాతనమైనది 2 మొదట 'మ' కారముగలది. ('మధ్యమ' పదములో మొదట మకారమున్నది). మధ్యమము = 1 నడుము 2 రెండవ రకమైనది 3 నడిమియక్షరము మకారముగలది. మధ్యమత్వము = 1 రెండవరకము వాఁడగుట 2 నడుమ 'మ' కారముకలవాఁడగుట. 'అమర' (అమరసింహుఁడు, అమరకోశ మను నిఘంటువు వ్రాసినకవి) పదములో నడుమ'మ'కారమున్నది.

92. 193 :- మాధ్యమ క్రిమము అనుమాధ్యమక్రిమము, నడుమనెడి మాధ్యమిక బౌద్ధవాదమని రూపకము. కాంచీగతశ్రుతి మంజు సమంచిత శబ్దములన్ = 1 ఒడ్డాణమును బొందిన చెవుల కింపగు చక్కని ధ్వనులచే [నడుము] 2 కాంచీపురమునందలి వారి యొక్క వేదములందలి మనోహరములైన చక్కని మాటలచే (బౌద్ధవాదము) నిరాసాంచితమయ్యున్ = నాశముతోఁగూడినదైనను, ఒడ్డాణపు ధ్వనులచే భంగము నొందినదైనను నను నమట, (నడుము) 2 ఓడింపఁ

ఖడినదైనను (బౌద్ధవాదము) శూన్యవాదము = 1 శూన్యమైనది అనగా లేనిది అనుమాటను, లేక, ఆకాశసామ్యవాదమును(నడుము) 2 నాస్తికవాదమును (బౌద్ధవాదము).

92 . 194 :- 1 స్మృతిజన్మ = మన్మధునకు, మూలభూతమగు కతనన్ = పుట్టుకకు స్థానమైనదగుట చేతను 2 స్మృతి = స్మృతులయొక్క, జన్మ = పుట్టుకకు, మూలభూతమగు కతనన్ = ఆదికారణ మగుట చేతను, తత్పురస్తన గౌరవదర్శనమునన్ = 1 తత్ = ఆనడుమునకు, పురః = ఎదుట, స్తన = పాలిండ్లయొక్క, గౌరవ = బరువును, దర్శనమునన్ = చూచుటచేత 2 తత్ = ప్రసిద్ధులగు, పురస్తన = ప్రాచీనులగు వ్యాసాదులయొక్క, గౌరవ = గొప్పదైన, దర్శనమునన్ = శాస్త్రముచేత, మన్మధుఁడచటనుండి పుట్టినవాఁడగుటచే నడుము ఉన్నదని ఊహింపఁ బడుచున్నది. మఱియు పెద్దబరువైన పాలిండ్లభారము ఎదుటఁ గనిపించుచున్నదగుటచే దానిని మోయుటకు నడుముండి తీరవలె నని ఊహింపఁబడుచున్నది. కాని కనిపించుట మాత్రము లేదని భావము.

92 . 195 :- పంచమ భూతము = 1 పంచమస్వర మైన కోకిలధ్వని. 2 పంచభూతములలో నైదవదగు ఆకాశము.

93 , 196 :- వరజఘనము = శ్రేష్ఠమైన నీ కటిదేశము. ఇది బౌద్ధమత గురువుతోఁ బోల్పఁబడినది. కాన జఘన, గురుపరము లుగ రెండర్థములు. ప్రబుద్ధదీప్తమగు గురువు = 1 మిక్కిలి

తెలియఁబడునదై ప్రకాశించునదియు, పెద్దదియు నైనది (జఘన) 2 ప్రకృష్టుఁడైన బుద్ధదేవునిచేఁ బ్రకాశించుచు నట్టి ఆచార్య స్థానమున నున్నది. (గురు) 1 ప్రబల + అగమంబును = మిక్కిలి బలమైన పర్వతమును (జఘన) 2 ప్రబల + అగమంబును = మిక్కిలిగొప్పదైన వేదమును. (గురు) అంతేవసన్మధ్యము = 1 దగ్గఱనేయున్న నడుము (జఘన) 2 అంతే వసన్మధ్యముండు = శిష్యుఁడైన మధ్యముఁడు, మాధ్యమమను బౌద్ధవాదము గురువునొద్దఁ బఠించువాఁడు (గురు) ఉండు = తన యందున్న, శూన్యవాదమున్ = ఆకాశసామ్యవాదమును (జఘన) శూన్యవాదముఁ = నాస్తికవాదమును, (గురు) మూలమున 'మధ్యమః' అను పుంలింగ రూపమే, నడుము, మాధ్యముఁడు నర్థములు గలది. తెనుఁగున మాధ్యమిక వాది అనినపుడు మధ్యముఁడు అనియు నడుము అనునపుడు 'మధ్యమము' అనియు నుండవలెను. 'మధ్యము + ఉండు' అని మధ్యముఁడు అని విఱుపుతో 'మధ్యముండు' అని తెనిగించుట విశేషము.

93 : 200 :- ఇందు స్వర్గపరముగ, జఘన పరముగ రెండర్థములు; శ్రీహరి = ఇంద్రుఁడు (స్వర్గ) 2 విష్ణువు (జఘన) ప్రమదావహము = విశేషసంతోషమును గలిగించునవి (రెండర్థముల సమానము) నైకవిధనేత్రసంపదల్ = 1అనేకములైన (వేయి) కన్నుల సంపదలు (స్వర్గ) 2 అనేకవిధములగు వస్త్రసంపదలు (జఘన) శుభా + ఊరు, రంభా ప్రశస్తి = చక్కని తొడలుగల రంభయను దేవవేశ్యయొక్క గొప్పతనమును (స్వర్గ) 2 శుభప్రదములైన అరటి బోదెలవంటి తొడలప్రశస్తిని (జఘన) అత్యు

దారతః = 1 మిక్కిలి గొప్పతనమున 2 మిక్కిలి స్వర్గ ఔదార్యమున. (జఘన)

94. 201 :- కరము = ఏనుఁగు తొండము. కరభము = మనికట్టు మొదలు చిటికెనవేఁ్రలు మొదలు దాఁక గల చేతి వెలుపలి చోటు. దీనికి తొడలతోఁ బోలిక కవిసమయము. వర్ణంబులు = 1 కాంతులు 2 అక్షరములు. 'కరము' న కన్న 'కరభము'న నొక యక్షరము హెచ్చు. కరభము కన్న కరమొక యక్షరము తక్కువ.

94. 202 :- ఉరువులు = గొప్పవి. ముఖ్యవర్ణ దైర్ఘ్యము = 1 ముఖ్యమైన కాంతియొక్క దీర్ఘత్వము 2 మొదటి యక్షరమునకు దీర్ఘత్వము. 'ఉరువు' అను దానిలో మొదటి యక్షరమగు 'ఉ' కారమునకు దీర్ఘము వచ్చుట. అప్పుడు 'ఊరువు' అగును.

94. 203 :- కరస్థమున్ = 1 తనచేత నుండునదిగా 2 తొండమున నుండు నదిగా, మధుపతతికిన్ = 1 త్రాగుబోఁతుల సమూహము నకు 2 తుమ్మెదల సమూహమునకు, దానము = 1 ఈవి 2 ఏనుఁగుల మదజలము, దానికి = 1 దానము చేయువానికి, 2 ఆ ఏనుఁగునకు, కరభము = 1 చేతిమణి కట్టు మొదలు చిటికెన వేఁ్రలు మొదలువరకు వెలుపలి భాగము 2 గాడిద.

96. 212 :- బాలమిత్ర రాగభావము = 1 ఉదయకాల సూర్యుని వలె నెఱ్ఱఁ దనము 2 బాలకులందు స్నేహభావము. పల్లవత్వము = 1 చిగురుటాకుయొక్క స్వభావము 2 విటధర్మము.

శ్లో॥ బాలసఖిత్వ, మకారణ హాసం, ।
స్త్రీషువివాద, మసజ్జన సేవాం, ।

గార్దభయాన, మసంస్కృతవాణీం, ।
షడ్భిరుపైతి, నరో లఘుభావమ్ ॥

అని యుండుటవలన బాల సఖిత్వము పనికిరాదు.

97. 216 :- శుభతర లాక్షమై = 1 శుభములై, తరలములైన అక్షులు గలది (ఆస్యము) 2 శుభతరమైన లాక్ష (లత్తుక యను పాద లేపము) గలది. (పాదము) శ్రితవిశుద్ధతర ద్విజము = కూడి యున్న మిక్కిలి తెల్లని దంతములు గలది. (ఆస్య) 2 బ్రాహ్మణ శ్రేష్ఠుల నాశ్రయించినది (పాద) అంబుజ ప్రభకు = 1 చంద్రికాంతికి (ఆస్య) 2 పద్మకాంతికి (పాద) హిమరుక్ + ఆకృతి = చంద్రుని యాకారము, (ఆస్య) అహిమరుక్ + ఆకృతి = సూర్యుని ఆకారము (పాద) పాదములు బాల సూర్యుని వలె నెఱ్ఱగా నుండునని భావము.

97. 218 :- సురాగములు, సు + రాగములు = చక్కని యెఱుపు దనము గలవి. 2 సుర + అగములు = కల్పవృక్షములు, అంచిత పత్ర జాతంబులు = చక్కని చిగురు టాకుల సమూహములు 2 పూజింపఁ బడిన పత్తిరి (పూజ కుపయోగింపఁబడు బిల్వదళాదులు) గలవి, లేక మకరికాది రేఖలు గలిగినవి.

97. 220 :- ఉదారసందేహమున్, ఉ = లక్ష్మీ దేవి, దార = భార్యగాఁగల విష్ణుని యొక్క, సం + దేహము = చక్కని దేహమును, ఒంది = పొంది, రాగము = ఎఱుపుఁదనము, ఉదారసందేహములు = మీ యిర్వురలో నెవ్వరు గొప్పయను

పెద్ద సందేహములను, తమ్మలన్ = (తమ్మి + లు) = పద్మము లను, రతిబంధవిశేషములందు లక్ష్మీదేవి పారాణి పాదములు విష్ణువక్షమున నంటెను. లక్ష్మీవిష్ణువులలో నెవరు గొప్పవారు అను సందేహించు వారికి విష్ణువక్షస్థలము లక్ష్మీపాదములను మోయుచుండుటను జూచి నపుడు లక్ష్మియే గొప్పదని తోఁచునవి భావము.

221 :- హితహంసకము = ధరింపఁబడిన యందెలు కలది, హృత హంసకము = హరింపఁబడిన హంసగమనము గలది. విరోధా భాసాలంకారము.

222 :- హంసకయుగము = 1 కాలియందెల జోడు. 2 హంస మిధునము.

223 :- పాదముపరముగ, అర్కబింబపరముగ రెండర్థములు. 1 రాజిత, శోభన్ = ప్రకాశించు శోభతో, నఖ + ఆశ్రి తము = గోళ్లతోఁ గూడినది (పాద) 2 రాజితశోభన = ప్రకాశించునట్టి శుభమైనట్టి, ఖ + ఆశ్రితము = ఆకాశముతోఁ గూడినది (అర్కబింబము) తామసహరంబు = 1 తమోగుణమును బోఁగొట్టునది (పాద) 2 చీఁకటినిఁ బోఁగొట్టునది (అర్క) అంబు జాప్తము = పద్మమునకు మిత్రమైనది (రెండిట సమము)

227 :- అనిశమున్ = 1 ఎల్లప్పుడు 2 (నిశకానిది) పగటివేళ. నఖములయ్యెను = 1 నీ గోళ్ల రూపము నందెను. 2 ఆకాశ

మున లేని వయ్యేను, ఖంబు = ఆకాశము, నభంబు = 1 నక్ష త్రములు లేనిది 2 ఆకాశము.

99. 228 :- అమర + ఆళికా + అభిమతము = దేవతా సమూహమున కిష్ట మైనది, మరాళికా + అభిమతము = ఆడుహంసల కిష్ట మైనది, నఖర + అంశు + కాంతము = గోళ్ల కాంతులచే నంద మైనది, ఖర + అంశు + కాంతము = బాల సూర్యకిరణముల వలె నెఱ్ఱనికాంతి గలది. లేక, ఖ = ఇంద్రియమును (మనోనేత్రా దికము) ర = ఇచ్చునట్టి, భర్తకుమనోజ్ఞ మైనట్టి యనుట, అంశుక = కిరణములచే, కాంతము = సుందర మైనది. విరోధాభాసా లంకారము.

99. 229 :- సాధుచక్రమాన్యములు = 1 సాధువులగు వారి సమూహ ముచేఁ బూజింపఁ దగినవి, 2 సాధువులగు చక్రవాక పక్షులచేఁ బూజింపఁ దగినవి.

99. 230 :- పరాగము. 1 పర + అగము = అస్త్రాద్రి 2 పరాగము = రజస్సు.

100. 231. పరాగము = ధూళి. అపరాగము = 1 పరాగము కానిది 2 వైరాగ్యము, విరోధా భాసాలంకారము.

100, 232 :- త్వత్పదము = నీ పాద మనెడు నిన్ను దెల్పునట్టి శబ్దము [శ్లిష్టరూపకము] లక్ష్మీపాదము పరముగ, శబ్దము పరముగ రెండర్థ ములు : శుభావహము = శుభమును కల్గించునది. (రెండిట సమము) 1 సురాది మాన్యము = దేవతలు మొదలగు వారిచేఁ బూజింపఁ దగినది (పాదము) సుర + ఆది, = "సుర" అనుపదము మొదట

గలది. మా + ఆస్యము = 'సుర' అను అక్షరముల తర్వాత, 'మా' అను అక్షరము గలది. అనఁగా 'సురమా' అనుపదము. (సు = చక్కని, రమ = లక్ష్మి గలది.) విధుతోప సర్గము. 1 విధుత + ఉపసర్గము = నిరస్తమైన సృష్టి లేక ప్రకృతి, లేక, మాయ గలది. లేక ,నిరస్తమైన ఉత్పాతము గలది. లేక 2విధుత + ఉపసర్గము = విష్ణుత్వము యొక్క సమీపమున సృష్టికలది. విష్ణు శక్తితో సృష్టి నిర్వహించునది యనుట. 3 విధుత + ఉప సర్గము = నిరస్తమైన ఉపసర్గలు (ప్రాదులు) గలది. 'సురమా' అను పదమున 'సు' గాని 'ఆ' గాని ఉపసర్గలు కావు (శబ్ద) చారు వర్ణము = 1 చక్కని కాంతి గలది (పాద) 2 చక్కని అక్షరములు గలది. (శబ్ద) నీ పాదమునుపూజ చేసినను నీ పదమును జపము చేసినను అట్టివారికి; అరమా పదాకృతి, 1 అరము = అత్యంతము. ఆపత్ + ఆకృతిన్ = ఆపదల రూపమును [పాద] 2 అరమా + పద + ఆకృతి = రమాపద రూపవ్యతిరిక్తమును [శబ్ద] నెట్టివేయున్ = తొలగిస్తుందు.

100 . 233 :- రాగదములు = 1 ఎఱుపుకాంతి నిచ్చునవి 2 ప్రేమ నొసంగునవి, పరాగములు = లాక్షాధూళులు. అబ్జత్రపాదము = పద్మములకు సిగ్గునిచ్చునది, పద్మములమించినదనుట,

100 . 234 :- ద్విపదవిభుఁడు = 1 రెండుపాదములుగల మనుష్యులకు రాజు 2 ద్విప = ఏనుఁగులను, ద = దానము చేయునట్టి విభుఁడు = రాజు. చతుష్పదుఁడు = జంతువు.

101 . 236 :- ఈవు, స్వపితృ పితృ ప్రసూ. విధము లొప్పన్ . స్వపితృ = నీ తండ్రియైన సముద్రుని యొక్కయు, పితృప్రసూ = సాయం కాల సంధ్యయొక్కయు (ని. సంధ్యా, పితృప్రసూః ఇత్యమరః) విధములు = రీతులు, ఒప్పన్ = తగునట్లుగా, అలరుచుందువు. 1 లక్ష్మీపరముగను 2 సముద్రపరముగను 3 సాయంసంధ్యాపరము గను మూఁడర్థములు : 1 లక్ష్మీపరము :- పరమ కర + ఆవళి రమ్య = శ్రేష్ఠములైన చేతుల సమూహముతోఁ జక్కనిది. 'రలయోరభేదః'. పరమకలా + ఆవళిరమ్య = ఓంకారకళలచేఁ జక్కనైనది లేక, పరమ = విష్ణువునకు, క = సుఖమును, ర = ఇచ్చునట్టి, కరావళి (కర అనునది శ్లిష్టమగాన తిరిగి చెప్పవలెను.) చేతులచే నందమైనది. లేక, పరమకరా ! = శ్రేష్ఠములైన చేతులు గలదానా! వళిరమ్యవు = కడుపుమీఁది ముడుతలచేఁ జక్కనిదానవు. 2 సముద్రపరము :— పర = శ్రేష్ఠములైన, మకర + ఆవళి రమ్య = మొసళ్ల సమూహముచే నందమైనది. 3 సాయం సంధ్యాపరము :- పరమ్ + అకర + ఆవళి + రమ్య. పరమ్ = మిక్కిలి, అకర = సూర్యకిరణములు లేనిదై. (వబయోరభేదః) ఆ + బలి = అంతటను భూతబలి ప్రదానములచే లేక పూజోప కరణములచే, రమ్య. = అందమైనది (సాయంకాలము లందు భూతములకు బలిప్రదానము జరుపుట ప్రాచీనులయాచారము) లేక, పర = శ్రేష్ఠమైన, మ = పింగళ వర్ణమును, కర = చేయు నట్టిదై , రమ్య = అందమైనది, ని. మః పుంసి. బంధనే, పింగళా ఖిదవర్ణయోరితి రత్నమాలా. (లక్ష్మీ) సుబహురాగధరాధరశోభ = 1 మిక్కిలి యెఱుపురంగు ధరించు పెదవుల శోభగలది. లేక,

సుబహూరాగ, ధరాధర, శోభ = మిక్కిలి యెక్కువ ప్రేమ గల, ధరా = కొండను. ధర = ధరించిన (గోవర్ధనము నెత్తిన,) కృష్ణరూప విష్ణువునకు, శోభ = ప్రకాశ మైనది. 2 సముద్రము — (రలయోరభేదః) బహుల+అగ, ధరాధర, రమ్య = ఎక్కువ కదలికలేని మైనాకపర్వతముచే (ఇంద్రునుండి తప్పించుకొని వచ్చి దాఁగుకొనిన రమ్య = అందమైనది. లేక, ఎక్కువ కొండలను ధరించుటచే రమ్యమైనది. (సముద్రమునఁ గొండలుండు ననుట ప్రసిద్ధి) లేక, ఎక్కువ కొండలు కల భూదేవి ధరించుటచే నందమైనది. 'సముద్రరశ నాచోర్వీ' యని యుండుటచే భూమి తన్ను ఒడ్డాణముగా ధరించుటచే నంద మైనది. 3 సాయంసంధ్య:- బహూరాగ, ధరాధరశోభ = ఎక్కువ ఎఱుపును ధరించిన కొండల యందము కలది. 1 లక్ష్మి:- హంస, హారి, గతి = అందెలచే మనోహరమైన గమనముగలది. లేక, హంసల వంటి మనోహరమైన. గమనము కలది. లేక, హంస = విష్ణువునకు, హారి = మనోహరమగు, గతి = నడవడిక గలది. 2 సముద్రము :- హంసహారిగతి = రాజ హంసల యొక్క రాకపోకలు గలది; లేక, విష్ణువుయొక్క మనోహరగతి గలది. (విష్ణువు క్షీరసాగరశాయి యగుటవలన)3 సాయంసంధ్య:- హంస = సూర్యుని, హారి = అస్తమింపఁ జేయునట్టి గతి = ప్రవృత్తి గలది.

## 9 శృంగార స్తబకము

102. 1 :- శృంగార పదముచే శృంగార స్తబకము సూచితము.

103. 8 :- కుచేలసక్తుఁడు = 1 చినిఁగి పోయిన బట్టలు గలవాఁడు, 2 కుచేలునందాసక్తి గలవాఁడు. నీదానరతిన్ = 1 నీయొక్క దానాసక్తియందు 2 నీ యీవియైన (నీ వొసగిన) రతిని. లేక, నీదానన్ = నీదియైన, రతిన్ = సంభోగమున, ప్రమద + ఉరుగుణము = సంతోషము యొక్క గుణమును 2 ప్రమద + ఉరుగుణము = బలిసిన తొడల లక్షణము.

శ్లో॥ అంబత్వ మత్యంతము దారతోరు ।
చమత్కృతిం దర్శయితుం ప్రియాయ ।
అభ్యర్థయిత్రే ధృతమాత్మనాపి ।
కుచేల మిత్రాయ దదాసి చేలం ॥

1 ఇందు అత్యంతమ్ + ఉదారతా + ఉరు చమత్కృతి, అని యు, అత్యంతముదా + రత + ఊరు చమత్కృతి యనియు, విభజించినపుడు, ఒకర్థమున 'ముదా' అనునది తృతీయాంతము, మఱొకర్థమున (మ్ + ఉదా = ముదా) అందలి 'మ్' కారము అత్యంతమ్ లోని అంతిమ మకారమైనది. 'ఉదా' 'ఉదారతా' అను పదములోఁ జేరినది. ఇది అను అనువాదములో మఱొకరీతిగా 'నీదాన రతిఁబ్రమదోరుగుణము' అనిమలఁచఁ బడినది.

104, 13 :- మధ్యదేశము = 1 దేశమధ్యము 2 నడుము. చక్ర సంపద = 1 రాజ్యచక్ర వికాసము 2 చక్రవాకపక్షుల సంపత్తు. భూమిభృద్ద్వయము = 1 ఇద్దఱు రాజులు 2 కొండల జంట, అతను రణము = 1 గొప్పయుద్ధము 2 మన్మథ యుద్ధము.

106 . 19 :- చాపలత = 1 లతవంటి విల్లు 2 చపలగుణము.

106 . 21 :- ఇందు రెండర్థములు గలవు, మొదటిది :- మధురన్ = మధురానగరమున, మధు + అర్తికరిన్ = మధువనురాక్షసునకుఁ బీడఁగల్గించిన విష్ణువును: మాయమాటలు + ఆడి = లోఁబఱుచు కొనుటకు వంచనా శిల్పముగల మాటలు పలికి, లేక, మా + అ = మాయ = లక్ష్మీదేవియే. మాటలు + ఆడి = కబుర్లు చెప్పి, వశపఱుపన్ = వశముచేసికొనఁగా, అంతన్ = అటుపిమ్మట, అంగముల్ = ఇరువురశరీరములు, ద్వైతము = రెండుగా నుండుటను, ఎడలన్ = విసర్జింపఁగా ముందుమాటలతోఁదేలి తర్వాతరతివేళ శరీరములు పరస్పరాలింగనములచే నేకముకాఁగా; ముక్తా + ఆళి = ముత్యాలసమూహము, నిర్గుణమగును = దారముల నుండి వీడిపోవును. అంతఃకరణము = మనస్సు, హరణమొందున్ = లీనమైపోవును. ఆనందము + అందున్ = రత్యానందము గల్గును. రెండవది:- మధుర + మధ్వ + ఆర్తి + కరిన్ = మధురభక్తిభావ ప్రధానమగు మాధ్వమతమునకుఁ బీడఁగల్గించునదగు, అద్వైతమున, మాయ + మాటలు + ఆడి = అద్వైత మత మాయావాదమునుచేసి అంగముల్ = (జీవేశ్వరుల) కించిత్ జ్ఞత్వసర్వజ్ఞత్వాదులును, తత్త్వమస్యాది వాక్యములచే వశపఱు

పన్ = లోఁబడునట్లు చేయగా, ద్వైతము = ద్వైతమతము, ఎడలున్ = అప్రాప్తమగును. ముక్త + ఆళిన్ = ముక్తుల సంఘమునందు, నిర్గుణమగున్ = నిర్గుణపరమాత్మత్వమగును. అంతఃకరణ హరణమగు = 'అహంబ్రహ్మాస్మి' అను పరబ్రహ్మానుసంధానమున అమనస్కతి సిద్ధించును. ఆనందము + 1 అందు = బ్రహ్మానందాను భావముకల్గును.

శ్లో॥ మాయావాద్వైస్తవతు వశితే దేవి మధ్వార్తికారి।
ణ్యంగాభ్యాం వాం విగళితమభూ ద్ద్వైత మాలింగనేషు।
అభి ర్ముక్తావళిభి రచి రాన్నిర్గుణత్వం ప్రపన్నం।
వ్యక్తా చాంతఃకరణహరణా త్తాదృ గానందమూర్తిః॥

ఇందు 'మాయావాద్వైః' అనునపుడు ఒక అర్థమున 'మాయా' అనుదానిలోని 'యా' అనునది సమాసపదములోనిది. 'మాయాః' (లక్ష్మ్యైః) అనురెండవ అర్థమున అదే షష్ఠీవిభక్తి ప్రత్యయ మగును. 'మాయమాటలాడి' (1 మాయ 2 మా + అ) అను నను వాదమున రెండర్థములు ఘటింపఁబడుట విశేషము.

106. 22.- ఇందు రెండర్థములు : మొదటిది :- మధురరతికేళి యందు = మధురమైన రతిక్రీడయందు, అసమస్తనాగనాయక నిబంధనశ్రమన్: అసమ = సాటిలేని, స్తన + అగ + నాయక = స్తనములనెడు శ్రేష్ఠములైన పర్వతములయొక్క, నిబంధన శ్రమన్ = గాఢాలింగనమును. అందునప్పుడు, ప్రియతమ,

పాణి, నియంత్రిణమునన్ = భర్తయొక్క, చేతులవల్లనైన పీడనముచే, గాఢాలింగనవేళ కంఠమున భర్త చేతులు పెనవేయుటచే, నీదు గళమునుండి, సుశబ్దములు = మణితమను పేరుగల రతికాలధ్వనులు, కల్గును. రెండవయర్ధము: మధురతిన్ = చక్కని యుత్సాహముతో, కేళి = క్రీడ, అందన్ = కల్గునట్లుగా, లీలగాననుట, సమస్త, నాగ, నాయక = అన్ని సర్పములందు శ్రేష్ఠమైన పతంజలియొక్క, నిబంధన = రచనమైన వ్యాకరణ భాష్యమునందు, శ్రమన్ = అభ్యాసశిక్షచేత, ప్రియతమ = పండితులకత్యంత ప్రియుఁడగు. పాణిని = పాణిని యను సంస్కృత వ్యాకరణ కర్తయొక్క, యంత్రణమునన్ = సూత్రసంఘముచేత, సుశబ్దములు = సాధుశబ్దములు, కల్గును.

శ్లో॥ జలజాయతనేఽ సమస్తనాగప్రవరప్రౌఢనిబంధనశ్రమేణ।
ప్రియపాణినియంత్రితో చితాయా। స్తవ కంఠా దుదితా
స్తదా సుశబ్దాః॥

ఇందు 'జలజాయతనేఽసమస్తనాగ' అనునపుడు ఒకర్థమునసమస్త నాగ, అని మఱొక అర్థమున పూర్వరూపసంధివశమున 'అసమస్త నాగ' అని విఱుగును. 'జలజాయతనే' అనునది ప్రథమాసంబుద్ధ్యంతము. అనువాదమున 'కేళియందసమస్త', అను పదమున నొకర్థమున 'అసమస్త' అని, మఱొకర్థమున, 'సమస్త' అని విఱువఁబడుట విశేషము.

107 . 24:- ఇందు అతను సంగరములను అతను సంగరములందు 1 అనగా రతికేళులందు 2గొప్ప యుద్ధములందు రెండర్థములు, రతికేళిపరము:-

చంచలగుణులు = 1 కదలుచున్న దారములు గలవి, పయోధి జనులు = సముద్రమునఁ జన్మించినవి, లులితులు = ఇటునటు పొరలాడునవి. అత్రాసముక్తావళులు = త్రాసమను దోషములేని ముత్యాలసమూహములు గలవి. (ముత్యములలోని దోషమునకు త్రాసమని పేరు) రాజకరగ = చంద్రునికిరణములను పొందిన (చంద్రకిరణములవంటివి)నానా = అనేకములైన.హారరాసులజ = ముత్యాలదండల సముదాయములందు, ప్రకంపనము = మిక్కిలి కదలిక, అతను సంగరములందు = రతికేళులందు, కల్గెను. యుద్ధపరము:- చంచలగుణులు + అంబ + యోధిజనులు, అంబ = తల్లీ ! చంచలగుణముగలవారగు, యుద్ధభటులు, లులితులు = ఇటునటు తిరుగువారు, అత్రాస = భయము లేకపోవుటను. ముక్త = విడిచినవారును అనగా భయముగలవారును ననుట. అబలులు (వబయోరభేదః) = బలములేనివారును, రాజ = ప్రభువుయొక్క, కర = కప్పమును. గ = పొందిన, నానా = అనేకములైన, ఆహారరాసులన్ = ఆహారసమూహములుగల వారైన వారియందు, ప్రభువునకు పన్నుగట్టక హరించి ఆహారము గూర్చుకొనువారు అనగా రాజస్వము హరించు వారనియర్థము, ప్రకంపనము = మిక్కిలిడడ (వణఁకు) అతను యుద్ధము లందు = గొప్పరణములందుఁ, గల్గును.

శ్లో॥ చలద్గుణే ష్వత్ర పయోధిజాతే ।
    ష్వత్రాసముక్తావళిషు ప్రకంపః ।
    రమే సదా రాజకరాప్త నానా ।
    హారేషు యుక్తోఽ తను యుద్ధకాలే॥

ఇందు 'అత్రిపయోధి జాతేషు' అనుచో, పయోధిజాతులు, యోధి జాతులు అను విఱుపు 'చంచల గుణులంబయోధి జనులు' అను అనువాద పదములందు రాబట్టఁబడుట విశేషము.

107. 25 :- మాధవుఁడు = 1 వసంతఋతువు 2 విష్ణువు. రెండిట రెండర్థములు:- చంపక + ఆమోద మాతరిశ్వమ్ము = 1 సంపెఁగ పూవుల నుండి వచ్చిన పరిమళ వాయువు. (వసంత) 2. నాసికనుండి వచ్చు పరిమళ వాయువు (విష్ణు) (ఇట చంపకముచే ఉపమేయమైన నాసికను గ్రహింప వలెను.) అంబుజంబుల + అళికులము = 1 పద్మముసందుమ్మెదలు (వసంత) 2ము మున ముంగురులు (విష్ణు) (ఉపమానముచే నుపమేయము గ్రహింపఁ బడెను.) కదంబకోరక + ఉదయము = 1 కడిమి మొగ్గల పుట్టుక. (వసంత) వసంతమున కడిమిపూచుట చిత్రము. 2 పులకాంకురముల పుట్టుక (విష్ణు) (ఉపమానముచే నుపమేయ గ్రహణము) అనివార్యార్థము.

107. 26 :- ఇందురెండవ యర్థమున (మన్మథ యుద్ధమున) ఉపమాన పదములచే నుపమేయములను గ్రహింపగా వచ్చు నర్థములు. 1 అరుణబింబము = ఎఱ్ఱని దొండపండువంటి అధరోష్ఠము 2 ఉడురాజి = నక్షత్రములవంటి ముత్యములు. 3 మేరుశిరము = స్తనములపైనున్న మెడ, తిమిరవృతి = చీఁకట్ల యావరణము వంటి కేశపాశముచే. చంద్రుఁడు = చంద్రునివంటి ముఖము.

108. 30 :- ఉపాసింపన్ = పొందగా 2 సేవింపఁగా. అధరము = 1 పెదవి 2 నీచస్థితి గలది. నీరాగము = 1 ఎఱుపులేనిది 2 రజోగుణములేనిది, నిరంజనము = 1 కాటుకలేనిది 2 సంసార

బంధము, లేక, తమోగుణము, లేనిది. బంధముక్తి = 1 ముడి విడి పోవుట 2 సంసారబంధము వదలి పోవుట.

108. 33 :- అలిక, వళితములు = 1 నుదుటిభాగమునఁ జుట్టఁబడినవి. 2 అలి, కబలిత (వబయోరభేదః) = తుమ్మెదలచే గ్రసింపఁబడిన.

110. 41 :- అనిశము = 1 ఎల్లప్పుడు 2 రాత్రి కానప్పుడు, పగలు. పుష్పవతులు = 1 పూలు గలవి. 2 రజస్వలలైన. లతలు = 1 తీఁగెలు 2 లతలవంటి స్త్రీలు. రాగము = 1 ఎఱుపు 2 ప్రేమ. పల్లవ + ఆళి = 1 చిగురుటాకుల సమూహము 2 విటుల సమూహము. శ్రుతి శిరమ్ములన్ = 1 వేదాంతములందు 2 చెవుల యొక్క మీఁదుభాగములందు, సుమనోఽనుగతి = 1 పుష్పముల నుంచుట 2 మంచివారి ననుసరించునట్లు, ఆమోదము = 1 పరిమళము 2 సంతోషము.

110. 44 :- పయోధరములు = 1 స్తనములు 2 మేఘములు, ఆశ్లేష = 1 ఆలింగనము, 2 ఆశ్లేషానక్షత్రము; అధరయాచన = 1 తక్కువ వారిని యాచించుట. 2 అధరోష్ఠమును గోరుట.

111. 46 :- జాడ్యకర = మాంద్యము గలిగించు, గుణ + అద్భుతము = 1 సద్గుణములచే నద్భుతమైనది 2 త్రాళ్లచే నద్భుతమైనది.

## 10 ఐశ్వర్య స్తబకము.

113. 1. :- ఐశ్వర్య పదప్రయోగమున ఐశ్వర్యస్తబకము సూచితము.

114. 3. పాఠాంతరము :- శేషము = అప్రధానము, శేషి = ప్రధానుఁడు, సర్వజనరక్షకుఁడైన శ్రీమన్నారాయణుఁడు.

114. 4 :- గుణమునన్ = అనంత కల్యాణగుణముచేత. ప్రత్యక్త్వము = అహంప్రత్యయ గోచరత్వము. పరాక్త్వము = పరప్రతీత్యేక గోచరత్వము.

114. 5 :-1 నీ, యను + ఆరంభము = నీ యనుజ్ఞా పూర్వకమైన యారంభము; 2 నీ, యన్వారంభము = నీరక్షణతో యజ్ఞమునకు సంబంధమును సూచించు కుశాది సంగమనము.

115. 9 :- ఐశ్వర్యము = ఈశ్వరత్వము, ప్రభుత్వము.
"శ్లో॥ తత్సాన్ని ధ్యాన్మయాసృష్టం। తస్మిన్నారోప్యతేఽబుధైః॥"
"శ్లో॥ అనన్యారాఘ వేణాహం।" ఇత్యాది లక్ష్మీమహిమాప్రతిపాదక దృష్టాంతములు రామాయణాదులఁ గననగును.

# 11 క్షాంతి స్తబకము

118. 1 :- క్షాంతిపదముచే క్షాంతి స్తబకము సూచితము.

119. 5 :- ఆతరము = రేవు, అనఁగా నావదాటించినందున కిచ్చు సొమ్ము.

122 18 :- క్షమాధరవు = 1 శాంతిని ధరించినదానవు 2 పర్వతమవు. లక్ష్మీపరముగ, పర్వతపరముగ రెండర్థములు :- 1 దివ్యకృష్ణ + ఉపలాల్య + ఆకృతి = దివ్యుఁడైన శ్రీకృష్ణునిచేత లాలింపఁదగు రూపము కలది(లక్ష్మి). 2 దివ్య + కృష్ణ + ఉపల + అలి + ఆకృతి = చక్కని నల్లని రాళ్ల సమూహముతోఁ గూడిన ఆకారము

గలది. (పర్వత) సులలిత, మేఖలా + ఆభ = మిక్కిలి సుందరమైన యొడ్డాణపుకాంతి గలది. (లక్ష్మి) 2 మిక్కిలి యందమైన నడిమి భాగము యొక్క కాంతిగలది. (పర్వత) అతితర + ఉన్మేష + కటక + ధర = 1 మిక్కిలి ప్రకాశించు అందెలు ధరించినది (లక్ష్మి) 2 మిక్కిలి ప్రకాశించు నడిచఱియ ప్రదేశములు గలది. (పర్వత) వనమాలికా + మహాస్థాన + గత = 1 'తోమాలె' చేత గొప్పస్థానము వొందినది (లక్ష్మి) 2 వనపంక్తులయొక్క గొప్ప స్థానము నందినది (పర్వత)

## 12 ఉత్సవస్తబకము.

125. 1 :- ఉత్సవ పదప్రయోగముచే నుత్సవస్తబకము సూచితము.

135. 45 :- 1 సుధాన్యజనిని = సు + ధాన్య + జనిని = చక్కని ధాన్యము వలనఁ బుట్టినదానిని, 2 సుధా + అన్య + జనిని = అమృతము యొక్క మఱియొక జన్మకలదానిని. అమృతసదృశ మనుట.

## 13 వదాన్యతాస్తబకము.

137. 1 :- వదాన్యత్వపద ప్రయోగమున వదాన్యతా స్తబకము సూచితము.

137. 2 :- 1 రెండు నాలుకలు గలది పాము, ఆదిశేషువు, 2 మూఁడు నేత్రములు గలవాఁడు శివుఁడు, 3 నాల్గుముఖములు గలవాఁడు బ్రహ్మ. 4 నాల్గుకరములు గలవాఁడు విష్ణువు.

138. 5 :- లుబ్ధకవతంసుఁడు = 1 లోభులలో గొప్పవాఁడు, పరమలోభి 2 లుబ్ధకుఁడనగా కిరాతుఁడు, అనఁగా మాయాకిరాతుఁడైన ఈశ్వ

రుఁడు, ఆతనికి వతంసకుఁడు అనఁగా శిరోభూషణ మైనవాఁడు చంద్రుఁడు, చెట్టు = కల్పవృక్షము.

138. 7 :- హిరణ్య దానము = 1 బంగారము దానముచేయుట. 2 హిరణ్యకశిపుహిరణ్యాక్షులఁ జీల్చుట (నామైకదేశే నామగ్రహణమ్)

139. 9 :- ఉన్నతి = 1 పొడవు 2 గొప్పతనము, ఉత్తమము = 1 ఎక్కువతమోగుణముకలది, 2 శ్రేష్ఠమైనది. దానవారితరువు, 1 దాన + వారి + తరువు = దానమును నివారించునట్టి తరువు 2 దానవ + అరి + తరువు = దేవతల వృక్షము (కల్పవృక్షము)

139. 10 :- కామగవీ! = కామధేనువు వైనట్టి లక్ష్మీదేవీ; లక్ష్మీపరముగ, కామధేనువు పరముగ రెండర్థములు: లక్ష్మీపరము :- రుచిరశ్రీ వత్సజుష్ట రుచిరమ్యాక్షీ! = అందమైన శ్రీవత్సమను మచ్చతోఁగూడి విష్ణువునందు, ఆసక్తిగల చూపులుగలదానా! రచితాశ్రితసుశ్రీ = ఆశ్రితులకు చక్కని సంపదలిచ్చుదానా! గుణఖచిత = సుగుణములతోఁ గూడినదానా! ప్రవాల + అంఘ్రి = చిగురుటాకులవంటి పాదములుగలదానా! కామగవీ = కామధేనువవలెఁ గోర్కెలనిచ్చుదానా! కామధేనుపరము :- రుచిరశ్రీ, వత్స, జుష్టరుచిరమ్యా = చక్కని శోభగల దూడయందుఁ గూడిన ఆసక్తిచే నందమైనదానా! క్షీర చితా = క్షీరసమృద్ధి గలదానా! శ్రితసుశ్రీ = పొందియున్న చక్కని శోభగలదానా! గుణఖచిత = త్రాటిచేఁగట్టబడినదానా! ప్రవాలాంఘ్రి = పెద్ద తోఁకతోఁగూడిన పాదములు గలదానా! పాదములంటుతోఁకగల దనుట. కామగవీ = కామధేనూ!

139 . 11 :- పలము = 1 మూఁడు తులముల తూకముగలది 2 మాంసము. కళ = 1 పదునారవభాగము 2 చంద్రునికళ. విషము = 1 విషము 2 నీరు.

139 . 12 :- సుమితము = 1 మిక్కిలి యల్పమైనది. 2 పుష్పితమైనది ఘనుఁడు = 1 గొప్పవాఁడు 2 మేఘుఁడు, అప్రదాత = 1ఎక్కువగా నీయనివాఁడు 2నీటినిచ్చువాఁడు, అపార్థకరుణుఁడు = 1 ధనమీయక కరుణ చూపువాఁడు. 2 అర్జునునియందు దయలేని వాఁడు, కుదాత = 1 చెడ్డదాత 2 భూమినిచ్చిన వాఁడు. హిరణ్య హారి = 1 బంగారము హరించినవాఁడు 2 హిరణ్యాక్ష హిరణ్య కశిపులను సంహరించినవాఁడు.

140 . 13 :- నీడుతనువు కల్పకమౌనుగాదే. లక్ష్మీశరీరపరముగ, కల్పవృక్ష పరముగ రెండర్థములు. మధుకాలయోగము = 1 మధువను రాక్షసునకునాశకుఁడగు విష్ణువుతోడి సంబంధము (లక్ష్మి) 2 వసంత కాలముతోఁ గలయిక (కల్పవృక్ష) భవ్యశాఖాశత + ఉద్యత్ + సుపర్ణ + వాహము = 1 భవ్యములైన అనేక శాఖలచేతఁ బ్రకాశించు గరుత్మంతుఁడే వాహనముగాఁగలది, గరుత్మంతుఁడు వేదవ యుఁ డని ప్రసిద్ధి. (లక్ష్మీశరీరము) 2 చక్కని యనేకములగు కొమ్మ లయందు ప్రకాశించు చక్కని ఆకులను వహించునవి (కల్పవృక్ష). ఫలమ్ములు = 1 కోరికలు, 2 పండ్లు,

## 14 యమక స్తబకము

ఈ స్తబకమునందు యమక సిద్ధికొఱకు అముఖ్యభావములందు ననువాదము నొంతపదమ్ములతో స్వతంత్రముగా రచింపఁబడుట విశేషము.

142 - 1 :- యమకపదప్రయోగముచే యమక స్తబకము సూచితము.

144 - 9 :- సుమనోజనున్ = మంచి మనస్సుతోఁ బుట్టినవానిని, సుజనుని,

144 - 10:- 1 మాపురేపు + ఈడనము = రాత్రింబగళ్లు స్తోత్రము చేయుట.

144 - 13 :- నాళీక, నాళీక, జనని; నాళీక = పద్మము. నాళీక = బాణముగాఁగల మన్మధునికి. జనని ! = తల్లియైనదానా

145 - 14 :- నాళికేళములు = కొబ్బరిచెట్లు, వనాళి కేలన్, వన + ఆళిక + ఇలన్ = వనపంక్తులయొక్క భూమిని.

145 - 15 :- గోపాలుని = కృష్ణుని, గోపాలునిగన్ = గో = (నీ) మాటను, పాలునిగన్ = పాలించువానినిగా, నీమాట మీఱని వానినిగా.

145 - 16:- ఏదియో = ఏదోయొక నామము, గిరాజపరముని, గిరా = వాక్కుచే, జప = జపమునందు, రముని = ఆసక్తికల వానినిగా,

145 - 17:- పరిహసిత + అమర + సాల + యమకము = పరిహసింపఁ బడిన కల్పవృక్షముల జంటగలది. భూ + మా + గముఁడు = భూలక్ష్మిని పొందినవాఁడగును.

146 - 21 భవనాశనము = జనన మరణనాశనము, భవన + అశనము = ఇంటిలోపలభోజనము.

147 - 24 :- హితవు = మేలుచేయుదానవు, అవహిత + అహి + మహి తవు; అవహిత = ఎచ్చరికగల, అహి = (శయ్యయగు)

ఆదిశేషుఁడే. మహితవు = గొప్పదానవు, అహితవిహితవు, అ = విష్ణువునకు, హిత = మేలుకోరకై, విహితవు = విధింపఁబడిన దానవు: రమవు = మనోజ్ఞమైనదానవు, పరమవు = శ్రేష్ఠురాలవు, ఉపరమరమవు = శాంతిప్రియవు.

147. 25 :- అరమరము + అర + మరి + అమరము + అ, అరమరము = (మాకు) సందేహము, అరన్ = నశింపఁగా, మరి = ఆపైని, అమరము + అ = (చావులేనిదే) మోక్షమే. నీదయగల్గిన నిస్సందేహముగా మోక్షముమాకుఁ గల్గునని భావము. నీకు దయలేక యున్నచో, మాకు, అరము + అరమరము + అర + మరము + అ, అరము = శీఘ్రముగా, అరమరము = సందేహము, అరన్ = నశింపఁగా, మరము + అ = మరణముగలదే. తిరిగి తిరిగి జననమరణములు గల సంసారము మాత్రమే సిద్ధించునసుట. మార్గము = వేఱుదారి, అగుపడున = కన్పించునా! నీ దయ లేనిచో మాకు జననమరణ మార్గము తప్ప వేఱు మోక్షముఁగూర్చునట్టి దారిలేదనుట.

147. 26 :- మన్మనోధ్వాంత, లోప + అహిమాంశు + రూప = నా మనసులోని చీఁకట్లను పోఁగొట్టునట్టి సూర్య స్వరూపురాలా!

147. 27 :- మంద + అరా! = మెల్లగనడుచువానా! మంద + అర + అమంద + అర, మంద = శనిగ్రహము యొక్కయు, అర = కుజగ్రహము యొక్కయు, అమంద = హెచ్చైన, అ = స్థానములకు, రా = అగ్నివంటిదానా! శనికుజతీవ్రతల

నెఱఁచు దానా యనుట. శేషశైలమందారము = శేషాచలమందుఁ గల్ప వృక్షము వంటిదానా! మా = లక్ష్మి! మంద + అర + అమంద + అర + అమంద + ఆ + రా ; మంద + అర = మందముగఁ జరించు వారిని, తక్కువ వారిని, అమంద + అర = చురుకుగఁజరించు వారిని, ఎక్కువ వారిని, అమంద = తక్కువ కాకుండునట్లుగా, ఆ = సమగ్రముగా, రా = స్వీకరించుదానా! నీ భక్తులలో మందులు, నమందులునగు వారిని సమముగా గ్రహించుదానా!

148. 27 :- స + ఆరావ + ఆసార + ఆవాస + అర + ఆ + వ + ఉరగనగము ; స + ఆరావ = ధ్వనితోఁ గూడిన, ఆసార = వర్షములకు. లేక, పాపనాశన్యాది సెలయేళ్లకు, ఆవాస = నివాసములైన, అర = శిఖరములను, ఆ = (సమంతాత్) అంతటను, వ = (వాతిగచ్ఛతీతి వ) పొందిన, ఉరగనగము = శేషాచలము, లేక, సారావ = ధ్వనిగల, ఆసార = పాపనాశన్యాది సెలయేళ్లకు, ఆ = నివాసస్థాన మైనదియు, వాసార + ఆ + వ + ఉరగనగము, ఉ + ఆ + సార = వాసార ('ఇకోయణచి' యనుసూత్రమున, ఉ + ఆ = వాయగును) ఉ = లక్ష్మీదేవి యొక్క, ఆ = సమగ్రమైన, సార = బలమును, ఆ = పూర్తిగ, వ = పొందిన, ఉరగనగము = శేషాచలము.

148. 29 :- క్లాంత, నర, కాంతన్ = బడలియున్నట్టి నరులకుఁ గోరఁదగిన దానిని, నరక + అంత + కాంతను = నరకాసురుని చంపిన విష్ణునకు భార్యవగు నిన్ను.

149. 36 :- ఉదధికన్యా + ఆయత + అపాంగము = లక్ష్మీదేవియొక్క విస్తారమైన క్రీఁగంటి వీక్షణము, ఉత్ + అధిక + న్యాయతా + ప + అంగుఁడు, ఉదధిక = మిక్కిలి హెచ్చయిన, న్యాయతా = నీతిధర్మమును. లేక, న్యాయశాస్త్రమును. ప = రక్షించునట్టి, అంగుఁడు = శరీరము గలవాఁడు, లక్ష్మీ కటాక్షమున్న,న్యాయ వంతుఁడును,న్యాయశాస్త్రజ్ఞుఁడు నగుననుట,

150. 37 :- నరక + ఆళిని = నరకలోక సమూహమునందు, నీసేవా నరక + ఆళి = నీ సేవయందలి నరసమూహమును, నీభక్తులను,

150, 38 :- కారాకల్పము = కారాగృహముతో సమానమైనది. సతత వికార + ఆకల్పము = ఎల్లప్పుడు వికారముల యొక్క పన్నుగడ కలది.

150, 40 :- మధ్యమతారకవర్ణా = తారకమంత్రాక్షరములలో నడిమి యక్షరము గలదానా ! 'శ్రీం, రాం, రామాయనమః' అను తారక మంత్రములో నడిమి యక్షరమగు 'మా' అనుదానికి లక్ష్మీ యర్థము.

150. 41 :- హృత = అపహరింపఁబడిన, సత్ + అరి = సత్పురుషులకు శత్రువులగు వారి యొక్క, ద్రవ్యా = ధనము కల దానా ! సత్పురుషుల కపకారము చేసిన వారిసంపదలను హరింతు వనుట.

151 . 42 :- కచ = కేశములచే. జిత = జయింపఁబడిన, ఉత్ప్రభ = మిక్కిలి నీలకాంతిగల, వనద = మేఘములుగలదానా ! అగ

ములు = దోషములు, అనభిభవన = తిరస్కారములేని, దయాగుఁడు = దయనుపొందినవాఁడు, త్రోసివేయకుండ దయతోఁ జూచువాఁడు.

151. 43 :- ధీరాజయతినుతన్ = బుద్ధితోఁ బ్రకాశించుయతులచేఁ గొని యాడఁబడు దానిని. ధీ, రా, జయ, తీవ్రతకు = బుద్ధి, ధనము జయము, వీనియొక్క ఆధిక్యమునకు, సుధీ = చక్కని బుద్ధిగల దానా, రా = రమ్ము, జయ = పార్వతి,

151. 44 :- ఆయతనము = గుడి, పూజా + యతనము = పూజా ప్రయత్నములు. అసమాన + అయతన్ = సాటిలేని శుభ త్వమును.

151. 45 :- ఉరగవృషభాగవతి = శేషాచలము, వృషభాద్రి యనుపేరు గల వేంకటాచలమునందుండుదానా! అతి, పరభాగవతీ = గొప్ప గుణోత్కర్ష కలదానా! ని. పర, భాగోగుణోత్కర్షః ఇత్యమరః॥ పరభాక్ + అవతీ; పర = శ్రేష్ఠుఁడైన విష్ణువును, భాక్ = పొందినవానిని, అవతీ = రక్షించుదానా! పరభాగవతీయము = శ్రేష్ఠమైన భగవత్సంబంధమైనది.

151. 46 :- ఆచార్యము = ఆచరింపఁదగినపని, వననిధితనయా = లక్ష్మియందు, చార్యముగ = చరించునదిగ, ఆర్యా = పార్వతి, తనరించుటచేఁ = చేయుటచే, పార్వతి తాను చేయుప్రతిపని లక్ష్మిసేవాకార్యమే యగుట చేతనే, అనయ + ఆచారుఁడు = శ్మశానమునఁ బిశాచములతోఁ దిరుగు అమంగళకరుఁడగు వాఁడు;

ఈశ్వరుఁడు, హిమనగతనయా = పార్వతియందు, చారి = చరించునట్టి, అంతరంగ = మనస్సును. ధరుఁడై = ధరించిన వాఁడైన కారణమున, శివుఁడౌ = మంగళకరుఁడగును.

152 , 47 :- ప్రథిత + అమాయతమై = ప్రసిద్ధమైన విజ్ఞతతో,

152 . 49 ;- దారుణ్యము, దారుణభావము. కాఠిన్యము; తారుణ్య + ఆరుణ్య కిరణతతి = లేఁతసూర్యసంబంధమైన కిరణసమూహము, ఆరుణ్యము = ఎఱుపురంగును, తారుణ్యక్రీడ = యౌవన సంబంధమైన క్రీడ

152 . 50 :- యమునా = పార్వతి, యములు. (యమి + లు) = మునులు, కుసుమవాణీయములు = 'వబయోరభేదః' కుసుమబాణీయములు = మన్మధసంబంధమైన వానిని, వాణీయములు = మాటలకు సంబంధించినవగు, పాపలవ + అణీయములు = పాపములయొక్క లేశాతి లేశములను.

152. 51:-మహః + అపకార + అతి + శమ్ + అస్తదాయీ, మహః = నీయుత్సవములకు, అపకార = చెఱుపుచేయువారియొక్క, అతిశమ్ = మిక్కిలి శాంతిని, అస్తదాయీ ! = నాశము నొందించుదానా ! తాయీ ! = తల్లీ ! మ...స్ధన్, మహా = గొప్పవారైన, ఉపకార = పరోపకారులగు, అతిశమ = మహాశాంతిమంతులయందు. ఆస్థన్ = కోరికతో, లేక, ప్రియత్నముతో, అహో ! = ఆశ్చర్యము, దయాసారము మాటన్ = 'దయా' వృష్టితోఁగూడిన మాటచేత మ...మున్, మహా = గొప్ప.

ఉదయ = అభివృద్ధులయొక్క, ఆసారమున్ = సంపూర్ణ సారమును, మాటన్ = అతుకునట్లుగా, ఈవే = ఓవే ఈవే = ఈయవా! గొప్పగా పరోపకారులై శాంతులైన వారికి బహు ప్రియత్నముతో దయార్ద్రమైన నీ యొక్క మాటతో సమస్తాభివృద్ధులు గల్గఁజేయుదువని భావము.

53. 52 :- సురక్ష = చక్కని రక్షకురాలా! మా...క్ష. మామక = మాయొక్క, అసు = ప్రాణములకు, రక్షన్ = రక్షణమును, మామకా! = మాకు సంబంధించినదానా! అ...తిన్. ఆసుర = అసురసంబంధమైన గుణములయొక్క, క్షయ = నాశముయొక్క, ఉద్భూతిన్ = పుట్టుకను, చూడన్ = చూడఁగా కల్గినచో ననుట. సు...నిన్ సుర = దేవతలయొక్క, క్షయ = నివాసమగు స్వర్గమును చూడనౌన్ = చూడఁగలము. పాపక్షయమైనచో స్వర్గవాసము గల్గుననుట, ఔనా! = ఇదినిజమేనా! నిజమేయనుట.

153. 53 :- నీ కన్నుల సరిన్ = నీ చూపులతో సాటియైనదానిని, నాకు + అమ్మ = తల్లీ! నాకు, నా కమ్మ = దుఃఖములేని స్థితి. నీకు + అన్నులన్ + సరిఁ + కానము = స్త్రీలయందు నీకు సాటియగు వారినిఁ గానము. నాకమ్మ + అ, నీదుదృష్టిన్, నాకమ్మ = స్వర్గము, అ = సుప్రసిద్ధమైన, నీదు దృష్టిన్ = నీ చూపుచేత, నాకమ్మ + అ = దుఃఖములేనిదే అగును. నీ చూపు చేతనే స్వర్గమునకు దుఃఖమనునది లేనే లేదు. నాకును నీచూపుచే దుఃఖస్థితిలేకుండును అని భావము.

153. 54 :- జననీ ! వైరమ్ము+అ+కారణమ్ము ; వైరమ్ము = శత్రుత్వము, అ = యుద్ధమునకు, ని. అకారోఒబ్రహ్మవిష్ణీశకమఠేష్వంగణే రణే, ఇతి రత్నమాలా. వైర+ఆగము శత్రుత్వమునకైన మా అపరాధము, విభునిమదినిఙ్ = విష్ణువుయొక్క మనస్సునందు, వడిన్ = త్వరగా, తగన్ = యుక్తముగా, చనన్ = పోవునట్లుగా, ఉరువై = గొప్పదై, రాగము = అనురాగము, విభుని మదినిఙ్ = విష్ణుమనస్సునందు, వడిన్ = శీఘ్రముగా, తగన్ = ఒప్పియుండునట్టి రీతిగా. నీవై = నీయంతట నీవే, అకారణమ్ము = కారణము లేకుండ, మేము పిలువనక్కఱలేకుండ, రమ్ము = భర్తృసన్నిధికిరమ్ము. శత్రుత్వమునకు అపరాధము కారణము. శత్రుత్వమున్న హింసాపూర్వకమగు యుద్ధము తప్పదు. కాన మేము చేసిన తప్పులను విష్ణు మనస్సునుండి తొలఁగి ఆతనికి అనురాగము కల్గునట్లు ఓ తల్లీ ! నీయంతట నీవే అతని సన్నిధియందుండి చెప్పి రక్షింపుమని భావము.

153. 55 :- సమస్త చర్యలన్ = అన్నిపనులందు, రక్తిఙ్ = అనురాగమును నించుదే ! = నిండించెదవుగదా ! దేవి = వెదకి వెదకి, సమస్త చర్యలన్, విరక్తి = వైరాగ్యమును, నించు = నిండించుము; నిష్కామయోగమును సిద్ధింపఁజేయుమనుట. స+మస్త చర్యలఙ్ = శిరసావహించి చేయు నీ సేవాకార్యములందు రక్తి = అనురాగమును. నించు = నిండించుము.

154 . 56 :- రాజీవ+ఆయతనా = పద్మనివాసినీ ! కృప = నీదయ. రాన్ = వచ్చినచో, జీవ+ఆయతనములను = ప్రాణికోట్ల గృహములందు, రాజీవ+ఆయత+నయనుఁడు = విష్ణువు. రాజు. ఈవు+ఆ+అతనుణ్+ కన్నరాజ్ఞివి. నీవు ఆ మన్మధునిఁ గన్న పట్టమహిషివి.

154 . 57 -: మా = లక్ష్మి ! మార. వితారకమును = మన్మధుని బాఱి నుండి విశేషముగా తప్పించునదియును. (లేక. వితా = వ్యర్ధముగా. రకము = మఱియొక విధము, మారణ్ = మారిపోను అన్యమతమునొందను) పరము = శ్రేష్ఠమైనది. ఆరవితారకము = సూర్యుఁడు నక్షత్రములుండునంత కాలము, అభిమతార్ధప్రదముణ్ = కోర్కెలను తీర్చునదియును. రవితారకము = జీవునిఁదరింపఁజేయునదియు, అఘమారవితారకము అఘ = పాపమును మార = నశింపఁజేయుట యందు (లేక. అఘము = పాపము, ఆరన్ = నశింపఁగా) వితారకము = విగతమైన తారకమంత్రముగలది. తారకమంత్రము కంటెఁగూడ విశేష పాపతారకమైన దనుట. లేక, విశేషముగా తరింపఁజేయునది.

154 . 58 :- 2 పా : మహితాపహారికవు. మహిత = గొప్ప. అపహా = చెఱుపుగల్గించు దుఃఖములకు, అరికవు = శత్రువైనదానవు.

154. 59 :- 2 పా:- అసదృశమహోదయ+అమిత రసమున్ = సాటి లేని గొప్పవృద్ధిగలదియు హద్దులేనిదియునగు ప్రేమరసమును, కొనము+అ = పొందమా ! పొందుదు మనుట. 3 పా :-

అసదృశము + అహో = సాటిలేనిది, ఎంత ఆశ్చర్యము ! దయా + మితరసమున్ = దయచేఁ గొలువఁబడిన ప్రేమ రసమును (ఎంత దయగల్గిన నంతప్రేమ గలుగుననుట) కొనము + ఆ = పొందిమా ! పొందుదుమనుట. 3 పా :- అ, సదృశ = విష్ణువుతో సమానమైన, మహః = తేజస్సును, ద = ఇచ్చుదానా ! (విష్ణు సారూప్యాది ముక్తి నిచ్చుదానా !) ఇత = పొందఁ బడిన, రసము = జన్మకారణములైన వాసనలు గలదియగు, ఆమున్ = గర్వమును, కొనము + అ = ఎంత మాత్రమును పొందమునుమా !

154. 60 :- 1 పా :- భజింపన్ = సేవింపఁగా, నేలన్ = భూమి యందు, ఎవ్వరు = ఏరు, మాకు + ఏలవలయు ! = మాకు పరిపాలింప వలెను ? మేము సేవింప వలసిన పరిపాలకులు భూమిలో నెవ్వరును లేరనిభావము. 2 పా :- ఏలన్ = పాలింపఁగా, ఏ + వరున్ = ఎవ్వరున్ = ఏ శ్రేష్ఠునిఁ గూడ (త్రికసంధి) భజింపఁ = నేను సేవింపను. మాకు = మాకు, ఏల ? = ఏమి, వలయుఁ ? = అవసరమున్నది ? భూమి నేలు నట్టి వాఁడెట్టి శ్రేష్ఠుఁడైనను నేను వానిని భజింపవలసిన యవసరము లేదని భావము. 3 పా :- ఏ + వరున్ = ఎవ్వరుఁ (త్రికసంధి) ఏశ్రేష్ఠునైనను, భజింపనేల ! = సేవించుట యెందులకు ? మా, కేలు + అ; మా = లక్ష్మీదేవి యొక్క కేల = అభయవరదరూప హస్తమే, వలయుఁ = మాకుఁ

గావలెను. 4 పా:- ఎవ్వరున్ = ఎవ్వారలును, అనఁగా, అందఱు ననుట. భజింపన్ = సేవింపఁగా, నేల = భూమి, మా = మాయొక్క, కేలన్ = చేతియందే, వలయున్ = కావలెను. అందఱు మమ్ము భజించునట్లు లక్ష్మికటాక్షమున భూమిమాచేతికే వశపడవలెనని భావము.

55 . 61 :- అమా ! నరామరమాన్యతన్, అమా ! = అమ్మా ! నరామ రమా = విష్ణువు లక్ష్మి కాక, అన్యతన్ = ఇతరమైన భావముచే, అవినాశాధ్యాయమహితమగు భవమును, అవినాశ + ఆధి + ఆయము + అహితము + అగు భవమును = నాశములేని మనోవ్యాధియొక్క ఆదాయముచే (రాకడచే) హితము కానిదగు జన్మపరంపరయును, అవును + ఎ = కలుగునుగదా. అట్టి, నవినాశ + అధ్యాయ మహితమగు భవమున = నాశములేని జీవితాధ్యాయముచే విస్తృతమగు జన్మపరంపరయందు. మా = లక్ష్మి ! నర + అమర, మాన్యత = మనుష్యులచేతను దేవతలచేతను పూజింపఁబడుట, అవునె = కల్గునా ? కలుగదనుట, రమావిష్ణువుల సేవకంటె ఇతరసేవవలన, ఆధి వ్యాధిభూయిష్టమగు జన్మపరంపరయందుఁ జిక్కుకొనుటయే జరుగును, అట్టి నాశము లేని జీవితపుటధ్యాయములచే విరివియైన జన్మపరంపరయందుఁ గూడ నరులచేఁగాని సురలచేఁగాని కొనియాడఁదగు జీవితము అసలు కలుగనే కలుగదని భావము,

## 15 నక్షత్రమాలా స్తబకము

56 . :- అశ్విని మొదలగు 27 నక్షత్రములు పేర్లు ఒక్కొకపద్యమున

నొక్కొక్కటి 27 పద్యములందు వరుసగా వచ్చుటచే నీ స్తబకము నక్షత్రమాలా స్తబకమైనది.

157 . 4 :- అధిరోహిణి = నిచ్చెన.

157 . 8 :- పుష్యయుగము = కలియుగము.

158 . 11 :- తనుపు + ఉబ్బన్, తనుపు = తృప్తి, ఉబ్బన్ = అతిశయింపఁగా.

160 . 17 :- ఘనతనసూరాధార్హా, ఘనతః = 1 గొప్పతనముచే 2 మేఘధర్మముచే, అనూరాధార్హా. అనూరాధ = క్షేమకారణుఁడైన, అర్హా = విష్ణువు కలదానా! (అనూరాధ = Causing welfare, అర్హ = Name of Vishnu, Apte's English to Sanskrit Dictionary) 'ఘనసమనూరాధార్హా' అని మఱియొక పాఠము. అప్పుడు, 1 ఘన, స, మనూరాధా + అర్హా; ఘన స మనూః = గొప్ప మంత్రముతోఁ గూడినదానా! మహామంత్ర స్వరూపిణీ యనుట, రాధా + అర్హా, రాధా = రాధాదేవిగా అర్హా = తగినదానా, రాధారూపిణీ! 2 ఘన, సమ్ + అనూరధా + అర్హా = మేఘమందలి చక్కని మెఱుపువలెఁ దగినదానా! మేఘశ్యాముఁడగు నీభర్తయందు నీవు మెఱుపువలె నుంటి వనుట. 'మనూ రాధారయుతా' అనుమూలములో మనూః + ఆధారయుతా; మనూః = మంత్రములను, ఆధారయుతా = ధరించినవానిచేత అనునర్థమున 'మనూః' ద్వితీయాబహువచనాంతము, ఇది తెనుఁగునకురాదు. ఘనసమనూ! రాధార్హా! అనుసంబుద్ధి రూపములతో అనువాదమున 'మనూ' శబ్దమురాఁబట్టఁబడినది.

160 . 29 :- అషాఢ = 1 బ్రహ్మవారులు, 2 ముని బ్రహ్మవారులుధరించు మోదుగు దండము.

160 . 21 :- ఉత్తరాషాఢధరులు, ఉత్తర + అషాఢధరులు = శ్రేష్ఠులై అషాఢదండము ధరించిన మునులు.

161 . 25 :- పూర్వభాద్రపదము = పూర్వమందుభద్రమైన స్థానము. భద్రపదమే, భాద్రపదమునగును.

161 . 26 :- భువనోత్తర భాద్రపదము = లోకములందు శ్రేష్ఠమైనదై శుభములకు నివాసమైనది.

162 . 27:- వతీర్ణవై = అవతరించినదానవై.

## 16 చిత్రచరిత్ర స్తబకము

163 : 1 :- చిత్రచరిత్ర పదప్రయోగమున చిత్రచరిత్ర స్తబకము సూచితము.

163 . 2 ;- ఆదిభూతము = పంచభూతములలో మొదటిదియగుభూమి. ద్వితీయభూతము = రెండవభూతమగు జలము. విష్ణువు రామాద్యవతారములందు అంచరిపలెనే స్త్రీయోనియందు, జన్మించెను. భూమిదున్నినపుడు పుట్టిన సీత అయోనిజ. అట్లే. సముద్రగర్భమునఁ బుట్టిన లక్ష్మి అయోనిజ. ఇది శ్రీదేవి యందు విశేషము.

164 . 6 :- లోకములు = 1 భువనములు 2 చూపులు.

## 17 నామవైభవస్తబకము.

166 . 1 :- నామ పదముచే నామవైభవస్తబకము సూచితము.

170 . 18 :- 'ఉపద్రవ సహానమను నది సామవేదము లోనొక భాగము దానికే 'ఉవదర్శివ' మనియుఁ బేరు.

172 . 25 :- నీ నామలహరి, కామధేనువు. నామపరముగ, కామధేను పరముగ రెండర్థములు :- 1 ప్రతి పదన్యాస భాసురవర్ణ = ప్రతి నామమున న్యాసము (అంగన్యాసకరన్యాసములు) చే ప్రకాశించు అక్షరములు కలది. అంగన్యాసకరన్యాసములచే మంత్రాక్షరములు ప్రభావితములగును. లేక, ప్రతిపదమునందు ఉన్న ప్రకాశమానము లగు అక్షరములుగలది.(నామ)2ప్రతియడుగు ఉంచుటయందు, (గమనమునందు) భాసురమైన కాంతిగలది (కామధేనువు) దివ్యరవగోష్ఠ సంశుద్ధిభవ్య = 1 దివ్య = చక్కనైన, రవ = ధ్వనులను, గ = పొందిన, ఓష్ఠ = పెదవులచే నైన, సంశుద్ధి = మిక్కిలి శుద్ధిచేత, భవ్య = మంగళకరమైనది (నామ) 2 దివ్యరవ = చక్కని ధ్వనిగల (దూడల అరపులుగల) గోష్ఠ = గోశాల యొక్క, సంశుద్ధి = పవిత్రతచే. భవ్య = మంగళకరమైనది, (కామధేనువు).

.72 . 26 :- జడాత్మ = 1 జడరూపముగలది 2 (లడయోరభేదః) జలాత్మ = జలరూపముగలది. రసాంతర రమణంబు = 1 జలమధ్యమందు కలిసియుండుట. 2 ఇతరరసములతోఁ గలిసి

యానందించుట, రస + అంతరమును = ఇతర రుచిని. ఇతర నామము లందాసక్తిని యనుట.

173 . 28 :- మన్వంతరములు = 1 ఇతరములైన మంత్రములు. 2 ఒక మనువు పరిపాలనమునకు మఱియొకమనువు పరిపాలనమునకు మధ్యగల కాల భాగములు.

173 . 29 :- స్వనివిష్టవర్ణత్రియమున్ = 1 తనలోనున్న మూఁడు అ + ఉ + మ్, అను అక్షరములను 2 తన్నారాధించు బ్రహ్మ క్షత్రియ వైశ్యులను మూఁడు ద్విజ (ఉపనయనాధికారముగల) కులములను, చతుర్వర్ణములను = నాల్గుకులములవారిని, ఏక ద్విపర్ణము = శ్రీయను ఒక అక్షరము, రమా, లక్ష్మిమొదలగు రెండక్షరములు గల నామము. మూఁడు వర్ణములు గల ఓంకారము. మూఁడు వర్ణములవారినే రక్షింపఁగా ఒకటి, లేక రెండు వర్ణములు గల నీనామ మంత్రము నాల్గువర్ణములవారినిఁ గూడ రక్షించును. కాన ప్రణవముకంటె నీ నామము గొప్పదని భావము,

174. 32 :- 1 పరమైన = 1 శ్రేష్ఠమైన 2 తర్వాతనున్న. గుణము = 1 శ్రేష్ఠత్వము. 2 గుణసంధి. 'ఓమ్' లో నున్న అ + ఉ + మ్ అనువానిలో "అ" అనగా విష్ణువు, 'ఉ' అనఁగా లక్ష్మి. ఈ రెండక్షరములకు గుణసంధివచ్చి 'ఓ' అయినది.

## 18 అరవింద స్తబకము : లేక స్థానవైభవ స్తబకము

176. 1 :- అరవింద పదముచే అరవింద స్తబకము సూచితము.

177. 4 :- భిక్షుశిరోమణి = విప్రగాండ్రలో శ్రేష్ఠుఁడు. 2 ఆది భిక్షువగు శివుని శిరసునందు వెలుఁగువాఁడైన చంద్రుఁడు.

177. 5 :- క్షమాకలితుఁడు = 1 భూమితోఁ గూడినది (కిటి) 2 ఓరిమితోఁ గూడినవాఁడు (విష్ణువు) పంకజాతమ్మున = బురద యొక్క సమూహమున (కిటి) 2 నాభీకమలముతో (విష్ణు)

177. 6 :- అరయ నవసుమత్వము, అరయన్ + అవసుమత్వము. అరయన్ = చూఁడగా, అవసుమత్వము = వసుమత్వము లేక పోవుట, కాంతి లేక పోవుట, లేక, చెడ్డదైన పుష్పమగుట; తదనుకూలమైన = దాని ననుసరించి యొప్పున నున్న, దాని కిష్టమై యున్న, తత్ + పతంగ + అంగము = ఆ పక్షుల దేహము, లేక, గరుత్మంతుని దేహము (గరుత్మంతునకు సుపర్ణుఁడని పేరు)

177. 8 :- జలజాతాధిక వత్సలత్వము = 1 పద్మము నందు ప్రేమ 2 (జలయోరభేదః) జడ, జాత + అధిక వత్సలత్వము = మందులైన బిడ్డల యందు ఎక్కువ ప్రేమభావము.

179. 13 :- బ్రధ్నార్చకుఁడు = సూర్యుఁడను వైష్ణవార్చకుఁడు, ఇరువుర పరముగ రెండర్థములు :- భృతతప్త చక్రుఁడు = 1 పొందఁబడినవియు, (విరహముచే) తపింపఁ బడినవియు నగు చక్రవాకములు గలవాఁడు (సూర్యుఁడు) 2 పొందఁబడిన, తప్త (కాల్చబడిన) చక్రాంకితములు గలవాఁడు (వైష్ణవార్చకుఁడు) శుచికరుఁడు = 1 తెల్లని కిరణములు గలవాఁడు (సూర్యుఁడు) 2 శుభ్రతను గూర్చువాఁడు (వైష్ణవార్చకుఁడు) విష్ణుపదసక్తి తోడన్ = 1 ఆకాశమునంటి యుండుటతో (సూర్యుఁడు)

2 విష్ణుపాదములందు ఆసక్తితో (వైష్ణవార్చకుఁడు) ఆలయము = 1 ఇల్లు 2 గుడి.

180. 14 :- మధుస్నిగ్ధతన్ = 1 మధువను రాక్షసునందు మైత్రి కలిగి యుండుట, 2 తేనెచే మృదువైనదగుట, వైధర్మ్యము = సమానత్వము లేక పోవుట.

181. 20. :- కుశేశయము = 1 దర్భలపైఁ బరుండునది, మంచములు మొదలగునవి లేక, దర్భలు పరుచుకొని పరుండు నట్టి దారిద్ర్యా వస్థగలది యనుట 2 పద్మము. స్వర్ణస్నాతి = 1 నీటి యందుం డుట 2 బంగారము కలిగియుండుట, హిరణ్యగర్భుఁడు = 1 బ్రహ్మ. 2 ఆగర్భ శ్రీమంతుఁడు. త్వదను + బంధి + అను బంధుఁడు = నిన్ననుసరించియున్న పద్మము ననుసరించిన వాఁడును; నీ దాసాను దాసుఁడును, ధన్యుఁడు = 1 చరితార్థుడు 2 ధనయోగ్యజన్మ గలవాఁడు.

182. 21 :- 1 కమల వనమధ్య. పుండరీకమున, కమల ! = లక్ష్మీ ! వనమధ్య = అడవినడుమ, లేక, జలమధ్యమున, పుండరీక మున = పద్మమునందు. 2 కమలవన, మధ్య. పుండరీక మున = పద్మవనమందలి పద్మమున. అమల, పురమధ్య, పుండరీకమున = 1 నిర్మలమైన పట్టణమందు గొడుగుక్రింద నడుముభాగమున 2 మలినములు లేని వారి దేహమధ్యమందలి మనః పద్మము యొక్క నడుమ,

182. 22 :- నీరజము = 1 రజోగుణము లేనిది 2 నీటఁబుట్టినది, పద్మము. త్రిపాత్పదంబు = 1 త్రివిక్రముఁడగు విష్ణుపద

స్థానము 2 మూఁడడుగులమేర. షట్పదపదము = తుమ్మెదలకు నివాసము 2 ఆరడుగులమేర.

182. 23 :- సురాది జీవసంఘములు = 1 దేవతలు మొదలగు జీవ సమూహము 2 సు = చక్కని 'రా' అను నక్షరము ఆదియందు గల, 'జీవసంఘములు' అను అక్షరములు. అనఁగా రాజీవ సంఘములు (పద్మముల సమూహములు) అమృతనిష్ఠను = 1 మోక్షమందాసక్తితో 2 నీటి యందుండుటచే, అంతరంగములన్ = 1 మనసులందు 2 లోపలభాగములందు. హరి = 1 విష్ణువు 2 సూర్యుఁడు. హస్తములన్ = 1 చేతులతో 2 కిరణములతో. ఆ లోకము = 1 ప్రసిద్ధమైనట్టి వైకుంఠము. 2 ప్రకాశము. ఆమోదము = 1 సంపూర్ణానందము 2 పరిమళము.

182. 25 :- నళినము = నీనివాసమగు పద్మము. స్వర్ణస్ఫూర్తిని = 1 బంగారము వలన (ధనమువలన) ప్రకాశమును 2 నీటియందలి బ్రకాశమును. క్షమన్ = 1 శాంతిచే, 2 భూమిచే. అమరియు = ఒప్పియుండికూడ. గుణదార్ఢ్యము లేమిచేన్ = 1 సుగుణములందు దృఢత్వము లేకపోవుటచే 2 దారములందు గట్టితనము లేకపోవుటచే. "నాలమ్" అనుదానిని. 1 న + అలం అనుదానిని = చాలదు అనుమాటను, నిన్నాశ్రయింపని హీనుఁడు ఎంత బంగారమున్నను. ఎంత శాంతియున్నను గుణ హీనుఁడైనచో ఉన్నది చాలదని దారిద్ర్యముచే పీడితుఁడుగనే యుండునని యొక భావము. పద్మము నీటి యందు భూమినానుకొని యుండియు దారములుగట్టిగా లేని తూడును పొందియుండునని వాస్తవ

భావము. అవియే = 1 అహీనుని దారిద్ర్యగుణమే 2 ఆపద్కర్మమే, త్వదాశ్రయి వశతస్ = నిన్నాశ్రయించి యుండినపుడు 'అలం, కారమై' = 'చాలు'ననునది చేయునదై 2 భూషణమై, అమరున్ = ఒప్పును. నిన్నాశ్రయించిన వారికి హీనులకును చాలినంతగా ధనము నొసఁగుదువని, రెండవ భావము స్ఫురించును.

83. 26 :- నీ దర్శనము = 1 నిన్ను దెలుపు శాస్త్రము 2 నీవు కనిపించుట, సద్గుణ + అలీకతను = 1 సత్వాది గుణములకు అయథార్థత్వమును 2 సత్త్వస్వభావమును దెలుపు ఫాలభాగమును, ని. అలీక మప్రియే ఫాలే ఇతివిశ్వః. లేక, సద్గుణ + ఆలీకతను = సద్గుణ సమూహమును 1 కల్పనగమును + ఈ, యా, లోకగణము, = కల్పనము వల్లఁ గలిగిన ఆయా లోకములసమూహమును (అద్వైతభావములో సర్వలోకములు మాయాకల్పితములు.) 2 కల్పనగము, నీయాలోక గణము = కల్పవృక్షముగా నున్న నీ చూపుల సమూహము. లేక, కోరికల నిచ్చు నీ చూపులసమూహము.

183. 27 :- నీ స్థానము = నీ నివాసమగు పద్మము, ప్రధానము = ప్రకృతి స్వరూపము: పద్మపరముగ ప్రకృతిపరముగా రెండర్థములు: ఉత్తమస్ఫూర్తియంత్రిత చిత్తవృత్తి, ఉత్తమస్ఫూర్తియంత్రిత = 1 ఉత్తమమైన ప్రకాశముతోఁ గట్టఁబడి యున్నదైనట్టి, చిత్త = కనిపించు నట్టిదైనట్టి, (చిత్తమ్ = Visible, Apte's English to Sanskrit Dictionary ) వృత్తి = వ్యాపారము గలది. లేక మనో వ్యాపారము కలది. మంచి ప్రకాశము గలదనుట (పద్మ)

2 ఉత్ + తమస్ + స్ఫూర్తి యంత్రిత చిత్తవృత్తి = ఎక్కువ తమోగుణాతిశయముతోఁ గూడిన మనోవ్యాపారము గలది. (ప్రకృతి) సద్రజోవృత్తి = 1 చక్కని పరాగము గలది (పద్మ) 2 రజోగుణము గలది. (ప్రకృతి) సారసత్వము = 1 సారసము అగుట (పద్మ) 2 శ్రేష్ఠమైన సత్వగుణము. (ప్రకృతి) మహత్ + ఆదితత్త్వము = 1 గొప్పతనము మొదలగు స్వభావములు గలది (పద్మ) 2 మహదహంకారాది తత్త్వములు గలది (ప్రకృతి)

185, 34 :- పుంనపుంసకఖ్యాతి = అబ్జపదము, చంద్రార్ధమున పులింగముగను, పద్మార్ధమున నపుంసకలింగముగను పేర్వడినది.

## 19. అభయస్తబకము.

187, 1 :- అభయపదముచే అభయస్తబకము సూచితము.

192, 25 :- తమసాన్వయము = 1 అజ్ఞానముతో సంబంధము 2 తమసానదీసంబంధము (వాల్మీకి తమసానదికి స్నానమాడఁబోయెననుట రామాయణమునఁగలదు.) మన్యుభారము = 1కోపభారము 2 యజ్ఞభారము, యమసంగమము = 1 యమునిఁ గలిసికొనుట 2 యమనియమాదులఁ గూడియుండుట, గదావాప్తి = 1 రోగములనొంది యుండుట, 2 గదయను ఆయుధమునొందియుండుట, 1 క్షుద్రహితధర్మము = నీచులకు ఇష్టమైనస్వభావము 2 క్షుత్ + రహితధర్మము = ఆఁకలిలేని స్వభావము. భవకృతము = 1 సంసార

కృతమైనవి 2 ఈశ్వరకృతమైనది. త్రాసము = 1 భయము 2 ముత్యములందుండు దోషము.

193, 30 :- 'కాకాఒభయప్రదా' అనుదానిలోని 'కా,కా' అనునవి, విడి పదములైనప్పుడు, కా = ఎవతె? కా = ఎవతె? అభయ ప్రదా = అభయమిచ్చుస్త్రీ. అభయమిచ్చు దేవత లెవరున్నారని ప్రశ్నార్థము. 'కాకాఒభయప్రదా' అనినపుడు 'కాకా' అను నక్షరములు సమాస గతములై, కాకా = కాకాసురునకు, అభయప్రదా = అభయము. నిచ్చుస్త్రీ. సీతాదేవి. సీతయేలక్ష్మి. కాన లక్ష్మి మాత్రమే అభయ మిచ్చుదేవతయని సమాధానము.

## 20 దేవతాంతర పరిసంఖ్యాన స్తబకము.

194. 1 :- దేవతాంతరపద ప్రయోగమున దేవతాంతరపరి సంఖ్యాన స్తబకము సూచితము.

195. 8 :- మహావిభూతిక, మర, స్వా.మీ ష్టదన్ = 1 గొప్పఐశ్వర్యము లకు స్థానమైన భర్తకు ఇష్టురాలైన నిన్ను 2 మహావిభూతి, కమఠస్వామి + ఇష్టదన్ = గొప్ప యైశ్వర్యముగల కూర్మావతారుఁ డగు భర్తకిష్టురాలైన నిన్ను, అశ్వకర్ణము అనునది 1 ఒకచెట్టుపేరు. 2 ఒక పర్వతముపేరు. ఈ అర్థములు వ్యుత్పత్యర్థముతో నిమిత్తము లేనివి. అనఁగా వ్యర్థములు = అర్థములేనివి, సార్థకములుకానివి,

## 21 దశావతార స్తబకము

201 . 1 :- పదియవతారములను పదముచే దశావతార స్తబకము సూచితము.

203 . 11 :- హర్యక్షపదము; హరి + అక్ష + పదము = 1 సూర్యుఁడు నేత్రముగాఁగలవాఁడు విష్ణువు అను నర్థమున 'హర్యక్ష' మను మాట 2 సిం. హశబ్దము. హరిపదము = విష్ణువను నర్థమిచ్చు 'హరి' యనుమాట 2 సింహశబ్దము. హిరణ్య + అంగదత = 1 బంగారు భుజకీర్తులనెడి ఆభరణములుగ లిగియుండుట, 2 హిరణ్యకశిపుని శరీరమును చీల్చుట, ప్రహ్లాదవృద్ధి = 1 సంతోషమును వృద్ధిచేయుట 2 ప్రహ్లాదుని వృద్ధినొందించుట. పూర్వహరియ = 1 వెనుకటి విష్ణువే, 1 పురుషోత్తముఁడుగ = శ్రేష్ఠపురుషుఁడుగ, నీకు భర్తగాననుట, 2 పూర్వహరియ = పూర్వ భాగము (తలభాగము) సింహమైనవాఁడే 2 పురుషోత్తముఁడుగ = ఉత్తర భాగము (మొండెము భాగము) పురుషుఁడైనవాఁడుగా, సరసింహామూర్తిగా అనుట.

శ్లో॥ హర్యక్షోఽయం హరి రితి వచ స్తస్యనాభూతపూర్వం।
న ప్రహ్లాదోపచయ కరతా నో హిరణ్యాంగదత్వం।
తస్మా దస్మజ్జనని ; పరమం విస్మయం తే విధాతుం।
నాథఃపూర్వం కిమిహ జగృహే నారసింహం శరీరమ్॥

ఇందు 'నాథః' అనునపుడు 'నాథః' నీకు భర్తయైన విష్ణువు, అను ఒక యర్థమునిచ్చును. నా + అధః = అని విరిచినపుడు, అధః =

క్రిందిభాగమున. నా = నరుఁడు అని మఱొకయర్థమిచ్చును. ఈ యర్థము 'నా' నృ అను ఋకారాంతశబ్దముయొక్క ప్రథమైక వచనము. ఇది తెనుఁగునకురాదు. పురుషోత్తముఁడు అను పదముతో అనువాదమున నీ రెండర్థములు రాఁబట్టుట విశేషము.

203 . 15 .- వృద్ధితో = 1 వడ్డీతో 2 పొడుగు అగుటతో, అఱన్ = నశింపఁగా, గోత్రారాతితమ్ముఁడు = 1 వంశములఁగూల్చువాని తమ్ముఁడు 2 ఇంద్రునితమ్ముఁడు, ఉపేంద్రుఁడు. 1 పాత్ర + ఆకారము పాత్రాకారము = రక్షకునియాకృతి 2 పాత్రి + ఆకారము = దానపాత్రమైన ఆకారము, లేక, అర్హమైన ఆకారము. శివసౌఖ్య + ఆపాదకము = 1 మంగళములను సుఖములను గల్గించునది, శివునకు సౌఖ్యమును గల్గించునది. పాదకమ్మ = 1 పాదము (స్వార్థేకః) 2 పాద = పాదమందలి, కమ్మ = నీరు, విష్ణుపాదోద్భవి గంగ, 'కంశిరో ఒంబు కోఃఇస్యమరః'

204 . 16 :- 1 అఘన + అశనము = ఎక్కువకాని భోజనము, అల్ప భోజనము 2 అఘ + నాశనము = పాపనాశనము. 1 మాకు + ఏల పాణిగ్రహణము = మాకు వివాహమెందుకు ? 2 మాకేలన్, మా = లక్ష్మీదేవియొక్క. కేలన్ = కరమునందు, పాణిగ్రహణము = చేతినిగ్రహించుట, వివాహమగుట.

205 . 19 :- 1 సు + అతిధి ధారణము = చక్కని అతిధులను పొందుట. 2 స్వతిధి = పరశువును, ధరించుట. మన్యువర్ధనము = 1 మంత్రములవృద్ధి, లేక, కోపమును ఛేదించుట 2 కోపమును వృద్ధిపొందిం

చుట, శాస్త్రవిజ్ఞత = 1 శాస్త్రపరిజ్ఞానము 2 శస్త్రములనుపయోగించు నేర్పు, జ్యాధర్మసంగ్రహము = 1 భార్యతోఁగూడి ధర్మమును సంపాదించుట 2 అల్లెత్రాడు, వింటిని పొందించుట, సమిత్ + హరణము = 1 సమిధలను తీసికొని వచ్చుట 2 యుద్ధములందు శత్రువుల సంహరించుట.

205 , 21 :- మోచితద్విపుఁడు = 1 విడువఁబడిన గజబలముగలవాఁడు, గజసైన్యమురేనివాఁడు 2 గజేంద్రుని రక్షించినవాఁడు. ఆపత్తిప్రశూన్యుఁడు 1 ప్రసిద్ధమైన పదాతి బలములేనివాఁడు 2 ఆపదలను శూన్యముచేయువాఁడు.

206 . 25 :- హలి = 1 నాఁగలిఁబట్టువాఁడు. కృషికుఁడు 2 బలరాముఁడు భోగి = 1 సుఖములొందువాఁడు 2 శేషుఁడు.

207 . 28 :- లక్ష్మీపరముగ, భగవద్గీతాపరముగ రెండర్థములు. వితతగంభీరభావ హి కృతమహార్ధ వితతి సంపన్న టీకా; 1 వితత, గంభీర, భావముగల, అహి = శేషావతారమైన బలరామునిచే, కృత, మహార్ధ, వితతి సంపన్నటీకా = చేయబడిన మహాకార్య సమూహమందలి సంపదయే నర్తకిగా గలదియు; (నటీకా, స్వార్థేకః) సర్వసంపదలు లక్ష్మీదేవి యధీనమై యున్నవని భావము. అర్థ = అర్థములచేత, శ్రుతి = చెవులకు, మృదూక్తి = మృదువైన మాటలుగలదియు నైనది (లక్ష్మి) 2 వితతగంభీరమైన భావము. (తాత్పర్యము) గల్గినట్టి, అహి = శేషావతారులగు శ్రీరామానుజులవారిచే, కృత = చేయఁబడిన, మహార్ధ వితతి సంపన్నమైన, టీకా = భాష్యమునందలి అర్థములచే: శ్రుతి =

వేదములకంటె, మృదూక్తి = మృదువైన మాటలుగలది (భగవద్గీత) కృష్ణ + ఆస్య, సౌరభజ్ఞ = విష్ణుని ముఖపరిమళము నెఱిఁగినది (లక్ష్మి) కృష్ణముఖము వలనఁ గల్గినదగుటచే. పరిమళము నెఱిఁగినది. కృష్ణముఖ నిర్గతమగుటచే భాసించునదనుట (భగవద్గీత) శుభయోగభావ్య = శుభమైన కలయికచే యోగ్యమైనది. (లక్ష్మి) శుభమై యోగవిద్యచే భావింపఁదగినది· (భగవద్గీత)

208. 32. :- అసుహృద్యవనావళి హాని అసుహృత్ + యవన + ఆళి + హాని = మంచిమనస్సు లేని, యవనజాతి వారి సమూహము నకు హానిని 2 అసు = ప్రాణములకు, హృద్య = ఆనంద కరమైన, వన + ఆళి = వనపంక్తుల యొక్క, హానిని. యవన పరముగ, వన పరముగ రెండర్థములు :- కలికాల + ఈశతన్ = కలికాలములో ప్రభువులగుటను, (యవన) కలికా + లేశతన్ = మొగ్గల యొక్క స్వల్పతను (వన) శాఖావళ నాశతన్ = 1 వేద శాఖల సమూహమును, లేక, వర్ణాశ్రమశాఖల సమూహమును నాశము చేయుటను. (యవన) 2 కొమ్మలను ఆకులను నాశము చేయుటను (వన) గత సత్ + ఆమోదత = 1 మంచి వారిని సంతోషపెట్టుట లేకుండుట [యవన] 2 పరిమళము లేకుండుట [వన] మహా + అవని = 1 గొప్పరక్షకురాలా !, [యవన] 2 మహా + అవనిన్ = గొప్పదైన భూమియందు, [వన] మాధవు చేఁ = 1 విష్ణువుచే 2 వసంతర్తువుచే.

208. 33 :- అవధూత కలికుఁడు = 1 పోఁగొట్టఁ బడిన మొగ్గలు కల వాఁడు 2 పోఁగొట్టబడిన కలి [పాపము] కలవాఁడు, ఖడ్గి =

1 ఘస్గమృగము 2 కర్తికంవాడు, అమ్లేచ్ఛు. అమ్ల + ఇచ్ఛు =
1పులుపునందాసక్తి 2 మ్లేచ్ఛులు లేనిది.

209. 34 :- మాత్స్య సౌందర్య సంభరితము = 1 చేప యొక్క అందము (కన్నులందు) గలది 2 మత్స్యావతార మైనది. 1 మంద. రక్షణ, పదము = 1 మందులను రక్షించు స్థానము 2 మందర, క్షణ, పదము = మందర పర్వతముయొక్క ఉన్నతమునకు స్థాన మైనది. కూర్మావతార మైనదనుట. అనంతహర్షావహము = 1 విష్ణువునకు సంతోషము కల్గించునది 2 భూమికి సంతోషము నిచ్చునది. వరాహావతారమును ధరించి సముద్రమగ్న యగు భూమి నుద్ధరించిన దనుట. హరి + ఆస్యస్పృశపం = 1 విష్ణుముఖ మును స్పృశించునది. 2 సింహ ముఖము నొందినది, చారువర్ణ = 1 అందమైన కాంతిగలది 2 చక్కని బ్రహ్మచారి యగు వామన మూర్తి గలది. సంతత + అశేష + అధిక + ఉపక్రియా గుణ రూప = 1 ఎల్లప్పుడు అందరకు గొప్పఉపకార గుణముగలది. 2 సంతత + అశేష + అధి + కోపక్రియా గుణరూప = ఎల్ల ప్పుడు అశేష రాజులందు కోప గుణము గల పరశురామరూపము గలది, హరిణసంపద్ధరమై = 1 లేడి సంపదను (కన్నులచే) హరించునది. 2 (బంగారు లేడిని హరించినది) రామావతార మైనది. కామపాల వైభవము = 1 మన్మథుని పాలనా విభవము కలది 2 (ని. కామపాలోహలాయుధః) బలరాముని విభుత్వము కలది, కృష్ణము = 1 నల్లనిది 2 కృష్ణావతారమైనది. కలిహ రము = 1 పాపమును బోఁగొట్టునది. 2 కలికి అవతారముగా [కలి యుగాంతమునఁ బాపుల హరించునది.]

209. 35 :- 1 అధరమ్మౌ + అమంద, రాగధరము = పెదవి, గొప్ప ఎఱుపును ధరించునది 2 అధరమ్మౌ + మందర + అగధరము = పెదవియే, మందర పర్వతమును ధరించిన కూర్మావతారము; సౌకర్యధరము = 1 సౌకర్యము గలది 2 సూకరధర్మము [వరాహ ధర్మము] ధరించినది. 1 స్తనభూమిన్ = స్తనప్రదేశము నందు. ముఖహరితాయుతము = ముఖము లందు [చూచుకము లందు] హరితా = నలుపుదనముచే, యుతము = కూడినది. 2 స్తనభూమి, ముఖహరితా యుతము = ముఖమునందు సింహత్వముతోఁ గూడినది, నృసింహావతారమైన దనుట. 1 వలిశ్రీ = వళుల సంపద, మధ్యమాంగ = నడుము యొక్క, సంవృతిన్ = వ్యాప్తిచే, భృతము = ధరింపఁ బడినది. 2. [వబయోరభేదః] బలిశ్రీ = బలిచక్రవర్తి సంపద కొఱకై. మధ్యమ = రెండవ రకమైన [పొట్టిదైన] అంగ = శరీరము యొక్క, వృతి = ఆవరణమును, భృతము = ధరించునది, వామనావతార మైన దనుట, 1 రామా + అగ్ర్యజనన ప్రసిద్ధము = స్త్రీలయందు శ్రేష్ఠమైన పుట్టుకగలదై ప్రసిద్ధినొందినది, 2 రాములలో (పరశు రామ బలరామ శ్రీరాములలో) మొదటివాఁడగు పరశురాముని జననముచేఁ బ్రసిద్ధమైనది; లేక, అగ్రకులమగు బ్రాహ్మణవంశమునఁబుట్టిన పరశురామునిచేఁ బ్రసిద్ధమైనది. రోమాళి = నూగారు, యమునావిరూపకమ్మౌ = యమునానదిని కురూపిగాఁ జేయునది. యమునకన్న మిక్కిలి నల్లనైనదనుట, 2 యమునా నదీ దర్పమును నాశముఁ జేసిన బలరామ రూపమైనది. అభిరామ సంపత్ప్రసాధకము = 1 అందమైన సంపదను సాధించునది.

2 శ్రీరామావతారమైనది. కలిగుణధ్వంసకము = 1 పాపహారము
2 కలియుగధర్మమును నాశనము చేయు కల్కి అవతారమైనది.

210 :- కలితదశరూపకుడు = 1 పదివిధముల నాటకములకు కర్త యైనవాడు (కవి) దశావతారములెత్తినవాడు (విష్ణువు).

## 22 చిత్రస్తబకము

మూలమున, బంధములను చిత్రములను జూపుటయే ప్రధానమగుటచే ఏకాక్షర పదములతో శ్లోకములందు భావమంతగా రసవంతముగా రాలేదు. అనువాదమునను బంధచిత్రములకే ప్రాధాన్య మీయఁబడినను, భావముఁ జెప్పుటలో గొన్నియెడల స్వతంత్రించుట తప్పనిసరి యైనది.

211 . 2 :- అపశబ్దమున్నట్లు భాసించుట అపశబ్దాభాసము. 'వేదవేదాంత' అనుటకు బదులు 'వేధవేధాంత' అని అపశబ్దములు ప్రయోగించినట్లు పైకిఁగన్పట్టును, కాని వేధ = బ్రహ్మదేవుఁడు. వేధా + అంతవిద్యలు = బాధలను నాశముచేయు విద్యలను (వేదములను, వేదాంతములను) అనెడియర్థములో నవి సుశబ్దములే. మూలములో 'వేదాని' అనునది నపుంసక లింగముగా అపశబ్దముగా తోఁచినను క్రియగా నది సుశబ్దము.

212 . 3 :- నడుచుచు విడిచినప్పుడు గోవు (ఎద్దు) మూత్రము క్రిందికిపైకి వంకరగానేర్పడును. అట్లే పైనుండి క్రిందికి, క్రిందినుండిపైకి అక్షరము విడిచి అక్షరముకలుపుకొనుచుఁ జదివిన నపుడు గూడఁ బద్యము చెడకుండ నుండిన గోమూత్రికాబంధమనఁబడును.

214 . 8 :- మూలశ్లోకము॥ పాయాన్మామురసావితశ్రియ
ముమారాధ్యాం ప్రపద్యేతమాం।
కోవానస్థిరమశ్నుతే శమధునోప్యాలోకితోజాతుచిత్।
వేదాంతైస్సుతాంప్రఘయేనకీమ్ముత శ్శ్రియోనతింతన్వతాం।
సేవామోరచయామి మానససదాభక్త్యావహావాదరమ్॥

క్రిందఁగీఁతలతో 'ఊః' అను శబ్దముయొక్క విభక్తి రూపములు చూపఁబడినవి. 'ఊః' అనఁగా లక్ష్మి 'ఉ' శబ్దమునకు ఉమ్, వా, వే, ఓః, ఔ అనునవి ద్వితీయా, తృతీయా, చతుర్థీ, పంచమీ షష్ఠీ (పంచమీ షష్ఠీవిభక్తులకు ఒకచోటనే 'ఓః' అనునది చూపఁబడినది.) సప్తమీ విభక్తి రూపములు సంధులు విడఁదీసినఁ గన్పట్టును. మఱియొక యర్థమున నవి వేఱుపదములుగ నేర్పడును. అనువాదములో 'మా' అనునది లక్ష్మీపర్యాయ పదము. మూలమునఁజూపకపోయి నను సంబోధనా ప్రథమావిభక్తి కూడ ననువాదమునఁ జూపఁబడినది. 'ఓమా !' అనునది సంబుద్ధిరూపము. 'ఓమ్ + ఆకృతిన్' 'ఓమ్' అను నాకారముతో నని యర్థము చెప్పినప్పుడు సంబుద్ధి యుండదు. 'చేఁత, చేత' అను సబిందు నిర్బిందురూపములకు 'సబిందు నిర్బిందుక యోస్స్యాదభేదః' అనుదానిచే శ్లేషార్థముల నభేదము ప్రామాణికసిద్ధమే.

215 , 9A :- మా రామా ! = రామా! = స్త్రీ. మా = లక్ష్మి ! కారుణ్యాధారా ! = దయకు ఆధారమైనదానా ! ధారా + అపాంగా ! = ప్రవాహరూపమున నవిచ్ఛిన్నమైన క్రీఁగంటిచూపుగలదానా !

సారా సారా కారా, సారా + ఆ = శ్రేష్ఠములైన వస్తువులకు స్థానమైన దానవును (ని. ఆకారస్తుపదేభావే ఇతి రత్నమాలా) అసార + అకారా ! = అసారములైన వానిని చేయనిదానవునైన దానా ! (కరఏవకార ! స్వార్థికః ప్రజ్ఞాద్యణ్) నః, బ్రోవన్, వే, రావే, రావే ! = నన్నురక్షింప వేగమే రమ్ము,

216 . 9B 1 పా:- పదచ్ఛేదము. మా, రామామా, రా, మా, మా = మాయొక్క, రామా = రామునిభార్యయైనట్టి మా = లక్ష్మీ : మా = తల్లీ ! రా = రమ్ము.

2 పా :- సార + అగ = శ్రేష్ఠమైన చెట్టునకు (కల్పవృక్షమునకు) అగార = నివాసమైన స్వర్గమున, ఆ = ఉండుదానా ! = స్వర్గ స్వరూపిణీ ! లేదా, సార = శ్రేష్ఠమైన అగ = పర్వతమగు శేషాచలమున, ఆసా = ఉండుదానా ! (ఆసఉపవేశనే)

3 పా:- మార + అజ + అజ + ఆరామా ! మార = మన్మ ధుని యందును, అజ = పుట్టుక లేనివాఁడను పేరుపడిన, అజ = బ్రహ్మదేవునియందును, ఆరామా = సంపూర్ణమైన తృప్తిగలదానా ? మన్మథుఁడు, బ్రహ్మ, బిడ్డలుగా గలదానా !

4 పా:- వేరు + ఆ = నేనునీకు పైవాఁడనా ? వే, వే = మిక్కిలి వేగముగ, రావే = రావా ! రమ్మనుట.

216 . 10 :- పదచ్ఛేదము. 1 పా:- సా, సాకారా, మానామా, మా, 2 పా:- మా, మానామారా, కా, సాసా. 3 పా:- రాధారాధానా, మానాగా 4 పా:- గానానూనా ధారాధారా.

1 పా:- సా ! = లక్ష్మి ! స + ఆకారా ! = ఆకృతితోఁ (అర్చావతారముతో) గూడినదానా ! మానామా, (మా. నామ + ఆ) మా = సంపదలయొక్క, నామ = పేరులందు, ఆ = నివాస ముండుదానా ! సంపదలను చెప్పుపదములన్నియు నీ పర్యాయములే యనుట. మా = తల్లీ !

2 పా:- మా. మానామారా. మా = మా యొక్క, మాన = చిత్తౌన్నత్యమును. అమారా (న + మారా) = నాశము చేయని దానా ! రా = రమ్ము. (క + ఆ) కా = బ్రిహ్మకుస్థానమైన దానా ? బ్రిహ్మజననీ ! ని. కో బ్రిహ్మాత్మానిలార్కాగ్ని ఇతి రత్న మాలా. సా సా, స + ఆసా = విష్ణునియందుండు దానా ! (స = Name of Vishnu Apte's English to Sanskrit Dictionary)

3 పా:- రాధారాధానా, మానూనాగా, రాధా = రాధాదేవియొక్క, ఆరాధ = ఆరాధకుఁడైన విష్ణువునకు, అనా ! ప్రాణమైనదానవును, మా = సంపదచే,, అనూన = గొప్పదైన, అగా = వృక్ష మైన (కల్పవృక్షము) దానవునైన దానా!

4 పా:- గాన + అనూన + అధార + ఆధారా. గాన = వేణుగానము నకు, అనూన = గొప్ప, అధార = ఆధారుఁడైనట్టి కృష్ణరూప విష్ణువు. ఆధారా = నివాసముగాఁగలదానా !

7 . 11 : 1 పా:- మా, రామా = లక్ష్మీవనితా! మా రాము + ఆ = మర్మమా !, నన్నుపాలించుటలో మర్మమెందుకనుట.

2 పా:- సార + అగ = శ్రేష్ఠమైన వ్రతమగు హిమవతము, అగారా = నివాసగృహముగాఁగల పార్వతీదేవియందు, ఆసా = ఉండుదానా! (నిత్యము పార్వతిచే ధ్యానింపఁబడునది లక్ష్మియని ఇందలి స్తబకములలోఁ గలదు.)

3 పా:- మా = మాయొక్క, రామా = సంతోషమును గల్గించు దానా! మా = లక్ష్మి! (రక్షింపుటలో మారామ ఎందుకు అని మొదటి పాదములోని క్రియానన్వయము.)

217. 12 : 1 పా :- సామ + ఆ + ధామ + ఆ = సామవేదము నకు పూర్ణనివాసులగు పండితులకు నివాసమైనదానా! (1 సమంతాత్ అను అర్థమున ఆజ్ 2 ఆకారస్తు పదేభావే అనిరత్నమాల.) సారా = శ్రేష్ఠురాలా! అభీమా = భయముగొలుపనిదానా! 2 పా:- కామ + ఆరామ + అరామా = కోరికలయందే పూర్తిగా నానందించు వారి యందు = సంతోష పడనిదానా! (కేవలైహికేచ్ఛగల వారి యందు అనురాగము లేనిదానా!) భూ + మా = భూదేవీ రూపము నొందిన లక్ష్మి!

3 పా :- రామాధామ + ఆ = స్త్రీలయొక్క తేజస్సునకు స్థానమైనదానా! భామా = సత్యభామయను పేరు గలదానా!, ('నామైకదేశే నామగ్రహణమ్') రా, రా = రమ్మ, రమ్మ.

4 పా:- భామా కామ + ఆ = స్త్రీలయొక్క కోర్కెల యందుండు దానా (స్త్రీలు ముఖ్యముగా లక్ష్మినారాధింతురు) భా + మా + భూమ + ఆ = కాంతి సంపదయొక్క ఆధిక్యమునకు స్థానమైన దానా! 'రా, రా' అని మూఁడవ పాదములోని క్రియతో నన్వయము.

217. 13 : 1 పా :- మా = మా యొక్క, భూ + ఉమా + రామా + కామ, + ఆభా = భూమియొక్కయు. పార్వతియొక్కయు స్త్రీయొక్కయు, కోర్కెల యొక్క ప్రకాశము కలదానా ! భూదేవియు, పార్వతీదేవియు లక్ష్మీదేవి వలన సకలసంపదల నొందుచుండునుట.

2 పా :- మా = మా యొక్క, భార = భారములైన పనులందు, అరా = అ + ర, + అ = నిర్భయము నకు స్థానమైనదానా (రమ్ = భయం. నవిద్యతేభయం అరమ్ నిర్భయమిత్యర్థః నిర్భయస్య అఃపదంయస్యాస్సా = అరా) రా = రమ్మా, మా = మా యొక్క, ధామా = తేజస్సువైనదానా ! రా = రమ్మా.

3 పా :- మా = మా యొక్క, భూమ + ఆ = సంపదకు స్థానమైన దానా ! కామ + ఆరామా = మన్మథుని యందు పూర్ణముగ సంతోష పడుదానా ! (మన్మధుఁడు లక్ష్మీపుత్రుఁడు) కా = విష్ణుపత్నీ ! (కః = విష్ణుః తస్య భార్యా,కా)

4 పా:- మా = లక్ష్మీ ! భీర = భయముగల (భయమును గ్రహించునట్టి) వానియందు, ఆసారా = సుహృద్బల మైనదానా ! (ఆసారస్తు సుహృద్బలమితి వైజయంతీ) అమా = లక్ష్మీ ప్రియము కాని వాని యందు, అధామ + ఆ = తేజస్సునకు స్థానము కానిదానా (లక్ష్మీప్రియము కానిచోట తేజస్సు ఉండదనిభావము) "రా, రా" అను రెండవ పాదము నందలి క్రియలతో నన్వయము.

218. 14 : 1 పా :- చారుసుచా = అందమైన కాంతి కలదానా ! అవనీ = రక్షించుదానా : నీవు (కర్తృపదము).

2 పా:- భావివిభా = (నాకు) కాఁబోవు తేజస్సువై సదానా!
దానసదా = దానవాహినీ!

3 పా:- వరా = శ్రేష్ఠురాలా! ౘమా = లక్ష్మి! మారు + ఆ = (నీకు) ప్రతియున్నదా! సాటియెవరనుట, రావ = రావా? (రమ్మనుట)

4 పా:- వేగగన్ = (నాబ్రిదుకుకు) ప్రభాతమగు నట్లుగా, వే = వేగముగా, నావవ = (నావవు + అ) నౌకవే (సంసార సముద్రమును తరించునౌకవు) నాన్ = అనునట్లుగా. 'రావ' అనిమూఁడవ పాదములోని క్రియతో నన్వయము.

218. 15 :- పై పద్యములోని పదములే, అర్థములే యిందును నగును.

218. 16 :- అచ్ఛసంగః = స్వచ్ఛమైన వారి యందు కలిసియుండు దానా !, ఫణిశయ మనోజ్ఞదేవి: = ఫణిశాయియగు విష్ణువునకు మనోహరవగు భార్యయైన దానా! బహుళ + ఆధులు = అనేకములగు మనో వ్యాధులు, హెచ్చైనన్ = అతిశయించి యున్నప్పటికిని, ఇంకింపన్ = హరించి పోవునట్లు. చూడు = చూడుము. తెనుఁగులో వృత్తములకు ప్రాసనియమము కలదుగాన ప్రాసాక్షరము పునరుక్తము కావచ్చును. అయినను ఇచ్చట హెచ్చు అను నపుడు దంత్యముగ, 'అచ్ఛ' అనునపుడు తాలవ్యముగ చకారమునకు భేదమేర్పడియే యున్నది.

219. 17 : 1, 2 పా :- వే = వేగముగా, రారా = రమ్ము రమ్ము, మా = లక్ష్మి! ఏ, సంసార + అరణ్య + ఆప్తుల్ = సంసారమను నరణ్యమునందు ఆప్తులగు వారెవ్వరును, రారు =

(రక్షించుటకై) రారు. రాగ + ఉద్దామా = గొప్పప్రేమ కలదానా!

3, 4 పా - మారు = (నాకు నీవుగాక) ఇతరులు, ఎవ్వార్ = ఎవరున్నారు? రా = రమ్మా, మాతా = తల్లీ! సంస్కృత్యారాధ్యా. సంస్కృతి + ఆరాధ్యా, = సంసారము నందుఁ బూజింపఁ దగిన దానా! వాణ్యాధారా, వాణీ + ఆధారా = సరస్వతికి ఆధారమైనదానా, నాస్తుతి రూపసరస్వతికి ఆధారమైన దాన వనుట. రా = రమ్మా.

221. 19 : 1 పా :- పదచ్ఛేదము :- మారము, మామేర, అర, మా, మామేర = మాహద్దు, అరన్ = నశించునట్లుగా, మా కుల మత సంప్రదాయ మర్యాదలు పోవునట్లుగా, మారము = ఇతర దేవతా భక్తులముగా మారఁబోము. మా = లక్ష్మి!

2 పా : పదచ్ఛేదము :- మారు, అరగాన్, చేయు, రమా, రమా! = లక్ష్మి! మారు = ఇతరభావము, అరగాన్ = నశించునట్లుగా, చేయు = చేయుము.

3 పా : పదచ్ఛేదము :- మాఱు, అయుతా, నీవ (నీవు + అ) రమా!, అయుత! = విష్ణువుతోఁ గూడిన దానా! (అకారో బ్రహ్మవిష్ణ్వీశ ఇతిరత్నమాలా) రమా = లక్ష్మి! మాఱు = అన్యము (అన్యదైవము) నీవ; నీవు + అ = నీవే. ఇతర దైవము లన్నియు నీలోనంతర్భూతము లైనవే యనుట.

4 పా :- పదచ్ఛేదము :- మారవ, మమ్మ, ఓము, రమా! మారవు + అ = భేదబుద్ధిని పొందనేపొందవు, మేము అజ్ఞాన

ముచే నన్యదైవములను భజించినను సర్వము నీవేయగుట
మా యందు భేదబుద్ధిఁ జూపమని భావము. మమ్మ, రమా,
ఓము = లక్ష్మీ ! మమ్ము రక్షింపుము.

222. 20 : 1 పా :- క్షమాసమాగమా, రమా, క్షమా = భూమితో,
సమాగమా = కలయిక గలదానా, (భూదేవియు శ్రీదేవియు విష్ణు
భార్యలగుటచే) లేక, శాంతితోఁ గూడినదానా ! రమా !

2 పా :- ప్రమా: క్రమాతిమాన, మా; ప్రమా = యథార్థ
జ్ఞాన రూపిణీ, క్రమ + అతి + మాన = క్రమము నతిక్రమించిన
పరిమాణము కలదానా ! మా = లక్ష్మీ !

3 పా :- ఉమాసమాభిమాన, మా; ఉమా = పార్వతియందు,
అసమ = సాటిలేని, అభిమాన = ప్రేమగలదానా !, మా =
మా యొక్క, దీనికి ముందు పాదముతో నన్వయము.

4 పా :-కుమార్గము, ఆదిన్, మాపుమా ; కుమార్గము = మా
చెడుదారిని, ఆదిన్ = మొదటిలోనే, మాపుమా =
పోఁగొట్టుమా.

223. 21 : 1 పా :- నాకాసారా, సారావాసా 2 పా :- కాకాకామా,
మాభావా, 3 పా :- సాకారా, రా, కావా, భారా 4 పా :- రాకా
రాజాస్యా, కామాసా,

1 పా :- నాక + ఆ, సారా = స్వర్గమందు అంతటను శ్రేష్ఠ
మైనదానా ! సార + ఆవాసా = శ్రేష్ఠమైన (విష్ణు వక్షము)
నివాసము గలదానా ! లేక, నాకు + ఆసారా, నాకు = నాకు,

ఆసారా = మిత్రబలమైనదానా! (ఆసారస్తు సుహృద్బలమితి వైజయంతీ)

2 పా:- కాక + అక + అకామా, కాక = కాకాసురునకు, అక = దుఃఖమును (నవిద్యతే కం సుఖం అకం, దుఃఖమిత్యర్థః) అక = దుఃఖమును, అకామా = కోరనిదానా! (కాకాసురుని రాముఁడు చంపఁబోగా రక్షించినదని భావము) భా భావా = కాంతిభావమైనదానా! కాంతి స్వరూపిణీ! యనుట.

3 పా:- స + ఆకారా = ఆకృతితోఁ గూడినదానా! (సగుణ రూపిణీ!) రా = రమ్ము, భారా = (మా యొక్క, లేక, జగత్తు యొక్క) భారము కలదానవై, కావా = కావా! (అగుదువు. మా యొక్కయు జగత్తుయొక్కయు భారమంతయు వహింతువనుట).

4 పా:- రాకా + రాజ + ఆస్యా! = పూర్ణిమ నాఁటి చంద్రుని వంటి ముఖము కలదానా! కామ + ఆపా = మన్మథుని యందుండుదానా! పుత్రుఁడగు మన్మథుని యందు ప్రేమ కలదానా! యనుట.

224. 22 : 1, 2 పా:- సముద్రజ + ఉన్నతా = సముద్రమందుఁ బుట్టిన వారి యం దున్నతురాలా! మహాక్షమా = గొప్పక్షాంతి కలదానా! సుధీప్రతారికా = మంచిబుద్ధి గలవారిని ఎక్కువగాఁ దరింపఁ జేయుదానా!

3, 4 : పా:- సముత్ + రజః + అన్విత + అరి + హా = సంతోషముతోఁ గూడిన రజోగుణాన్వితులగు శత్రువులను ఘాతింపఁ జేయుదానా! కుమార్గ = చెడుమార్గమందలి, ధీ = బుద్ధి

యందు, వ్రత = దీక్షగల వారు, అరికా = శత్రువులుగాఁ గలదానా!
చెడుమార్గమును బట్టిన వారు నీకు శత్రువులనుట.

225 , 23 :- ఇంసిరా + అంబ ! = లక్ష్మి! మా = మాయొక్క,
కరుణామందిర + అంబ ! = కరుణకు నివాసమైన తల్లీ ! వంద
నీయ ! = నమస్కరింపఁదగినదానా ! మోక్షముతోన్ = జన్మ
వాసనలయొక్క విడుదలతో, మోక్షమున్ = కైవల్యముక్తిని,
ఈవు = నీవు, అందన్ = మాకులభించునట్లుగా, ఈయన్ =
ఈయఁగా, అరుదా ! = ఆశ్చర్యమగునా !

226 . 24 : 1పా. పదచ్ఛేదము:- కాకానన, భూభూ, మమకాకార, రమా,
మా॥ కాక + అనన = కాకాసురుని బ్రదికించినదానా ! (అనసం
ప్రాణనం, అనప్రాణఇతిధాతోర్లుట్) భూభూ = భూమినుండి
పుట్టినదానా ! (సీతారూపమున) మమక + అక + ఆ + ర =
మమక = నాయొక్క, అక = (కమ్సుఖంన విద్యతే సుఖం
అకం దుఃఖం) దుఃఖములకు, ఆ = పూర్తిగా (ఆ,సమంతాత్)
ల = (రలయోరభేదః) ఖండించుదానా ! ని. లఃఖండనే త్రిష్వా
దానః. రమా = లక్ష్మి ! మా = తల్లీ.

2 పా : పదచ్ఛేదము :- కా, కావవ, రా, రామమఘా ఘాతత
పాపా॥ కా = విష్ణుపత్నీ ! (కః విష్ణుఃతస్యపత్నీ,కా) కావవు +
ఆ = రక్షింపవా ! రా = రమ్మ, రా...పా, రామమఘ =
రామునిఁ గూర్చిచేయుయజ్ఞములందు, అఘ = పాపములను,
ఆతత = విరివిగా, ప = పాలించువారిని (పాతిరక్షతిఇతిపః)
యజ్ఞవిధ్వంసకులననుట, అపా = రక్షింపనిదానా !

3 పా: పదచ్ఛేదము:- కాకాననానాకక, కాకు, అకకు, అమా, మా॥ కా...న, కా = చెడ్డదైన, కానన = అడవులందు, నానా = అనేకములైన, అకక ! = దుఃఖములు కలదానా! (అకందుఃఖం, స్వార్థేకః అకకం దుఃఖమిత్యర్థః). సీతారూపమున దుర్గమారణ్యములఁ గష్టముల ననుభవించిన దానా ! యనుట. కాకు + ఆఁకకు + అమా; అమా ! = తల్లీ ! ఆఁకకు = ఆటంకము నకు, కాకు = కాకుము. మా యత్నముల కాటంకములు రానీకు మనుట. చివరి 'మా' ముందుపాదముతో నన్వయించును.

4 పా :- పదచ్ఛేదము ; కాఁక, ఆఁగఁగన్, వే, భేఖు, అఱంగాన్, కానన, జేజే, మా = (వెనుకటిపాదములోని చివరి యక్షరము) మా యొక్క, కాఁక = తాపము, ఆఁగఁగన్ = అడ్డగింపఁబడు నట్లుగా. (శ్లేషే సబిందునిర్బిందుకయో స్స్వైద భేదః) వే = శీఘ్రముగా. వేఖు = భేదభావము, అఱఁగాన్ = నశించునట్లుగా, రా = (రెండవపాదములోని క్రియాక్షరముతో నన్వయము) రమ్ము, జేజే = నమస్కారము.

226. 25 : పదచ్ఛేదము :- మాతా, ఈఃవే, భూజాతా, సీతా, తాయీా, భూతాజాసీమా, మా, తాపాతాపా, ఈఃవే. ప్రసిద్ధతాగ్ర్య నంతార్థశ్రీ, మా, ఈఃవే = సీవే, మాతా = తల్లీ ! భూజాతా ! సీతా ! = భూపుత్రివైన సీతారూపిణీ ! తాయీా ! = తల్లీ ! భూ...మా॥ భూత = ప్రాణులకును. అజ = సృష్టికర్తయై జన్మరేని వాఁడను ప్రసిద్ధిగల బ్రహ్మకును, ఆ = సంపూర్ణమైన

సీమా = స్థానమైనదానా! పిపీలికాది బ్రహ్మ పర్యంతము నీ బిడ్డలే యనుట. మా = మా యొక్క, తా...పా. తాప = తాపములను. ఆ = అత్యంతము. తాపా = తపింపఁజేయు దానా! మా తాపమూలములైన పాపములను నశింపఁ జేయు దానా! యనుట. మా = తల్లీ!. ప్రి...శ్రీ. ప్రిస్ఫీత = మిక్కిలి బలిసినట్టియు. అగ్ర్య = శ్రేష్ఠము లైనట్టియు. అనంత = అంతము లేనట్టియు. అర్థ = కార్యములం దైన శ్రీ = సంపదను. ఈవే = ఈయవా! ఇచ్చెద వనుట.

227. 26 : పదచ్ఛేదము :- రారా, రావా, రాధాతామాధ్యా రామా, భామా, కామారా, జే, రాజాతా, సారాభాపోమా. రా. జే. మా. ధీపేతా, మా. అర్థము :- రాధా...మా. రాధాతా = రాధా భావమునందు. మా = అభిమానముచే. అధి + ఆ. రామా = ఎక్కువ అధిక ముగా సంతోష పడుదానా! రారా = (రాం = ధనం, రాతి = గృహ్ణాతి) ధనమును గ్రహించుదానా! ధనమునకు నివాస మైనదానా! యని భావము. 1 ని.మాశ్రీ మానే మృతౌ వేళా ఇతి రత్నమాలా. 2 ని. రాత్రియాంహేమ్ని శాలాయామితి రత్న మాలా; రావా! = మమ్ము అనుగ్రహింపగా రావా! రమ్మ అనుట; రామా! = రాముని భార్యయైన సీతారూపము గలదానా! భామా! = సత్యభామారూపము నొందినదానా! (నా మైక దేశేనామ గ్రహణం) కామ + ఆరా = (ఆసమంతాత్. రాతిగృహ్ణాతీతి ఆరా) కోరికలను పూర్తిగా గ్రహింప జేయుదానా. జే = నమ స్కారము. రాజాతా = ధనసమూహ మైనదానా! సారా + ఆభా + పా + ఉమా. సార = శ్రేష్ఠమైన. ఆభా = కాంతిని,

పా = పొందియున్నదియైన (గొప్పదీప్తి మంతురాలైన) ఉమా! = పార్వతీదేవి కలదానా !, ధీ = బుద్ధిని. పా = పాలించు నట్టిదైన సరస్వతీదేవితో, ఇతా = కూడుకొని యుండుదానా ! ఉమా సరస్వతులచే సేవింపఁ బడుదానా ! యనుట. మా = లక్ష్మీ ' రా = రమ్ము (ప్రత్యక్షము కమ్ము) జే = నమస్కారము.

217. 27 : పదచ్ఛేదము :- రామారామా, మారా, మా, రా, రామ + ఆ + తాప + ఉపేతా, ఆరాధ్య + అజ + అ, మార + ఆవాసా, తారాధాభామా. కా, ధీభారా, జేజే. రామ + ఆరామా = రామునియందు ఎక్కువ సంతోషించుదానా ! (ఆసమంతాత్ రమతీతిఆరామా) మారు + ఆ = నీకు మారేమున్నది ? (నీకు సమానులు మరెవరున్నారు ?) మా ! = లక్ష్మీ ! రా = రమ్ము, రా...తా, రామ = రామునియందు, ఆతాప = సంపూర్ణమైన విరహతాపముతో, ఉపేతా = కూడినదానా ! (సీతా రూపమున) అ...జా. ఆరాధ్య = సేవింపఁ దగిన, అజ = బ్రహ్మదేవునకు, అ = సానమైన దానా ! మేము సేవించు బ్రహ్మకుఁ దల్లివైనదానా ! ని. అకారస్తుపదేఘావే ఇతి రత్నమాలా, మా... సా, మార = మన్మధునకు, ఆవాసా = నివాస మైనదానా ! తారా = నక్షత్రములకు, ధ = రక్షకుఁడైన చంద్రుని యొక్క (ధః = Protector, Apte's English to Sanskrit Dictionary )ఆభా = కాంతి యనెడు, మా = సంపద కలదానా, కా = విష్ణుపత్నీ ! ధీ = బుద్ధియొక్క, భా = కాంతిని, రా = గ్రహించుదానా !, జేజే = నమస్కారము.

228 , 28 : పదచ్ఛేదము :- రామా రామా, మారా, మా, రా, మా, మా, మామా, అమా. మా, మా, మా, రామా కారా. రాకా మారా, మా, మారా, జేజే, రా, మామా

అర్ధము :- రామ + ఆరామా ! = రామునియందు సంపూర్ణముగ నానందించుదానా । మార + ఆ; మార = మన్మధునకు, ఆ = స్దానమైన దానా ! మా = తల్లీ !, రా = రమ్ము, ప్రత్యక్షము కమ్ము అనుట. మా, మా = మా, సంబంధములైన, మ + ఆ = బంధనములకు స్థానములైన పాపములను. మా = నశింప జేయుదానా, ని. మః పుంసిబంధనే ఇతిరత్నమాలా, ని. మాస్త్రీ మానే మృతౌవేళా మేధాశ్రీ మధ్యమాత్రృష్వితి రత్నమాలా ని, ఆకారస్తు పదే భావే ఇతి రత్నమాలా! అమా (న + మా) = కొలతలేని దానా. సాటిలేనిదానా యనుట, మా = మాయొక్క. మా = తల్లీ ! మా = బుద్ధిరూపిణీ ! రామా + ఆకారా; రామా = రామునిభార్యయొక్క (సీతయొక్క) ఆకారా ! = రూపము కలదానా ! రాకామారా, రాకా = పూర్ణిమయందలి, మా = సంపదను. రా = గ్రహించుదానా ! పున్నమవెన్నెలవలె ఆనంద మిచ్చునదనుట. మా = లక్ష్మీ ! మారా? = నీకు అడ్డేమున్నది ? మామా, మా = స్త్రీలయందు, మా = హద్దుఅయినాదానా ! నీ కంటె స్త్రీలలో గొప్పవారు. లేరనుట రా = రమ్ము, జేజే = నమస్కారము.

229 . 30 : తాత్పర్యము :- సమస్త సంపదలతో నిర్మల గృహము, అందమైన భార్యతో ఆనందము. మనుమల యొక్కయు, మునిమను

మల యొక్కయు జననము, అనునివి కలుగునట్లు లక్ష్మీదేవిని సేవించుటయే జన్మకు సాఫల్యము. లక్ష్మీదేవిని సేవించిన పైవన్నియుః గల్గునని భావము,

230 , 32 : పదచ్ఛేదము :- ఏలుకోక, ఏల, కాలకాలాలికా, కలఃకలు, ఏల, లీలలా, లోకలోల, లౌకికాకాలకల్లోల కాలికా, కలికి, కాలికాకాల. కోఃకలు, ఏల.

అర్థము :- ఏలుకోకఏల ? = ఏలుకొనకుండ నెందులకు ? ఇంకను ఏలరక్షింపవు ? అనుట. కాలకాల = మిక్కిలి నల్లనైన (వీప్సాయాం ద్విర్భావః) ఆలికా = తుమ్మెదలవంటి (స్వార్థేకః తతష్టాప్) అలకా = ముంగురులుగలదానా ! కలఃకలు = కాలుష్యములు, ఏల = ఎందులకు ? లీలలా = విలాసలా ? (అట్లుండుట నీయొక్క లీలలవునా ?) లోక లోల = లోకులయందు నిలుకడలేనిదానా ! లక్ష్మి యెవ్వరియందు స్థిరపడి యుండదనుట. లౌకిక = లోకవిషయములందు, అకాల = కాలముకాని కాలమందైన (అనుకొనకుండ సంభవించునట్టి) కల్లోల = నాశతుల్యములకు, కాలికా = మృత్యుదేవతవైన దానా !, కలికి! = చక్కనిదానా ! లౌకిక + అక + ఆ + ల, లౌకిక = లోకసంబంధమైన, అక = దుఃఖములను, ఆ = సమగ్రముగ, ల ! = ఖండించుదానా ! కోఃకలు = కోపతాపములు, ఏల ? = ఎందులకు ? మాపైన కోపమేల ? యనుట.

230 . 33 : పదచ్ఛేదము ;- మమ్మ్మ, ఓమ, మీమోమ. మా, మామమామ, మమ్మ్మ. ఓము, మమ్మ్మ, అమ్మము. అమ్మ. మా, మేము.

అర్థము :- మీమోము + అ = మీయొక్క ముఖమే (మీముఖ దర్శనమే యనుట) మమ్మ = మమ్ములను, ఓమన్ = రక్షింపఁగా, మా = తల్లీ ! మామమామ = మామకు మామయైన విష్ణువు (సముద్రుఁడు తనకూఁతురగు లక్ష్మిని విష్ణునకిచ్చి మామయయ్యెను. విష్ణువు తన పాదములందుఁ బుట్టి తనకుకూఁతురైన గంగను సముద్రునికి భార్యగా చేసెను. ఈవిధముగా మామకు మామయైనవాఁడు విష్ణువు) మమ్మ = మమ్ములను, ఓమున్ = రక్షించును. దయగలదాన వగుట ముందు నీముఖదర్శనము చేసికొన్న మా పాపములను బోఁద్రోలిరక్షింతువు, ఆపైని విష్ణువుకూడ, రక్షించును. కాని ముందుగానే విష్ణువును దర్శింప నాతఁడు మాపాపములను కఠినుఁడై మన్నింపక శిక్షించునని భావము.

**231 . 34 :** పదచ్ఛేదము : 1 పా:- మారామా, రా, రామారామా, 2పా:, రారా, రా, మా, మారా, రా, రా, 3 పా:- మారారారా, రారా, రామా, 4 పా:- రామా, రామా, మారామా, రా.

1 పా:- మారాము + అ = మర్మమా ! నీవు ప్రత్యక్షము కాకుండుటలో మర్మమున్నదా ? యనుట. మారామా = లక్ష్మీ రూపవనితా ! (లీలామానుషీ రూపిణివనుట) రా, రా = రమ్మి రమ్మి (వీప్సయాంద్విరాభావః)

2 పా :- రారా = ధనమును గ్రహింపజేయుదానా ! (రామ్ ధనమ్ రాతిగృహ్ణాతీతిరారా, ని. రాస్త్రియాం హేమ్ని శాలాయామితి రత్నమాలా) రా = రమ్మి, మా = లక్ష్మీ ! మారు + అ = (నీకు) మారున్నదా ! నీకు సాటిలేరనుట. (ర + అ + రా + అ)

లారా, ర = అగ్నియందు. ఆ = అంతటను, రా = ధనము
నకు, ఆ = స్థానమైనదానా! ‘శ్రియమిచ్ఛేద్ధుతాశనాత్’ అను ప్రమా
ణమున అగ్నియందు ‘శ్రీ’యుండుననుట. ని. రః పుమాన్ పావకే
కామే క్షయే వహ్నౌ భయే రతా వితి రత్నమాలా.

3 పా:- మార + అర + ఆ + రా : మార = మన్మధుని యందు
అర = తీవ్రమైన. ఆ = భావమును, రా = గ్రహించుదానా!
కుమారుఁడగు మన్మథునియందు వాత్సల్య తీవ్రత కలదానా! యనుట.
ని. ఆకారస్తు పదేభావే ఇతిరత్నమాలా. రా = రమ్ము, రా =
రమ్ము, రామా = రాముని భార్యయైన సీతారూపిణీ!

4 పా:- రామా + ఆరామా = స్త్రీలయందు ఎక్కువ ఆనందించు
దానా! స్త్రీలు ఎక్కువగా లక్ష్మీకళ గలవారనుట. మాన + ఆ =
నీకు సాటియున్నదా! మా = తల్లీ! ని. మా శ్రీ మానే
మృతౌ వేళా మేధా శ్రీ మధ్య మాతృష్వితిరత్నమాలా. రా =
రమ్ము (ప్రత్యక్షమగుమనుట).

232. 35: పదచ్ఛేదము: 1 పా:- మాయామాయా, మామా
మాయా 2 పా:- మాయా, మాయా మాయా అమాయా,
3 పా:- మాయా, మాయామాయా! మాయా 4 పా:- మాయామా,
అయా, అమాయామా, యా.

1 పా:- అర్ధము:- మా = మేధను, య = పొందినవారియందు
(యా ప్రాపణే) అమాయా = మాయలేనిదానా! జ్ఞానమార్గమున
మాయావరణము లేకుండఁ జేయుదానా యనుట. మాయా +
ఆ + అమాయా, మా = లక్ష్మిని, య = పొందినవాఁడగు

విష్ణునంచలి, ఆ = భావమునందు, అమాయా = మాయలేని దానా ! విష్ణుని భావించిన మాయావరణము లేకుండఁ జేయుదువనుట.
2 పా:- మాయా = మాయాస్వరూపిణీ ; మాయ = మాయ గలవారియందు (అర్శఆదిత్వాదచ్) ఆ = అంతట, మాయా = మాయగలదానా ; అమాయా + ఆ, అమాయ = మాయలేని వారియందు, ఆ = స్థానముగలదానా ;

3 పా :- మాయా, (మాయ + ఆ) మాయ = విష్ణువునందు. ని. మాయఃపీతాంబరేఽసురే ఇతి విశ్వః. ఆ = స్థానముఁగల దానా ; మాయామాయా, (మా + ఆయామ + అయా,) మా = సంపదలయొక్క, ఆయామ = దైర్ఘ్యమును, అయా = పొందిన దానా ; మాయా = విష్ణుపత్ని ;

4 పా:- మాయామా, మా = మరణమునకు, యామా = యమసంబంధమైనదానా ; మరణమునకు మరణమైన దానా అనఁగా మోక్షముఁ గూర్చుదానా యనుట, (యమనం యామో యమశ్చ. యమ ఉపరమే) అయూ ! = శుభవిధియైనదానా ; అమ + ఆ + యామా, అమ = రోగములయొక్క, ఆ = స్థానమైన కారణములకు (ని, ఆకారస్తుపదే ఇతీరత్నమాలా) యామ (యమ సంబంధమును) నాశమును, ఆ = అంతటను, యా = పొందించు దానా ! రోగములయొక్క, కారణములను పూర్తిగా నాశము చేయు దానా ; శరీర రోగకారణములను భవరోగకారణములను పూర్తిగా నాశము చేయుదువనుట,

233. 36 :- 1 పా :- మాతా ! = తల్లీ ! రమ్యాక్షి ! = రమ్యము లైన కన్నులు గలదానా ; అమర = గంధర్వ సంబంధమైన

(దేవతా సంబంధమైన) గ = గానమును (ని. గం. గీతే, గాతు. గాథాయాం; గో. గంధర్వ గణే; చయే; ఇతి నానార్థ రత్న మాలా) గ = పొందుదానా! (గచ్ఛతీతిగా) గరము = కరము = మిక్కిలి (సూ. ప్రథమ మీఁది కచటతపలకు గసడదవలగు అను సూత్రమున కరము అనునది గరము అని యగును) అమ్మా = తల్లీ! ఘృణత్ + దేవతా = పురుగుల వలె ఆచరించు దేవతలు కలదానా! (ఇతర దేవతలు అల్పాల్పు లనుట.) మా = లక్ష్మీ! రమ్మా = రమ్మా. ప్రత్యక్షముకమ్మా.

2 పా :- మాతా = తల్లీ! నాకు = నాకు. ఏది = ఏదియును. వద్దు = వలదు. మోక్షము తప్ప ఇతరము లేవియు నేను కోరుట లేదనుట. అమరదద. అమర = దేవతా సంబంధములగు లోకములను. ద = చీల్చునట్టి రాక్షసులను. ద = ఖండించుదానా! దేవతలను పీడించు రాక్షసులను నాశముచేయుదానా! యనుట. (ద్యతి ఖండయతీతిదః) అమ్మా = తల్లీ! చరితావ్రతి + ఈమా, చరితావ్రతి = నడవడికయందు దీక్ష గల వారియందలి (సచ్చరితులందు) ఈ = సరస్వతివి. బుద్ధివి. లేక, విద్యవు ననుట. ని. ఈకారోఽబ్జదశే లక్ష్మ్యాం వాణ్యామితి రత్నమాలా, మా = సంపదవు నైనదానా! సచ్చరితులకు విద్యా సంపదలనిచ్చుదానా యనుట. నాకు = నాకు, ఏది = ఏవిధమైనట్టి, దరము = భయమును, వద్దు = వలదు. నాకే భయమును లేకుండఁ జేయు మనుట.

3 పా :- రత + ఉమా = ఆసక్తిగల పార్వతి కలదానా! పార్వతిచే సేవింపఁబడుదానా! యనుట, మా = మా యొక్క.

తీవ్రత్రా, తీవ్ర = తీక్ష్ణ విషయముల నుండి, సంసార, తీవ్రతలనుండి యనుట, త్రా = రక్షించుదానా! (తృపవన తరణయోః) అసన్ + కాము = మాపాపతీవ్రతలచే ఒప్పుకొన సమర్థులము కాము; అహితత తహి, అహిత = కీడుగల్గుపనులచే, తత = విరవియైన దానిని, పాపరాశి ననుట, హి = పోఁద్రోలుదానా! (హినోతీతిహి) మమ్మ = మమ్ములను, ఆదన్ = ఆదుకొనఁగా, రమ్మా = రమ్మ.

4 పా :- బ్రహ్మాండగమ్యా ! = బ్రహ్మాండ మంతయు (ప్రపంచ మంతయు) గమ్యముగాఁ గలదానా! సర్వత్రయుండుదానా! లేక, బ్రహ్మాండముచేఁ బొందఁదఁగినదానా ! రతా = ఆసక్తిగలదానా, మా = తల్లీ ! ఘనుండు + అన్ = ఘనుఁడు అనునట్టి, ప్రమ ము = ప్రకృష్టమైన సంతోషమును గల్గించు నట్టిది. (మార్గము) అమరన్ = కల్గునట్లుగా, మాతో = మాతోడ, మా కుటుంబ సభ్యులందఱి తోడ ననుట, రమ్మా = రమ్మ. 'నేను ఘనుఁడను, నేనుఘనుఁడను' అని సంతోషము నొందు జీవిత మార్గముఁ గల్గించి మా వారందఱితోడను నీవు నిత్యము కలిసియుండుమా అని భావము.

234. 37 :- నిత్యావేక్షణకర్మ రక్ష ! = నిత్యము దృష్టివ్యాపారము చేతనే రక్షించుదానా ! సర్వదాశస్త ! = ఎల్లప్పుడు స్తుతింపఁ బడుదానా ! మా = మా యొక్క, స్తుతి + అంకమ్మ = స్తోత్రమునకు చిహ్నము, ఇది = ఈ లక్ష్మీ సహస్రకావ్యము. సుశర్మప్రభా = చక్కనిసంతోషపు వెలుఁగు వైన దానా !

లేక, సూర్యనారాయణ శర్మకు వెలుఁగైనదానా! భృత్యా + అట, శ్రమ. లాస్య. సంగ. హరణా = కూలికొఱకై, తిరుగు లాడెడి. శ్రమయను. నర్తనముయొక్క. సంబంధమును, పోఁగొట్టుదానా! విస్రంభ, మూలప్రమా = విశ్వాసమునకు, మూలమైన యధార్థజ్ఞానమైనదానా! మా = లక్ష్మి! త్యాగ + అనిశ! = నిత్యము త్యాగ గుణముకలదానా! నిస్తుల, ప్రభృత, ధామా = సాటిలేనట్లు మిక్కిలి నిండింపఁబడిన ప్రభావము కలదానా!

235. 38 :- ఆదిధ్యేయ = ముందుగా ధ్యానము చేయఁదగినదానా! ప్రశాన! = చక్కఁగ శాసించుదానా! భాగ్యద = భాగ్యదానము నందు, ఆయామ = దైర్ఘ్యము గలదానా! విశేషభాగ్యప్రదా! యనుట. ఆదేయున్ = స్వీకరింపఁదగిన వానిని. హృదయ + ఆలయున్ = హృదయమే దేవాలయముగాఁ గలవానిని, శమ ములన్ = ఇంద్రియనిగ్రహముల చేత, ప్రారబ్ధమున్ = శరీరము నెత్తించెడు కర్మవిశేషమును. చించు = నశింపఁజేయు నట్టి, శ్రీ+త్రా+ఈ+దున్; శ్రీ = లక్ష్మీదేవి. త్రా = రక్షించునట్టి, ఈ = వాణిని అనగా బుద్ధిని, (ని. ఈకారో ఒబ్జ దళే లక్ష్మ్యాం వాణ్యాంకమలకేసరే ఇతిరత్నమాలా) దున్ = ఇచ్చు వానిని అనఁగా లక్ష్మిని నిలువరించునట్టి వాణి నిచ్చువానిని, లక్ష్మీసహస్రకావ్యకర్త యైనవాని ననుట. వేంకట పాదున్ = పూజ్యుఁడైనట్టి ఆత్రేయ వేంకటాధ్వరి కవిని. 2 వేంకటేశ్వర స్వామి పాదములఁ బట్టియున్న సూర్యనారాయణశర్మను, మహిన్ = భూమియందు, రాట్+శ్రీ+ద్వారున్ =

రాజులయొక్క సంపద్వంతములైన గుమ్మముల కడనున్న వానిని, వేంకటాధ్వరి ఎందఱో రాజుల నాశ్రయింపఁ గోరి వారి గుమ్మములకడ. దౌవారికులచేఁ దిరస్కరింపఁ బడి నిరాశ నొంది తుదకు లక్ష్మినాశ్రయించి నట్లు ఈ కావ్యమునం దనేక స్థలములందు చెప్పఁబడి యున్నది. వే-శర్మన్ = వేదుల సూర్య నారాయణశర్మను, మాయాదా = మాయను ఛేదించుదానా ! ఈ భవమును = ఈవిధమైన పుట్టుక. (ఈజననమరణ పరిభ్రమణము.) 'కట్కట' = కట్. కట్ అను ధ్వనులతో. (బంధములు త్రెంపునపుడు 'కట్కట్' అనుధ్వనులగును.) మటుమాయఁగా = పూర్తిగా నశింపఁగా, కర్మన్ = కర్మబంధమును. జార్చి = సడలునట్లు చేసి. ననుఁ = నన్నుఁ గూడ. ప్రోవుము = రక్షింపుము.

235. 39 :- ఆ, యాత్రేయశ్రీ, శ్రీమానున్ = 1 ఆత్రేయ వంశ సంపదచే జక్కని గౌరవము గలవానిని (వేంకటాధ్వరిని) 2 మాతామహగోత్రమగు ఆత్రేయగోత్రము యొక్క ఘనతచే చక్కని గౌరవముకల అనువాదకర్తయగు సూర్యనారాయణశర్మను, మాయా + అపాయీ = మాయనుదొలఁగించుదానా ! భారద్వాజ + ఆశా + యున్ = భారద్వాజ వంశపు వైపును పొందిన వానిని (యాప్రావణే) అనువాదకర్తను. చాలన్, ప్రోవన్, మా = లక్ష్మి ! రా = రమ్ము.

236. 40 :- సుఖిత్వ + ఆవాసము = సుఖిగానుంటకు నివాసమును, సుఖముగా బ్రదుకు పరిస్థితిని ననుట. శ్రీవాస + అపాంగవినుతిన్ = సంపదలకు నివాసమయిన కటాక్ష స్తుతిని.

237 . 41 :- ప్రవాహి, సంసార, విప, ద్విపాదినీ: = ప్రవాహముగలిగిన, జనన మరణ పరిభ్రమణ మందలి, విపత్తులను పోఁద్రోలుదానా ! ద్రవించి = పలుచనై

237 . 42 :- భావ + ఆర్తి, సంతారిణీ ! = మనసునందలి బాధలనుండి తరింపఁజేయుదానా ! శ్రావింతున్ = వినిపింతును. వే = వేగముగా, వేయి = వేయి విధములైన, అనేకములైన యనుట, దీప్రమ్ముల = ప్రకాశమానములగు విషయములను, పోచి = ఇచ్చి, పోషించి, మాచ్చకక్కులు, = మాబుద్ధులను, దప్పి + పాయగన్ = దాహము తీరునట్లు అనఁగా శ్రమము పోవునట్లు తావించుమా = మామనసులకు విజ్ఞానతృష్ణదీర్చుమా యనుట.

238 . 43 :- చేఁదుము = ఆకర్షించుకొనుము; మైన్ = శరీరమును ఈఁగన్ + బోఁగాదె = నివర్తించుకొననగును గదా ! జన్మ లేకుండఁ జేసికొననగును గదా యనుట; ఈవితోన్ = త్యాగముతో.

238 . 44 :- విగతి = గతిలేనిస్థితి, దిక్కుతోఁచనిస్థితి, నేను = నేను అనుభావము అహంకారము, విగతమైనన్ = పోయినచో, విధి = దైవము. చేఁదున్ = ఆకర్షించును, పతిమీఁదుచే = భర్తయగు విష్ణువుద్వారా, నీ ప్రగతిన్ = నీవిచ్చు ప్రకృష్టమైన గతిని. సారూప్యాదిముక్తులను, నేను = నేను, చెందన్ = పొందఁగా, తగదఁటే = అర్హతలేదా ! కలదనుట, వే = వేగముగా, వివేకతరు భూమి ! = జ్ఞానవృక్షమునకు మూలాధారమైన దానా ! అహంకారమును విడిచి వైచినచో పరమాత్మతానే తనలోని కాకర్షించుకొనును. అట్లహంకారనాశము గాకున్నప్పటికిని నాకు నీభర్త ద్వారా నీవిచ్చునుత్కృష్టగతిని పొందఁగలుగుదుననుట.

239. 45 :- ఇవే, వేయి = ఈవేయి పద్యములు, వేదజాలము = వేద సమూహము, వేదతుల్యములనుట. వేదులన్ = తెలిసిన వారిని. లేక, 'వేదుల' యను ఇంటిపేరుగల అనువాద కవి వంశస్థులననుట. తేర్చెన్ = ఆనందమునఁ దేలించెను. వేదురన్ = ఉన్మత్తులను, ఇతరుల యాస్తుల నన్యాయముగ హరించు నున్మాదము కలవారిని, చన్నవి = ఇదివరకు నష్టమైనవి. ఏవి + ఏవో = ఏవేవి గలవో వాని నన్నిటిని. ఆస్తిన్ = భూమి, ధనము మొదలగు స్థిరచరాస్తులను, నీకు నేను వేదతుల్యములగు వేయి పద్యముల నర్పించితిని. అన్యాయముగా దాయాదులు కృతఘ్నులై అపహరించిన భూములను, ధనమును, నీవు, నావి నా కిప్పింపుమని అనువాదకవి లక్ష్మికి విజ్ఞప్తి సేయుట యిందు విశేషము. కావ్యసమర్పణ పద్యములలో 18 వ పద్యమున "అపహరించి రన్యాయముగను ఆస్తినిఁ గృతఘ్నులైన దాయాదు లపుడు" అని అనువాద కవి తన స్థితిని చెప్పుకొనియే యున్నాఁడు. దానితో దీని కన్వయము ఘటించుకొన వలెను.

240. 46 :- పదచ్ఛేదము :- శ్రీకారి కాకారి, కాకారికాకారి, కా

అర్థము :- శ్రీకారిక + ఆకారి = సంపదలను గలిగించు ఆకారము గలవానా !, కాక + అరిక + అక + అరి, కాక = కాకాసురుఁడను, అరిక = శత్రువుయొక్క (స్వార్థమునక ప్రత్యయము) అక = దుఃఖమునకు, అరి = శత్రువైనదానా, నశింపఁజేయుదానా ! యనుట. కాకాసురుఁడు తన స్తనములనుఁ జీల్చినపుడు రాముఁడు బాణము నెక్కుపెట్టి చంపయత్నింప, నాతనిని సీతాదేవి వారించి శత్రువైన కాకాసురుని రక్షించిన కథ రామాయణమునఁ గలదు. క + అ = క = విష్ణువు, అ = స్థానముగాఁ గల

దానా ! లక్ష్మి ! ని. కోబ్రిహ్మాత్మానిలార్కాగ్నా చిత్తధీయమతే కిషు. విష్ణావాహతశబ్దేఽబ్ధౌ ఇతిరత్నమాలా. ని. ఆకారస్తు పదే భావావితి రత్నమాలా.

240 . 47 :- పదచ్ఛేదము :- నామయానామయా, నామయానా మయా, నామ = పేరును, య = పొందిన (యాప్రాపణే) (న + ఆమయా !) అనామయా ! = ఆరోగ్యముగలదానా ! నీ నామ స్మరణమున రోగములుపోయి ఆరోగ్యము గల్గుననుట. నామ = ప్రసిద్ధిని. యా = పొందినదానా ! నామ = నీటిని. యా = పొందినదానా ! ( నామ = Water, Apte's English to Sanskrit Dictionary ).

240 . 49 :- పదచ్ఛేదము. అపేక్షన్, కామ్మీ, పరమార, మారమా, అపాకృతాపావధి కాధికా, అధికా, అపూర్ణు౯. నన్, నీ, నయనాయనాయనా, ద్యుపాత్త కర్ణోత్సవదున్, వదావదు౯,

అర్థము :- పరమార = శత్రువులను నశింపఁజేయుదానా ! మారమా = మా లక్ష్మి ! అపాకృత = దూరీకరింపఁబడిన. అప + అవధిక = నిరవధికములగు (హద్దులేని) ఆధికా = మనోవ్యాధులు కలదానవును (శేషాద్విభాషేతికప్) భక్తులయొక్క మనోవ్యాధులను దూరీకరించు దానవు ! అధికా = శ్రేష్ఠురాలవు నైనదానా ! అపూర్ణు౯ = పరిపూర్ణత నొందని వానిని. నీ = నీయొక్క, నయన = కటాక్షములయొక్క, అయన = పొందుటకు, ఆది = మూలమైనదై, ఉపాత్త = పొందబడిన, కర్ణోత్సవ = నీచెవులకు విందును, దున్ = ఇచ్చువానిని. (నీకటాక్షము

నొందుటకు మూలమైన నీ చెవులకు విందుగా స్తుతి నొనరించిన వాని ననుట! వదావదున్ = వక్తయగు వానిని, నన్ = నన్ను, అపేక్ష = ఆసక్తితో, కొమ్మి = స్వీకరింపుమా.

241. 49 :- క్షమింపఁజేయవే = కృశింపఁజేయవా, (చేయుదువనుట) సామ + ఆశయా = సామవేదము యొక్క భావమైనదానా! లేక, సమమనస్సు గలదానా! సుర + ఆదరా = దేవతలందు ఆదరము కలదానా!

241. 51 :- నీమరులు = నీ యందు మోహములను, ఊని = పొంది, సామి = ప్రభువగు విష్ణువు, తోన = నీ తోడనే, రాన్ = రాఁగా, శచీ, సుమోద! = శచీదేవికి మిక్కిలి సంతోషమైనదానా! లక్ష్మి విష్ణువుచే రాక్షసవధ చేయించుటచే నింద్రుని భార్యకు సంతోషము నొసఁగున దనుట.

243. 52 : 1 పా :- పదచ్ఛేదము. మ, అసవాస రస, రా, సమా; మ, జనులయందలి, ని, మాఽవ్యయం ప్రతిషేధే చ జనేతుస్యా న్నపుంసకమ్ ఇతిరత్నమాలా. అసవ (న + సవ) = యజ్ఞభిన్నము లైన వానిని అనఁగా దుష్కర్మలను, అస = చిమ్మివేయుట యందు (అసుక్షేపణే ఇతిధాతోః రూపమ్) రస = ఆసక్తి కలదానా! సమా = సమబుద్ధి గలదానా!, రా = రమ్ము.
2 పా : పదచ్ఛేదము :- మా + అస, రాసరస వాస, మా. మా = బుద్ధియందున, అస = ఉండుదానా! రాసరసవాస! = రాస క్రీడారసమందు నివసించుదానా! కృష్ణునితో గోపీరూపమున రాసక్రీడలు సలుపుదానా యనుట, మా = లక్ష్మి!
3 పా : పదచ్ఛేదము : మాస, వాసరస, రాసమా. మా + అస = సంపదకు స్థానమైనదానా! వాసరస = వారము నందు (లక్ష్మి

వారము వారములలో నొకదానిపేరు) సరా = సంచరించునట్టి, దానవును, అసమా = సాటిలేని దానవు నైన లక్ష్మీ!

4 పా : పదచ్ఛేదము .- మా, సరాసరసవాస, మా, మా = మా యొక్క, సర + అసర = చరాచరములందు, సవాస = నివాసముతోఁ గూడుదానా! చరాచరవస్తు లందంతట నుండునది లక్ష్మియనుట. మా = తల్లీ!

244 53 :- నీవు తొల్లి సీతారూపమున చిత్రకూటాద్రి రాళ్లపై నివసించిన యలవాటు గలదానవే యగుట నా రాతిగుండెపై నివాసము తప్పక చేయఁగలవని ఆశించుచున్నానని భావము.

244. 55 :- ఉగ్రమహోష్ణను దృష్ణను = గొప్ప అగ్నివంటి దగు ఆశచే, నాలుక = నాలుక, అధిక, మల + ఆలయ, యోన్ = మిక్కిలి పాపములకు నివాస మైనదగును; కమలా + ఆలయ, గాదు = లక్ష్మీదేవికి నివాసమైనది గాదు. లక్ష్మిని సేవించునది కాదనుట, ధనిక, మల + ఆలయము = ధనవంతుని పాప గృహము, ఎడపి = దూరముచేసి. కమలా + ఆలయము = లక్ష్మీదేవి యొక్క నివాసమగు నీ గుడిని.

244. 56 :- భక్తతమస్ + స్తేన = భక్తుల తమోగుణము నపహరించుదానా! అతుల, సమస్త + ఇనునిగా = సాటిలేనట్టి వాఁడును, అందఱకుఁ బ్రభువైనవాఁడు నైన వానినిగా, సమస్త + ఇనను అందఱకు ప్రభ్వియైన దానిని.

244. 57 :- శుభవిద్యుత్ప్రభ వపుషివి (శుభవిద్యుత్ప్రభం వపుః యస్యాస్సా.) = మంగళకరము లైన మెఱపుల యొక్క కాంతివంటి కాంతి గలది యగు శరీరముఁ గలదానవు. ప్రభవ.

పుషివి = జన్మములు గల మమ్మేలను పోషించు దానవు.
అమృష + అచల విభవములను = యథార్థములైన, స్థిరములైన, సంపదలను.

245. 58 :- హృత, సుఖవారి, జనిలయము ; హృత = హరింపఁ జేయఁ బడినట్టి, సుఖవారి = సుఖముల నడ్డగించు. జని, లయము = జననమరణములు గలది. నిజమైన సుఖము లేని జననమరణ పరిభ్రమణమును హరింపఁ జేయునది యనుట. ఇతర పతనము, ఇతర = ఇతర దైవములందు, పతనము = తగులొ్కనుట. త్వదితర దైవముల నారాధించుట.

245. 59 :- ప్రపదనభారతి ! = పాదాగ్రములందు సరస్వతి కలదానా ! 'ని. పాదాగ్రంతు ప్రపదనమితివిశ్వః', భారతి, కపరాధము, లేను, చేసినవి : అనర్హులను స్తుతించుట మొదలగు నేను సరస్వతికిఁ జేసిన యపరాధములు, అప పథులకును ను = అపమార్గ వర్తులకుఁ గూడ, ఈశపథము = పరమేశ్వరునిఁ జేరుమార్గము.

245. 60 :- 1 భాంతము = ప్రకాశించునది. కృతహింసాఽరంభాంతము = చేయఁబడిన హింసయొక్క ప్రయత్నములను నాశము చేయునది. నీ భక్తులకు హింసచేయు వారి ప్రయత్నములను మొదటనే నాశము చేయుదువనుట. రక్షోపాయదృష్టిన్ ; 1 రక్ష + ఉపాయ, దృష్టిన్ = రక్షించు నట్టి యుపాయము గల చూపును. 2 రక్షన్ + అపాయ, దృష్టిన్ = రక్షోఽపాయ = రాక్షసులకు హానిఁ గూర్చునట్టి, దృష్టిన్ = చూపుచే.

245. 61 :- అనుకంపా, రమ్యోన్నతి ! = దయచే జక్కనైన యున్నత స్థితిగలదానా ! పారమ్య + ఉన్నతికి = పరమ

పదము యొక్క ఉన్నతస్థితికి, కృతహిత = చేయఁబడిన మేలు గల, యాచితృలకున్ = యాచకులకు, నీకు మేలు చేసిన అనఁగా సేవ చేసిన యాచకులకు ననుట. లేక, కృతహిత = చేయఁ బడిన మేలుగలదానా! యాచితృలకును = యాచకులకుఁగూడ.

## 23 సంకీర్ణ స్తబకము.

246. 1 :- సంకీర్ణ పదప్రయోగమున సంకీర్ణ స్తబకము సూచితము.

246. 2 :- 'వైదర్భి' యనునది కావ్యలక్షణములలో నొకటి. 'బంధ పారుష్యరహితా శబ్దాకాఠిన్యవర్జితా నాతిదీర్ఘ సమాసాచ వైదర్భీ రీతిరిష్యతే. 1 లక్ష్మీపరముగ 2 వైదర్భీరీతి పరముగ రెండర్ధములు. ఔదార్యము, కాంతి, ఓజస్సు, ప్రసాదము అనుకావ్య గుణములను వైదర్భి పరములగు అర్ధములుగాఁ జెప్పుకొనవలెను.

246. 3 :- లక్ష్మీపరముగ, నాటకము పరముగ రెండర్ధములు. 1 ఆరంభము 2 యత్నము, 3 ప్రాప్త్యాశ, 4 నియతాప్తి, 5 ఫలాగమము అను ఐదు అర్ధప్రకృతులు నాటకాంగములు. ఇవి నాటక పరములగు అర్ధములు.

247. 4. వ్యాప్తి, పక్షము, విపక్షము, బాధ, అనునవి తర్క శాస్త్రమున సద్ధేతువున కుండు లక్షణములు. ఇవి తర్కశాస్త్ర పరములగు నర్ధములు.

247. 5 :- లక్ష్మీపరముగ, వ్యాకరణ పరముగ, రెండర్ధములు. 1 ప్రకృతి 2 ప్రత్యయ, 3 గుణ, 4, వృద్ధి 5 సాధుత ఇవి వ్యాకరణాంగ

ములు. అనంత పరిణతి = 1 అమిత మైన ఫల పరిపాకము (లక్ష్మీపరము) 2 ఎంతోమార్పు (వ్యాకరణ పరము) 1 అజ+ ఆదులు = బ్రహ్మ మొదలగు వారు (లక్ష్మీపరము) 2 అచ్+ ఆదులు = అచ్చులు మొదలగునవి (వ్యాకరణ పరము)

247. 6 :- అధికరణాది : 1 అధిక, రణ+ఆది = ఎక్కువయుద్ధ ములు మొదలగునవి 2 అధికరణ+ఆది = సహస్రాధికరణ ములు మొదలుకొని (ఒక దానిని గుఱించి చెప్పిన ఒకభాగము అధికరణమనఁ బడును, విపక్ష = 1 శత్రువులు 2 పూర్వపక్షములు (నిలువని వాదములు) కర్మ = 1 పని 2 వేదకర్మ. పై వానిలో రెండుసంఖ్య గల యర్థములు పూర్వమీమాంసాపరములు. 1 సంఖ్య గలవి లక్ష్మీపరములు.

247 , 7 :- చతురాకృతి = 1 నేర్పరితనముగల రీతి. 2 నాలుఁగు ఆకారములు, సామీప్య, సారూప్య. సాలోక్య, సాయుజ్యము క్తులను నాల్గువిధములు. లక్షణ = 1 చిహ్నములు 2 అధ్యాయములు, పరదేవతాపాదక = 1 శ్రేష్ఠులైన దేవతలకుఁ బొందించునది (సుఖములు) 2 పరబ్రహ్మ ప్రతిపాదకము. అపవర్గ సంపదలు = 1 వర్గవిభాగములేని సంపదలు 2 మోక్షసంపదలు. ఇందు 2 సంఖ్య గల అర్థములు ఉత్తరమీమాంస శాస్త్రపరములు. 1 సంఖ్యగలవి లక్ష్మీపరములు.

247 . 8 :- బ్రాహ్మణమతము = 1 బ్రాహ్మణులచేఁ గొనియాడఁ బడునది. 2 బ్రాహ్మణములను భాగములచే నుతింపఁబడినది. సౌవర్ణ భసురము = 1 బంగారురంగుచేఁ బ్రకాశించునది, 2 మంచి అక్షరములచేఁ బ్రకాశించునది; 2 శుభకర పదర్చనము = 1 శుభమును గల్గించు పాదపూజగలది 2 శుభమును గల్గించు

ఋక్ మంత్రములు గల భాగమును పొందునది. రెండు సంఖ్య గల అర్థములు వేదము పరములు, 1 సంఖ్యగలవి లక్ష్మీపరములు.

248 . 9 :- 1 కమలావృత = 1 పద్మములచే నావరింపఁబడినది, 2 నీటిచే నావరింపఁబడినది, ద్విజరాజ = 1 బ్రాహ్మణ శ్రేష్ఠులు 2 శ్రేష్ఠములైన పక్షులు, అవిహత = 1 అడ్డులేనిది 2 ఆగిపోనిది. సతతము ప్రవహించునదనుట రెండు సంఖ్యగల అర్థములు అమృతధుని పరములు. 1 సంఖ్యగలవి లక్ష్మీపరములు.

## 24 ని ర్వే ద స్త బ క ము

255 . 1 :- నిర్వేదపద ప్రయోగమున నిర్వేద స్తబకము సూచితము.

257 . 10 :- పరితోవృతమేచకము = అంతటను నావరింపఁబడిన శ్యామవర్ణముగలది. తత్పరాత్పరమహము = అందఱికంటె శ్రేష్ఠుఁడైన ఆశ్రీకృష్ణ శరీరకాంతి.

257 . 11 :- జనితహృదవసాదము = ఉత్పాదితమైన మనోబాధ గల్గినది. మనోబాధను కల్గించునదనుట.

## 25 శరణాగతి స్తబకము : లేక శ్రీఫల స్తబకము

258 . 1 :- శరణాగతి పదప్రయోగమున శరణాగతి స్తబకము సూచితము.

258 . 2 :- జాలము = 1 సమూహము 2 వల

259 . 5 :- లక్ష్మీభక్తులు ఇహసుఖములన్ని యనుభవించి మోక్షము నందుదురని శ్రుతిస్మృతులు, చెప్పుచున్నవి.

261 . 13 :- స్వస్తరువు = స్వర్గవృక్షము, కల్పవృక్షము. స్తబకములు = 1 పూలగుత్తులు 2 స్తబకములను పేరుగల ఈ కావ్యమందలి అధ్యాయములు, సుమనః ప్రస్తుతము = 1 పూవులచేఁ

గొనియాడఁబడునది. 2 పండితులచేఁ గొనియాడఁబడునది. సదానందనవస్తువు = 1 ఎప్పుడు నందనవనమందు వసించునది. 2 ఎప్పుడు ఆనందమిచ్చు వస్తువు. ఆమోదము = 1 పరిమళము 2 సంతోషము.

261. 17 :- మూలములో 'ఇందిరా, శర్మణాం, నిర్మిమాణా' అనిపల శ్రితి శ్లోకములోనున్నది. ఇందిరా = లక్ష్మీదేవి, శర్మణాం = సుఖములకు, నిర్మిమాణా = సమకూర్చునది అని యొక యర్థము. శర్మణాం = వే॥ సూ॥ శర్మగారి యొక్క, నిర్మిమాణా = నిర్మితియైన, రచనగలదై యనుట అనియు నిందు గర్భితమైన యర్థము స్ఫురించు చున్నది. తనకు సరియైన అనువాద కర్తను వేంకటాధ్వరి నాఁడే సూచించుటయు, నేఁడు అదియే జరుగుటయు ఆశ్చర్యావహము, 'శర్మణాం నిర్మిమాణా' అనుదానికి 'శర్మాగమము' అని అనువాదము. శర్మ = సుఖముల యొక్క, ఆగమము = రాకగలది. లేక, శర్మ = మోక్ష సుఖమును గూర్చు, ఆగమము = వేదము, లేక, శర్మ = వే॥ సూ॥ శర్మనుండి, ఆగమము = ఆ + ఆగమము = సంపూర్ణమైన రాకగలది. చిత్రశ్లేషయమకాను లేదియు విడువకుండ సంపూర్ణముగఁ దెనుఁగునకుఁ గొని రాఁబడినది యనుట.

ఇది శ్రీ ఆత్రేయ వేంకటాధ్వరి విరచిత లక్ష్మీ సహస్రకావ్యమునకు శ్రీ ద్వివేది రామచంద్రశాస్త్రి కవి విరచిత విద్వజ్జన కటాక్ష వ్యాఖ్యను, శ్రీమాన్ గోపాలాచార్య విరచిత బుధామోదినీ వ్యాఖ్యను బరిశోధించి అన్యూనాతి క్రమణముగ నను వదింపఁ బడిన లక్ష్మీసహస్రకావ్యమునకుఁ దదనువాద కర్తృ విరచితమే యైన బాలావబోధమను లఘువాఖ్యానము సమాప్తము.

ఇతిశ్రీః

# ముఖ్యములగు సవరణలు

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 2 | 4 | 1 | కోరి | చేరి |
| 2 | 5 | 4 | గొల్చెదన్ | గొల్చెడిన్ |
| 25 | 3 | 4 | జలంబులన్ | జలంబునన్ |
| 27 | 9 | 3 | జొచ్చితో | జొచ్చితిన్ |
| 28 | 18 | 3 | మరుచ్చిశిర | మరుచ్ఛిశిర |
| 30 | 27 | 2 | దుఃఖముల | దుఃఖము |
| 32 | 35 | 3 | లంఘునిని | లంఘునుని |
| 35 | 47 | 3 | షాచర | షాకర |
| 37 | 57 | 1 | తాప్తి | తాతి |
| 38 | 62 | 3 | దమో | దత్తమో |
| 41 | 10 | 4 | యిటుల | యిట్టుల |
| 44 | 24 | 4 | కటె | కట్టె |
| 45 | 30 | 4 | దిటె | దిట్టె |
| 45 | 32 | 2 | దీసి | జేసి |
| 49 | 6 | 4 | శక్రి | వజ్రి |
| 53 | 6 | 2 | ఘస | ఘన |
| 60 | 41 | 4 | క్షముఁ | క్షము |
| 90 | 183 | 2 | నఖి | నభి |
| 90 | 185 | 1 | మస్త | యస్త |
| 111 | 47 | 4 | జంద్రి | జంద్ర |
| 112 | 49 | 2 | ననభమ్ము | నభమ్ము |
| 114 | 4 | 3 | ప్రాజ్ఞు | తద్జ్ఞు |

| పుట | పద్యము | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|---|
| 120 | 10 | 4 | హంత | హంతృ |
| 160 | 18 | 4 | యగు | నగు |
| 161 | 26 | 4 | భవనంబు | యవసథము |
| 164 | 5 | 1 | బెటు | బెట్టు |
| 176 | 2 | 1 | ఇందిరా ! | ఇందిర ! |
| 183 | 28 | 3 | వహించి | వహించె |
| 187 | 3 | 3 | సైన | లైన |
| 208 | 33 | 9 | పరినా | పరివా |
| 227 | 26 | 4 | జేధీ | జీమూధీ |
| 233 | 36 | 4 | బరమ | బ్రరమ |
| 244 | 53 | 1 | చేయుదు | చేయుము |
| 245 | 59 | 8 | శపథమును | శపథము. |
| 247 | 5 | 2 | వృద్ధి | వృద్ధివై |
| 252 | 20 | 6 | వృక్షమ్మునకు | వృక్షమ్ముసకును |
| 258 | 2 | 2 | యపాగ | యపాంగ |
| 258 | 3 | 2 | బన | జన |
| 260 | 12 | 3 | లొకింత | లుకొంత |
| 274 | — | 24 | నతిక్రమిం | నలంకరిం |